# విజ్ఞప్తి

చిన్నతనంలో నేనూ, నా మేనకోడలూ పోటీలు వేసుకొని శరత్ సాహిత్యం వేసవిసెలవులలో చదివేవాళ్ళం. పసిహృదయంలోకి శరత్ పాత్రలు శరవేగంతో చొచ్చుకుని పోయాయి. అనిర్వచనీయమైన అశాంతిని రేపినవి ఆ పాత్రలే. ఏనాడయినా నేనూ ఒక నవల వ్రాయాలనే కోరిక నాలో పుద్భవించినది తత్ఫలితంగానే. చాలాకాలంవరకూ నాకు ధైర్యం చాలలేదు; అవకాశమూ రాలేదు. విద్యాభ్యాసం ముగిసి ఉద్యోగాన్వేషణ ప్రారంభించినప్పుడు కలం చేతబట్టి, కళ్ళు మూసుకుని ఒకనాటి సంధ్యాసమయంలో కూర్చున్నాను—ఈ నవల అవతరించింది. నా మేనకోడలు యీ నవల చదివి శరత్ శైలి స్పష్టంగా కనబడుతోంది అంది. అది నిజమే అయివుండవచ్చు. శరత్ సాహిత్యం నాలో జీర్ణించుకుపోయి, నాలోని భావాలనూ, ఆశయాలనూ తీర్చి దిద్దినప్పుడు నా నవలలోంచి ఆ భావాలూ, ఆ ఆశయాలూ తొంగి చూడటం క్షంతవ్యమే అనుకుంటాను !

ఈ నవల రచయించి సుమారు ఏడు సంవత్సరాలయినది. దీనిని ప్రచురించాలనే ఉద్దేశం నాకెప్పుడూ లేదు. త్మసంతృప్తికి వ్రాసినది అలాగే వుంచాలనుకున్నాను. ని స్నేహితులూ, శ్రేయోభిలాషులూ నాతో ఏకీభవించ

లేదు. వారి ఒత్తిడి ఫలితంగానే ఈనాడు యిది ప్రచురించ బడుతోంది. కొన్ని నెలలకిత్రం యీ నవల తిరిగి చదువు తూంటే కొన్ని మార్పులు చేద్దామనే కోరిక కలిగింది. గత ఏడు సంవత్సరాలలో నాలో కలిగిన అభిప్రాయాల మార్పు లను నవలలో ప్రతిబింబించేలా వ్రాద్దామనుకున్నాను. కాని చివరకు అలా చేయడం మంచిదికాదనే నిశ్చయానికి వచ్చాను. ఆ నిర్ణయం నవల ఔన్నత్యానికే ద్రోహదమవు తుందని ఆశిస్తున్నాను. కాకపోయినా నాచే ప్రప్రథమంగా సృష్టించబడిన యీ నవలను నేను విసర్జించలేను గదా !!

—రచయిత

# క్షంతవ్యాలు

"జీవితంలో ఏంచేసినా నువ్వు కథలు వ్రాయవద్దు రామం." అని కాలేజీలో తెలుగు మాస్టారు చెప్పినట్లు జ్ఞాపకం. ఆయన పండితుడు, చాలా ఉద్గ్రంథాలు పఠించారు. కొన్నిపుస్తకాలు కూడా వ్రాసారు; కొన్ని కథలు కూడా చెప్పినట్లు గుర్తు. అందుచేత ఆయన చెప్పినది నిజమే అయి వుంటుంది. అప్పుడు నేను ఆ మాటలను అట్టే పట్టించుకోలేదు. ఒక శ్రేయోభిలాషి చెప్పిన సలహా అని, భావించాను. ఈనాడు నేను ఆయన సలహాను వుల్లంఘిస్తున్నానేమోనని భయంగావుంది. అయినా, నేను వ్రాసేది కట్టుకధాకాదు, నవలాకాదు. అయితే ఏమిటది? సరియైన సమాధానం నేను చెప్పలేను. కల్పన లేకుండా కథ వుండదు. కథ లేకుండా నవల వుండదు. ఇందులో రెండూ లేవు. యదార్థానికి దూర ములో వున్న విషయాలు చాలా తక్కువ యిందులో.

గత జీవితాన్ని పర్యావలోకనం చేసుకోవాలనే వాంఛ ప్రతి మానవునికి ఎప్పుడో ఒకప్పుడు కలుగుతుంది. జీవిత సంధ్యాసమయంలోని వేకువఝామున యిది మరీ ప్రబలంగా వుంటుంది. ఈ భూమి మీద యింతకాలం బ్రతికాను. నేను సాధించిన దేమిటి? ఎంతమందిని దుఃఖపెట్టాను? ఎంతమందిని సుఖపెట్టాను? ఇలాంటి ప్రశ్నలు మనస్సులో మెరపులా మెరుస్తూ వుంటాయి. అదే కోరిక నాకు ఈనాడు కలిగింది. అయినా ఎంతో సంశయంతో, ఎంతో అనుమానంతో ఈ ప్రశ్నలకి సమాధానం వెదకడం మొదలుపెట్టాను.

నా జీవితమంతా వ్యర్థంగానే గడచిపోయింది. ఆశయంలేని జీవి తానికి గమ్యస్థానం కూడా తెలియదు. పుట్టినప్పటినుంచి, ఇప్పటివరకూ నే నొక దమ్మిడీ కష్టపడి సంపాదించలేదు. చెమటకార్చి నే నెవరినీ పోషించలేదు. చాలాకాలం ఒక స్త్రీధనం మీద నేను బ్రతికాను. అది చాలా 'హీనమైన పని' అని చాలామంది అంటారు. ఎందుచేత ? పురుషుని ధనంమీద స్త్రీ ఎందుకు బ్రతకాలి? స్త్రీ ధనంమీద ఎందుకు కాదు? ఈ ప్రశ్నలకి సమాధానం నే నెంత ఆలోచించినా నాకు దొరకలేదు. అయినా అది హీనమైనది కాకపోయినా, వాంఛనీయమైనది మాత్రం కాదు. ఎవరి దేహాన్ని వారే పోషించుకోవాలి. యితరుల - స్త్రీ అయినా, పురుషుడైనా - మీద ఆధారపడటం వివేకవంతమైనది కాదు. అదిసరే! 'గతాన్ని గురించి దుఃఖించి లాభమేమిటి ?' అని నిటూర్పు విడిచాను. జీవితంలోని వెన్నెలంతా తెలుగు దేశం బయటే గడిపివేసాను. దానిలో, సగభాగం మంత్రముగ్ధునివలె ఒక స్త్రీ వెంట తిరిగాను. ఈనాడుకూడా నాకు ఆశయం లేదు. నివృత్త జీవితంనుంచి నిష్కృతిని నిరీక్షిస్తున్నాను. కాని ఆ రోజులు వేరు. నా సర్వస్వమూ ఆమె గుప్పిటిలో యిమిడి వుండేది. ఇంత నిరర్థకుడి భారం ఆమె ఎందుకు వహించింది ? నాకోసం ఎంతో త్యాగం చేసింది. ఆమెకు నానుండి తిరిగి లభించింది శూన్యం. అయినా జీవితపుటంచులలాగే జీవితపు విలువలుకూడా మనకు తెలియవు. ఒక వ్యక్తి విలువ తక్కెడలో పెట్టి తూచగల శక్తి ఎవరికి వుంది? ఒకరికి నిరర్థక జీవిలా కనబడే వ్యక్తి యింకొకరికి ప్రేమ పాత్రుడు, వుత్తముడుగా కనబడుతాడు. సృష్టిలోని చిదంబర రహస్యమిదే.

చిన్నతనంనుంచి నేనెవరో ఒకరి ఛాయల్లోనే మెదిలాను. ఎవరో ఒకరి రక్షణలోనే బ్రతికాను. బాల్యంలో తల్లి, చిరుయవ్వనంలో సుశీ ఆ తరువాత యశో - యీ ముగ్గురు స్త్రీలూ నా వ్యక్తిత్వాన్ని కప్పి కప్పివుచ్చారు. కాని వీరి ముగ్గిరికన్నా మిన్నగా యింకొకరి రూపం నా హృదయంలో హత్తుకుపోయింది. ఆమే లఖియా. పవిత్రత అనేపదాన్ని భూమిమీద నడిచే ఏ స్త్రీకైనా జతచేయ దలచుకొంటే యిదిగో ఇక్కడ

వుందీమె. ఇక సరళ సంగతి. అందరిలోకీ ఆమెకే నేను అన్యాయం చేశాననిపిస్తోంది. ఆమెను నేను ఈనాటికి అర్థంచేసుకోలేక పోయాను. హృదయాంతరాళంలో ఆమె నన్ను ఏవిధంగా భావించేదో నేను ఎన్నడూ తెలుసుకోలేకపోయాను. ఇక సుజాత. ఆమె కథ విన్నాను. కాని ఎప్పుడూ కలుసుకోలేదు. నల్లటి అందమయిన యువతులు కనబడితే స్మృతిపథంలో తళుక్కున ఒకసారి మెరుస్తుంది. ప్రమీలను కూడా నేను ఎప్పుడూ చూడలేదు. అయినా చివరకు నా జీవితవిధానాన్ని మార్చే ప్రయత్నంలో ఆమె ఎంతో తోడ్పడింది. ఇక మిగిలింది సురేఖ. అపరిచిత బాటసారులుగా వెళ్ళి ఆమె ఆతిథ్యాన్ని ఆరాత్రి మేము స్వీకరించాము. ఆ తరువాత కొన్నాళ్ళు ఆమె సాంగత్యము లభించింది. కోరిన ప్రియుడిని వివాహము చేసుకోగలిగింది.

ఇంకొకమాట. నవల వ్రాయడం బొత్తిగా చేతకాదని ముందరే చెప్పాను. నేను వ్రాసేది నవలకాదు. అని నన్ను నేను మభ్యపరచుకొంటూ దీనిని మొదలుపెట్టాను. నవలదృష్టితో చూస్తే యిందులో చాలా లోపాలుంటాయి. అయినా నిజం కల్పనకన్నా ఎప్పుడూ మంచిదనే నమ్మకంతో ముందుకు సాగిపోతాను.-తెలుగు మాస్టారును తలచుకొంటూ.

నా ఎనిమిదవఏట నేను. నా తలిదండ్రులు మద్రాసు వెళ్ళాం. అనేకమందిని కోల్పోయిన తరువాత నేనే వారిద్దరికి మిగిలింది. అందుకని తల్లిదండ్రులకి నేనంటే పంచప్రాణాలు; ముఖ్యంగా మా అమ్మకి యికవేరేపని వుండేదికాదు. మద్రాసులోనే రెండు సంవత్సరాలు వుండిపోయాము. ఎగ్మూరులోని మాయింటిప్రక్క ఒక ప్లీడరుగారు వుండేవారు. ఆయనకూడా మాలాగే ఆంధ్రుడు. మా కుటుంబానికి ఆయన కుటుంబానికి చాలాదోస్తీ. ఆయన పదేళ్ళకూతురు సుశీల. నేను వకేక్లాసు చదివేవాళ్ళం. నేను ఆ ఊరికి కొత్తకనుక నన్ను స్కూలుకు తీసుకెళ్ళి యింటికి తిరిగి తీసుకొచ్చేపూచీ మా నాన్నగారు సుశిమీద పెట్టేరు. మొదటిసారి వాళ్ళయింటికి వెళ్ళినప్పుడు వాళ్ళ నాన్నగారు నన్ను సుశి దగ్గరకు తీసుకువెళ్ళి "సుశీ, నీకు ఒకకొత్త స్నేహితుడు వచ్చాడు" అన్నారు.

సుశీ కొంచెము పొద్దుగా, నాకంటే బాగా పొట్టిగావుంది. (అప్పటి సుశీ ఫోటో యింకా నావద్దవుంది) పరికిణీకట్టుకొని బుద్ధిగా కూర్చుని బయటికి పాఠాలు చదువుకొంటూవుంది. మేము లోపలికి వచ్చినవెంటనే లేచి నుంచుంది. తండ్రి చెప్పిన మాటలు విని నా ముఖం కేసి తదేకంగా చూచింది. నాకు అంతకుముందు ఆడపిల్లలతో స్నేహంలేదు. అక్కచెళ్ళెళ్ళుకూడా లేరు. స్త్రీజాతినంతను మా అమ్మతో ఏకం చేసేవాడిని. ఇంకే యితరస్త్రీ ఏ అంతస్తులోనూ నావూహలోలేదు. పసివాడినయినా ఎందుకో ఆమె కళ్ళు నాలోని సిగ్గును బయటికి తెచ్చాయి. నాకంటె పొట్టిగావున్న ఆమె నాకంటె చాలా పెద్దదానిలా కనబడింది. ఏంచేయాలో అర్థంకాలేమ కళ్ళు క్రిందికి దించివేసుకొని ఆ గదిలోంచి బయటకు పారిపోదామని ఆలోచిస్తూన్నాను. నా పరిస్థితి చూచి జాలికలిగిందని, ఒక విధమైన మాతృప్రేమ పెల్లుబికిందని సుశీ నాకు తరువాత చెప్పింది. ఆటలు ఆడుకునే సమయంలో బొమ్మలికి తల్లిగా నటించినట్లే తన కళ్ళలోకి చూడటానికి భయపడుతున్న ఆ అబ్బాయిని కూడా బుజ్జగించాలనె కోరిక కలిగిందట.

నా దగ్గరకు వచ్చి నా కళ్ళలోకి చూస్తూ "నీ పేరేమిటి?" అంది. ఇంకా ఆ కళ్ళలోకి చూడలేకపోయాను. అవి క్రిందకు దించుకునే 'రామం' అన్నాను. "నాపేరు సుశీ — సుశీల" అంది నా చెయ్యి పట్టుకుంటూ.

సుశీ తండ్రి "సుశీ! రామం నీతో స్కూలుకి వస్తాడు. జాగ్రత్తగా తీసుకువెళ్ళి, తీసుకురావాలి" అన్నాడు.

సుశీ ఆయన మాటలను విన్నా వాటికి సమాధానం చెప్పలేదు. నా చెయ్యి పట్టుకుని "నువ్వు నాకన్నా పెద్దవాడివా? చిన్నవాడివా?" అంది.

అది రామానికెలా తెలుస్తుంది. "సుశీ! నీకెన్ని ఏళ్ళో చెప్పలేదు కదా నువ్వు?" అన్నాడు ఆయన నవ్వుతూ.

"నాకు పదేళ్ళు" అంది సుశీ.

ఆమె చేతిలో నాచెయ్యి అలాగేవుంది. నెమ్మదిగా అది విడదీస్తూ "నాకు ఎన్నిఏళ్ళో నాకు తెలియదు. మాఅమ్మ నాకు చెప్పలేదు" అన్నాను.

"నాకంటె పొడుగ్గా వున్నావు. నా కంటే పెద్దవాడివే అయి వుంటావు" అంది. నా దగ్గర అలాగే నుంచుంది. నా చేతిని మళ్ళీ తన చేతిలోకి తీసుకోవటానికి ప్రయత్నం చేయలేదు. సుశీ నాన్నగారు "సరే, యిక పద రామం, మీ యింటికి వెళ్దాం. రేపు స్కూలుకు వెళ్ళేముందు సుశీ మీ యింటికి వస్తుంది" అన్నాడు.

ఆయనతో నేను బయటికి వచ్చేశాను. సుశీ అక్కడ అలాగే నిలబడి వుంది. ఆ విధంగా నాటుకున్న విత్తనం క్రమ క్రమంగా పెరిగి పెద్దదయింది. స్కూలుకి కలసి వెళ్ళేవాళ్ళం, కలసి తిరిగి వచ్చేవాళ్ళం. స్కూలులోకూడా ఒకే క్లాసులో వుండేవాళ్ళం, ప్రక్క ప్రక్కన ఇళ్ళు కనుక యితర సమయాల్లో కూడా కలసే వుండేవాళ్ళం. మొదటినుంచి సుశీ నామీద అధికారం చెలాయించేది. స్కూలులో తోటిపిల్లలవద్ద ఎప్పుడూ నన్ను వెనకవేసుకొని వచ్చేది. ఏమైనా అల్లరిపని చేస్తే మాష్టారుకంటె ఎక్కువగా సుశే నన్ను మందలించేది. అది నాకేమంత కష్టమనిపించేదికాదు. స్వతంత్రంగా నేను ఎప్పుడూ జీవించలేదు. ఇంటి దగ్గర మా అమ్మ, బయట సుశీ—వీరిద్దరూ నన్ను పరిపాలించేవారు. మేము ఒకరిని విడచి ఒకరం ఒకరోజైనా వుండలేదు. అసలు అలాంటి అవసరమే రాలేదు. ఈ విధంగా రెండుసంవత్సరాలు గడచిపోయాయి. ఇక మద్రాసుని, సుశీనీ వదలవలసిన సమయం ఆసన్నమయింది. ఆ మాట విని సుశీ ఏడ్చింది. గోలచేసింది. కాని ఆ చిన్నపిల్లమాట వినే దెవరు? నేనూ ఏడ్చాను. కాని నా ఏడుపు మా నాన్నగారి పేకబెత్తంతో పటాపంచలయింది. మేము మావూరు వచ్చేసాము. మొదట్లో కొన్నాళ్ళు అస్తమానమూ సుశీ జ్ఞప్తికి వచ్చేది. తరువాత సుశీని క్రమ క్రమంగా మరచిపోయాను.

ఎనిమిది సంవత్సరము లయ్యేటప్పటికి సుశీ ఒక స్మృతిగా మిగిలింది. సుశీ చిన్ననాటి ఫొటోని బయటికతీసి అప్పుడప్పుడు చూసూ

వుండేవాడిని. అవి నేను ఆంధ్రా యూనివర్సిటీలో III ఆనర్సు చదివే రోజులు. నేను వూరిలో ఒంటరిగా బస చేసేవాడిని. కాలేజీ తెరచిన రెండు నెలలకి ఒక అందమైన అమ్మాయి నా క్లాసులో చేరింది. ఆరోజు సాయంత్రం నేను లాడ్జికి తిరిగి వస్తూవుంటే వెనుకనుంచి ఎవరో పిలుస్తూన్నట్టయి వెనుదిరిగి చూచాను ఆమే కొత్త అమ్మాయి. ఆగమని చేత్తో సంజ్ఞ చేసింది నా దగ్గరకు వచ్చి "క్షమించండి. నేను మీ క్లాసు మేటుని. మీ ఫిజిక్సునోట్సు ఒకసారి యివ్వగలరా?" అంది. నేను ఒక అపరిచిత కాలేజీ యువతితో మాట్లాడటం అదే మొదటిసారి. సుశీని వదలిన తరువాత యింకెవరి సహవాసము నాకు లభించలేదు. కాస్త తడబడుతూ "నా రైటింగ్ బావుండదండీ, ఇంకెవరినైనా అడగండి" అన్నాను.

"పరవాలేదు మీదే యివ్వండి"

'కానీ అవి నావద్ద లేదండి' అన్నాను ఏలాగైనా తప్పించుకుందామని. అయినా ఆమె నన్ను వదలలేదు. "మీతో మీ లాడ్జికి వస్తాను పదండి" అంది. ముక్కూ మొగము తెలియని నాతో లాడ్జికి వస్తానన్న ఆమెమీద ఏహ్యభావం కలిగినమాట దాచటం అనవసరమనుకుంటాను. అయినా యిప్పుడు నన్ను నేను ప్రశ్నించుకుంటాను. అందులో తప్పేముంది? నలుగురు అలా అనుకుంటారని అర్థంలేకుండా నేనుకూడా అలా ఎందుకు భావించాలి?

"ఎందుకు మీకింత శ్రమ? నేను రేపు క్లాసుకి తీసుకువస్తాను, వెళ్ళండి" అన్నాను. కాస్సేపు నన్ను పలకరించి చూచి "మీతో కాస్త మాట్లాడవలసిన పనివుందండి. మీ రొక్కరేనా రూములో వుంటున్నది?" అంది.

'ఔనండి' అన్నాను. 'మీ కభ్యంతరం లేకపోతే మీతో వస్తాను' అంది. అభ్యంతరంవున్నా అడ్డు ఎలాచెప్తాను? నాతో రూముకు వచ్చింది. తీరికగా కూర్చుని "మీపేరు తెలుసుకో వచ్చాండీ?" అంది. చెప్పాను. 'మీ తండ్రిగారి పేరు?' అదీ చెప్పాను. 'ఊరిపేరు?' కాస్త గిరాకుగా

అదీ చెప్పాను. ఇంతలో ఆమెదృష్టి గోడకు తగిలించివున్న సుశీ చిన్న నాటి ఫొటోమీద పడింది. నాకేసి తిరిగి "నేను ఎవరో గుర్తుపట్టలేదా రామం ?" అంది.

ఆమె సుశీ ఫోటోకేసి చూడటం, అలా అడగటమూ గ్రహించి 'సుశీ' అన్నాను. సుశీ కిలకిలా నవ్వి 'రామం' అంది. సుశీ స్వతహాగా అందకత్తెయని నాకు తెలుసు. కానీ యింత అందంగా తయారవుతుందని నేను ఊహించలేదు. స్త్రీలు యవ్వన ప్రవేశానంతరం గుర్తుపట్టలేనంతగా మారిపోతారు. సన్నగా, పొడుగ్గా, నాజూగ్గా వుంది. అంతా మరచిపోయి ఆమెకేసి తేరిపార చూస్తున్నాను.

సిగ్గుతో కళ్ళు క్రిందకు దించుకొని "అలా చూస్తావేమిటి రామం ? నన్ను యింకా గుర్తుపట్టలేదా ?" అంది.

"గుర్తుపట్టాను. కానీ నువ్వే ఆ సుశీవంటే నమ్మలేకపోయున్నాను. చాలా మారిపోయావు"

"మీరూ మారిపోయారు. అయినా క్లాసులో చూచినప్పుడే అనుమానం వేసింది. అందుకనే వెంటవచ్చాను" అంది.

## 2

కొన్ని కొన్ని సంఘటనలు మనమెన్నడూ ఆశించనివి, జీవిత కాలక్రమాన్నే మార్చివేస్తాయి. తిన్నగా సాఫీగా సాగుతూన్న జీవితపు బాట వక్రమార్గాలు త్రొక్కుతుంది. దీనికి కారణం వెతకటం అవివేకమూ, అవాంఛనీయమూ కూడాను. లోకాన్ని చూచిన పెద్దలు క్రింద పెదవి నొక్కిపెట్టి 'విధిచేష్టలు' అంటారు. ఏమో అయివుండవచ్చు. కానీ యీ విధి, యీనియంత, యింత పక్షపాతంగా ఎందుకు వుండాలా అని ఆశ్చర్యం వేస్తూవుంటుంది. ఎవరైనా సుఖపడుతూంటే యింతగా చూడలేదా ?

ఏమయితేనే, సుశీ సాంగత్యమూ, స్నేహమూ నాకు లభించాయి. ఎనిమిది సంవత్సరాల తరువాత పసియవ్వనంలో తిరిగి ఈమె నాకు దొరికింది. సంతోషించాలని వేరే చెప్పాలా? ఆనందంగా, ఆహ్లాదంగా, ఖులాసాగా ఆ సంవత్సరము గడిపివేశాము. క్లాసులో సుశీకి ఎప్పుడూ నాకంటే ఎక్కువ మార్కులు వచ్చేవి. సుశీ కొంటెగా "నన్ను చూచి మార్కులు వేస్తున్నారు. జర్మన్ ప్రొఫెసర్‌కి నేనంటే చాలా యిష్టం తెలుసా!" అంది.

ఒకసారి క్లాసులో జర్మనీ ప్రొఫెసర్ బ్లాకు బోర్డుమీద 'యిష్ లీబెర్ జీ మేర్' అని జర్మనీలో వ్రాసి సుశీని యింగ్లీషులోకి తర్జుమా చేయమన్నారు. అంటే దానిఅర్థం 'నేను నిన్ను చాలా ప్రేమిస్తున్నాను' అని. సుశీ నిస్సందేహంగా తర్జుమాచేసింది. క్లాసు అయిపోయిం తరువాత 'ఈరాత్రి ప్రొఫెసర్ నిద్రపోడు - బట్టతల గోక్కుంటూ కూర్చుంటాడు' అంది.

రోజులు వారాలుగాను, వారాలు నెలలుగాను శరవేగంతో మారిపోతూవున్నాయి. సాయంసమయాల్లో సముద్రతీరానికి వెళ్ళేవాళ్ళం. విరామరహితంగా విరుచుకుపడే కెరటాలను చూస్తూ చీకటిపడేదాక వుండిపొయ్యేవాళ్ళం. ఒకరోజు సాయంకాలము లాజన్సేజేవద్ద యిసుకలో కూర్చొని వున్నాము. ఎందుచేతో సుశీ ఆరోజు పరధ్యాన్నంగా వున్నట్టు కనబడింది. చీకటి పడిపోయింది. కాని లేచి రూముకు పోబుద్ధి పుట్టడంలేదు. సుశీకూడ లేచేప్రయత్నం చేయలేదు.

"ఇసుకలో ఏమని వ్రాశానో చెప్పుకో" అన్నాను. నా ప్రక్కనే వున్న సుశీ ముఖకవళికలు స్పష్టంగా కనబడటంలేదు. కాని పెదిమలు విడచుకొని తెల్లటి రెండు పళ్ళ వరుసలు కనబడ్డాయి. బుగ్గలుమీద రెండు సొంటలు పడ్డాయని ఊహించుకొన్నాను. ఎందుకంటే, చిరునవ్వుకి వాటికి ఏదో అవినాభావసంబంధము వుందని నకు తెలుసు.

"ఇంకేమి వ్రాస్తావు నీవు - ఎప్పుడూ ఆలోచించేది ఒక్కటేగా? సుశీల అని వ్రాసివుంటావు" అంది.

"తప్పు చెప్పావు. సుశీల అని వ్రాయలేము. సుశీ అని వ్రాశాను" అన్నాను. రెండింటికి తేడా యేమిటో?

"సుశీల నా క్లాసుమేటు. సుశీ నా బాల్య స్నేహితురాలు. ఫిజిక్సు నోట్సు పుస్తకంతోపాటు తిరిగి నేను ఆమెకు దొరికాను" అన్నాను.

"అవును యింతకీ నువ్వు నాకు నీ ఫిజిక్సునోట్సు పుస్తకం ఇవ్వనేలేదు రామం. ఆనాడు మరచిపోయాను" అంది.

"దానితో యిక అవసరమేముంది సుశీ. అది నీకు వంకమాత్రమే కదా?" అన్నాను.

"నన్ను గురించి మీరేమనుకొన్నారు? మీ రూముకు తీసుకవెళ్ళమంటె మీరేమని భావించారు" అంది.

"చాలా ఆశ్చర్యపోయాను. ఒక అపరిచిత యువతి అలాంటి పని చేస్తుందని నేను ఎన్నడూ వూహించలేను. ఆ సుందరాంగి సుశీ అనే అనుమానమే నాకు కలుగలేదు."

"అవును; అదే స్త్రీ పురుషులకున్న తేడా. పురుషుని జీవితంలో ప్రేమ ఒక భాగం మాత్రమే. కాని స్త్రీకి అదే సర్వస్వము. జీవిత కాలంలోని అనుక్షణము అందుకే అర్పిస్తుంది. స్త్రీ హృదయాన్ని అలా ఎందుకు సృష్టించాడో నాకు తెలియదు. బహుశా సృష్టికర్తకి కూడా స్త్రీ అంటే చిన్నచూపేయేమో! ఎందుకంటె దానివలన స్త్రీకి లభించేది దుఃఖం మాత్రమే" అంది.

సుశీ మాటల్లోని సత్యాన్ని యిప్పుడు గ్రహించినంత సుస్పష్టంగా నేను అప్పుడు గ్రహించలేదు. అది నిరూపించవలసిన దౌర్భాగ్య స్థితి కలిగింది. నేను మౌనంగా వుండిపోయాను. ఆమె మాటలకంటె ఆమె కంఠస్వరం నన్ను వ్యాకులపరచింది. ఆ విధంగా ఆమె ఎప్పుడూ అంతకుముందు మాట్లాడలేదు. సీరియస్‌గా దేనినిగురించి సుశీ మాట్లాడేది కాదు. అలాంటి చిన్న విషయములను గురించి చింతించటం ఆమె స్వభావానికే విరుద్ధం. నేను అన్నమాటలు ఆమె హృదయాన్ని గాయపరచాయని గ్రహించాను. అనాలోచితంగా అపరిచిత

యువతి అన్నాను—చిన్ననాటి సుశీని చాలావరకు మరచిపోయినమాట నిజమే.

చీకటి నలుమూలలా దట్టంగా వ్యాపించింది. కనుచూపుమేరలో వున్న సముద్రతీరమంతా దాదాపు నిర్మానుష్యంగా వుంది. నురుగులు కక్కుకుంటూ సముద్రం భీకరంగా వుంది. దూరానవున్న ఓడలోని దీపాలు, ద్వీపంలోని భవనపు దీపాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. మలుపు తిరుగుతున్న కారులైటు కాంతి మా యిద్దరిమీద ఒకసారి పడింది.

"చాలా ఆలస్యమయినట్టుంది. సుశీ, యిక పోదామా !" అన్నాను.

"అప్పుడేవద్దు. రేపు ఆదివారంకదా ? ఇంకా కాసేపు కూర్చుందాము" అంది.

నేను ఇంకేమీ మాట్లాడలేదు. రూముకు పోవాలనే కుతూహలం నాకు లేదు. కొన్ని నిమిషాలు గడచిపోయాయి. నిద్రిస్తూన్న నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ సముద్రం ఘోషపెడుతూంది. ఎవరో ఒకజంట మా ముందు నడచిపోయారు. సముద్రానికి ప్రేమికులకు యుగయుగాలనుంచీ సంబంధముంది. సాగరగర్భంలో ఎంతమంది ప్రేమికులు యిమిడి వుండలేదు ! సముద్రంమీద ఏకాంత యాత్ర ఎంత మధురంగా వుంటుంది ! సముద్రతీరం ప్రేమకలాపాలకి ఎంత అనువైన స్థలం !

"చదువైపోయిన తర్వాత మీరేం చేస్తారు" అంది సుశీ హఠాత్తుగా. "ఏం చేస్తాను సుశీ ! అందరూ చేసేదే నేనూ చేస్తాను. ఏదో ఒక ఉద్యోగం దొరకక పోతుందంటావా ?" అన్నాను.

సన్నగా నవ్వుతూ "మీరు ఉద్యోగం చేస్తారా ? అయితే చూడాలని వుంది. కాని అది మీకు సరిపడదు"

"ఉద్యోగం చేయక ఇంకేమిచేస్తాను సుశీ ! హోటలు పెట్టమంటావా ?" అన్నాను నవ్వుతూ.

"అదికాదు. మీరు బహుశా కవి అవుతారేమో ! లేకపోతే రచయిత అవుతారు. చిన్నతనంలో మీరు పాడుకథలు చెప్పి అందరినీ భయపెట్టేవారు" అంది.

"లేదు సుశీ! అదేమీ సులభంకాదు. కవి కావాలన్నా, కవిత్వం వ్రాయాలన్నా సత్యాన్ని అసత్యంనుంచీ, సంభవాన్ని అసంభవమునుంచీ శుచిత్వాన్ని కల్మషంనుంచీ విడదీసి విశదీకరించగలిగే ఆత్మ పరిశోధనా శక్తి కావాలి విజ్ఞానం అనుభవంగానూ, అనుభవం విజ్ఞానంగానూ రెప్పపాటు కాలంలో మార్చగలిగే శక్తి కావాలి. బాహ్యనేత్రానికి కనబడని దానిని మనోనేత్రంతో పరిశోధించగలిగే శక్తి కావాలి. అదిలేకుండా కలం కాగితంమీద పెట్టడం దుష్కరం. కేవలం మనం దేనినీ ఊహించి సృష్టించలేము. అస్థిపంజరం లేకుండా ఆత్మను వూహించుకోలేము. ఆత్మలేకుండా మానవుడే వుండడు" అన్నాను.

"కవిత్వం చేతకాదంటూ కవిత్వంమీద ఒక చిన్న ఉపన్యాసం యిచ్చారు." సుశీ ఈ మాటలు అంటూంటే ఒక పెద్ద కెరటం వచ్చి మా ముందర విరచుకపడింది. భయపడుతూ, భయపడుతూ బుల్లిబుల్లి కెరటాలు సుశీ పాదాలను ముద్దుపెట్టుకున్నాయి.

"సుశీ! నాకు ఈ సముద్రాన్నీ, ఈ నురుగనీ చూస్తూంటే టాగూర్ వ్రాసినది జ్ఞాపకం వస్తూంది. సముద్రతీరం సముద్రాన్ని అడిగిందట -'నీ కెరటాలు నిరంతరం చెప్పడానికి ప్రయత్నిస్తూన్న దేమిటో వ్రాసి చూపించు' సముద్రం నురుగుతో పదే పదే చెప్పదలచుకున్నది వ్రాసి నిరాశా నిస్పృహలతో అక్షరాలను చెరిపివేసిందట' అంది.

"అంటే దాని అర్థం ఆగమనంలోనే పురోగమనం యిమిడి వుందని కదా! సముద్రంలాగే మానవుడికి కూడా అందని అంతస్తులో అర్రులుచాచే ఆభరణం ఒకటుంటుంది. దానిని అందుకనే ప్రయత్నం లోనే చెయ్యి జారిపోయే విధానంకూడా యిమిడివుంటుందని కదా?"

"అయివుండవచ్చు. అవును నువ్వు చెప్పిందే నిజము కావచ్చు. సముద్రానికి లేదని తెలుస్తూనే వుంది. అయితే ఇంకెవరిది? దానిని షారిదే కదా? వారెవరు? నిన్నూ, నన్నూ సృష్టించినవారే

ర్యానికి మేరలేదు. సుశీ ఎందుకీవాళ యిలావుంది. ఎన్నో

సార్లు నేను యిలా మాట్లాడుతూవుంటే మందలించేది. రాబోయే దానిని రహస్యంగా అంతరంగం గుర్తింపగలిగిందా? అయితే రాబోయేదేమిటి?

"అదిసరే, ఉద్యోగం గురించి మాట్లాడుతున్నాము మనము. అది నాలుగు సంవత్సరముల తరువాత సంగతి. అప్పుడు మనమెలా వుంటామో, ఎక్కడ వుంటామో ఎవరికి తెలుసు" అన్నాను మాట తప్పించుకుందామని.

సుశీ మనస్సుని ప్రాపంచక విషయాలమీద మరలించడానికి అడిగిన ప్రశ్న అది. అయినా అదికూడా సరియైన ప్రశ్న కాదు.

"మీకేమీ ఆ భయం అక్కరలేదు. అప్పటికి నేను ఎక్కడ వుంటానో మీరూ అక్కడే వుంటారు" అంది.

ఈ మాటలు పరధ్యానంగా అన్నట్టు కనబడింది. మనస్సు ఎక్కడో విహరిస్తున్నట్టుంది.

"ఏమో సుశీ! జరగబోయే దానివి గురించి ఎవరికి తెలుసు?" అన్నాను.

"అంటే నీ ఉద్దేశం ఏమిటి రామం? అంత నిగూఢంగా ఎందుకు మాట్లాడుతావు?"

"నిగూఢంకాదు సుశీ! గమ్యస్థానం తెలియని గుడ్డివానిని చెయ్యి పట్టుకుని ఎవరో వొకరు తీసుకువెళ్ళాలి కదా? ఆశయంలేని వారికి అసహాయత విషం లాంటిది" అన్నాను.

"గమ్యస్థానం మీకేకాదు ఎవరికీ తెలియదు. మీరేమీ గుడ్డివారు కారు. అయినా నా చెయ్యి మీకు ఎప్పుడూ లభిస్తుంది. అనవసరంగా భవిష్యత్తును గురించి ఆలోచించకు రామం. దానివలన కలిగే లాభ మేమిలేదు. మనయిద్దరి జీవితాలు ఒకే పంథాతో నడుస్తాయి. ఆ భార నేను వహిస్తాను" అంది.

ఇక్కడ కాస్త ఒక విషయం విశదీకరించాలేమో! అప్పుడప్పుడు "మీరు" అని సంబోధించేది; అప్పుడప్పు ప్రకారం "నువ్వు" అనేది. ఈ విధం తెలుగుభాషలోనే

బడుతుంది. ఇంగ్లీషులో ఈ రెండింటికీ తేడా ఏమీలేదు. "యూ" అనే పదానికి రెండు అర్థాలూ వస్తాయి. ఏదయితేనేం ఒకసారి 'ఎందుకు సుశీ ఈ బాధ ? అలవాటు ప్రకారమే పిలవకూడదు' అన్నాను.

సుశీ "ఇప్పటినుంచీ అలవాటు చేసుకోకపోతే తర్వాత కష్టపడ వలసి వస్తుంది. అందరియెదుటా చిన్నతనంగా వుండదా ?" అంది.

"స్త్రీలకు పురుషులతో సమానహక్కులు కావాలని యింటికప్పు లెక్కి అరచే వనితలలో ఒకదానివి కదా నువ్వు ? మొన్న దానిమీద ఒక చిన్న ఉపన్యాసంకూడా యిచ్చావు. అందులో టాగూర్ నాటకం చిత్రాంగదలో చిత్ర చెప్పిన మాటలు వుదహరించావు 'నేను చిత్రిని ! పూజచేసే దేవతనుకాదు. అడుగులొత్తే దాసీనికాను. నీ సర్వస్వంలోనూ నాకు సమభాగం కావాలి' అంటూ చెప్పావు. అలాంటప్పుడు భార్య భర్తని మీరు అని ఎందుకు పిలవాలి ? భార్యని భర్త ఎందుకు అలా సంబోధించకూడదు" అన్నాను.

"అవును అదీ నిజమే. కాని మనం సమాజంలో కొన్ని కొన్ని నియమాలకు బద్ధులమయి వుండాలి. అంటే నా వుద్దేశ్యం అన్నిటికీ తల ఒగ్గమనికాదు. ఆత్మ గౌరవాన్ని అణగతొక్కే వాటిని ప్రతిఘటించాలి. కానీ అందువలన కలిగే నష్టమేమీలేదు. మీరు నాకంటే ఆరునెలలు పెద్ద వారు. ఎలాగయినా పెద్దవారిని గౌరవించాలి కదా !"

"నీకంటే ఆరు నెలలు చిన్నవాడినైతే ఏం చేద్దువు సుశీ ?" అన్నాను. "చెయ్యడానికేముంది ? అది యే విధంగానూ అడ్డురాదు మన దారికి" అంది. "కాని మన సమాజం అది ఒప్పుకోదు కదా ! ఇదీ తల ఒగ్గవలసిన కట్టుబాటు కాదా ?" "కాదు. భార్యకన్నా భర్త ఒకమెట్టు పైన వుండాలనే వుద్దేశ్యంతో మన పూర్వీకులు పెట్టిన నియమం యిది. ఈనాడు ఇది అర్థంలేనిది" అంది.

"అలా అయితే నన్ను "నువ్వు" అని పిలిచేదానివా ?"

నవ్వుతూ "అవును. అల్లరిచేస్తే చెవులుకూడా మెలివేసేదానిని" అంది.

"మన ఇద్దరిలో ఎవరిది పైచేయి అవుతుంది సుశీ!" అన్నాను.

"ఇంకెవరిది? నాదే. నేనేకాదు - మీరు ఎవరిని కట్టుకున్నా ఆమెదే అవుతుంది. మీ స్వభావమే యింత"

ఆమె అన్న మాటలకి నాకేమంత కష్టం కలిగించలేదు. ఆమె చెప్పినదే నిజమనిపించింది. తలిదండ్రులకి ఏకైక పుత్రుడి నవటం వలన వచ్చిన నష్టమిది. సుశీ నామీద అనవసరమైన అధికారం చెలాయిస్తుందనే భయం నాకు కలుగలేదు. ఏంచేసినా మంచికోసమే చేస్తుందనే విశ్వాసం నాకు ముఖ్యమైన విషయాలలో ఎప్పుడూ నామాట చెల్లేది. మా యిద్దరి మధ్య ఆనాడు వున్న సంబంధము ఈనాడు నాకు ఎంతో విచిత్రంగా కనబడుతుంది. భూతకాలాన్ని వర్తమానపు దీపంతో పరీక్షిస్తూంటే ఎప్పుడూ మేము ప్రేమవాక్యాలు చెప్పుకునేవాళ్ళంకాము. వాటి అవసరం ఎప్పుడూ కలగలేదు. ఒకరి హృదయం ఇంకొకరికి స్పష్టంగా తెలుసు. అక్షర శబ్దాలని మించిన అనురాగం అది. సుశీ అప్పుడప్పుడు ఆమె చెప్పదలచుకొన్నది నేత్రాలతో వ్యక్తం చేసేది. ఎప్పుడైనా కాలేజికి వెళ్ళటం మానివేస్తే ఆ సాయంత్రము రూముకి వచ్చేది. తలుపు తోసుకొని రూములోకి వస్తూన్నప్పుడు ఆమె కళ్ళు చూస్తే అప్పుడు నాకు వాటిలో ఆమె హృదయమంతా అద్దంలోని ప్రతిబింబములా కనపడేది. "క్లాసులో యీవేళ ఏం చెప్పారు?" అని అడిగితే నవ్వుతూ ఏమో నాలుగు మాటలు చెప్పేది. ఇంకనేనేమి అడిగే వాడినికాను. పాఠాలు వినలేదని స్పష్టంగా తెలిసిపోయేది. ఒకసారి "హోటలు భోజనం నీకు పడటంలేనట్టుంది" అనేది.

"హాస్టలు భోజనం నీకు పడుతుందా?"

"ఎందుకు పడటంలేదు. నేను నిక్షేపంగా వున్నాను" అంది.

నిక్షేపంలా ఏమీ సుశీ వుండేదికాదు. పేలగా, పల్చగా, బలహీనంగా కనపడేది. చాలాకాలం అది ఆమె శరీరం తత్వమే అనుకునే వాడిని. కాని చిన్నతనంలో ఎంత బొద్దుగావుండేదో జ్ఞాపకంవచ్చి అప్పుడప్పుడు ఆశ్చర్యపోయేవాడిని. అయినా ఆ మార్పుని యవ్వనానికి అంతగట్టేవాడిని. ఇలా వుంటేనే అందంగావుంది కదా? అలాంటప్పుడు

ఎందుకు విచారించాలి ? క్లాసులో నవ్వుతూ నాలుక బయటపెట్టి వెక్కి రిస్తూ వుంటే ఎంత కొంటెగా, ఎంత మనోహరంగా వుంటుంది ? ఒక సారి మా ఇంగ్లీషు మాస్టారు అది కనిపెట్టి వేశారు. అయినా ఆయన పిల్లలున్నవాడు, ఇలాంటి అనుభవాలున్న తండ్రి అందుకు ఊరు కున్నాడు. సుశీ ఈ సుఖం క్షణికమూ, శాశ్వతమూ అని నాలో నేను అప్పుడప్పుడు తర్కించుకుంటూండేవాడిని.

ఇంటికి వెళ్ళడానికే నిశ్చయించుకొన్నాము. ఇంటివద్దనుంచి మా నాన్నగారు గట్టిగా వుత్తరం వ్రాశారు. మేమిద్దరం దసరాకు, సంక్రాంతికి కూడా యింటికి పోలేదు. ఇక తప్పదనుకుని సుశీ మద్రాసుకు, నేను రాజమండ్రి బయలుదేరాము. నేను కనీసం వారానికొకసారైనా ఉత్తరం వ్రాస్తానని వాగ్దానం చేశాను. వచ్చేముందు రెండు నెలలబట్టి సుశీ ఆరోగ్యం సరిగా వుండేదికాదు. ఏదో నీరసంగా వుండేది. ఏమిటంటే ఏమీ లేదు వేసవికాలం అనేది.

నేను రాజమండ్రి వచ్చి ఒక పక్షంరోజులయి వుంటుంది. ఏమీ తోచేదికాదు. ఎప్పుడూ సుశీ జ్ఞప్తికి వచ్చేది. నా హృదయవేదనను తెలియపరుస్తూ ఒక పెద్ద వుత్తరం వ్రాసి యిలా ముగించాను. "దైవం నీకూ నాకూ యీ కలయిక ఎందుకు ఏర్పాటుచేశాడో నాకే తెలియదు. కానీ ఒకటి మాత్రం సత్యం సుశీ ! ఈ కలయిక ఏలాంటిదైనా, ఎలా ఏర్పడినా నిన్ను మాత్రం యిక వదలదలచుకోలేను. నా చేతుల్లోంచి జారిపోయిందనుకున్న వజ్రం నాకు అనాయాచితంగా, సునాయాసంగా తిరిగి లభించింది. ఎందుకు మళ్ళీ పారవేసుకోవాలి ? దైవం నీకు శుభం చేకూర్చుగాక !"

దీనికి జవాబుగా ఒక వారంరోజులకి టెలిగ్రాం వచ్చింది. అందులో తాను బయలుదేరి వస్తూన్నాననీ, స్టేషనులో కలుసుకోమనీ వుంది. మొదట నాకది అర్థంకాలేదు. తరువాత ఒంటరితనం భరించలేక వచ్చేస్తుందనుకొని ఆనందించాను.

ఆవేళ స్టేషనుకు వెళ్ళాను, సుశీకి స్వాగతం చెప్పడానికి. కాని రైలులోంచి దిగిన సుశీ నేను ఊహించిన సుశీ కాదు. "దిగినది" అన

టంకన్నా "దింపబడినది" అనటం వుచితమనుకుంటాను. నేను ఒకక్షణం కొయ్యబారిపోయాను. ఒక చెయ్యి తల్లి భుజంమీద భారంగా వేసి, రెండవ చేత్తో తండ్రి చెయ్యి పట్టుకుని సుశీల అనే జీవచ్ఛవం రైలులోంచి నీర సంగా నాకేసి చూచి నవ్వుతూ దిగింది. సుశీల తండ్రి నా కంగారు చూచి భుజంతట్టి "తరువాత అంతా చెప్తాను రామం ! ముందర ఒక టాక్సీ పిలుచుకురా !" అన్నాడు. నేను అక్కడనుంచీ కదిలేస్థితిలో లేను. కళ్ళు చీకట్లు కమ్మాయి. ఆయనే బయటకు వెళ్ళారు. తరువాత ఆయన చెప్పిన సారాంశం యిది ——

సుశీ వాళ్ళ ఊరు వెళ్ళింతర్వాత నీరసంతోపాటు దగ్గుకూడా పట్టుకుందట. అతినీరసపడిపోయింది. డాక్టరుకు చూపిస్తే సుశీలని పీడి స్తున్నది 'క్షయ' అనే మహా పిశాచం అని తేల్చాడట. సుశీని మద్రాసు లోనే హాస్పిటలులో చేర్పించుతా నన్నాడట సుశీ తండ్రి. సుశీ తనను రాజమండ్రి శానిటోరియంలో చేర్పించమందట. అందుకనే యిక్కడికి వచ్చారు.

సుశీ నాతో మాట్లాడిన మొదటి మాటేమిటంటే "మీ వజ్రం కోసం మీరు ఎవరితో పోరాడాలో తెలుసా ?" అంది.

"ఎవరితో పోరాడాలో వారిని ప్రార్థిస్తాను అది నాకు దక్కనివ్వ మని"

# 3

నా హృదయపు ఆరాటాన్ని, ఆవేదనను నేను చెప్పలేకపోతు న్నాను. నాకు బాల్యంనుంచీ దైవంమీద అచంచలమైన విశ్వాసం వుండేది. చిన్నతనంలో రామనామం జపిస్తే దెయ్యాలు పారిపోతాయిని నమ్మేవాడిని. అదే నమ్మకంతో నేను సుశీని రక్షించుకోగలనని నమ్మాను. ఎవరినైతే నేను నమ్మకున్నానో వారు సుశీని నానుంచీ వేరు చెయ్యరని ఆశించాను.

డాక్టరుని కలుసుకొని సుశిని దక్కనివ్వమని అడిగాను. ఆయన నాకేసి తేరిపార చూచి "ఆవిడ మీకేమవుతుంది" అన్నారు.

"అవవలసినంతా అవుతుంది డాక్టరుగారు. ప్రపంచంలో యీమె కంటె నాకు ఆప్తులెవరూ లేరు. ఆమెను నేను మీ చేతుల్లో పెడుతున్నాను" అన్నాను.

"ఫరవాలేదు. త్వరలోనే కనుక్కున్నారు .... ఇలాంటి కేసులు చాలా నయమయ్యాయి. అయినా మీరు విదేశాలనుంచి యిక్కడ దొరకని మందులు తెప్పించుకోవాలి" అన్నారు.

నాకు ఆ సమయంలో డబ్బంటే చాలా హీనంగా కనబడింది. "డాక్టరుగారు, మీరు డబ్బును గురించి ఆలోచించకండి. ఎంత డబ్బయినా ఖర్చుపెడ్తాను. చివరకు నా ప్రాణం యిస్తాను కావాలంటే. ఆమెకు నయం చెయ్యండి" అన్నాను.

ఆయన నవ్వుతూ "మీ ప్రాణం.... చేసుకుంటాను. నా శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను" అన్నారు.

నా శక్తులన్నీ కూడతీసుకొని ఆమెను రక్షించుకోటానికి రంగంలో దిగాను. రాత్రి పగలు - సుశి వద్దంటూన్నా సుశి ప్రక్కనే కూర్చునేవాడిని. ఆమె ఒకరోజున కొంచెము కోపంగా ముఖంపెట్టి "ఇది పాడు రోగము. నా వద్దకు రావద్దంటూంటే మీకు వినబడదా ?" అంది.

నేను నవ్వుతూ "నాకేమీ ఫరవాలేదు సుశీ ! కాని నాక్కూడా ఈ రోగంవస్తే మరీ మంచిది. అప్పుడేమీ యీ అడ్డంకులుండవు. హాయిగా ఒకరి ప్రక్కన ఒకరు కూర్చుని చక్కగా ఎప్పుడూ కబుర్లు చెప్పుకోవచ్చు. చావటం తప్పకపోతే యిద్దరమూ చద్దాము" అన్నాను.

సుశీ కళ్ళల్లో నీరు మొదటిసారిగా అప్పుడే నేను చూశాను. వ్యాకుల కంఠంతో "ఛీ, ఛీ ! అలాంటి మాటలనకండి. అసలు మనమిద్దరమూ కలుసుకోక పోయినట్లయితే ఎంత బావుండును ! ఎక్కడో చచ్చేదానికి" అంది. సుశి నోటివెంట అలాంటి మాటలువస్తే నేనెలా సహించగలను. కట్టతెగిన ప్రవాహంలా ఒక అశ్రుధార సుశి శుష్కవక్షస్థలం మీదుగా ప్రవహించింది.

రోజులూ, వారాలూ గడిచిపోతూన్నాయి. సుశీ ఆరోగ్యం బాగవు తూంది. పక్కన కూర్చుని వేళ తప్పకుండా మందులు ఆహారం ఇచ్చే వాడిని. నర్సులు నేను లేనప్పుడు వేళాకోళం చేసేవారుట. "ఆయన మీకేమవుతారు" అని అడిగితే "నా కాబోయే భర్త" అని చెప్పేదిట. ఎందుకలా అన్నావని అడిగితే "ఏం! కారా!" అంది. ఆ ఒక్కమాట నాకు ఎంతో ధైర్యాన్ని, వుత్సాహాన్నీ యిచ్చింది. ఆమెలో కోరిక లున్నాయి. అదేవాలు.

కాని ఒక్కొక్కప్పుడు ఎంతోవిచారంగా కృంగిపోయి మాట్లాడేది. ఒకనాడు మంచంమీద లేచి కూర్చుని "నేనొకమాట చెప్తాను వింటారా!" అంది.

"చెప్పు సుశీ! ఎందుకు వినను" అన్నాను.

"నే నొకవేళ చనిపోతే మీరు...." అని ఏదో అనబోయింది.

నెమ్మదిగా చెయ్యి ఆమె నోటిమీద పెట్టి "అలాంటి మాటలనకు సుశీ! నాకు చాలా బాధ కలుగుతుంది. నీకు తప్పకుండా స్వస్థత కలుగు తుంది. నాకు తెలుసు" అన్నాను. సుశీ నెమ్మదిగా చెయ్యితీసి తన చెంప మీద పెట్టుకొని పక్కకు ఒరిగిపోయింది. నేను ముఖం పక్కకు తిప్పి చూద్దునుగదా, సుశీ కళ్ళలోంచి ఒక కన్నీటిధార స్వేచ్ఛగా, నిరా టంకంగా స్రవిస్తోంది.

## 4

రెండు మాసాలు గడచిపోయాయి. సుశీ చాలావరకూ కోలుకుంది. టెంపరేచర్ నార్మలుకి వచ్చేసింది. శరీరం నిగనిగలాడుతూ వుండేది. గండం గడచిపోయిందనుకున్నాను. డాక్టరు కూడా అదే అన్నారు. ఇంకొక నెల లోపున పూర్తిగా తగ్గకపోతే ఆపరేట్ చేస్తానన్నాడు.

నేను ఒకరోజున మా యింటికి భోజనానికి వచ్చాను. అన్నం కలిపి ముద్ద నోట్లో పెట్టబోయే సమయానికి మా బంట్రోతు గబగబా

పరుగెత్తుకుంటూ వచ్చి "చిన్నబాబుగారు, అయ్యగారు మిమ్మల్ని త్వరగా రమ్మంటూవున్నారు. చిన్నమ్మగారి నోట్లోంచి రకతం పడుతూంది" అన్నాడు. నేను స్తంభించిపోయాను. కాసేపటివరకూ నాకు నోటమాట రాలేదు. అలాగ ఎప్పుడూ అంతకుముందు జరుగలేదు.

నేను వెంటనే అక్కడికి వెళ్ళి చూచిన దృశ్యం నే నెన్నటికి మరువలేను. సుశీ మంచంమీంచి క్రిందకు వంగి రక్తం కక్కుతూంది. సుశీ తల్లి, తండ్రి యిద్దరూ కూడా ఆమెను పట్టుకోలేకపోతూన్నారు. పక్కనిండా నెత్తురు. ఒంటినిండా నెత్తురు. ఎర్రటి నెత్తురులో అక్కడక్కడ చిన్న మాంసపు కండలున్నాయి. ఇంతలో డాక్టరు వచ్చి ఏదో యింజక్షన్ యిచ్చాడు. కొంతసేపటికి నెత్తురుపడటం తగ్గింది, కానీ సుశీకి వంటిమీద స్పృహలేదు. ఆశాజ్యోతి ఆరిపోయే సమయం ఆసన్నమైందా అనే భయంతో వొణికిపోయాను. కాని ఆ దినం గడిచిపోయింది. అయినా నెత్తురుపడటం తగ్గిపోలేదు. అలా జరిగినప్పుడల్లా తోకతెగిన పాములా కొట్టుకునేది. అంత కన్నీరు నాలో ఎక్కడ దాగివుందో! సుశీని చూచినప్పుడల్లా కళ్ళు నీటితో నిండిపోయేవి. ఇక సుశీకి ఆ బంధనాలనుంచీ శాశ్వత విముక్తిలేదని గ్రహించాను. ఆమె బాధ చూడలేక అక్కడకు వెళ్ళటం తగ్గించివేశాను.

ఒకసారి సుశీ ఆయాసపడుతూ అంది : "నేను ఎలాగా చచ్చిపోతాను. అయితే నేను ఏమయిపోతాను ? మిమ్ములను విడిచి నేను ఎక్కడికి పోతాను చెప్పండి ? నాకు మిమ్మల్ని విడిచిపోవాలని లేదు. నేనుపోతే మీరు చాలా బాధపడుతారు కదూ!" అంది.

అలాంటి మాటలు విని నేనెలా సహించగలను ? సుశీ చెయ్యి తీసుకుని నా హృదయంవద్ద పెట్టుకుని "నువ్వు చనిపోవటానికి వీల్లేదు సుశీ! ఎన్నటికీ వీల్లేదు. నేను చనిపోనివ్వను. నువ్వు నాకోసం జీవిస్తావు. లేకపోతే నేనూ చచ్చిపోతాను" అన్నాను.

సుశీ గబుక్కున చెయ్యి లాక్కుని అంది : "ఛీ, ఛీ! నేను చనిపోతే మీరు చనిపోవటమేమిటి ? మీరింత పిరికివారా ? నే నె

మీకు ? అసలు మీకూ నాకూ సంబంధమేమిటి? ఏదో కొంచెం స్నేహం కలిగింది అంతే !" అంది.

ఆ చివరి మాటలు ఆమె హృదయంలోంచి రాలేదనే విషయం నాకు బాగా తెలుసు.

ఈ విధంగా ఒక పక్షంరోజులు దిన దిన గండంగా గడచి పోయాయి. డాక్టరు వద్దంటూన్నా. తలిదండ్రులు ఎంత బతిమాలినా, సుశీ ఎంత మందలించినా ఆమె దగ్గరే రాత్రి పగలూ గడిపేవాడిని. అవసాన కాలం సమీపిస్తూంది. నాకేమయినా సరే, ఈ తిరిగిరాని కాలాన్ని వృధా చెయ్యను. సుశీ పోయింతర్వాత నేనేమవుతే నేమిటి ?

సుశీ పరిస్థితి నానాటికి క్షీణించిపోతూంది. నా వజ్రాన్ని కాపాడుమని అహర్నిశలూ ప్రార్థించేవాడిని. "సుశీని కాపాడు, కావాలంటే నన్ను తీసుకుపో" అని రోదించేవాడిని. ఆనాడు సుశీ పరిస్థితి విషమించి పోయింది. డాక్టరు చివరి గండం గడవటం చాలా కష్టమని చెప్పారు.

డాక్టరుని తీసుకుని సుశీ వద్దకు వెళ్ళాను. సుశీ నరకయాతన అనుభవిస్తూంది. డాక్టరు యింజక్షన్ యిస్తానంటే మొదట చెయ్యి చాచలేదు. బలవంతాన చివరకి యివ్వగలిగేడు. కాని మరుక్షణంలోనే ఆమెకు స్పృహపోయింది. మరికొంతసేపటికి స్పృహ వచ్చింది. కాని మాట పోయింది. 'సుశీ, సుశీ !' అని ఎంతోసేపు పిలిచినమీదట ఆమె కళ్ళు విప్పింది. నాకు ఏదో చెప్పాలని ఎంతో ప్రయత్నించింది. నాకేమీ అర్థం కాలేదు. అప్పుడు డాక్టరు "తనతల మీ ఒడిలో పెట్టుకోమంటూంది" అన్నాడు. సుశీకేసి చూచాను. ఆమె 'అవును' అన్నట్లు తల ఊపింది. ఒకసారి నేను అలా చేస్తానని మాట యిచ్చాను. సమయానికి ఆమె జ్ఞప్తికి తెచ్చేవరకూ అది మరచేపోయాను. ఆమె కోరిక ప్రకారం చేశాను. అలాచేసిన వెంటనే నేను సర్వం మరచిపోయాను. నాకు అపుడు కనిపించినదీ తెలిసినదీ ఒకటే. నాకోసం విధితో పోరాడే సుశీ. ఆమెమీద ప్రేమతో పెల్లుబికే నా హృదయం - అంతే. మిగతాదంతా మరచిపోయాను. "సుశీ, సుశీ" అంటూ పిచ్చివాడిలా అరచాను. సుశీ ఒకసారి కళ్ళుతెరచి చూచింది. ఆచూపుతోనే నాకు వీడ్కోలు ఇచ్చింది. ఒకసారి చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నించింది.

పెదిమలు వణికాయి. ఆ పరిస్థితిలో ఆ శక్తిమకు కూడా ఆమె తట్టుకోలేక పోయింది. కళ్ళు మూసివేసింది. అంతే. అందమైన కనురెప్పలు యిక తెరచుకోలేదు. డాక్టరు పల్సు చూస్తున్నాడు. నేను బయటికి వచ్చేశాను. నాకేసి చూడనీ, నన్ను పలకరించనీ - సుశీని నేను యింక చూడలేక పోయాను. జరుగవలసిన తతంగం అంతా జరుగుతూంది. ఇక నేనెం దుకు ?

# 5

ఆ మరునాడు పొద్దున్న నిద్రలేచిన వెంటనే ఏవో ఒక పీడకల వచ్చినట్టయింది. మా అమ్మ దగ్గరకు వెళ్ళి "రాత్రి ఏదో పాడుకల వచ్చింది. సుశీకి ఎలావుందో ? ఆస్పత్రికి యిప్పుడే వెళ్ళి వస్తాను" అన్నాను. ఆమె కళ్ళలోని కన్నీరు చూడగానే సుశీ నిజంగా మరణించిం దనే విషయం స్ఫురణకు వచ్చింది. అప్పుడు నాకు కళ్ళవెంట నీరు రాలేదు. కళ్ళు చీకట్లు కమ్మాయి. అక్కడే కూలిపోయాను.

సుశీ మరణం జీవితంలోని అతిముఖ్యమైన సంఘటన. అది నాలోని కోరికలని, నమ్మకాల్ని సమూలంగా పూడబెరికింది. దైవంమీద నా విశ్వాసం సడలింది. భవిష్యత్తులో నా ఆలోచనల్ని, అభిప్రాయాల్ని, చేష్టలనీ తీర్చిదిద్దింది. దైవం నాకు అన్యాయం చేశాడనే అభిప్రాయం నా హృదయంలో హత్తుకుపోయింది. అది ఎన్నడూ మాసిపోలేదు. చని పోయినా సుశీకి నేను అన్యాయం చేయకూడదనే దృఢనిశ్చయానికి వచ్చాను. జీవితంలో యిక వివాహపు ఆలోచనలు పూర్తిగా అణగారి పోయాయి. ఇక వాటినిగురించి యోచించకూడదనుకొన్నాను. చాలా కాలంవరకు ఆ నిశ్చయానికి కట్టుబడివున్నాను. ఆ తరువాత యింకొక వ్యక్తి నా జీవితంలో ప్రవేశించి, నన్ను మభ్యపరచి నా మనస్సు కాజే శాడు. అయినా చాలా కాలంవరకూ నా హృదయంలో ఆమెకే నేను మొదటిస్థానం ఇచ్చాను. సుశీ స్మృతి నే నెన్నడూ కలుషితం చెయ్య లేదు, క్షణకాలంకూడా ఆమెను పూర్తిగా మరచిపోలేదు.

కాలానికి మానవునికి ఇష్టాయిష్టములతో ప్రమేయంలేదు. నిరంతరంగా నిర్విరామంగా అది ముందంజ వేస్తూంది. మానవుని దుఃఖానికి అది కంటతడి పెట్టదు. సుఖానికి చిరునవ్వు నవ్వదు. నా విషయంలో కూడా అదే జరిగింది. జీవచ్ఛవంలా కాలము గడిపాను. సుశిని నానుండీ దూరం చేసింది మానవుడు కాదు. ఎవరినైతే బాల్యమునుండి నమ్ముకుంటున్నానో వారే యిలా చేశారు. ఇలా శిక్షించటానికి నేను సుశీ చేసిన దోషమేమిటి? దైవం ఎవరినైతే ప్రేమిస్తాడో వారిని త్వరగా యీ లోకంనుంచీ తనవద్దకు తీసుకుపోతాడు అంటారు. నిజమేకావచ్చు. సుశిని ఆయన ప్రేమించాడంటే నేను ఆశ్చర్యపడను. అదే నా ఆఖరి ఓదార్పు.

భగవద్గీతలో-మరణమంటే భయపడవలసిన అవసరంలేదు. అది ఒక మాసినచొక్కా విప్పి కొత్త చొక్కా తొడుక్కోవటం మాత్రమే-అని వ్రాసివుంది. అది నిజమో కాదో నాకు తెలియదు. కాని ఒక విషయం మటుకు సుస్పష్టమైంది కొత్త చొక్కా తొడుక్కున్న పిదప తను ఒకప్పుడు పాతచొక్కా తొడుక్కున్నాననే విషయం మరచిపోతాడు. పూర్వజన్మ జ్ఞానమే మానవుడికి వుంటే నిత్యమూ చొక్కా మార్చటానికి అంగీకరిస్తాడు. అయితే పూర్వజన్మవుంటే పునర్జన్మకూడా వుండే వుండాలి. సుశీ ఎక్కడైనా పునర్జన్మించిందా? నేను ఆమె తలపుతో సతమతమవుతూంటే ఆమె ఒక పసిపాప రూపంలో వుగ్గుపాలుతాగుతూందా? ఇలాంటి ఆలోచనలు నన్ను అనుక్షణమూ వేధించేవి.

కొన్నాళ్ళు పోయింతర్వాత తిరిగి కాలేజీలో చేరాను. చదువులో మునిగి దుఃఖము మరచిపోదామనుకున్నాను. అలా సాధ్యపడలేదు. ప్రతి స్థలమూ, ప్రతి వస్తువూ సుశీ స్మృతులను జ్ఞప్తికి తెచ్చేది. క్లాసులో పాఠం వింటూంటే సుశీ నాకేసి కొంటెగా నవ్వుతున్నట్టు కనబడేది. కాలేజినుంచి తిరిగి వస్తూంటే వెనుకనుంచీ ఎవరో పిలిచినట్టయ్యేది. దారిలో ఒక స్త్రీ కంఠం "మీ ఫిజిక్సునోట్సు ఒకసారి ఇస్తారా?" అన్ని అడుగుతున్నట్టనిపించేది,

అవి యవ్వనంలో అడుగుపెట్టిన రోజులు. బతకవలసిన కాలం యింకా చాలా వుండివుంటుంది. శేష జీవితమంతా ఇలాగే గడపవలసిందా ? అంతకంటే వేరేమార్గము కనబడలేదు. సుశీని దైవం ప్రేమించాడు. అందుకని ఆమెను తీసుకుపోయాడు. నన్ను కూడా అలాగే ప్రేమించాడనటానికి నిదర్శనాలు లేవు.

# 6

ఆనర్సు చదువు పూర్తి అయింది. ఆ వేసంగి శలవులకు ఏదైనా ఒక ప్రశాంత వాతావరణములో గడుపుదామనుకున్నాను. తలిదండ్రులు కాదనలేదు. అయితే ఎక్కడికి వెళ్ళాలి ? ఏదైనా ఒక హిల్ స్టేషన్‌కు వెళ్తే బావుంటుంది. వేసవికాలం చల్లగా వుంటుంది. మా నాన్నగారు ముస్సోరీ వెళ్ళమన్నారు. ఆయన ఆప్తమిత్రుడొకాయన బాగా డబ్బు గణించి అక్కడ స్థిరపడిపోయాడు. నాగురించి ఆయనకు వ్రాస్తే తప్పకుండా అక్కడకు పంపించమని నొక్కి వ్రాశారు. "నాకు కొడుకూ, కూతురూ సర్వస్వమూ అయిన మా యశోకి మీ రామానికి ఏమీ తేడా చూపించనని మాటయిస్తూన్నాను.నువ్వు వ్రాసిన వుత్తరం నేను ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తూవున్న సంఘటనలా నా మనస్సు పదే పదే చెప్తోంది. ఇది భగవత్సంకల్పం. సందేహంలేదు" అని వ్రాశారు.

సరే, అక్కడకు బయలుదేరటానికే బెడ్డింగు చుట్టాను. నాన్నగారు ఆయన మిత్రుడికి టెలిగ్రాం ఇచ్చారు. ఎక్స్‌ప్రెస్ కలకత్తానుంచీ రెండు రాత్రులు ఒక పగలూ ప్రయాణం చేసి దేహ్రాడూన్ ప్లాటుఫారం మీదకి వచ్చి ఆగింది. పెట్టె, బెడ్డింగు దింపి ప్లాటుఫారంమీద నుంచున్నాను.

ఇంతట్లో 'నాన్నా ! ఆయనేమో !' అన్న ఒక స్త్రీ కంఠం విని ప్రక్కకు తిరిగి చూచాను. ఒక ముసలాయన, ఒక యువతీ నావైపు నడచి వస్తున్నారు. ఆ ముసలాయన దగ్గరకు వచ్చి "నాయనా, నువ్వే కదూ మా శేషు కొడుకువి రామానివి ?" అన్నారు.

"ఔనండి; నమస్కారం" అన్నాను.

ఆయన ఎంతో ఆప్యాయంగా "నీకోసమే ఎదురు చూస్తున్నాము నాయనా ! పద బయటకు వెళ్దాం. అన్నట్టు మరచిపోయాను. ఈవిడే మా అమ్మాయి "యశో" అన్నారు.

అంతవరకూ ఆవిడను నేను సరిగా చూడనేలేదు. అంత చక్కటి అమ్మాయిని నేను యింతవరకూ చూడలేదు. బంగారపు ఛాయ ఆమెది. శిల్పి చెక్కిన విగ్రహంలావుంది. పసుపుపచ్చటి పట్టుచీర కట్టుకుంది.

నాకేసి చూచి సన్నగా నవ్వుతూ "నమస్కారమండీ !" అంది. ఆ నవ్వులో నా మనస్సులో సదా మెదిలే సుశీ రూపం జ్ఞప్తికి వచ్చింది. జవాబివ్వకుండా అలాగే చూస్తున్నాను.

ముసలాయన "పద నాయనా బయటకు వెళ్దాం .... బాగా అలసి పోయి నట్లున్నావు. ఎక్కడ రాజమండ్రి, ఎక్కడ దెహ్రాడూన్" అన్నారు ముగ్గురమూ బయటకి బయలుదేరాము. దారిలో ఆమెకు ప్రతి నమస్కారము చెయ్యలేదని జ్ఞప్తికి వచ్చి "నమస్కారమండీ !" అన్నాను.

ఆమె నాకేసి ఎంతో ఆశ్చర్యంగా చూచింది. నాలో దేనినో వెదకు తున్నట్టనిపించింది. బలవంతాన నవ్వు ఆపుకుంటూన్నట్లు కూడా అనిపించింది. బయట కారులో సామానుపెట్టి బయలుదేరేముందు యశో నవ్వుతూ "నమస్కారమండీ !" అంది.

సుశీ చనిపోయిన తరువాత మొదటిసారిగా నేను నవ్వు అణచుకోలేక పోయాను. యశో చాలా కొంటెపిల్లని గ్రహించాను.

పాములా వంకలు తిరిగివున్న ఆ రోడ్డుమీద కారు పరుగెడు తూంది. కవులు ప్రకృతి సౌందర్యాని కెందుకు ముగ్ధులయ్యారో నాకు అప్పుడు తెలిసింది. ఎత్తైన ఆ కొండలు జలజలా ఆ రోడ్డుమీద వురికే జలపాతాలు కన్నులపండుగగా వున్నాయి. మలుపుతిరిగితే ఎదురైయ్యే మబ్బుల దృశ్యం మనోహరంగా వుంది.

ముగ్గురమూ మౌనంగానే వున్నాము. ఇంతలో ఒక అస్పష్టమైన కంఠస్వరం 'అబ్బా ! ఎంత బావుంది' అంది. యశో కిటికీలోంచి బయ

టకు చూస్తూ తన్నుతాను మరచి అన్నమాట లివి. పప్పటి ఆమె ముఖం మీద ముంగురులు నాట్యం చేస్తూవున్నాయి. ఉదయభానుని లేత సూర్య రశ్మి ఆమె ముఖాని కొకింత శోభనిస్తూంది. మనోరంజకమైన ఆమె ముఖాన్ని తదేకంగా చూస్తూ వున్నాను. హఠాత్తుగా ఆమె నావైపు తిరిగి కాస్త సిగ్గుపడుతూ "ఏమిటో ఈ నేచర్‌ని చూస్తూవుంటే నన్ను నేను మరచిపోతాను. ఇలాంటి ప్రదేశం ఎలా వదలిపెట్ట బుద్ధి పుడుతుంది చెప్పండి !" అంది.

ముందర సీటులో కూర్చున్న యశో తండ్రి "అవును నాయనా. యశోకి ప్రకృతి అంటే తీరని పిచ్చి. ముస్సోరి వదలి ఎక్కడకు రా నంటుంది" అన్నారు.

కారును కొంచెం దూరంలో ఆపివేశారు. ఊరిలోకి బస్సులూ, కారులూ రానీయరట. ఆ కొంచెము దూరమూ నడచి వెళ్ళేము. సామానులు అక్కడ కూలీలు తీసుకువచ్చారు. కారువదలి వచ్చేస్తూంటే యశో "ఈ కారు మాది కాదండోయ్ ! ఒక స్నేహితురాలివద్ద పుచ్చుకున్నాను" అంది. ఆమె అలా అనటం కాస్త అసభ్యంగా వుందనిపించింది నాకు.

ముస్సోరీ చాలా మనోహరంగా వుంది. ఏవైపు చూసినా చల్లని మేఘాలు చక్కిలిగింతలు పెడుతున్నాయి. అక్కడక్కడ దట్టమైన మబ్బులు ఒక గజంలోని వస్తువుల్ని కూడా మరుగుపరుస్తూన్నాయి.

వారి బంగళా దగ్గరకు వచ్చాము. బయట ఒక ముసలి బంట్రోతు వున్నాడు. "రామదీన్ ! సామాను మేడమీద అమ్మాయి ప్రక్కగదిలో పెట్టించు. పద నాయనా, లోపలికి పద" అన్నాడు ముసలాయన.

# 7

ఆరోజు మధ్యాహ్నము నేను నిద్రలేచి మేడమెట్లు దిగి వస్తూ న్నాను. క్రింద గదిలో యశో ఎవరితోనో మాట్లాడుతూంది. యశో

అంటోంది "అబ్బ! నేను రాలేను రాజేంద్రబాబూ! ఈ ఒక్కరోజుకి నన్ను క్షమించలేరా!"

అతగాడు ఏమి జవాబిచ్చాడో నాకు సరిగా వినబడలేదు. యశో "నన్ను విసిగించకండి రాజేంద్రబాబూ! నేను రావడానికి ఎంత మాత్రమూ వీల్లేదు" అంది.

ఈసారి కంఠస్వరాన్ని హెచ్చించి అతను "అతిథులు మీ ఇంటికి రావటం ఏమీ కొత్తకాదు. యశో, అతిథులు ఇంట్లో వుండగా పిక్చర్సుకీ, పిక్నిక్‌కీ నతో చాలాసార్లు వచ్చావు. అసలు ఈ అతిథి ఎవరు? నీకు ఇంట్లో ఆయనమీద ఇంత అనురాగము ఎలా పుట్టుకొచ్చింది. నాకు జవాబులు కావాలి ఈ ప్రశ్నలకి" అంటున్నాడు.

నేను తిరిగి పోదామనుకుంటూంటే యశో నన్ను చూచింది. ఇంకా ఏమైనా అంటాదేమోనని ఆమె లేచి నుంచుని "అప్పుడే వచ్చేసారే కిందకి. మీరు. రాత్రి సరిగా నిద్ర వుండివుండదు. మిమ్మల్ని మెలకువ వచ్చేవరకు లేపవద్దని అన్నారు నాన్నగారు" అంది.

నేను ఇక తప్పదనుకుని కిందకు వచ్చాను. యశో లేచి చిరునవ్వు తెచ్చుకుని నన్నాయనకు పరిచయం చేసింది. "ఈయన రాజేంద్ర కుమార్. ఈ ఏడాదే యం. బి. ప్యాసయ్యారు. డూన్‌లో ప్రాక్టీసు పెట్టారు. నాన్నగారికి బాగా తెలుసు. ఈయన అప్పుడప్పుడు వస్తూం టారు."

చివరి రెండు వాక్యాలూ అసందర్భమనిపించాయి నాకు. లోపలి నుంచి వాళ్ళ నాన్నగారు వచ్చారు. ఆయన మా ముగ్గురినీ చూచి "ఏమమ్మా యశో! మీ ముగ్గురూ యేమైనా ప్రోగ్రాం వేసుకున్నారా?" అన్నారు. "లేదు నాన్నా. ఈవేళేకదా వచ్చారు ఈయన. ఇప్పుడే అన్నీ చూపిస్తే తరువాత ఏం చెయ్యటం? ఈరోజు మన యిల్లంతా చూపి స్తాను, మళ్ళీ మరిచిపోకుండా"

రాజేంద్ర మాకేసి కాస్త కోపంగా చూస్తున్నాడు. ఆయనని

చూస్తే నాకు కాస్త జాలివేసింది. "పోనీ, మీరు ఆయనతో కలసి బయ టకు వెళ్ళిరాకూడదా! నేను ఈలోపున సామాను సర్దుకుంటాను" అన్నాను.

రాజేంద్ర చిరునవ్వు నవ్వాడు.

యశో కొంచెం కోపంగా "నన్ను అప్పుడే వదలించుకోవాలని చూస్తారా? అయినా నేను ఈరోజు ఇంట్లోనే వుంటాను ఇంకొక సంగతి రామబాబూ! నన్ను ఎందుకు 'మీరు' అని సంబోధిస్తున్నారు. లేకపోతే నాపేరు మీకు నచ్చలేదా చెప్పండి 'యశో' అని పిలవటం ఇష్టంలేక పోతే 'రాజ్యం' అని పిలవండి. నా పూర్తిపేరు 'యశోరాజ్యం' అనే సంగతి మీకు తెలియదనుకుంటాను" అంది.

అంతమంది ఎదుట ఆ అప్రస్తుత సంభాషణకి నేను కాస్త సిగ్గు పడ్డాను. నేను 'సరేలెండి, అలాగే పిలుస్తాను' అని మళ్ళీ జ్ఞాపకానికి వచ్చి "సరే యశో, అలాగే పిలుస్తాను" అన్నాను.

కొంచెంసేపు పోయిన తర్వాత రాజేంద్ర వెళ్ళిపోయాడు. నన్ను వాళ్ళ ఇంటికి ఒకసారి రమ్మని ఆహ్వానించాడు. యశో నా ఎదుట ఆయనతో బయటికి రా నిరాకరించినందుకు బాధపడుతూన్నట్టు కనిపించాడు.

సాయంకాలము యశో నన్ను వెంటబెట్టుకొని వాళ్ళ బంగళా చూపించటానికి బయలుదేరింది. ఆపని ఒక అరగంటలోనే అయి పోయింది. అది ఒక వంక మాత్రమేనని గ్రహించాను నాకు యశోమీద కొంచెం కోపంకూడా వచ్చింది. ఆమె నలుగురి ఎదుట అతిథిని అలా ఎందుకు పరాభవించింది? ఇది అపరిమిత అనురాగమా లేక అంతులేని అహంకారమా? వాళ్ళ ఇంట్లో తిరుగుతున్నంత కాలమూ నేనేమీ మాట్లాడలేదు. యశోకూడా చాలా ముక్తసరిగా వుంది.

అంతా అయిపోయి నేను గదిలోకి వెళ్తూవుంటే యశో వరం డాలో నుంచుని "మిమ్మల్ని ఒకమాట అడిగితే కోపంరాదుకదా రాం బాబూ!" అంది. నేను వెనుదిరక్కుండానే "నే నెవరిని నీమీద కోప గించటానికి? అడుగు" అన్నాను. యశో కొంచెం ఆవేశంగా "ఇందాక

మీరు రాజేంద్రి, మా నాన్నగార్ల ఎదుట నన్ను ఎందుకు అవమానించారు ?" అంది. నేను ఆశ్చర్య చకితుడనయ్యాను. దృఢంగా, కాస్త కఠినంగా అన్నాను. "నేను నిన్ను అవమానించలేదు. అవమానించింది నువ్వు యశో. అవమానించింది రాజేంద్రి. ఇది చాలా స్పష్టమైన సంగతి"

యశో ఆవేశం హెచ్చింది. తీక్షణంగా "మీతో సరదాగా కబుర్లు చెప్పుదామని ఇంట్లో వుండిపోదామంటే, నన్ను బయటికి వెళ్ళిపోమనటం అవమానించటం కాదా ? నేను మీతో వుండటం మీకు ఇష్టంలేదని, నన్ను వదలించుకోవటానికి ప్రయత్నిస్తున్నారని చెప్పటం కాదా ? ఇక రాజేంద్రి సంగతి : అస్తమానమూ ఆయనమాటే చెల్లాలా, నామాటకు విలువలేదా ? ఈ ఒక్కరోజుకే నన్ను క్షమించమంటే ఆయన ఎందుకు అంత పట్టుపట్టాలి ?" అంది.

ఆమె అన్నిమాటలు అంత తీక్షణంగా మాట్లాడగలదని నేను ఊహించలేదు; కాస్సేపు మాట్లాడలేదు.

"నేను అంతదూరం ఆలోచించలేదు. యశో ఆలోచించివుంటే నేనలా అనేవాడిని కాదేమో। నేనెంతసేపూ రాజేంద్రి విషయమే ఆలోచించాను. నీ సంగతి గుర్తుకు రాలేదు ఎందుచేతనో ?" అన్నాను.

యశో కోపం ఇంకా పోలేదు. తల అడ్డంగా తిప్పుతూ "కాదు, మీరు కావాలనే అన్నారు. నన్ను నలుగురి ఎదుట చిన్నబుచ్చాలనే అన్నారు" అంది.

నేను నీరసంగా "అయితే నన్నిప్పుడేమి చేయమంటావు యశో. నా సత్సంకల్పాన్ని ఋజువు చేసుకోవటానికి నేనేం చెయ్యాలి? అయినా నేను ఒక సంగతి అడుగుతాను. నన్ను అతిథిగా మాత్రమే చూస్తున్నావా లేక ఇంకొక విధంగా చూస్తున్నావా ? నా యీ రెండు ప్రశ్నలకి జవాబివ్వాలి" అన్నాను. "చెప్పమంటారా ?" అంది నా ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

"చెప్పు యశో !"

"ఉఁ హూఁ ! ఇప్పుడుకాదు. మరొక్కప్పుడు చెప్పుతాను. ఈ

స్థితిలో మీరు అది అర్థం చేసుకోలేరు" అని చరచరా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆరోజు రాత్రి నా అలవాటు ప్రకారం చాలా రాత్రివరకు చదువుతూ మేల్కొని వున్నాను. తలుపు ఎవరో తట్టినట్టయి "ఎవరు; రామదన్, లోపలికి రా!" అన్నాను.

లోపలికి వచ్చింది యశో, రామదీన్ కాదు.

లోపలికి వస్తూ "టైమెంత అయిందో మీకేమన్నా తెలుసా? ఇంకా మేలుకునే వున్నారెందుచేత? నిద్రపోవాలనే ఆలోచన మీకున్నట్టులేదు" అంది. నేను సమాధానికి ప్రయత్నిస్తూ "నాకు ఆలస్యంగా పడుకోవటం అలవాటు యశో" అన్నాను.

ఆమెముందు నేనొక చిన్నపిల్లవాడి నయిపోయాను.

"అలవాటు ఎందుకు చేసుకున్నారు? అలవాటుకు కూడా మొదట అంటూవుంటుంది కదా? ఇంత పెద్దవారైనా మీఆరోగ్య సంగతి మీరు చూచుకోకపోతే ఇంకెవరు చూస్తారు? ఇక్కడున్నంతకాలము మీ ఆరోగ్యం సంగతి మా బాధ్యత.దయతో ఇది జ్ఞాపక ముంచుకోండి. ఇవాళే రామదీనుతో చెప్తాను-పది గంటలకల్లా యింట్లో లైట్లన్నీ ఆర్పివేయమని" అంది.

యశో నా చేతుల్లోంచీ పుస్తకము తీసికొని లైటు ఆర్పివేసింది. యశో వెంటనే వెళ్ళిపోతుందనుకున్నాను. కాని ఆమె అక్కడే నుంచుంది.

నేను ఆశ్చర్యంతో "యశో,ఇంకా యిక్కడేవున్నావా?" అన్నాను. చీకట్లోంచి ఒక స్త్రీ కంఠం జవాబిచ్చింది. "అవును. మిమ్మల్ని ఒక విషయం అడుగుదామని వున్నాను"

"అయితే ఆలస్యందేనికి అడుగు"

"మీపేరు నాకు నచ్చలేదు. ఇంకొకపేరు పెట్టి పిలువాలని అనుకుంటూన్నాను. మీ అనుజ్ఞ అయితే"

"ఏమని పిలుస్తావు ? జంతువుపేరు పెత్తావా లేక రాక్షసుకి పేరు పెడతావా ?" అన్నాను.

యశో ఒక్కమాటే పలికింది – "బాదకబాబు"

నా ఆశ్చర్యానికి అంతులేదు. ఈ పేరు నే నంతకుముందు నవల్లోకూడా చదివిన గుర్తులేదు. "అంటే ఏమిటి ? అసలు నీకు యీ కోరిక ఎందుకు కలిగింది. చెప్పు యశో!"

యశో ఇంకా అక్కడేవుంది. "ఆ విషయం మీరెప్పుడూ అడుగ కూడదు. అయినా ఆ విషయం బహూశా రానురాను మీకే తెలుస్తుంది" అని ఆమె తలుపువైపు వెళ్ళిపోతూంది.

హఠాత్తుగా అనాలోచితంగా నేను "అందరి ఎదుటా అలాగే పిలుస్తాను యశో" అన్నాను.

యశో హఠాత్తుగా ఆగి "అంటే మీ ఉద్దేశ్యం ఏమిటి ? నలుగురి ఎదుటా అలా పిలిస్తే సిగ్గుపడతారా? సరే. అయితే ఇది మీ ముద్దుపేరు" అంది. జవాబుకి ఎదురు చూడకుండా గబగబా బయటకు వెళ్ళిపోయింది.

ఆ రాత్రి సరిగా నిద్ర పట్టలేదు. యశో మాటల అర్థం నేను సరిగా గ్రహించలేకపోయాను. అతి గారాబంగా పెరిగిన యువతి ఈమె అని గ్రహించాను. కారులో తల బయటకు పెట్టి 'అబ్బా ఎంత బావుంది' అన్న యశోకి, కోపంతో ప్రజ్వరిల్లిపోతూ 'మీరు నన్ను కావాలని అవ మానించారు' అన్న యశోకి చివరికి చీకట్లో ఇది మీ ముద్దుపేరు' అన్న ఆమెకి నాకేమీ పోలికలు కనబడలేదు. ఒక్కరోజులో ఈమె ఇంత చనువునానుండీ ఎలా సంపాదించింది ? ఈమెకు సుశీ విషయం తెలియదా ? మా నాన్నగారు ఆ విషయం యశో తండ్రికి రాశా రనే వుద్దేశంలో నే నున్నాను. అయితే ఈయన కూతురుతో ఈ విష యం చెప్పలేదా ? ఏమయితేనేం. మనస్సులో ముద్రితమైన సుశీ ఛాయా పటాన్ని నేను చెరపలేను. అయితే ఇక మిగిలింది ఒకే ఒక ప్రశ్న. నా కర్తవ్యం యేమిటి ?

# 8

మరునాడు నిద్రలేచేటప్పటికి చాలా పొద్దుపోయింది. కళ్ళు తెరచే టప్పటికి ఎదురుగుండా యశో నా బట్టలు సర్దుతూ కనబడింది. నేను లేచి కూర్చుని "నీ కెందుకు యశో ఈ పనులన్నీ ? నేను సర్దుకుంటాను తరువాత" అన్నాను. యశో నవ్వుతూ "ఈ విషయం గురించి తరువాత మాట్లాడుకుందాము. ముందర ముఖం కడుక్కొని రండి. లేకపోతే మీకు పాచిపళ్ళతో కాఫీ తాగటం అలవాటా ?" అంది.

నిజం చెప్పాలంటే నిద్ర లేచిన వెంటనే కాఫీ ముందరవుంటే గడగడా తాగేస్తాను. కాని యశో ఎదుట అలా అనటానికి భయం వేసింది. మంచంమీంచి లేచి బాత్‌రూములోకి వెళ్ళిపోయాను.

నేను తిరిగి వచ్చేటప్పటకి యశో గదిలో లేదు. ఒక ఫ్లాస్కు, ప్లేటులో టిఫినూ, ఒకచీటీ వున్నాయి. ఆ చీటీలో "బావకబాబూ ! ఫ్లాస్కులో కాఫీవుంది. మీరు స్నానంచేసి సిద్ధంగా వుండండి. మనం బయటికి వెళ్తున్నాం" అని వుంది.

ఒకగంట పోయిన తరువాత నేను యశో క్రిందికి వస్తూంటే వాళ్ళ నాన్నగారు ఎదురయ్యారు. "ఏమమ్మా యశో ! ఎక్కడకు ప్రయాణం ?" అన్నారు.

"సరళ దగ్గరకు తీసుకువెళ్తున్నా నాన్నా !" అంది.

సరే అని ఆయన వెళ్ళిపోయారు. బయటికి వచ్చిన తరువాత నే నన్నాను. "సరళ ఎవరు యశో ? ఆమె దగ్గరికి నేనెందుకు ?" యశో నవ్వుతూ "సరళ నా స్నేహితురాలు. వాళ్ళ నాన్నగారు డబ్బున్న వాళ్లు. ఏడాదికి ఆరునెలలు ఇక్కడే వుంటారు. మిమ్మల్ని గురించి సరళకు చాలా చెప్పాను. ఆమెకు మిమ్మల్ని చూపించి నా పందెం గెలుచుకుంటాను" అంది. నాకేమీ అర్థంకాలేదు. "ఏమిటిదంతా యశో ! నాగురించి

సరళకు ఎప్పుడు చెప్పావు ? ఈ పందెం ఏమిటి ? నేను నిన్ననేగా యిక్కడికి వచ్చాను. అంతకుముందు నా గురించి నీకేమీ తెలియదుగా ?" అన్నాను.

"కంగారు పడకండి. బాదకబాబూ ! రావటం మీరు నిన్ననే వచ్చారు యిక్కడికి. కానీ, మీకోసం చాలాకాలంనుంచీ ఎదురుచూస్తూ వున్నాను. లేకపోతే ఒక్కరోజులో మీతో యింత చనువు ఎలా ఏర్ప డింది చెప్పండి ? సరళతో యిదే చెప్పాను. ఆమె నమ్మలేదు. ఇవాళ మిమ్మల్ని చూపించి హాకీమన్స్‌లో దిన్నరూ, పిక్చరూ అడుగుతాను మన యిద్దరికీ" అంది.

పెదవులమీద చిరునవ్వు వెలుగుతూంది. ముఖములోంచి గర్వమూ, అహంభావమూ తొంగి చూస్తూన్నాయి.

దగ్గరలోనే వుంది ఈ సరళ యిల్లు కూడా. ఇల్లునుపట్టి యింటి యజమాని బాగా ధనికుడని గ్రహించాను. ఇల్లు దగ్గరకు వచ్చిన వెంటనే యశో సరళా, సరళా అంటూ లోపలికి పరుగెత్తింది. యశో కేకలు విని మేడమీదనుంచి ఇంకొక యువతి పరుగెత్తుకుంటూ వచ్చి యశోని కౌగ లించుకుంది. బాగా పొడుగ్గా వుంది. ఈమె యశో అంత తెలుపు కాక పోయినా మొత్తంమీద తెలుపనే చెప్పాలి. నిండైన విగ్రహం. చిలిపి కళ్ళు. ఆమెలో కొట్టవచ్చినట్లు కనబడుతూన్నాయి.

"ఏమిటి యశో ! ఇవాళ చాలా హుషారుగా వున్నావే. ఇవాళ మీ యింటికి.... ఎవరు ఆయన ? నీతో వచ్చారా ?"

యశో చెవిలో ఏదో చెప్పింది. సరళ నవ్వుతూ "ఏమిటి యశో! ఆయనని అలా నిలబెట్టివేశావు. ఆయనకు నన్ను పరిచయం చెయ్యవా ?" అంది. యశో నన్ను సరళకు పరిచయం చేసింది. కొంటెతనంలో యశో కంటె ఒక ఆకు ఎక్కువే చదివిందని గ్రహించాను.

ముగ్గురమూ కూర్చున్నాము. సరళ నా గురించి చాలా ప్రశ్నలు వేసింది. అన్నింటికీ నేను సమాధానం చెప్పాను. ఇక ప్రశ్నలు అయి

పోయాయి. కాస్సేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కృత్రిమమైన నిశ్శబ్దం గదినిండా వ్యాపించింది.

దానిని భంగపరుస్తూ యశో "హాక్‌మన్స్‌కి ఎప్పుడు వెళ్దాం ? ఈ సాయంకాలము నీకేమైనా పనివుందా ? మీ నాన్న నిన్ను ఇంటికి కాపలా కాయమనలేదు కదా ?" అంది.

సరళ నవ్వుతూ "లేదు యశో, నాన్నగారు యీవేళ పొద్దున వెళ్ళిపోయారు. రెండు నెలలదాకా తిరిగిరారు. ఈలోపున ఈ ఇంటికి నేనే యజమానురాలిని" అంది.

"అరే, ఎంత శుభవార్త ! అన్నీ కలసివచ్చాయి. రామబాబు రావటం మీ నాన్న బెడ్డింగు చుట్టటం ఒకసారే జరిగాయి. అయితే సాయంకాలము పోగ్రాము మారదుకదా ?"

సరళ "సరే అలాగే చేద్దాం. సాయంకాలము మిమ్మల్ని తీసుకుపోతాను" అని లోపలికి వెళ్ళిపోయింది. ఇప్పుడే వస్తానంటూ.

కాస్సేపటిలో ఒక ప్లేటులో యాపిల్సు, టీ ట్రే పట్టుకువచ్చింది. యశో ఒక యాపిల్ తీసుకుని కొరకటం మొదలుపెట్టింది. నేను తినటానికి తటపటాయిస్తూవుంటే యశో "అరే, మీరు తినటంలేదే ? ఎందుచేత ? ఓహో, సరళా ! ఒక కత్తి పట్టుకురా ఈయనకి. యాపిల్‌వి ముక్కలుగా కోసి నోటికందిస్తేగాని తినరుకామోసు" అంది.

ఆ అప్రస్తుత మాటలకి నాకు చాలా కోపం వచ్చింది. సరళలేచి లోపలికి వెళ్ళబోతే నేను వద్దన్నాను. అయినా ఆమె లోపలికివెళ్ళి కత్తి తెచ్చింది. యశో ఒక యాపిల్‌ని కోయడానికి వుద్యుక్తురాలైంది. దానితో నా కోపం మిన్నుముట్టింది.

పరిసరాల్ని మరచిపోయి "యశో, నీవు ఆ యాపిల్‌ను ముక్కలుగా కోసావంటే, నేను యాపిల్ నేకాదు, అసలేపీ ముట్టుకోను" అన్నాను. యశో, సరళా నాకేసి విత్తరపోయి చూస్తున్నారు. నామాటలు నాకే ఎంతో కటువుగా వినిపించాయి. చిరునవ్వు తెచ్చుకుని "ముక్క-

లుగా కోస్తే చాలా టైం పడుతుంది తినటానికి. కావాలంటే నేను నీకు కోసిపెడ్తాను" అన్నాను.

యశో చిన్నబోయిన ముఖంతో "థాంక్సు, అక్కర లేదు లెండి. మీ ఇష్టం వచ్చినట్లే చేయండి" అంది.

ఇంకొక అరగంట పోయిన తరువాత మే మిద్దరమూ బయలుదేరి వచ్చాము. సరళ సాయంకాలం ఇంటికి వస్తానని చెప్పింది, ఇంటికి తిరిగి వస్తూ నా అసభ్య ప్రవర్తనకు నేను చాలా బాధపడ్డాను. వచ్చినప్పటి నుంచీ యశోకి ఏదో కష్టాన్ని కలిగిస్తూనే వున్నాను. ఈసారి క్షమాపణ చెప్పకోవలసిన విధి నాదనిపించింది. అందుచేత "యశో, నేను అలా ప్రవర్తించాలనుకోలేదు. నన్ను క్షమించాలి ఈసారికి" అన్నాను.

యశో "ఇందులో క్షమించటానికి ఏముంది చెప్పండి. మీలో ఇంత కోపం దాగివుందని నా కింతవరకూ తెలియదు. భవిష్యత్తులో జాగ్రత్త పడుతాను" అంది.

భవిష్యత్తులో ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? అయినా ఆమె నాకేమీ అవదు. అది నాపూచీ. సుశీ స్థానం యీమెకు నేను అర్పించలేను.

# ౩

ఒకవారం రోజులు దొర్లిపోయాయి. కుస్సూరి వాతావరణం నా శరీరానికి సరిపోయింది. శరీరారోగ్యంతోపాటు మనస్సుకూడా బాగయింది. యశో నన్ను పిక్‌నిక్ స్థలాలకి తీసుకుని వెళ్ళేది. అప్పటికి ఆమె నన్ను ఏ విధంగా భావిస్తోందో తేటతెల్లమయింది. ఎవరో 'బాదలీ బాబు' అనే ఒక పురుషుడిని ఊహించుకుంది. ఈమె నన్ను మొదటిసారి

చూచిన ఆ అశుభముహూర్తాన నేనే అతగాడినని ఈమెకు తట్టింది. 'నమస్కారమండి' అన్నప్పుడు నేను పడిన తడబాటు యీమె నమ్మకాన్ని దృఢతరం చేసింది. ఈమే మెదడులోంచి ఈ మిథ్యను ఎలా పోగొట్టటం ? కాలమే ఈ సమస్యకి పరిష్కారం తీసుకువస్తుందని ఆశించాను. ఆమె నాయెడ ప్రదర్శించే అనురాగం, శ్రద్ధా అవాంఛనీయమని ఆమెకు చూపించుదామనుకున్నాను. లేక మనస్సులో నాకు తెలియకుండానే ఆమె యెడలభిమానం దాగియుందేమో? యశోకి సుశీ విషయం తెలిసిపుంటుందనే ఆలోచనతో నన్ను నేనే మోసపుచ్చుకునే వాడిని. అలాకాకపోతే ఆమెకు ఇదంతా ఎందుకు చెప్పను ?

ఆరోజు రాత్రి కూడా పదిగంటలకల్లా లైట్లు ఆరిపోయాయి. కాని నిద్రాదేవత వచ్చే సూచనలేమి లేమి. మరణించిన సుశీ, జీవించివున్న యశో వీరిద్దరి రూపాలూ మనోనేత్రం ముందు మెదలసాగాయి. వీరిద్దరి మధ్యా నా కర్తవ్యమేమిటి ? సుశీ ఒకనాటి రాత్రి అన్న మాటలు చటుక్కున జ్ఞప్తికి వచ్చాయి. "నేను ఎన్నటికైనా మీదాన్నే. కానీ మీరు నావారే అనటానికి ధైర్యం చాలటంలేదు. అయినా మీరు నావారే" ఆమె అనుమానపడినట్లే ఆమెకు అన్యాయం జరుగుతుందా ? నా చేతులకి ఆమె అందనంత మాత్రాన ఆమెకి ద్రోహం చేస్తానా ? ఇలాంటి ఆలోచనలతో నిద్దురపట్టక బయటికి వచ్చాను.

వెన్నెలరాత్రి ఎంతో ప్రశాంతంగా వుంది. చాలాసేపు దానిని చూస్తూ నుంచున్నాను. హఠాత్తుగా దృష్టి వరండా చివర సోఫామీద పడింది. అక్కడ ఎవరో పడుకున్నట్టు కనబడింది. దగ్గరకు వెళ్ళి చూచాను. టేబిల్‌మీద తలమోపి యశో పడుకునివుంది. వెన్నెలకాంతిలో ఆమె ముఖం స్పష్టంగా కనబడుతూవుంది. తెల్ల రాళ్ళమీద ప్రవహించే సెలయేరువలె ఆమె కన్నుల్లోంచి అశ్రువాహినులు సాగి వస్తున్నాయి.

నెమ్మదిగా "యశో, యిక్కడ పడుకున్నావేమిటి ? ఏమిటి ఇదంతా ?" అన్నాను. యశో చివాలున లేచి నా గుండెలమీద వాలిపోయింది వెక్కివెక్కి ఏడుస్తూ. నేను ఆశ్చర్యాన్వితుడనయిపోయాను. నాకు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అయినా స్త్రీ కన్నీరు చూస్తే నా

మనస్సు కరిగిపోయింది. యశో తల నిమురుతూ "ఏమిటి యశో ? ఏం జరిగిందో చెప్పు ? నేనేమైనా నీకు కష్టం కలిగించానా?" అన్నాను.యశో ముఖం పైకెత్తి "నా దుఃఖకారణం నేను నోటితో చెప్పలేను. అదికూడా తెలియని అమాయకులా మీరు? దేనికైనా ఒక హద్దువుంది బాదకబాబూ!" అంది.

మరుక్షణంలోనే తుఫానులా తన గదిలోకి వెళ్ళిపోయింది. హత బుద్ధుడనూ, అప్రతిభుడనూ అయిపోయి అక్కడనే నిల్చుండిపోయాను. రాత్రి చాలాసేపువరకూ దుర్నివార్యమై పొంగివస్తూన్న దుఃఖాన్ని బల వంతాన అణచుకోవటానికి ఆమె చేస్తూన్న ప్రయత్నాలు నాకు ప్రక్క గదిలోకి వినబడుతూనే వున్నాయి.

ఆమె దుఃఖకారణం ఆ అంతరాత్మకే తెలుసు. అందరినీ దుఃఖ పెట్టేది అతగాడేగా ?

ఒక వారంరోజులవరకూ నాకు ఈమెలేదు; ఈమెకు నేనులేను. ఈ కొద్దికాలంలో జన్మజన్మలకీ మరపురాని సంబంధం ఎలా ఏర్పడింది? నా యిష్టంలేకుండా ఈ వుచ్చులోకి ఎందుకు కాలుపెట్టాను ? గడిచిన వారంరోజులనుంచీ జరిగిన సంఘటనలను పర్యావలోకించి చూస్తే నాకు ఒకే ఒక సత్యం పొడచూపింది.

నేను ఒక ప్రవాహంలోపడి కొట్టుకుపోతూన్నాను. ఎదురీదటం హాస్యాస్పదమైన సంగతి. గమ్యస్థానం నాకు తెలియదు. మునుగుతానో, తేలానో నా కంతకంటే అస్పష్టంగా వుంది. ఇక మిగిలినది-నా కర్తవ్యం యేమిటి ?

9

మానవుడు తలచేది ఒకటి, దైవం చేసేది ఒకటి-అనే వాక్యంలో ఎంత సత్యం యిమిడివుందో నాకప్పుడు బాగా విదితమైంది.కాకపోతే ఈ జరిగినదానికి నేనెలా సంజాయిషీ యివ్వుకోవాలి? కలలోకూడా ఊహించని ఈ విషయాన్ని, ఈ సంఘటనలనూ నేనెలా సమర్థించగలను !

జరిగింది జరిగిపోయింది; జరుగవలసింది జరుగుతుంది - అనే నిర్బలులూ, నిస్సహాయులూ పలికే వాక్యాలలో నేనెందుకు తల దాచుకుంటాను. నాస్తికుడివి అనే అభియోగానికి నేనెందుకు జవాబివ్వాలి?

రోజులు గడిచిపోతూన్నాయి. స్థలానికీ, సంఘటనకీ లంకె ఎప్పుడూ వుంటుంది. ఒకప్రక్క పురుషుడు తిరస్కరించలేని రమణీయమైన రమణిప్రేమ, ఇంకొకప్రక్క అద్వితీయమైన ప్రకృతి శోభ, ప్రశాంత వాతావరణం ఈ ప్రబల శక్తుల బారినుంచి నన్ను కాపాడేదెవరు? రానురాను యశో ఆదరానికీ, ప్రేమకీ కట్టుబడిపోతున్నాను. ఆమె అనురాగానికీ, ఆదరానికీ, ప్రేమకీ హద్దుమించి కృతజ్ఞుడనయిపోయాను. స్నేహం, కరుణ, మార్దవం గట్టుతెంచుకుని ప్రవహించాయి. హృదయపు గోడలకు చిల్లులు పడ్డాయి.

గతాన్ని మరచిపోయి ఈ యువతితో ఎందుకు సుఖించకూడదు. భూతకాలంలో నాకు జరిగిన అన్యాయానికి వర్తమాన భవిష్యత్కాలాలలో నన్ను నేను ఎందుకు శిక్షించుకోవాలి? భవిష్యత్తులో యశో నన్ను మరచిపోయి తన పూర్వపు జీవితాన్ని గడపలేదనే విషయం స్పష్టమవతొచ్చింది. ఆమె నన్ను సంపూర్ణంగా నమ్మింది. పవిత్రమూ నిష్కళంకమూ, నిర్మలమూ అయిన అనురాగం నామీద కురిపించేది. ఒక క్షణంలో ప్రేమ స్వరూపిణిగా వుండేది; మరొక క్షణంలో కొంటెపిల్లగా వుండేది.

ఆనాడు చాకలికి నా బట్టలు వేసింది. వాడు వెళ్ళిపోయిన తర్వాత

యశో పకపకా నవ్వటం మొదలుపెట్టింది. ఆమె నవ్వు వింటూంటే జల జలా ప్రవహించే సెలయేరులు జ్ఞాపకానికి వస్తాయి. ఎందుకు నవ్వు తుందో అని ఆమెవైపు దృష్టి ప్రసరించాను. యశో నాకు మొదటిరోజు సరళ ఇంటికివెళ్ళక మునుపురాసిన చీటీ చేతిలో పట్టుకుని నవ్వుతూంది. అది మరచిపోయి చొక్కా-జేబులో పెట్టినట్టున్నాను. అది ఆమె కంట పడింది. కాని నాకు ఇందులో నవ్వవలసిన విషయం ఏమీ కనబడలేదు.

"ఎందుకు నవ్వుతున్నావు ?" అన్నాను.

బలవంతాన నవ్వు ఆపుకుంటూ "ఇదేమైనా ప్రేమలేఖ అను కున్నారా ? భద్రంగా జేబులో దాచుకున్నారు. మీకు కోరికగావుంటే నాతో చెప్పలేకపోయారా ? ఒక పెద్ద ప్రేమలేఖ వ్రాసి రాజేంద్రచేత యిచ్చి 'డూన్'లో పోస్టు చేయించేదానిని" అంది. ఆ మాటలు వింటూంటే నాకు కొంచెం కోపం వచ్చింది. "చాలు యశో ! నీకు దేనిని గురించి పరిహాసమాడాలో తెలియదు" అన్నాను.

ఆ నవ్వు యశో కళ్ళల్లో నీరు తెప్పించింది. నవ్వుతూ కళ్ళు తుడుచుకుంటూ "సరేలెండి. అప్పుడే కోపం వచ్చినట్టుంది మీకు. నాకు దేనికి పరిహాసమాడాలోతెలియదన్నారు; మీకు దేనికి కోపగించుకోవాలో తెలియదు" అని చీటీ పట్టుకుని నేలమీద కూర్చుని తనలోతాను ఆలో చించుకుంటున్నట్టు "ప్రేమలేఖ ఎలావుంటుందో నాకు తెలియనే తెలి యదు. రాయడానికి ఎవరూలేందే ! ఇదిగో ఇప్పుడు వచ్చారు. మీరు రాస్తారా ? చాలా పెద్దది రాయాలి తెలుసా" అని నాకేసి చూస్తూ నవ్వింది.

కాని మరుక్షణంలోనే ఆమె ముఖం వెలవెలపోయింది. భయ విహ్వల అయింది. గబగబా మంచంమీద కూర్చుని ఏదో నా అనుమా నాన్ని పోగొట్టడానికి ప్రయత్నిస్తూన్నట్లు "మనకి ప్రేమలేఖలు వ్రాసుకో వలసిన అగత్యం ఎందుకు కలుగుతుంది చెప్పండి బావగారూ ? మన మెప్పుడు ఒకరిని విడిచి ఒకరము వుండంకదా ; ఏమంటారు ?" అంది.

నేనేమీ మాట్లాడలేదు. ఆ అమాయకపు ముఖంలోని ఆతురతను

చూస్తూంటే నా మనస్సు విచలితమైంది. ఇలాంటి ప్రేమను నేనెలా తిరస్కరించగలను?

యశో నన్ను కదుపుతూ అంటూంది. ఏమిటంటే "ఏమీ మాట్లాడ రేమిటి? అక్కడేముందని చూస్తూ వున్నారు? నాకు భయం వేస్తుంది"

"మరీ నువ్వు నన్నింత నవ్వటం మంచిదికాదు యశో. నే నెలాంటి వాడికో నీకేమి తెలుసు. మనది కొద్దిరోజుల పరిచయం" అన్నాను, రుద్దకంఠంతో.

"మీరు అలా అనకండి బాదకబాబూ! నాకు చాలా బాధ కలుగు తుంది" అంది. మరుక్షణంలోనే యశో దుఃఖపు తెరలను చెదరగొట్టింది. నవ్వుతూ "ఇవేళనుంచీ మీరన్నట్టు మిమ్మల్ని మరీ అంతగా నమ్మను, బాదకబాబు. అది సరే, ఈ వుత్తరం మీరే తీసుకోండి" అని నా జేబులో పడవేసి నవ్వుతూ బయటికి వెళ్ళిపోయింది.

రాజేంద్ర ఆహ్వానాన్ని పురస్కరించుకుని నేనూ, యశో, సరళా ఒకరోజు డూన్ బయలుదేరాము. కారుకు సారథ్యం ఈసారి సరళ వహించింది. ఆనాడు జరిగిన ప్రతి చిన్న విషయమూ నాకు ఈనాటికీ స్పష్టంగా జ్ఞాపకం వున్నాయి. ఎందుకంటే మా నలుగురి జీవితాల్లో ఆ దినం ఒక మైలురాయి లాంటిది.

ఒక చిన్న ఇంటివద్ద సరళ కారు ఆపింది. స్నానం చేస్తూన్నా దన్ని బంట్రోతు చెప్పాడు. డాక్టరుగారి ఇల్లు ఆయన ప్రాక్టీసుకి అను గుణంగానే వుంది.

కొద్దిసేపటికి రాజేంద్ర లోపలినుంచీ వచ్చాడు, తిన్నగా నావద్దకు వచ్చి "క్షమించండి రాంబాబూ! ఆలస్యం చేశాను. తలవని తలంపుగా వచ్చారు. యశోనికూడా తీసుకువచ్చినందుకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు. "యశోని నేను తీసుకు రావటంకాదు రాజేంద్రా! ఆవిడే నన్ను తీసుకువచ్చింది" అన్నాను. రాజేంద్ర "అరే, చాలా ఆశ్చర్యంగా

వుందే! య్యా ఇక్కడకు వచ్చి సంవత్సరం దాటిపోయింది" అన్నాడు యసోవైపు చూస్తూ.

యసో అతనికేసి చూడటంలేదు. గోడమీద బల్లి పురుగులను కబళించటానికి పొంచివున్న దృశ్యాన్ని తదేకంగా చూస్తూంది.

లోపలినుంచి ఒక ఇరువది సంవత్సరాల యువకుడు వచ్చాడు. "దిల్‌బహదూర్! ఇంకొక నలుగురికి ఈరోజు వంట చెయ్యాలి. ముందర టీ తీసుకురా ఇప్పుడు" అన్నాడు. లోపలికి వెళ్ళిపోయాడు. రాజేంద్రి "చాలా మంచివాడు. బాగా వంటచేస్తాడు. ప్రాణం తీయాలన్నా, ప్రాణప్రదంగా సేవ చేయాలన్నా నేపాలీలను మించినవారు వుండరు" అన్నాడు.

ఎవరూ జవాబివ్వలేదు. సరళ నవ్వుతూ "ఇలా ఎన్నాళ్ళు బాధ పడుతారు రాజేంద్రిబాబూ! పెళ్ళి చేసుకొనకూడదా?" అంది.

"పెళ్ళి చేసుకుంటే మాత్రం నాకు కలిగే లాభం ఏమిటి?"

హఠాత్తుగా సరళ ఆవేశపడింది."పెళ్ళి చేసుకున్నారంటే అభేద్యమైన ఇనుప కవచం మీకు లభిస్తుంది. మీరు ఏంచేసినా లోకం తప్పు పట్టదు. మీరు ఎన్ని పాపాలు చేసినా కప్పిపోతాయి. అందులో మీరు ధనికులు. ఇకనేం?" అంది. అందరమూ సరళకేసి నిశ్చేష్టులయి చూస్తున్నాం.అంత హఠాత్తుగా వివాహం సంగతి ఎత్తి అంత ఆవేశంగా మాట్లాడుతుందని మే మెవరమూ అనుకోలేదు.

సరళ "మీరంతా నన్ను క్షమించాలి. నా ఆవేశానికి ముఖ్యంగా మీరు రాజేంద్రిబాబూ! నేనన్న మాటలు మీ గురించికాదు. మీరు అన్యథా తలచకండి. వివాహపు బంధనం అవిచ్ఛిన్నమైనదని భావించి బలిఅయిపోయిన ఒక ప్రాణ స్నేహితురాలు జ్ఞాపకమొచ్చింది. అది చాలా విషాదగాథ. చెప్పమంటారా!" అంది.

"చెప్పు సరళా! తప్పకుండా చెప్పు. విని చేయగలిగిందేమీ లేకపోయినా అలాంటివి జరుగుతూ వుంటాయని తెలుసుకోవటం మంచిది"

అన్నాను నేను. సరళ మొదలుపెట్టింది. "ఈ కథ ఈవూరిలోనే జరిగింది. అప్పటికి లఖియాకు వివాహమై నాలుగు సంవత్సరాలై వుంటుంది. చక్కటి రూపం, వెన్నెలలాంటి హృదయం, అమృతకలశంలాంటి మనసు ఆమెది. భర్త అందంగానే వుంటాడు. అయినా క్రూరుడు. లోకంలోని దుర్గుణములన్నీ అతనిలోనే మూర్తీభవించాయి. లఖియాని చాలా కష్టం పెట్టేవాడు అన్నింటినీ ఆమె సహించేది. లఖియా కోసం అప్పుడప్పుడు వాళ్ళ ఇంటికి వెళ్ళేదాన్ని. నన్ను మంచిచేసుకోవటానికి ప్రయత్నించేవాడు. ఎందుకో అతనిని చూస్తేనే నాకు భయంవేసింది. ఒకరోజు సాయంకాలం ఆమె ఇంటికి వెళ్ళాను. లఖియా లోపలవుంది. నేను లోపలికి వెళ్తాంటే నా వెనుక తలుపు మూసిన చప్పుడయి నేను తిరిగి చూచాను-లఖియా భర్త చేసినపని అది. నావైపు నడిచి చూస్తూ 'సరళా! నీతో కాస్త మాట్లాడాలి' అన్నాడు. నానోట మాటరాలేదు. ఎంత ధైర్యంగా వుందామనుకున్నా కాళ్ళు వణకసాగాయి. ఇంతలో లఖియా లోపలినుంచీ వచ్చింది.

ఆమె భర్త వణకిపోతూ "నువ్వు ఇక్కడకు ఎందుకు వచ్చావు. లోపలికి పో!" అన్నాడు. లఖియా దృఢంగా "పోను. సరళ నాకోసం వచ్చింది" అంది. కోపంతో ముఖం ఎంత ఎర్రబడి పోయిం దతనికి. 'పోవా' అని హూంకరించాడు.

లఖియా యీసారి జవాబివ్వలేదు. హఠాత్తుగా నా చెయ్యి పట్టుకుని "సరళా! నువ్వు పెరటి గుమ్మంగుండా బయటికి వెళ్ళిపో. నా కోసం వీరిని క్షమించు" అని నన్ను బయటికి తోసివేసి గడియవేసింది. ఇదంతా క్షణకాలంలో జరిగింది. నా కాళ్ళు స్వాధీనం తప్పాయి. ఎలాగో పెరటి గుమ్మంగుండా బయటికి వచ్చేసరికి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఒక స్త్రీ అసహాయ ఆర్తనాదం వినబడింది. వీధి గుమ్మం దగ్గరకు వచ్చేసరికి చైతన్యరహితమైన లఖియా శరీరం నా కాళ్ళకు తగిలింది. కేకవిని మా డ్రైవరు రామన్న పరుగెత్తుకు వచ్చారు. లఖియాను కారులో పడుకొనబెట్టాము. రామన్న కోపాన్ని ఎంతో కష్టంమీద శాంతింపచేశాను. ఇంటికి తీసుక వచ్చాను. డాక్టరు ఎంత ప్రయత్నించినా మానవత్వంలేని ఆమె

భర్త చొక్కాలో తన్నిన తాపులకి ఆమెకు రాత్రింతా స్పృహరాలేదు. మరునాడు తెలివవచ్చి తన ఇంటికి తాను వెళ్ళిపోతానంది. బహుశా ఓపికవుంటే వెళ్ళేది. నేను ఆ కిరాయికి వద్దని పంపినందుకు బదులుగా నామీద చాలా కోపపడింది. తనకు కొంచెం స్వస్థత చిక్కినవెంటనే భర్త వద్దకు పంపించివేస్తానని వాగ్దానం చేసిన తరువాత మందులు, ఆహారం తీసుకోవటం మొదలుపెట్టింది.

ఆశ మాని ఎంతో వేడుకునే దానిని. భర్తను విడాకులివ్వమని, ఆ ఖర్చంతా నేను వహిస్తానని. దానికి ఆమె సమాధానం ఏమిటంటే "నువ్వు నా సోదరివి కాబట్టి నీ నోట ఆ మాటవిని సహించాను. సరళా, కాని నువ్వింక ఆ మాట మళ్ళీ అనవద్దు భర్త ఎన్నటికీ భర్తే నా మనస్సులోని ఆ వ్యక్తిని తెంచే శక్తి మానవమాత్రులకి లేదు. కాని నా భర్తను నేను పొందగలననే విశ్వాసం నాకుంది. నేను ఎన్నడూ ఎవ్వరికీ ద్రోహం చేయలేదు. ఏ పాపము చెయ్యలేదు. అలాంటప్పుడు భగవంతుడు జీవితాంతం ఎందుకు శిక్షిస్తాడు. ఈ విధంగా నా భర్త అనురాగం నాకు తిరిగి లభిస్తుందనే విశ్వాసం నాకు వుంది. భగవంతుని పాదపద్మముల వద్ద వదలి, నువ్వు నిశ్చింతగా వుండు సరళా! అదే నేను నీనుండీ కోరేది" అంది.

ఈ మాటలు చెప్తూ సరళ కంఠం అవరుద్ధమయిపోయింది. కళ్ళలోంచి కన్నీరు తొంగి చూస్తుందేమో ననుకున్నాను. కాని ఒక క్షణంలో ఆమె తనను తాను సంబాళించుకుంది తిరిగి చెప్పటం ప్రారంభించింది.

ఒక వారంరోజులకి ఆమె కొంచెము స్వస్థతకి వచ్చింది. లేచి తిరగటం మొదలుపెట్టింది. కాని పక్కలో పోట్లు పూర్తిగా పోలేదు. అయినా ఆమె వెళ్ళిపోతానంది. ఇంకా కొన్నాళ్ళుండమని ఎంతో ప్రార్థించాను ఆమె అంది. "ఇంకా వున్నానంటే ఆయన తిరిగి నన్ను రానివ్వడు. నన్ను ఎన్నటికీ క్షమించడు."

నా నోట మాట రాలేదు. క్షమించవలసింది [illegible] ఉన్మాది భర్తా? అర్థాంగిని స్పృహతప్పేటట్టు తన్నినందుకు వాడుగాదు ఆమెను క్షమించాలట.

లఖియా నా వూహలను గ్రహించి నవ్వుతూ—"నీ యభిప్రాయం నాకు తెలుసు. కాని నాకు ఆయన అభిప్రాయం కూడా తెలుసు. క్షంతవ్యం లేనిదయినా వారిని నీవు క్షమించాలి. రేపే నేను వెళ్ళిపోతాను నా భర్త వద్దకు. అనారోగ్య కారణంగా పుట్టింటికి వచ్చి కొన్నాళ్ళున్నాను. ఆరోగ్యం బాగుపడింది. ఇక తిరిగి పోవాలి" అంది.

ఆ మరునాడే వెళ్ళిపోయింది. తరువాత చాలాకాలం వరకూ ఆమె సంగతి తెలియలేదు. ఆమె మా ఇంటికి రాలేదు. వాళ్ళ ఇంటికి వెళ్ళడానికి భయంవేసేది. లఖియా ఆ కసాయి వానితో కాలం ఎలా గడుపుతుందో అని ఆశ్చర్యపోయేదాన్ని.

ఆఖరికి లఖియాను కలుసుకోకుండా నేను వూరికి వెళ్ళవలసి వచ్చింది. రెండు నెలలు తర్వాత తిరిగి ఇక్కడకు వచ్చాము. తరువాత లఖియా విషయం రామన్న చెప్పాడు. లఖియా భర్త పోయాడట. తన పాపాలని మూటగట్టుకుని. లఖియాను విధవను చేసి నరకంలోకి పోయాడు. అప్పులన్నీ తీర్చి కట్టుబట్టలతో లఖియా బాహ్య ప్రపంచంలోకి వెళ్ళిపోయిందా లేక ప్రపంచంనుంచి వెళ్ళిపోయిందా అనే అనుమానం అప్పుడప్పుడు కలిగేది నన్ను ఎక్కువగా బాధి చేసగతేమిటంటే. లఖియా తన సోదరి ఒకామె. ఆమెను ప్రేమించే కోటి స్త్రీ ఒకామె. జీవించే వున్నదనే విషయం మరచిపోయింది. లఖియా యే దైవం పాదపద్మముల వద్ద తనను వదలి నన్ను నిశ్చింతగా వుంచమంచో ఆ దైవం ఈమె ఇన్నికష్టాలు పడుతూ వుంటే ఏం చేస్తూన్నట్లు? ఆమె చేసిన అపరాధం ఆయనని నమ్ముకోవటమేగా లఖియా బ్రతికివుంటే తిరిగి నా వద్దకు వస్తుందనే ఆశతో చాలా కాలం నిరీక్షించాను. అదికూడా క్షీణించిపోయింది.

సరళ కథ చెప్పటం ముగించింది. ముగ్గురమూ ఆ గాథ చెప్తూ ంతసేపు ఏదో మైకంలో వున్నట్టు విన్నాము. యశో కళ్ళవెంట ధారాళంగా కన్నీరు ప్రవహిస్తూంది. కన్నీళ్ళు తుడుచుకుంటూ యశో, తే సరళా, నువ్వు చెప్పిందే నిజం. కష్టాలు సహించేవాళ్ళనే సమా

జము, దైవము కష్టాలు పెడుతారు. నువ్వు నీ కర్తవ్యం నీవు చేయ గలిగింది చేశావు. అదేచాలు" అంది.

సరళ—"దైవంచేసే అన్యాయానికి మనమేం చేయలేం యశో. కాని సంఘపు అన్యాయాన్ని మనం సహించకూడదు. లక్ష్మియా దుఃఖా నికి ముఖ్యకారణం ఏమిటి? ఒక అపరిచిత వ్యక్తిని ఎవరినో వివా హమాడింది. అదే మూలకారణం. తనకు తెలిసిన వ్యక్తిని వివాహమాడి నట్లయితే ఇవన్నీ తప్పును. హిందూ సమాజం స్త్రీకి చాలా అన్యాయం చేస్తూంది. స్త్రీకి యుక్తవయస్సు రాకుండానేఅసలు బాల్యంలోనే వివాహం చేస్తారు. భర్తను మొదటిసారిగా వివాహపు మంటపం దగ్గర చూస్తుంది. చిన్నతనంనుంచి తను ప్రేమించిన వ్యక్తులు చాలామంది వుంటారు. తల్లిదండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, స్నేహితులు వీరంతా. వారందరినీ విడిచి వారందరియెడ తన ప్రేమను మరచిపోయి, భర్త పుస్తెకట్టిన మరుక్షణం నుంచీ అతనిని వీరందరికన్నా మిన్నగా ప్రేమిం చాలంటారు. అప్పటివరకూ తన ప్రాణప్రదంగా కాపాడుకుంటూన్న తన సర్వస్వాన్ని భర్తకు సమర్పించా లంటారు. ఎవరో నల్లగానో, లేక తెల్లగానో వున్న ఈ నూతన వ్యక్తి అవసరం తనకేమిటి?ఎందుకు ఇతగాడికి తను అన్నీ సమర్పించాలి? జీవితం మధ్యలో హఠాత్తుగా ఎక్కడనుండీ వూడిపడ్డాడు ఈయన. అందరికంటె మిన్నగా ఎందుకు ప్రేమించాలి? ఈ ప్రశ్నలగురించి చాలా తక్కువమంది ఆలోచిస్తారు. ఆలోచించిన వారికి జవాబులు దొరకవు. తర తరాలనుంచీ వస్తూన్న అర్థంలేని ఈ తతంగానికి ఎదురు తిరగరు. దారీ తెన్నూ కనబడక ఇతరు లను అనుసరిస్తారు. చనిపోయే లోపున పిల్లల్ని కంటుంది. వారికికూడా తనకు జరిగినట్టే వివాహం చేస్తారు. ఈ నాటకానికి ఆఖరి అంకంలేదు. కాలగర్భంనుంచీ జన్మించింది గనుక కాలగర్భంలోనే లీనమైపోవాలి" అంది.

"అయితే మీరనేది ప్రేమించి పెళ్ళిచేసుకోమంటారు అంతేనా?" అన్నాను. "ప్రేమించనక్కరలేదు రామబాబూ పేరు తెలిస్తే పదివేలు అతగాడెవరో, ఎలాంటివాడో, అ

అభిప్రాయాలతో తను ఏకీభవించగలదో లేదో, భవిష్యత్తులోనైనా అతన్ని ప్రేమించగలదో లేదో ఇవన్నీ అయినా కనీసం ఆమెకు తెలియాలి. భర్త కంఠస్వరమే అపరిచితంగా వుండకూడదు ఆమెకి. మీకు తెలియదు రాంబాబూ! స్త్రీ హృదయం ఎంత కరుణార్ద్రమయినదో తన యెడకనికరం చూపించిన వ్యక్తికోసం ఎంత త్యాగమైనా చేస్తుంది.అది కూడా కరువైపోయింది ఆమెకు" అంది.

"నువ్వు చెప్పింది చాలామట్టుకు నిజం, సరళా, ఇందులో లోపం కొంతవరకూ స్త్రీలదే. ఎవరూ ముందుకు రారు; అవకాశాన్ని జారవిడుస్తారు, సహాయాన్ని తిరస్కరిస్తారు, చాలామంది ఇదే బాగుంది అంటారు" అన్నాను.

"అవును, లోపం స్త్రీలలోకూడా వుంది. నాకొక స్నేహితురాలుండేది. నా అభిప్రాయాలతో ఏకీభవించేది. చివరకు కమల ఎవరో అపరిచితుడిని వివాహమాడింది. వివాహం అయిన తరువాత వ్యక్తిత్వమే కోల్పోయింది. ఈనాడు భర్త మాటను జవదాటదు. అతనికి ఇష్టంలేని చీరకూడా కట్టుకోదు. ఒకసారి ఆమెని కారణం అడిగాను. ఆమె ఏమందంటే, "సరళా! భార్యాభర్తలలో ఎవరో ఒకరు సర్దుకుపోవాలి. భర్తకు ఎదురుతిరిగినానంటే నేను చివరకి బయటికి పోవలసివస్తుంది. నాకంత ధైర్యంలేదు. అందరితోపాటు ఈ ఊబిలో నేనూ దిగిపోతాను." వివాహమయిన తరువాత కలిగేది జ్ఞానం కామోసు! కమల కిప్పుడు ఇద్దరు పిల్లలు. సావిత్రి దమయంతులను జ్ఞప్తికితెచ్చే భారత నారీమణి" అంది.

దిల్‌బహదూర్ భోజనం తయారైందని చెప్పాడు. భోజనాలయిన తరువాత పిక్‌నిక్‌కి బయలుదేరాము.

డూన్‌కి నాలుగుమైళ్ళ దూరంలో వుంది ఆ స్థలం. దట్టమైన ... పురకలు కక్కుతూ పరుగెత్తే సెలయేరూ, ఉత్సాహాన్ని ఉద్రేకిత ...ంచే మలయమారుతం, ఇవన్నీ కలసి ఖింతో మనోహరంగా వుంది ఆ ప్రదేశం. కారుని ఒక పెద్ద మర్రిచెట్టుకింద ఆపింది సరళ. ఆటలు

ఆడిఆడి అలసిపోయాము. కారులోంచి టిఫినూ, కాఫీ తీసుకొని ఆరగించాము. పరుగు పెట్టడంతో సరళ కాలు బెణికింది. తను ఇక్కడే కూర్చుంటానంది. నేను కూడా బాగా అలసిపోయాను ఒక అరగంట పోయిన తర్వాత యశో నావైపు తిరిగి 'అలా ఆ సెలయేరు వరకు వెళ్ళి వద్దాము వస్తారా ?' అంది. "ఇప్పుడు అక్కడికెందుకు యశో, నలుగురము ఇక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుందాం" అన్నాను.

యశో లేచి నుంచుని "నే నడిగింది అదికాదు; వస్తారా, రారా అని అడిగాను. సరే, అయితే రాజేంద్రబాబు.మీరైనా నా సాంగత్యాన్ని సహించగలరా !" అని జవాబుకు ఎదురుచూడకుండా ముందుకు నడిచింది. రాజేంద్ర జవాబివ్వలేదు నావైపు ఒకసారి చూశాడు.నేను సరళ వైపు చూచాను. అతడు ముందుకు సాగిపోయాడు.

వారిద్దరూ వెళ్ళిపోయిన కొంతసేపటి వరకూ ఎవరూ మాట్లాడలేదు. సరళతో ఒంటరిగా మాట్లాడడం ఇదే ప్రథమ పర్యాయం.

"ఇందాకా మీరేమీ తినలేదు ఒక యాపిల్ ఇమ్మంటారా?" అంది. కంఠస్వరంలో తీయని మార్దవం వుంది. కళ్ళల్లో అలసటా, అశాంతి కనబడ్డాయి. హఠాత్తుగా అన్న మాటలవి. ఉలిక్కిపడ్డాను. సరళ నాకు మొదటినుంచీ జటిల సమస్యగానే వుంది. ఆమె కంపిత కంఠస్వరం, చెదరిన నేత్రాలూ నన్ను వ్యాకులపరచాయి. నేనేమీ మాట్లాడలేదు. యాపిల్ అందుకున్నాను. సరళ సన్నగా నవ్వుతూ "కత్తిరావాలా రామబాబూ !" అంది. సరళ ఇంటికి మొదటిసారి వెళ్ళినప్పుడు తను చేసిన రసాభాస జ్ఞప్తికి వచ్చింది ఇంక నేనేమీ మాట్లాడలేదు.

"కొంతమందిని చూస్తూంటే రెక్కలు కప్పి రక్షించాలని బుద్ధి పుడుతుంది కదూ రామబాబూ !" అంది.

నేను దిగ్భ్రాంతుడనయ్యాను. ఏమిటి సరళ. ఇవాళ ఇలా మాట్లాడుతుంది? ఈమె మాటల్లో ఏదో నిగూఢార్థం ఇమిడివుందా? నా మనస్సు అక్కడ రాజేంద్ర యశోల మధ్య జరుగుతున్న సంభాషణను ఊహించుకుంటూంది.

ఇంకా నేను మాట్లాడలేదు.

"మీకు ప్రేమలో నమ్మకముందా, రామబాబూ!" అంది.

హఠాత్తుగా చెవివద్ద వీణ మీటినట్లయింది. ఏదో అస్పష్టంగా అన్నాను బహుశః వుందని కామోసు!

సరళ అంటూంది: "నాకుమటుకు యేమంత నమ్మకంలేదు. అనేక సమయాల్లో నేను అనేక మందిని ప్రేమించాను; ఈ క్షణంలో మిమ్మల్ని నేను ప్రేమిస్తూన్నాను. ఇప్పుడు నా సర్వస్వమూ మీదే! కానీ ఇదే విషయం ఇంకాసేపు పోయిన తరువాత అనలేను. అదేమి ఖర్మోగాని, నన్ను ప్రేమించేవాళ్ళను నేను తిరిగి ప్రేమించలేను.నన్ను ప్రేమించి నిరాశచెందినవారు చాలామంది వున్నారు రామబాబూ!" అని చిరునవ్వు నవ్వుతూ "ఒకతను ధనికుడు: బాగానే వుండేవాడు. నేను తనని ప్రేమించకపోతే మా కారుక్రింద పడతానన్నాడు. భయంతో కొన్నాళ్ళు కారు నడపటం మానివేశాను. ఇదంతా మీకు అసందర్భ ప్రలాపములా కనబడుతోందనుకుంటాను; ఇవ్వాళ మనస్సంతా చాలా చంచలంగా వుంది. రామబాబూ, మీరు నన్ను క్షమించాలి"

హృదయమంతా ఆమెయెడ కృతజ్ఞతా, జాలితో నిండిపోయింది. ఒక అందమైన స్త్రీ క్షణికమైన తనను ప్రేమిస్తానని చెప్పినప్పుడు ఏ యువక హృదయం చలించదు. సుశీ, యశో నాతో ఎన్నో ప్రేమ వాక్యాలు పలికారు కాని ఎన్నాడూ 'నేను మిమ్మల్ని ఈ క్షణంలో ప్రేమిస్తూన్నాను. నా సర్వస్వమూ మీదే' అని చెప్పలేదు. కాని యీ విచిత్ర యువతి ఒంటరిగా నాతో మొదటిసారి మాట్లాడుతూ అలా చెప్ప గలిగింది. తను నమ్మినవాటినీ, వాంఛించినవాటినీ నిర్భయంగా, నిస్సం కోచంగా వెల్లడించగల శక్తి ఈమెలో వుంది"

"ఎందుచేత సరళా?" అన్నాను.

"నాకు సరిగ్గా తెలియదు రామబాబూ! కాని అప్పుడప్పుడు చాలా అశాంతిగా వుంటుంది. ఈనాడు లఖియా జ్ఞాపకమొచ్చి మనస్సంతా గాదయిపోయింది"

లఖియా విషాదగాధ విన్నప్పటినుంచీ నా మనస్సుకూడా సరిగా లేదు. జీవితంలో హృదయానికి హత్తుకుపోయిన కొద్దిమంది స్త్రీలలోను లఖియా ప్రథమస్థానం ఆక్రమిస్తుంది. ఆమెగురించి ఆలోచిస్తూ, ఆమె రూపాన్ని ఊహించడానికి ప్రయత్నిస్తూ "లఖియా అందంగా వుండేదా సరళా ?" అన్నాను.

సరళ తల పైకెత్తి నాకేసి చూచి "యశోలో లఖియా పోలికలు కనబడుతాయి రామబాబూ ! అందుకనే యశో అంటే నాకంత ఆపేక్ష" అంది.

కాస్సేపాగి మనస్సులో మెదుల్తూన్న భయంకరమైన ప్రశ్న వేశాను.

"లఖియా ఆత్మహత్య చేసుకుందంటావా సరళా ?"

సరళ ఒక్కసారి వులిక్కిపడింది. "మీకలా అనిపిస్తుందా రామ బాబూ !" అంది.

"లేదు సరళా ! నాకలా అనిపించడంలేదు. నీవు చెప్పినదానిని బట్టి ఆమె అటువంటిది కాదనిపిస్తుంది. ఆమె విషాదగాధలో పిరికితనం ఏకోశానా లేదు. ఇందాకా నన్ను నేను ఎంతో కష్టంమీద నిబ్బరించు కున్నాను సరళా ! కాని ఇప్పుడు నాకా అవసరం కనబడటంలేదు. నీ సమక్షంలో ఆ అజ్ఞాతయువతికి జోహారు లర్పిస్తున్నాను హృదయపూర్వ కంగా ఈనాడు" అన్నాను.

సరళ నాకేసి ఎంతో ఆశ్చర్యంగా చూచింది. "అదేమిటి రామ బాబూ ! కన్నీరు కారుస్తున్నారు మీరు" అంది.

నాకళ్ళు నిజంగానే చెమర్చాయి. కళ్ళు తుడుచుకుంటూ - "అందులో తప్పేముంది. చెప్పు ! పురుషులు కన్నీరు కార్చకూడదా ? అది స్త్రీలసొత్తేనా ? కొన్నికొన్ని సమయాల్లో మనంకన్నీరు కార్చటం కంటే యింకేమీ చేయలేని అసహాయస్థితిలో వుంటాము సరళా ! హృద యంలోని సానుభూతీ, ఆవేదనా బయటకు ఎలా వెల్లడించటమో నువ్వే చెప్పు ?" అన్నాడు.

సరళ దానికేమీ జవాబివ్వలేదు. కొంతసేపు మౌనంగా వుంది. అన్నది- "లఖియాగాథ మీ మనస్సునుకూడా పాడుచేసింది. ఇక ఆ విషయం గురించి మాట్లాడవద్దు" అని ఇంకా ఏదో చెప్పబోతూంటే నేను అడ్డువచ్చి అన్నాను—

"ఈ విషయంలో నువ్వు నాకొక వాగ్దానం చేయాలి. సరళా, లఖియా సంగతి నీకెప్పుడైనా తెలిస్తే నాకు కబురు చెయ్యాలి. ఎంత దూరంలోవున్నా ఆమెను చూడటానికి వస్తాను. లఖియా నాతో మాట్లాడుతుంది కదా ?"

"సరే అలాగే చేస్తాను. కాని అంతటి అదృష్టం నాకు లభిస్తుందనే ఆశ నశిస్తూంది" అంది.

"నన్ను వంటరిగా వదలి వెళ్ళిపోతారా !" అంది కంపిత స్వరంతో.... ఆ కంఠస్వరమూ, ఆ కళ్ళూ మళ్ళీ నన్ను విభ్రుతుని చేశాయి.

"ఇప్పుడే వచ్చేస్తాను" అని బయలుదేర బోయాను.

సరళ కంగారుగా "హాస్యంకాదు రామబాబూ ! ఈ అరణ్యంలో నేను ఒంటరిగా వుండలేను; ఎక్కడా మనుష్య సంచారంలేదు. వాళ్ళే వస్తారు కొద్దిసేపటిలో. అయినా తప్పు చెయ్యకుండా మీరు నన్ను ఎందుకు శిక్షిస్తారు ? మీరు వెళ్ళారంటే నామీద ఒట్టే !" అన్నది.

నా కాళ్ళకు బ్రేక్ పడింది.ఇంక చేసేదిలేక తిరిగి వచ్చి హార్బుని కొంచెం కోపంగా "ఇంత చిన్న విషయాలమీద ఇంత రసాభాస ఎందుకు చేస్తావు సరళా? నిజంగా నీవు భయపడే నన్ను ఇక్కడ వుండమన్నావా?" అన్నాను.

"అవును, నిజంగానే భయం వేస్తూంది. నేను చెప్పానుకదా, యీ వేళ నా మనస్సు చాలా చంచలంగా వుందని. కొన్ని కొన్ని సమయాల్లో స్త్రీలకు పురుష సహాయం చాలా అవసరం రామబాబూ ! అది మీరెవరూ గుర్తించరు" అంది.

నే నింకేమీ మాట్లాడలేదు. ఏకాంతాన్ని ఏవిధంగా భగ్నం చెయ్యాలా అని ఆలోచిస్తూంటే అల్లంత దూరంలో రాజేంద్ర యశోలు కనబడ్డారు ప్రాణం లేచి వచ్చినట్లయింది.

ఉత్సాహంతో "అదుగో, వారు వస్తూన్నారు" అన్నాను.

సరళ ఒకసారి వేదనాపూరిత నేత్రాలతో చూచింది. నేను ఆమెను తప్పించుకోటానికి ఆతుర్త పడుతున్నానని గ్రహించింది.

కొంచెం నవ్వుతూ "మీరు ఈవేళ నా వాగుడంతా చాలా ఓపికతో విన్నారు. అందుకు నేను కృతజ్ఞురాలిని రామబాబూ!"

మరుక్షణంలో హృదయమంతా ఆమెపై జాలితో నిండిపోయింది. పాపం, ఈమె ఏమి చేసింది ? నే నెందుకు ఈమెను వదిలించుకోవటానికి ప్రయత్నిస్తున్నాను ? ఇంతలో రాజేంద్ర యశోలు చాలా దగ్గరకు వచ్చేశారు. నాదృష్టి వారిమీదకు పోయింది.

# 10

యశోకి సుశి సంగతి తెలుసునేమో అనే ఆశతో అంతవరకూ వున్నాను. ఆనాటి తరువాత ఆమె ప్రవర్తనబట్టి ఆ ఆశ నిరాశ అని తెలిసింది. ఇక ఏమైనా ఈ వార్త ఈమెకు చెప్పాలి. ఆ నిశ్చయానికి వచ్చిన తరువాత ఇంకా చాలా రోజులు గడచిపోయాయి. ప్రతి రాత్రి ఆమెకు చెప్దామనుకునేవాడిని. కానీ నోటమాట వచ్చేదికాదు. రాత్రి భోజనం అయిన తరువాత ఇద్దరమూ కలిసి నవలలు చదివేవాళ్ళం. వాటిలోని పాత్రలను గురించి చర్చించేవాళ్ళం.

ఒకరాత్రి యశో అడిగింది : "మీరు నవలల్లో ఎవరిపక్షం వహిస్తారు. విసర్జించబడిన ప్రేమికుడా లేక వివాహం చేసుకున్నవాడా ?"

"సాధారణంగా విసర్జించబడినవాడే యశో! అతనికి ఎంత దుఃఖం కలుగుతుంది చెప్పు. ఒకసారి హృదయ మర్పించిన తరువాత ఏం జరిగినా తిరిగీ తీసుకోలేడుగా!" అన్నాను.

"అయితే మీరు ఎవరి ప్రేమనూ తిరస్కరించరు కదా?"

"ఆ విషయం నాకు తెలియదు యశో! నే నెప్పుడు నా విషయం ఆలోచించలేదు. అయినా ఇతర బంధనాలు లేకపోతేనూ, ఆమె నిజంగా నన్ను ప్రేమిస్తూందని నమ్మకం కలుగుతే ఎందుకు తిరస్కరిస్తాను" అన్నాను.

"ఒకవేళ ఇతర బందనాలు లేవనుకోండి;ఆమె మిమ్మల్ని ఎంతో గాఢంగా ప్రేమిస్తూందనుకోండి. మీకే తన హృదయాన్ని అర్పించిం దనుకోండి .." అని యశో ఎంతో ఆవేశంగా చెప్తూ హఠాత్తుగా ఆగి పోయి నాకేసి భయంగా చూచింది. నేను ఆమె మాటల అర్థాన్ని గుర్తిం చానేమోనని ఆమె అనుమానం స్థిరపడిపోయింది కామోసు. నా చేతులు పట్టుకుని —

"నన్ను క్షమించండి బాదకబాబూ! నేనన్న మాటలు మరచి పోండి. నామీద మీకు కోపం వచ్చిందా?" అంది.

భయపడుతూ, దీనంగా చూస్తూన్న ఆ కాటుక కళ్ళని చూస్తూంటేం ఏమనాలో తెలియలేదు.

"అలా అనకు యశో! నాకూ హృదయం వుంది. నీ అభిమా నానికి, ఆదరణకీ కృతజ్ఞుడని. కాని నన్నేమి చేయమంటావో చెప్పు!"

యశో మంచంమీంచి కిందకు వంగి నా కాళ్ళపై తలపెట్టి నెమ్మ దిగా "ఇక్కడే కొంచెం చోటివ్వండి" అని గద్గదస్వరంతో అంది. తర్వాత కొంచెంసేపు గది అంతా నిశ్శబ్దంతో నిండిపోయింది. నా కాళ్ళ మీనుంచి అశ్రుబిందువులు నేలపైన పడ నారంభించాయి. నాకు దేవ దాసులోని పారూ గుర్తుకు వచ్చింది.

నేను యశోను లేవదీసి "యశో! నేనుతప్ప నీకిక గత్యంతరం

లేదా?" అన్నాను. యశో మాట్లాడలేదు. ఒకసారి నా కళ్ళల్లోకి చూచింది. ఆ చూపులోనే నన్నడిగినట్టుంది—"దీనికి కూడా నేను జవాబివ్వాలా ?"

నాక్కూడా కళ్ళు చెమర్చాయి. అయినా ఈ అవకాశం జారవిడుచుకోకూడదు. యశోకి సుశీ సంగతి చెప్పితీరాలి.

మనస్సు రాయి చేసుకుని "కాని నాకు ఇతర బంధనాలున్నాయి యశో !" అన్నాను. యశో ఒక్కసారి ఉలిక్కిపడింది.

'చెప్పండి' అని మాత్రం అంది.

యశో మాట్లాడకుండా అంతా వింది. ఆమెలో ఆవేశం కనబడలేదు; విచారమూ కనబడలేదు. శూన్యంలోకి శూన్యంగా చూస్తూంది. తన విన్న ఆ గాథనూ, తనకూగల ఆ భయంకరమైన సంబంధం గ్రహించటానికి కొంతసేపు పట్టింది. నిశ్చలంగావున్న ఈమె ముఖం మేఘావృతమైంది.

భయ విహ్వాల అయి నా చెయ్యి పట్టుకుంది...."అంటే....మీరు నాకు....మీరు నన్ను ఏంచేసి పోతారు" అంది.

"ఈ ప్రశ్నకి సమాధానం తెలియకే ఇన్నాళ్ళూ నీకీ సంగతి చెప్పలేదు. యశో, నేను పూర్తిగా నిస్సహాయుణ్ణి....జరిగిందంతా చెప్పాను. ఇక భవిష్యత్తులో ఏం జరగాలో నిర్ణయించవలసిన భారం కూడా నీమీద మోపుతున్నాను. నీ నిశ్చయానికి నేను కట్టుబడి వుంటాను" అన్నాను.

యశో చాలాసేపు మాట్లాడలేదు. నా మనస్సు కాస్త తేలికబడింది. భారమంతా ఆమె తలమీద పెట్టాను. ఆమె మాటకు కట్టుబడి వుంటాను. యశో-"సుశీని మీరు మరచిపోలేరా ఎన్నటికీ ?" అని అడిగింది. అప్రయత్నంగా నానోటి వెంట జవాబు వచ్చింది - "మరచిపోతే సుశీ కాని చివరకు నువ్వు కాని నన్ను క్షమించగలరా ? అదేమిటి యశో ! ఏం చేస్తూన్నావు ?"

యశో ఆవేశంతో తలను మంచం కోడుకేసి కొట్టుకుంటూం

ఆమె తలమీద తగిలిన ఒక్కొక్క దెబ్బ బల్లెపు పోటులా హృదయానికి తగిలాయి. యశో తలను రెండు చేతుల్లోనూ తీసుకుని "ఎంత పని చేశావు యశో!" అన్నాను. దుఃఖమూ, బాధ పొర్లివస్తున్న కంఠం అంది—"దైవంనుంచీ, సమాజంనుంచీ, చివరకు మీవద్దనుంచీ నేను పొందగలిగింది యిదే; నా నొసట వ్రాసివున్నది. నాకు జీవితంలో లభించిందీ ఇదే.

ఈ మాటలు అని యశో గదిలోంచి రివ్వున బయటికి వెళ్ళిపోయింది. శిలాప్రతిమలా అలాగే కూర్చుండిపోయాను. అలాంటి పరిస్థితిలో కూడా నా మనస్సు పూర్వంకంటే తేలికపడింది. నా దుఃఖాన్ని పంచుకోవడానికి ఇంకొక అభాగిని దొరికింది. కానీ ఆ ఆలోచనలో ఇంత స్వార్థం ఇమిడివుందని నా కప్పుడు తెలియదు. భవిష్యత్తులో ఆమె చెప్పినట్టు చేస్తానని మాటయిచ్చాను. ఇక నా తప్పు లేదు అని అనుకున్నాను. యశో మొదట చూపిన నిగ్రహమూ, నిశ్చలతా గోల్పోయింది. ఆ పరిస్థితిలో మీరు నావారే అంటే నేనేమి చెయ్యాలి?

మరునాడు పొద్దుపోయిన తరువాత లేచాను. కళ్ళు తెరచే టప్పటికి ఎదురుగుండా యశో కనబడింది.

చిరునవ్వుతో "రాత్రింతా ఆలోచించటమూ, ఆలశ్యంగా లేవడమూ మీ కలవాటయింది. ఇప్పటికైనా లేవండి" అంది.

యశో మరునాడు ఉదయం చిరునవ్వుతో దర్శన మిస్తుందని నేను ఊహించలేదు. అలా జరిగినందుకు నేను చాలా సంతోషించాను. ఆ నవ్వు దేనికి నాంది?

ముఖ ప్రక్షాళనం చేసి వచ్చేటప్పటికి యశోకి బదులు కాఫీ, టిఫినూ వున్నాయి. గ్లాసు తీసేటప్పటికి క్రింద ఒక చీటీ కనబడింది. వణికే చేతులతో అది చదువ నారంభించాను.

"బాదకబాబూ!

రాత్రింతా ఆలోచించాను. ఇంత పెద్ద బరువు నా కుష్క స్కం

ఢాలమీద మీరెందుకు పెట్టారు ? కాని నేను మీకిప్పుడు ఏమని చెప్పాలి? కల్లోలపూరితమైన నా మనస్సుకి ఒకే సత్యం దృగ్గోచరమవుతూంది. చనిపోయిన సుశీ మిమ్మల్ని పొందగలిగింది. ఇతరులు మీకు లభించవచ్చు కానీ, ఇతరులు మిమ్మల్ని పొందలేరు. ఈ నిగూఢ సత్యాన్ని నేనెలా తోసిపుచ్చగలను ?

నన్ను గురించి నేనేమీ చెప్పలేను. అయినా జీవితంలో మీనుండీ యాచించవలసిన భిక్ష ఇంకొకటి వుంది. యాచితంగానో, అనాయాచితంగానో, స్వకర్మవల్లనో, పరకర్మవల్లనో మీ సాంగత్యమూ, మీ స్నేహమూ నాకు లభించాయి. జీవితంలో మరపురాని ఘడియలు కొన్ని నాకు ప్రాప్తించాయి. ఇంకా కొద్దికాలమే మన మిద్దరమూ కలసి వుంటాము. అలాంటి సుఘడియలు ఇంకా కొన్ని నాకు లభ్యమయ్యేటట్టు నన్ను ఆశీర్వదించండి. ఇది నాకు లభించపోతే ఇక నాకు జీవితంలో మిగిలింది ఏమిటనే ప్రశ్న ఉదయిస్తుంది. మీనుండీ నేనేమీ వాంఛించటంలేదు. నేను సమర్పించేదాన్ని స్వీకరించమని అడుగుతున్నాను. మీరు స్వీకరించే వస్తువు మీరు సమర్పించలేనిదాన్ని కలుషితం చెయ్యదని మీరు గుర్తించుకోవాలి.

జీవితంలో స్త్రీ ఒకసారి హృదయార్పణం చేస్తుంది బాదకబాబూ! తిరిగి పుచ్చుకోవటమనేది ఆమెకు చేతకాదు. నా విషయంలో కూడా అంతే ! మీకు సుశీ ఎలాంటిదో మీరు నాకూ అలాంటివారే. సుశీ మరణించింది; నేను జీవించే వున్నాను ఇంకా ! అంతే"

ఉత్తరం చేత్తో పట్టుకుని అలాగే కూర్చున్నాను. అప్పటి మనస్థితి నేను సరిగా చెప్పలేను. సుశీ- యశో- యశో-సుశీ ఏమిటి ఈ అంతర్యుద్ధం? ఆ వుత్తరం చాలాసార్లు చదివాను. ఈ లక్ష్మి నన్ను శాశ్వతంగా విస్మరించిందా ? అనే ప్రశ్నకు నాకు జవాబు దొరకలేదు.

ఎంతసేపు అలా వున్నానో నాకు గుర్తులేదు. యశో హఠాత్తుగా గదిలోకి వచ్చి నన్నూ, నా చేతిలోని ఉత్తరమూ చూచి క్షణంసేపు గుమ్మంవద్దే నిలబడిపోయింది కానీ ఇంతల్లో ఆమె దృష్టి టేబిల్‌మీద

వున్న కాఫీ, టిఫిన్ మీద పడ్డాయి. గబగబా దగ్గరకు వచ్చి "ఇంకా కాఫీ టిఫిన్ తీసుకోలేదా ? అరే ! కాఫీ చల్లారిపోయింది. మళ్ళీ ఇప్పుడే తయారుచేసి పట్టుకొస్తా" అని వెళ్ళబోతూంటే హఠాత్తుగా ఆమె చెయ్యి పట్టుకుని అన్నాను —

"ఒక్కరోజు చల్లారిన కాఫీ తాగితే ఏం ఫరవాలేదు యశో ! ఈ మొండి ప్రాణం ఏమీ అయిపోదు. అయినా పొరపాటు నాది. అలాంటప్పుడు నీకెందుకు యీ శిక్ష !" అన్నాను.

యశో కాస్సేపు తన చెయ్యిని నా చేతిలో అలాగే వుంచింది. ఆమె కళ్ళల్లో సన్నగా నీరు తిరుగుతున్నట్టనిపించింది. నెమ్మదిగా చేయి విడిపించుకుని —

"ఫరవాలేదు. ఇప్పుడే పట్టుకు వస్తాను" అని బయటకు వెళ్ళిపోయింది. వేడివేడి కాఫీ కొద్దిసేపటిలోనే వచ్చింది. కానీ యశో రాలేదు. రామదీన్ పట్టుకు వచ్చాడు. యశోకి కాఫీ చెయ్యటం ఏమంత కష్టంలేదు. కానీ గట్టులు తెంచుకుని ప్రవహించే అశ్రుధారలు ఆపటం అంత సులభంకాదు. చేతులంత సులభంగా నేత్రాలు మన ఆదేశాన్ని పాటించవు. ఆనాడు నేను తాగిన కాఫీలో కన్నీరు ఎంతవుందో నాకు ఈ నాటికి తెలియదు.

నేను రామదీన్‌ని అడిగాను, యశో ఏం చేస్తూందని.

"ఏమిటో బాబూ ! ఇవాళ అమ్మాయి పొద్దుటనుంచీ విచిత్రంగా వుంది. రోజూ నవ్వుతూ ఎదురయ్యేది. ఇవాళ పొద్దున్న ఆ చిరునవ్వు మాయమైంది. దానికితోడు ఆ అమ్మ నన్నడిగింది-'తాతా ! చావటానికి అన్ని మార్గాలకన్నా సులభమైన మార్గం చెప్పగలవా ?' అని. అది పరాచకమే అనుకోండి. అయినా పొద్దున్నే అలాంటి మాటలంటారా ఎక్కడైనా బాబూ !" అన్నాడు.

అది పరాచకమే అన్నాడు రామదీన్. కాని నాకంత నమ్మకం కలుగలేదు. హఠాత్తుగా వుత్తరంలోని వాక్యాలు గుర్తుకొచ్చాయి. ఈ భిక్ష నాకు లభించకపోతే ఇక జీవితంలో మిగిలిందేమిటనే ప్రశ్న ఉద

యిస్తుంది. అంటే దీని అర్థమేమిటి ? సుశీ మరణించింది; నే జీవించే వున్నాను. ఇంకా ఈ వాక్యం అనుమానాన్ని పోగొట్టింది.

ఆనాటి రాత్రివరకు యశో నాకు ఒంటరిగా కనబడలేదు. ఆ రాత్రి ఆమె తన గదిలోకి వెళ్ళిపోతూంటే నేను "కాస్త లోపలికి రా యశో ! నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను.

యశో లోపలికి రాలేదు. వరండాలో నుంచుని "లోపలికెందుకు? ఇక్కడే చెప్పండి" అంది.

"కాదు యశో, కాస్త లోపలికి రా !"

"చెప్పవలసిందేమైనా వుంటే ఇక్కడే చెప్పండి. లేకపోతే నేను వెళ్ళిపోతాను" హృదయపు కన్నీరు కోపంగా వ్యక్తమవుతూందని గ్రహించాను.

"నీ ఉత్తరం నాకు సరిగా అర్థంకాలేదు. యశో, నీ సుఖం కోసం...." అని ఏదో అనబోతూంటే యశో అడ్డువచ్చింది. తీక్షణంగా నాకేసి చూస్తూ అడిగింది : "నా సుఖంకోసం మీరేమీ కష్టపడనక్కర లేదు. నా ఉత్తరం అర్థం కాలేదన్నారు. ఉత్తరం స్పష్టంగానే వ్రాశాను రామబాబూ !" అంది.

రామబాబూ, అని ఆమె నన్ను ఎప్పుడూ పిలవలేదు. చెంపమీద చెళ్ళున కొట్టినట్టయింది. మనస్సు ఎంతో బాధపడింది.

"బాదకబాబుకు అంత్యక్రియలు ఎప్పుడు జరిపించావు యశో !" అన్నాను. ఆ మాట విని వేటగాని బాణపు దెబ్బతిన్న హరిణిలా నాకేసి చూచింది. యశోరాజ్యం రివ్వుమని తన గదిలోకి పోయి తలుపు గడియ వేసుకుంది.

# 11

ఇంకొక రెండు వారాలు గడచిపోయాయి. మొదట కొన్నాళ్ళు యశోని చూస్తే భయంవేసేది. ఆమె ఏమి అఘాయిత్యం చేస్తుందో ? అని అనుక్షణమూ భయపడేవాడిని. రాత్రింటవళ్ళు నిద్ర పట్టేదికాదు. చాలాసార్లు యశో గది తలుపులు నెమ్మదిగా తోచి చూచేవాడిని. తెరచి వున్నాయేమోనని ఆమె గదిలో లేనప్పుడు లోపలికి వెళ్ళి వెదకేవాడిని. ఒక వారంరోజులు గడిచేటప్పటికి యశో కాస్త మామూలు స్థితికి వచ్చింది. అయినా నామీద కోపం పోలేదు. ఒకసారి రాజేంద్ర వచ్చాడు. నామీద కోపాన్ని అతనిమీద అనురాగంగా మార్చింది. అందుకు అతనే కాస్త కంగారు పడ్డాడు. నేను మొదట కొంచెం బాధపడ్డాను. చివర కదంతా మంచికే ననుకున్నాను. సరళ కూడా ఇదంతా గమనించింది. ఒకసారి ఆమె నన్నడిగింది. అంతా చెప్పేశాను.

అంతా విని "మీరు ఇదంతా యశోకి చాలా కాలం క్రితం చెప్పి వుండవలసింది రామబాబూ ! చాలా ఆలశ్యం చేశారు" అంది.

"అవును. అది నిజమే సరళా ! నాదే అపరాధం. కాని నేనేమి చెయ్యను. మానవ బలహీనతకు కూడా మనం కొంచెం చోటివ్వాలి. చివ రకు ఇలా పరిణమిస్తుందని నేను ఊహించలేను. అయితే ఇప్పుడు నన్నేమి చేయమంటారు ?"

"మీరు ఇదే నిశ్చయంలో వున్నట్లయితే యశోను త్వరలో వదిచి వెళ్ళిపోండి." ఇంత స్పష్టంగా సరళ ఎలా చెప్పగలిగింది. ఇందులో స్వలాభమేమైనా వుందా ? ఏదయితేనేం నా ఉద్దేశ్యంకూడా ఇదే. హఠాత్తుగా వెళ్ళిపోతే యశో తండ్రి అనుమానపడతారేమోనని ప్రయాణం కొన్నాళ్ళు వాయిదా వేశాను.

యశో మామూలు స్థితికి వచ్చింది. ఆవేశం, ఆవేదనా అట్టడుకి

అణచివేసింది. చాలా ముభావంగా వుండేది. అయినా ఆదరణకీ, అనురాగానికీ ఏమీ లోపం రానిచ్చేదికాదు. ఎప్పుడూ గదిలో కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూండేది. ఆ మౌనమే నన్ను చాలా భయపెట్టేది. పిచ్చి గోలచేసినా ఫరవాలేదు. ఆమె మనస్సులో సాగుతున్న ఆలోచన ఏమిటి? గొడ్డలి పెట్టులాంటి ఈ దెబ్బకు ఈ అభాగిని వున్మాదిని అయిపోతుందా? లేక తన హృదయజ్వాలను చల్లార్చుకోవటానికి నదీతీరానికి పరుగెడుతుందా? అయితే ఈ పాపం ఎవరి మెడకు చుట్టుకుంటుంది?

ఆనాడే ప్రయాణం. మధ్యాహ్నం యశో గదిలోకి వెళ్ళాను. యశో పక్కమీద పడుకుని వుంది. కళ్ళు మూసుకుని వుంది; కాని నిద్ర పోవటంలేదు అని నాకు తెలుసు. మెల్లిగా చెవిలో 'యశో' అన్నాను.

యశో కళ్ళువిప్పి చూచింది. మందహాసంతో "సామానంతా సర్దుకున్నారా?" అంది.

"నేను సర్దుకోవటానికేముంది. యశో, నిన్నరాత్రి కూర్చుని నీవేగా సర్దావు." యశో జవాబేమీ ఇవ్వలేదు. కళ్ళు మూసుకుని మెల్లిగా "అయితే ఈవేళ వెళ్ళిపోతారన్నమాట!" అంది.

ఆ మాట తనలోతను అనుకున్నట్టువుంది. అందులో జీవంలేదు; ఆశలేదు; ఉత్సాహంలేదు; ఉద్రేకంలేదు; భయంకరమైన తిరుగులేని నిశ్చయంమట్టుకు వుంది.

"నామీద కోపంలేదు కదా యశో! నకు తెలుసు నీకు నేను చాలా బాధ కలిగించానని. కాని.... కానీ నేనేమి చెయ్యను?" అన్నాను.

కంఠం అవరుద్ధమైంది. గొంతుక పెగలదీసి అన్న మాటలవి. గది అంతా నిశ్శబ్దమైంది. కళ్ళుతెరచి నావైపు చూస్తూ "మీమీద కోప గించుకోవటానికి మీరేమి చేశారు? మీరు మీ కర్తవ్యాన్ని నిర్వహిస్తూ వున్నారు. ఇక ఈ నాటినుంచి నా కర్తవ్యాన్ని నిర్వహించాలి" అంది.

"ఏమిటి అది యశో?"

"జీవితాంతం యీ హృదయంలో ఇంకొకరికి చోటివ్వను. నిత్యం వేళలా నా సర్వస్వమూ మీరే" అంది.

"కానీ, యశో నే నొకటి అడుగుతాను. నేను ఇక్కడికి రాక మునుపు నేను వస్తానని నీ మనస్సు చెప్పేదన్నావు: నువ్వొక బాదల్ బాబూను ఊహించుకున్నావు. నేను అతగాడిని కానని, ఇంకెవర్నో రామ బాబు నని ఎందుకనుకో కూడదూ? బహుశా నీవు పొరబడి వుంటావు. నీ జీవితం ఇంత చిన్నతనంలో విషాదపూరిత మవటానికి వీలులేదు" అన్నాను.

యశో తల అడ్డంగా తిప్పుతూ - "కాదు, నేను పొరపడలేదు. కాకపోయినా నాకు చింతలేదు. మిమ్మల్ని ఇన్నాళ్ళు ఇంత ప్రేమించాను. ఇదంతా బూటకమేనా? అలా ఎన్నటికీ జరుగదు. మీరలా మాట్లాడ కండి. ఇవాళ ఆఖరిరోజు. ఇదికూడా సుఖంగా గడిచిపోనివ్వండి" అని, కాసేపాగి "మీరు నన్ను పూర్తిగా మరచిపోరు కదూ బాదల్ బాబూ!" అంది.

యశో కలవారి బిడ్డ. శైశవంనుంచీ అతి గారాబంగా పెరిగింది. ఆమె ఎవ్వరినీ చేయి చాచి అడిగేదికాదు. ఇప్పుడు వ్యాకులచిత్తురాలై వణికే కంఠంతో యాచించిన భిక్ష శూలంలా హృదయాన్ని ఛేదించింది.

కన్నీళ్ళు బలవంతాన ఆపుకుని "ఇది నువ్వు అడగవలసిన ప్రశ్న కాదు యశో. ఇంత జరిగిన తర్వాత నిన్ను మరచిపోతే నాలో మాన వత్వం లోపించి వుండాలి" అన్నాను.యశో చీరకొంగు నోటిలో కుక్కు కుని అవతలవైపుకి తిరిగిపోయింది. అపరిమిత దుఃఖాన్ని సహనంతో సహిస్తూన్న ఆమె ధైర్యాన్ని నేను చెదరగొట్టాను. ఆమె దుఃఖ కార కుడిని నేను. ఆమెని ఓదార్చటానికి ప్రయత్నించటం ఎంత మూర్ఖ త్వం?

లేచి నుంచుని "ఇక నేను వెళ్ళిపోతాను. యశో, ఇంతకంటె ఆనందకర పరిస్థితులలో తిరిగి తప్పకుండా కలుసుకుంటాము. నీ దగ్గర నుంచీ శుభలేఖ వచ్చిందంటే రెక్కలు కట్టుకు వాలతాను" అన్నాను.

యశో ఇంకా అటువైపు తిరిగి వుంది. 'సరే వెళ్తాను' అన్నాను. యశో లేచి నిల్చుని "ఆగండి. ఇంకొక యాచన వుండిపోయింది" అంది.

"చెప్పు యశో!"

భర్తకి పాదాభివందనం చేయమని చిన్నతనంలో మా అమ్మ చెప్పేది. ఆ అదృష్టం నాకు కలుగలేదు. ఈనాడు మీకు చేస్తాను. నన్ను ఆశీర్వదించండి" అని వంగి నమస్కరించింది.

పళ్ళను గట్టిగా నొక్కిపెట్టి, గుప్పికి బిగించి అన్నాను :

"ఎప్పుడూ సుఖంగా వుండు యశో!" బయటికి వచ్చేశాను, నన్ను నేను నమ్ముకోలేక.

# 12

నేను రాజమండ్రి తిరిగి చేరుకున్నాను. దారిలో ఎన్నోసార్లు తిరిగి వెళ్ళిపోదామనిపించింది. శిలా విగ్రహంలా ప్లాటుఫారంమీద నిల్చున్న యశో స్మృతి నే నెలా మరువగలను. కంటతడిపెట్టి 'మీ నిశ్చయాన్ని భంగపరచను బాదల్‌బాబూ!' అని రైలు కదలబోయే ముందు చెప్పింది. నిజమే. కంటతడి పెట్టలేదు. ఆమె చివరివరకూ ఎవరికోసమని నేను యశోరాజ్యాన్ని వదలి వచ్చాను? సుశీల చనిపోయింది; యశోని తిరస్కరించాను; ఇక మిగిలింది నేను.

యం. యస్. సి. లో చేరాను. చదువులో పడి యశోని మరచి పోవటానికని ప్రయత్నించాను. సుశీ చనిపోయిన తరువాతకూడా యీ విధంగానే చేశాను. కొంతవరకు సఫలీకృతుడనయ్యాను. సాయం సమయాల్లో సముద్రపు ఒడ్డున నడుస్తూవుంటే యశో మనోవీధిలో పరిమళం వెదజల్లుతూ పరుగెత్తుతున్న దృశ్యం కనబడేది. ఏదో విధంగా ఏడాది గడిపివేశాను. చదువయిపోయింది. నా భారం తీరిపోయిం ఇంకొక యేడాదికూడా గడిచిపోయింది. యశో ఎప్పుడో కాని తలు వచ్చేదికాదు ఇక ఆమెను పూర్తిగా మరచిపోగలనని ఆశించాను.

జ్ఞాపక చిహ్నం నావద్ద ఏమీలేదు. అప్పుడు నా కాళ్ళమీద తలపెట్టి 'ఇక్కడే కాస్త చోటివ్వండి' అన్న దృశ్యం మనస్సులో మెదిలేది. యశోలాంటి వనిత ఎంత బాధపడుతూంటే, అలాంటి పనిచేస్తుందో నేను గ్రహించాను. అలాంటి సమయాల్లో నేను చేసిన పని వివేకవంత మైనదా కాదా అని నాలో నేను తర్కించుకునేవాడిని. కాని మరుక్షణం లోనే ఆ ఆలోచన్ని తోసిపుచ్చేవాడిని. రెండు సంవత్సరాలు గడచి పోయాయి. ఈ లోపున ఎన్నయినా జరిగివుండవచ్చు. యశో నన్ను పూర్తిగా మరచిపోయి వుంటుంది. బహుశా వివాహంకూడా జరిగి వుండ వచ్చు. జరిగిందంతా మంచికే జరిగింది. ఈ ఉచ్చులోంచి ఎలాగైతేనేం బయటపడ్డాను. ఇక తిరిగి అందులో కాలుపెట్టను.

కొంతకాలం జీవితం సాఫీగా గడచిపోయింది. ఇలా వుండగా ఒక ఆరునెలల్లో తల్లిదండ్రు లిద్దరూ గతించారు. క్రూరమైన ఆ దెబ్బకు నేను తట్టుకోలేకపోయాను. జీవితమంతా అంధకార బంధురమయి పోయింది. నాకు సోదరులు లేరు; అక్కచెల్లెళ్ళు లేరు; ఒంటరివాణ్ణి. బాబయ్య ఒక్కడే నాకు దగ్గర బంధువు మిగిలాడు. కాని ఆయన అదొక తరహా మనిషి. లలిత పిన్నికి నేనంటే మమకారమే. కాని వారిది పుట్టెడు సంసారం. నా బాధ్యతకూడా ఎక్కడ వహించగలదు. ఉద్యోగం చేయా లనే వాంఛ నశించిపోయింది. డబ్బు గడించి ఎవరిని వుద్ధరించాలి? నాన్న గారు వదలిన దానితో నా పొట్ట గడుస్తుంది. అదేచాలు. కాలం ఎంతో బరువుగా గడచిపోయేది. జీవితం కాంతివిహీనమైంది. దైవంమీద విశ్వా సం మరింత సడలింది.

ఒకనాటి రాత్రి యశోకి ఉత్తరం రాయాలని బుద్ధిపుట్టింది. ఆమెకు అందుతుందనే నమ్మకంలేదు నాకు. ఎక్కడ వుందో ఆమె? మనసులోని బాధ కాగితంమీద పెడితే బరువైనా తీరుతుందని ఉత్తరం రాశాను. ఆమెకి అందుతుందన్న ఆశ వుంటే బహుశా ఇంకొక విధంగా రాసేవాడిని.

యి కొన్నాళ్ళు గడిచేటప్పటికి వుత్తరం మాటే మరచిపోయాను.

ఇలా వుండగా ఒకరోజు నాకొక వుత్తరం అందింది. చాలా పెద్ద వుత్తరం!

"బాదల్ బాబూ!

నమస్కారమండీ! (జ్ఞాపకం వుంది కదూ) మీ ఉత్తరం అందింది. నేను కొంచెం ఆశ్చర్యపోయాను. మీనుంచి ఇన్నాళ్ళకు జాబు వస్తుందని నే ననుకోలేదు. అస్వభావికమనీ కాదు. అవాంఛనీయమనీ కాదు. అప్రత్యాశితం కనుక చాలాకాలం క్రితం మీకు నేను చెప్పాను ప్రేమలేఖంటే నాకు తెలియదని. నాకు ఎవరూ రాయలేదు. ఈ నాటికి మీ మంచి అది లిఖించిందా? మీరు నాకు ప్రియులు. అది మీ లేఖ అయితే అది ప్రేమలేఖా?

ఆ. మీ లేఖ చాలా ఊళ్ళు తిరిగి ఇక్కడికి చేరిందంటే మీరు ఆశ్చర్యపోతారా? కాని అందులో ఆశ్చర్యకరమైనదేమీ లేదు. నేను ఇక్కడికి వచ్చి ఒక సంవత్సరం కావస్తుంది. చెప్పినా ఈ ప్రదేశం పేరు మీకు తెలియదు. అసలు తెలుసుకోవలసిన అగత్యం ఏమిటి? మా నాన్నగారు చనిపోయిన మరుసటి నెలలో నేను ఇక్కడకు వచ్చేశాను. అప్పటినుంచీ ఇక్కడే వుంటున్నాను. ఈ ప్రదేశం పేరు చెప్పకుండా, ఎలా వుంటుందో చెప్పకుండా "ఇక్కడ ఇక్కడ" అంటూంటే కోపంగా వుంది కదూ? మీకు కోపం వచ్చిందంటే నాకు తగని భయం. అందుకు చెప్తాను నేను నివసిస్తూ వున్నది ఒకరకం ఆశ్రమము లాంటిది. ఆ ఆశ్రమం అంటే రుద్రాక్షమాలలూ, భయంకరంగా మూడవకన్ను తెరచే సన్యాసులూ, నారచీరలు ధరించే సన్యాసినులూ జ్ఞాపక మొస్తున్నారు కదూ? అదేమీకాదు; అలాంటివాళ్ళు కూడా వున్నారిక్కడ. కాని నేను కాదు. శూన్యంలోని పల్చటి కుటీరం నాది. నిరాడంబర జీవితం కాని నేను ఇప్పుడు కట్టుకున్న చీర చాలా విలువైనది. ఇది ఎప్పుడూ ఇక్కడకు వచ్చిన తరువాత కట్టుకోలేదు. చాలా సాదా చీరలు కట్టుకునేదానిని. మీరు చెప్పారే ఆనాడు పసుపు పచ్చటి జార్జెట్టు చీర కట్టుకుంటే నేను ముచ్చటగా వుంటానని. అదే చీర ఇప్పుడు కట్టుకున్నాను. అన్నిటిని త్యజించేసుకుని దీనిని వదలలేకపోయాను. ఇంత రాత్రి సమయంలో

యీ చీర కట్టుకుని మిణుకు, మిణుకుమనే ఈ దీపం దగ్గర కూచున్న నన్ను చూస్తే మీ లోకం యేమంటుంది ? అభిసారిక. ప్రేయసి అంటుంది కదూ ! ఇందాకా మా రాణి అడిగింది. 'ఏమిటిదంతా చెల్లీ ! ఈ చీర ఇప్పుడు కట్టుకున్నావేమిటి ?' అంటే నేను చెప్పాను. 'నేను ఈ రాత్రి నా భర్తకు ఉత్తరం వ్రాస్తున్నాను రాణీ !' కాదంటారా ? అంటే అనండి నాకేం ?

ముందర నే నిక్కడకు ఎందుకు వచ్చానో చెప్తాను మీకు. మీరు వెళ్ళిపోయిన తరువాత నాలో ఒకరకం ఉదాసీనత్వం, జడత్వమూ ప్రవేశించాయి. అర్థంలేని ఆడంబర జీవితంమీద విరక్తి కలిగింది. నన్ను ఎవరూ చూడకుండా వుండాలనీ, చూచినా నన్ను పూర్వపు యశోగా గుర్తుపట్టకూడదనీ, ఎక్కడో ఎవరికీ తెలియని ప్రదేశంలో నివశించాలనీ వాంఛించాను. ఏకాంత జీవితంకోసం హృదయం తహతహలాడింది. అన్నట్టు చెప్పటం మరచిపోయా. ఇక్కడ నాపేరు యశో కాదు. ఇక్కడకు వచ్చిన వెంటనే మా గురువుగారు 'సుందరీ' అని నామకరణం చేశారు. నవ్వుతున్నారు కదూ ! ఇక్కడ ప్రజలకి కూడా సౌందర్య పిపాస వుందికదాయని. కావచ్చు. కాని మీ లోకంలోలాగ అది ఇతరులకు హాని చెయ్యదు. సరే, ఆ బంగళా, ఆ ఆస్తినంతా అమ్మి ఇక్కడకు వచ్చేశాను. చాలా డబ్బే వచ్చింది. అదంతా బ్యాంకులో వేయించాను. ఈ పనులన్నీ రాజేంద్ర చేసిపెట్టాడు. రాజేంద్రను గురించీ, సరళను గురించీ తరువాత వ్రాస్తాను. ముందర నా సంగతి అవనీయండి. డబ్బు కావలసినప్పుడల్లా బ్యాంకినుంచి తెప్పిస్తాను. అయినా నాకేమంత అవసరం వుండదు.

నేను ఎలా వున్నానో తెలుసుకోవలెనని వుందని వ్రాశారు. నేను అంటే మీ ఉద్దేశ్యమేమిటి ? నిగనిగలాడుతూ పచ్చగావున్న ఈ శరీరం వుంది. బాహ్య నేత్రాలకి కనబడకుండా సహస్ర సూర్య ప్రమాణంతో ప్రకాశించే ఈ మనస్సు వుంది. మీరంతా నా శరీరానికే ప్రాముఖ్యత ఇస్తారు. నేను శరీరాన్ని గురించిన ఆలోచల్ని కట్టిపెట్టాను. పరులు కొనియాడే ఈ శరీరం అందాన్ని కాపాడుకోవటానికి ఇరువదిమూడు

సంవత్సరాలు వ్యర్థంగా గడిపివేశాను. ఇంకా అజ్ఞానాంధకారంలో పడి కొట్టుకు పోమంటారా ? ఆ దశని నేను దాటివేశాను. ఇప్పుడు మన స్థైర్యం తప్ప మనోచాంచల్యం లేదు. నిశ్చలమయిన ప్రేమ వుంది. కాని దానిని అధఃపతనానికి తోసే మోహంలేదు. సూర్యోదయపు అరుణ కాంతిని చూస్తూంటే నా ఒళ్ళు పులకరిస్తుంది. ప్రకృతి నే నెన్నడూ జయించలేదు. ప్రకృతిని చూచి నన్ను నేను మరచిపోను. ఆనాడు కాటలో జరిగినట్టు. ఎందుకంటే నేను ప్రకృతిలోనే జీవిస్తున్నాను. అది నాకు ఒక అందమైన దృశ్యం మాత్రమే కాదు; అదే నా సర్వస్వం. ఇప్పుడు నేర్చుకున్నా వీ కవిత్వం అంటారేమో ! ఇది కవిత్వం కాదు. కవిత్వానికి ఊహ ఆయువుపట్టు లాంటిది. దానికి కవి జీవం పోస్తాడు; కవిత్వం జీవితంలో ఒక భాగం మాత్రమే. అదే సర్వస్వం కాదు. కాని నా కిది సర్వస్వమూ అక్షయమూ కూడాను. దీనికి దేశకాలలాతో నిమిత్తం లేదు; యుగాలతో ప్రమేయం లేదు. నా జీవితాన్ని అతి కృపణ్యంతో కొన్ని హద్దులలో నడుపుతున్నాను. ఇక ఆ అంచుదాటి ఒక అడుగుకూడా ముందుకు వేయను.

మీరు ఎగతాళి చేయనంటే ఒక మాట చెప్తాను. జన్మలనేవేవుంటే మళ్ళీ జన్మలో నేనొక పుష్పాన్ని అయి పుట్టాలని చనిపోయేముందు కోరుకుంటాను. ఎందుకంటే సృష్టిలో దానిని మించిన అందమైన వస్తువు ఇంకొకటిలేదు. పుష్పపు వాసన నా ఆత్మను ఎక్కడెక్కడికో తీసుకుపోతుంది. అది నన్ను నిరర్థక బంధనాలనుంచి విముక్తురాలను చేస్తుంది. ఇక్కడ చిన్న పూలతోటలోని రకరకాల పుష్పాలను ప్రాతః కాలములో కోస్తాను; కొన్నింటితో పూజచేస్తాను; మరి కొన్నింటిని తలలో పెట్టుకుంటాను. వాటి సుగంధ పరిమళం నాతోపాటు నలుదిశలా వ్యాపిస్తుంది. ఆ పూదండలో సువాసన లేని పుష్పాల్నికూడా కచుపుతాను. పువ్వులను కోస్తూ కోస్తూ అలాంటివాటి దగ్గరకు వచ్చి ఆగిపోతాను. అప్పుడు ఆ మూగ పుష్పాలు అంటాయి—'ఓ రమణీ ! మేము ఏం పాపం చేశాము. మాకు సువాసన లేకపోవచ్చు; కానీ మేము అందంగానే వుంటాము. సృష్టికర్త విధించిన శిక్ష కాకుండా మానవులు కూడా

మమ్మల్ని శిక్షించాలా ?' వాటి ఆర్తనాదంతో నా హృదయం కరిగి పోతుంది. సున్నితంగా వాటిని తుంచుతాను. ఆ పుష్పాన్ని శిగలో పెట్టు కుని సంధ్యాసమయాల్లో పిల్లవాయువులు వీస్తూంటే, నది ఒడ్డున పరు గెత్తుతున్నప్పుడు నా హృదయం ఆహ్లాదంతో నిండిపోతుంది. ఆ పిల్ల వాయువులు నా బుగ్గలను ఎంతచొరవగా తాకుతాయనుకున్నరు. సూర్య రశ్మి వెన్నెలకాంతి, మలయమారుతము సోకని స్త్రీ ఎవరు ? అలాంటి సమయాల్లో మీ రూపం మెదులుతూవుంటుంది. అన్ని బంధాలనీ పూర్తిగా తెగ్గించివేసినాను కానీ ఈ బంధన తెంచటం నా శక్యంకాలేదు. తెంచ బడని దానిని తెంచ ప్రయత్నించట మెందుకు ? పూర్వపు జీవితానికీ, నూతన జీవితానికీ మీరు ఒక్కరే లంకె. నాకు మిగిలిన స్మృతి మీరొక్క రిదే.

కొన్ని కొన్ని సమయాల్లో నేను భయపడుతూ వుంటాను. నాలో అజ్ఞాతమైన కోరికలు అణగారి యున్నాఏమోనని అనుభవాన్ని ఆశించే వాంఛలు మరుగుపడి వున్నాఏమో ? నేను ఆశించే ఆత్మ సంయమనం ఇంకా నాకు లభించలేదు. నాకు లభించింది సహనము మాత్రమే. శాంతి కాదు. నిర్దుష్టమైన శాంతి లభించినప్పుడే ఆత్మ సంయమనం పరిపూర్ణంగా లభిస్తుంది. దానికోసం నేనింకా ఎంతకాలం ప్రయాణం చేయాలో. సరే, నా గురించి చాలా వ్రాశాను. మొదట నేనంత వ్రాద్దామనుకోలేదు. కాని కలం నడుస్తూన్నంతకాలం దానిని ఎందుకు వారించాలి ?

ఇక మీ సంగతి. పూజ్యులైన మీ తలిదండ్రులు పరమ పదించా రని విని నేను ఎంతో దుఃఖించాను. వారి దర్శనభాగ్యమైనా నాకు కలుగ లేదు. జీవితంలో ఉత్తమామల ప్రేమ నాకిక లభించదన్నమాట. ఈ మాటలు ఏదో మర్యాదకోసం అంటూన్నానని మీరనుకోకండి. నిజంగానే వారి ఆశీర్వాదాలు పొందాలని తీవ్రవాంఛ వుండేది. ఏ పనీ స్వంతగా చేయలేదు మీరు. అలాంటి విషాద వణామాన్ని ఎలా తట్టుకున్నారు మీరు.

మీ గురించి మీరు చాలా తక్కువగా వ్రాశారు. మీమీద మీరే అభియోగాలు వేసుకున్నారు. అది మీరు ఆత్మ పరిశోధన అనుకున్నా

రేమో? అది ఎన్నటికీ కాదు. అది ఆత్మనింద మాత్రమే. మీరు వ్రాశారు. మానసికంగా నేను చాలా పిరికివాడిని. దుర్బలుడిని. నన్ను నమ్మినవారెవరూ సుఖపడలేదు. అమ్మీ సుశీ సంగతే చూడు. ఆమె నన్ను నమ్ముకుంది. చివరకు ఏమయింది? ఆమెకు నేను తగనని దైవమే ఆమెను నానుండీ వేరు చేశాడు. ఇక నీ సంగతి. నన్ను సర్వవిధాలా నమ్ముకున్న నిన్ను మోసపుచ్చి నది సముద్రంలో వదలి వచ్చాను. ఎందు చేత? నీ అపరాధం ఏమిటి? ఏమీలేదు. అదే నీ అపరాధం. అసలు నీకు మొట్టమొదటే సుశీ సంగతి చెప్పవలసింది. అలా అయినట్లయితే మన ఇద్దరిమధ్యా యీ బాంధవ్యం ఏర్పడకపోనేమో! అయినా నేను బాధపడేదేమంటే సుశీ—యశోల ఎడ నా కర్తవ్యం నేను నెరవేర్చలేక పోయాను. చివరకు ఈనాడు నన్ను నేను నమ్ముకోలేకపోతున్నాను. ఈ వాక్యాల్లోంచి అశాంతి మానసిక క్షోభ తొంగి చూస్తూన్నాయి. అలా ఎంచుకుంటాను? మీ అభియోగాలకి నేనే జవాబిస్తాను. మిమ్మల్ని నమ్మిన వారెవరూ సుఖపడలేదన్నారు. సుశీని గురించి ప్రస్తావించారు. సుశీ విషయం మీరు చెప్పినప్పటినుంచీ నేను చాలా యోచించాను. సుశీ అక్కయ్యకు నమస్కారం చేయలేకపోయాననే విచారం ఎన్నటికీ విడనాడదు. కాని ఆమె చాలా అదృష్టవంతురాలు. మనస్ఫూర్తిగా మిమ్మల్నే ప్రేమించింది. మీ ఆదరణ తిరిగి సంపాదించింది. జీవితంలో ఆమె ఎవరికీ కష్టం కలిగించలేదు. తనూ ఇతరులవల్ల కష్టపడలేదు. అంతిమ సమయంలో—అది అందరికీ అసన్నమయ్యేదా కదా ఆమె మీ సమక్షంలో, మీ ఒడిలో ఒరిగిపోయింది. అంతకంటె ఇంకేమికావాలి? నేను కూడా మిమ్మల్ని సుశీ యాచించిన భిక్షే యాచిస్తున్నాను. నాకూ కూడా అలాంటి మరణమే సంప్రాప్తించేటట్టు ఆశీర్వదించండి. ఎక్కడవున్నా సరే. అంతిమ సమయంలో మీరాక కెదురు చూస్తూంటాను. జీవన్మరణాల మధ్య ఊగిసలాడే సమయంలో బాదల్‌బాబూ దర్శనంకోసం నాకళ్ళు స్వాతి వానకెదురు చూచే ముత్యపు చిప్పలా కాయలుకాచి వుంటాయి. మీరాక ముందే నేను చనిపోయినట్లయితే నేను మహా పాపినన్నమాట!

మీరు అనవసరంగా బాధపడకండి. సుఖ-దుఃఖాల ఎడే కాకుండా మీరు నాఎడ కూడా కర్తవ్యం నిర్వహిస్తూవున్నారు. మీ వున్నతిగురించీ. మీ సుగుణాలగురించీ. మీఎడ నా అభిప్రాయాల గురించీ నేను చెప్పనవసరంలేదు. అవి నా నరనరాలకీ తెలుసు. ఒక్క-మాటమాత్రం నేను ఇక్కడ చెప్తాను. మీ జీవితపు చరిత్రలో మీరు సిగ్గుతో తల వంచుకోవలసిన సంఘటన ఏదీలేదు. అంతేకాదు. మిమ్మల్ని ప్రేమించినవారు మిమ్మల్ని చూసి గర్వపడతారు. ఈ మాటల్ని మీరు విశ్వసించండి; నన్ను కరుణించండి. అంతే।

ఇక సరళా-రాజేంద్రుల సంగతి. వారిద్దరికీ నేను ఇక్కడకు వచ్చేముందు వివాహమయింది. అది నాకు చాలా సంతోషం కలిగించింది. మీరు వెళ్ళిపోయిన తరువాత చాలాకాలంవరకూ రాజేంద్ర నన్ను వేధించాడు. ఒకసారి వివాహం సంగతి ప్రస్తావిస్తే నేను చెప్పివేశాను. 'నా హృదయం పరాధీన'మని. నావలన అతను ఏదీ నష్టపోలేదు: ఏమీ కష్టాలు పడలేదు. అందుచేత అతని ఋణం నామీదలేదు. అయినా అతడు నాకు చాలా సహాయం చేశాడు. ఇక సరళ సంగతి మీకు తెలుసు ఎంత చెంచెలచిత్తయో. ఏదయితేనేం వీరిద్దరికీ వివాహం జరిగింది, మంచిదే.

ఇంకొక మాట. మీకు అక్కడ మనశ్శాంతి లేకపోతేనూ, రావాలని వుంటేనూ ఇక్కడికి వచ్చేయండి ఒక్కసారి. ఏమి చేస్తారక్కడ ? ఈ ఆశ్రమం డూన్‌కి యాభైమైళ్ళ దూరంలో వుంది. నేను 'రాణి' అని ఇంతకుముందు చెప్పానే ఆమె ఇంకెవరోకాదు-లలియా. సరళ చెప్పింది. కదా ఆమె సంగతి. చాలా మంచిది. మే మిద్దరం ప్రాణస్నేహితులం అంత శాంత స్వభావిని. సత్యశీల. నిష్కల్మషురాలు అరుదుగా కనబడుతుంది ఈ పాప భూయిష్టమైన ప్రపంచంలో. ఆమెనుకూడా చూద్దురుగాని ఇక్కడికి వచ్చేయండి. మీగురించి ఆమెతో చాలా చెప్పాను; ఇంతే।

# 13

ఆ పుత్తరం అందిన ఒక వారంరోజుల తర్వాత ముస్సోరీ బయలుదేరాను. వెళ్ళటమా, మానటమా అని నాలో నేను తర్కించుకున్నాను. ఏకాంత జీవితంలో పూర్తిగా విసిగిపోయాను. యశో సన్యాసిని అయిందంటే నేను నమ్మలేకపోయాను. ఉత్తరం ఒక సన్యాసిని వ్రాసిన దానిలా కనబడటంలేదు. ఆమెను చూడాలనే వాంఛ ఆ వార్త విన్న తరువాత హెచ్చింది. లఖియా అక్కడే వుందని విని ఆమెని చూడాలనే ఆతురత కలిగింది. ఆమె కథ నే నెన్నడూ మరువలేను. యశో,లఖియా అక్కడ కలుసుకోవటం ఎంత ఆశ్చర్యంగా వుంది.

వెళ్ళటానికే నిశ్చయించాను. అన్ని భారాలతోపాటు ఇంటిభారం, భూములభారం బాబయ్యమీద పెట్టాను. రెండురోజుల తర్వాత డూన్ చేరుకున్నాను. మొదటిసారి వచ్చినప్పుడు నా రాకకోసం యశో ఆమె తండ్రి ఎదురుచూస్తూన్నారు ప్లాటుఫారంమీద. ఆ ఇద్దరిలో ఒకరు స్వర్గంలో వున్నారు. ఇంకొకామె ఆశ్రమంలో వుంది. మొదటిసారి సుశీని మరచిపోవటానికి వచ్చాను; రెండవసారి యశోను వెదకటానికి వచ్చాను.

నాకు యశోమీద కోపం వచ్చింది. మూర్ఖురాలు ఆశ్రమం ఎక్కడవుందో, అక్కడకు ఎలా వెళ్ళాలో, ఏమీ వ్రాయలేదు. ఈ మాత్రం తెలియదా ? ఇప్పుడు నేనెంత బాధపడాలి ? నాకు ఒకే ఒక ఆశ మిగిలింది. సరళను కలుసుకోగలిగితే ! ఆమె ఎక్కడుందో యశో వ్రాయలేదు. ముస్సోరి వెళ్ళి చూద్దామని బయలుదేరాను. సామాను డూన్‌లో వదలివేశాను సరళ ఇంటికోసం వెతకటం మొదలుపెట్టాను. దానిని పూర్తిగా మరచిపోయాను. బజారులోంచి పోతున్నాను. 'రామబాబూ !' అని ఎవరో పిలిచినట్లయింది. పక్కకు చూచాను. ఇంకెవరు సరళే. షాపులోంచి బయటికి వస్తూ కనబడింది. దగ్గరకు వచ్చి "ఎప్పుడు

వచ్చారు రామబాబూ! చాలని తలంపుగా కనబడ్డారు. ఎక్కడికిలా వెళ్తున్నారు?" అంది.

"ఇప్పుడే వచ్చాను సరళా! మీ ఇంటికే బయలుదేరాను" అన్నాను.

సరళ నవ్వుతూ "బలేవారు మీరు. మా ఇల్లు బజారులో వుందని ఎవరు చెప్పారు మీకు? క్రిందటిసారి మా ఇంటికి వచ్చారుగా?" అంది.

వెనుకనుంచీ రాజేంద్రి వచ్చాడు. సరళ అతని చెయ్యి పట్టుకుని "ఈయన రాజేంద్రి అని గుర్తించారనుకుంటాను. మీకు ఇంకా తెలియదనుకుంటాను. ఈయనే ఇప్పుడు నాభర్త. శుభలేఖ మీకు పంపటం ఇష్టంలేక మానేశాను" అంది.

అందుకు కారణ మడుగలేదు నేను. కంగ్రాట్యులేటు చేశాను ఇద్దరినీ. సరళ "తరువాత మాట్లాడుకుందాం. రాజేంద్రి, మీకు ఇంకా ఏదో పని వుందన్నారు కదా! అది చూచుకుని రండి. నేను ఈయనను ఇంటికి తీసికెళ్తాను" అంది. అతను వెళ్ళిపోయాడు. సరళ నాచేయి పట్టుకుని "పదండి రామబాబూ! మా ఇంటికి దారి చూపిస్తాను" అంది.

మూడు సంవత్సరాలయినా, వివాహిత అయినా ఆమె ఏమీ మారలేదు. నేను నవ్వి వూరుకున్నాను. సరళ "నాకు రాజేంద్రికు వివాహం అయిందన్న వార్త మిమ్మల్ని ఆశ్చర్య పరచిందా రామబాబూ!" అంది.

"లేదు సరళా! నాకు అది చాలా సహజంగా కనబడింది. అయినా నాకిది ఇంతకుముందే తెలుసును. యశో వుత్తరం వ్రాసింది" అన్నాను.

సరళ ఆశ్చర్యంతో "యశో వుత్తరం వ్రాసిందా? ఎక్కడ వుంది. ఎప్పుడు వ్రాసింది" అంది.

"ఉత్తరం ఒక వారంరోజుల క్రితం అందింది. ఎక్కడో డూన్‌కి యాభైమైళ్ళ దూరంలో ఒక ఆశ్రమంలో వుంటానని వ్రాసింది. అందుకోసమే ఇక్కడకు వచ్చాను. ఈ సన్యాసినిని వెదుకుదామని" అన్నాను.

"అరె! గమ్మత్తుగా వుంది. ఇంత దగ్గరలో వుండికూడా నాకు తెలియదు" అంది.

నేను కాస్సేపు మాట్లాడలేదు. నడిచిపోతున్నాం. సరళకూడా ఏవో ఆలోచిస్తూవుంది. లక్షియా సంగతి చెప్పుదామని "సరళా! లక్షియా సంగతి నీకేమైనా తెలుసా?" అన్నాను.

లక్షియాపేరు విని సరళ తుళ్ళిపడింది. "లేదు" అంది.

"లక్షియా కూడా అక్కడే వుందిట సరళా!" అన్నాను.

సరళ గట్టిగా నాచేయి పట్టుకుని ఆగిపోయి "ఏమిటి మీరనేది రామబాబూ? లక్షియా యశోదగ్గర వుందా?" అంది.

"అక్షరాలా నిజం సరళా! యశో వ్రాసిందలాగా" అన్నాను.

సరళ ఎంతో కష్టంమీద సంతోషాన్ని ఆపుకుంది. కళ్ళు జ్యోతుల్లా వెలిగాయి. ఉత్సాహం వుట్టిపడే కంఠంతో "పదండి రామబాబూ! నేనుకూడా వస్తాను మీతో. రేపు పొద్దున బయలుదేరుదాము" అంది.

ఇంటివద్దకు వచ్చేశాము. నా సామాను డూన్‌లో వదలివచ్చాననే సంగతి అప్పుడు జ్ఞాపకానికి వచ్చింది.

"అరే, సరళా! నా సామానంతా డూన్‌లో వదలివచ్చాను" అన్నాను.

"ఫరవాలేదు లెండి. రోడ్డుమీద వదలకపోతే ఏమీ అయిపోవు. మీకాక్కావాల్సిన సదుపాయాలన్నీ నేను చేస్తాను. రేపు పొద్దున దారిలో తీసుకుందాము" అంది.

నేనింకేమీ మాట్లాడలేదు.

ఒకగంట పోయిన తరువాత రాజేంద్ర తిరిగి వచ్చాడు. ఆనాడు భోజనాలదగ్గర సరళ "యశోని చూడటానికి వస్తావా రాజేంద్రా!" అంది.

యశో పేరు విని కాస్త కంగారుపడ్డాడు. యశో-యశో ఆఁ, వస్తాను. అసలు ఎక్కడవుంది ఏమిటీ సంగతి?" అన్నాడు.

"ఇక్కడ ఏదో ఆశ్రమంలో వుందిట. రేపు బయలుదేరదాము. అన్నట్లు మీకు లక్షియా గుర్తువుందా?" అంది.

"లఖియా ఎవరో నాకు సరిగా గుర్తులేదు. పేరు విన్నట్లు గుర్తు. ఎవరామె ?" అన్నాడు.

"అబ్బే ఎవరూలేదు. డూన్‌లో మీ ఇంటికి మేమంతా వచ్చినప్పుడు ఆమె గురించి చెప్పాను"

లఖియాను అంత త్వరగా మరచిపోయినందుకు సరళకి కోపం వచ్చింది.

* * *

మరునాడు పొద్దున కారులో ముగ్గురమూ బయలుదేరాము యశో అన్వేషణార్థం. అదృష్టవశాత్తు వాకబ్ చేస్తే డూన్‌కి దక్షిణదిశలో ఏవో ఆశ్రమాలున్నాయని తెలిసింది. దారిలో సామాను తీసుకుని, తినటానికి టిఫిన్ తీసుకుని బయలుదేరాము. మూడుగంటల ప్రయాణం చేసేటప్పటికి ఏవో పర్ణ కుటీరాలు కనబడ్డాయి. కారు దిగి వెళ్ళి అడిగేవాళ్ళం సుందరీ అనే ఒక్కటి సన్యాసిని వుందాయని కొన్నిచోట్ల. 'ఆ, వుంది' అనేవారు. నాగుండె వేగం హెచ్చేది. సుందరి వచ్చేది. కాని ఈ సుందరి వేరు; వెదకుతూన్న సుందరివేరు. ఇలా చాలాచోట్ల జరిగింది. లఖియా-రాణీల పేరు చెప్పినా ఫలించలేదు.

తిరిగి తిరిగి అలసిపోయాము. యశో-లఖియాల ఆచూకీ దొరక లేదు. నిరాశ, నిస్పృహలతో అందరి హృదయాలు నిండిపోయాయి. ఇంతదూరం వచ్చి వట్టిచేతులతో తిరిగి పోతామా? అక్కడ ఆశ్రమాలు చాలా వున్నాయి. అందులో ఎక్కడో యశోవుందని నాకు నమ్మకంగా వుంది. కాని ఆమెను వెదకటం ఎలాగ? తెచ్చుకున్న టిఫిన్ అయి పోయింది. ఆకలికూడా వేస్తూవుంది. ఇదంతా వృధా ప్రయాసేనా? రాజేంద్ర నెమ్మదిగా కారు నడుపుతున్నాడు. అందరి ముఖాలమీద నిరుత్సాహం స్పష్టంగా కనబడుతూంది. ఇంతలో హఠాత్తుగా సరళ గొంతుక వినబడింది. "ఆపు రాజేంద్రా! కారు ఆపు"

కారు సరిగా ఆగకుండానే సరళ తలుపుతీసి వెనుకకు పరుగెత్తింది. మే మిద్దరమూ కారులోంచి బయటికి వచ్చేసరికి సరళ ఒక అపరిచిత

యువతి కౌగలిలో ఇమిడిపుంది. సుందరి యశో ఏమో అనుకున్నాను. గబగబా దగ్గరకు వెళ్ళాము. ఆమె యశో కాదు. అతిసామాన్యమైన తెల్లటి చీర కట్టుకుంది. తెల్లటి శరీరఛాయలో తెల్లటిచీర ఇమిడిపోయింది. ఒక వ్యక్తి ముఖంలో అంత ప్రశాంతతా, చల్లదనమూ వెన్నెల్లా నేను అంతకుముందు ఎన్నడూ చూడలేదు. ఆ సుందరయువతి నొసట కుంకుమలేదు. ఆమె లఖియా అని గుర్తుపట్టాను.

సరళ కళ్ళవెంట కన్నీటిధార కారుతోంది. 'లఖియా లఖియా' అని మాటిమాటికి అంటూవుంది. మమ్మల్ని చూచి లఖియా సరళ కౌగిలి లోంచి విడిపించుకుని చీరచెంగు తలమీద పూర్తిగా కప్పుకుంది.

సరళ అప్పటికి ఈ లోకంలోకి వచ్చింది. మా ఇద్దరినీ పరిచయం చేసింది. నమస్కార ప్రతి నమస్కారాలయ్యాయి. లఖియా వదనం నుంచి దృష్టి మరల్చుకోలేకపోయాను. ఆమె చూడాలనీ, కలుసుకోవా లనీ, నాకున్న విపరీతమైన వాంఛ అలా హఠాత్తుగా ఫలించేటప్పటికి నేను క్షణకాలం మూగవాడనయిపోయాను.

సరళ అంటూంది: "రామబాబు ఒకసారి నీ గురించి ఏమన్నారో తెలుసా లఖియా ?"

"లఖియా నీకు మళ్ళీ కనబడితే నాకు తప్పకుండా కబురుచెయ్యి సరళా, నేను ఎక్కడున్నా, ఎలావున్నా చూడటానికి వస్తాను; ఆ అజ్ఞాత యువతికి నేను జోహారు లర్పిస్తున్నాను" అన్నారు.

అలాంటి మాటలు ఇంత అసందర్భంగా, అనాలోచితంగా మాట్లాడు తుందని నేనూహించలేదు. లఖియాకు కోపం వస్తుందేమోనని భయ పడ్డాను. ఆమె తలఎత్తి నా కళ్ళల్లోకి ఒకసారి చూచింది. ఆ చూపు నా కర్థంకాలేదు. కాని అందులో కోపంలేదు; చల్లటి వెన్నెలవుంది.

అప్పుడు లఖియా "మీరంతా మా ఆశ్రమానికి బయలుదేరారా ? అయితే పదండి. సుందరికి ఇవాళ పర్వదినం" అంది.

కారుని అక్కడే వదలివేసి లఖియాతో ఆశ్రమానికి బయలు దేరాము. రెండు ఫర్లాంగులు చెట్లలోంచి నడిచేటప్పటికి చిన్న చిన్న

పూలతోటలూ, పర్ణకుటీరాలు ఎదురయ్యాయి. లక్ష్మియా, "ఇదే సుందరి నివాసం. లోపలికి వెళ్ళి కూర్చోండి. నేను యిప్పుడే వెళ్ళి పిలుచుకు వస్తాను" అంది.

సరళ "ఒకవేళ లోపలవుందేమో!" అంది.

లక్ష్మియా నవ్వుతూ "అబ్బే! సుందరి యీ సమయంలో గురువు గారి దగ్గర వుంటుంది. ఆమె భోజనమైనా మానుతుంది కాని యిది తప్పదు. ఇప్పుడే తీసుకవస్తాను" అని వెళ్ళింది.

తలుపు తోసుకుని లోపలికి వెళ్ళాము. లోపల మట్టినేల అప్పుడే అలికినట్టుంది. గదికి ఒకమూల పూజాసామగ్రి వుంది. ఒక ఎత్తైన మట్టిగోడ ఆ పెద్ద గదిని రెండు భాగాలుగా విభజిస్తూంది. ఇంకొకమూల వంటసామగ్రి వుంది. ఇవికాక ఒక పెద్ద ట్రంకుపెట్టి వుంది. బహుశా చీరలపెట్టి అయివుంటుంది. పెట్టి దగ్గర రెండు చాపలుకూడా వున్నాయి. ఆ కుటీరమూ, ఆ నిరాడంబరత్వమూ చూచి మా ముగ్గిరినోట మాట పెగలలేదు. సరళ చాప పరిచింది. ముగ్గురమూ కూర్చున్నాము. ఎవరికీ ఏమి మాట్లాడాలో తోచటంలేదు. సరళ కృత్రిమంగా నవ్వుతూ "భలే యిల్లు. ఈ సాయంకాలమే వీరిద్దరినీ యిక్కడనుంచీ తీసుకుపోవాలి" అంది.

జవాబులేదు. బయట అడుగుల చప్పుడయింది. తలఎత్తి చూచే సరికి ఎదురుగుండా ఎవరి రూపాన్ని చూడటానికి నా హృదయం మూడు సంవత్సరాలనుంచీ తహతహ పడుతూందో ఆమె ప్రత్యక్ష మయింది. క్షణమాత్రం గుమ్మంవద్ద ఆగిపోయింది. మరుక్షణంలో చీర చెంగు తలమీదికి లాక్కుని గబగబా లోపలికి వచ్చింది యశోరాజ్యం. ముగ్గురికీ నమస్కరించి "ఎంత సుదినం. తలవని తలంపుగా వచ్చారే ముగ్గురూ" అంది.

మూడు సంవత్సరాల క్రితం విన్న అదే కంఠస్వరం ఎంత మధురంగా వుంది. సరళ "పవిత్రమైన నీ గృహాన్ని అపవిత్రం చేయ లేదు కదా!" అంది.

"నా గృహం అపవిత్రమవ్వాలంటే నేను అపవిత్రమవ్వాలి సరళా! అంతకంటె వేరేమార్గం లేదు. రాజేంద్రబాబూ, మీరు నన్ను క్షమించాలి. ఇంతకాలం యింత దగ్గరవుండి కూడా మీకు తెలియపరచనందుకు" అంది.

రాజేంద్ర "అలా అనకు యశో. ఈనాడు చూచాము అదేచాలు" అన్నాడు. కంఠంలో కాస్త తొట్రుపాటు వుంది.

ఇప్పటివరకూ నాతో ఒక్కమాటకూడా మాట్లాడలేదు. అందరినీ పలకరించిన తర్వాత నావైపు తిరిగి చిరునవ్వు నవ్వుతూ—

"మీరు వీ రిద్దరినీ ఎక్కడ కలుసుకున్నారు. ఇంటినుంచీ ఎప్పుడు బయలుదేరారు?" అంది.

జవాబు సరళ చెప్పింది. "నిన్న పొద్దున ముస్సోరీ బజారులో మా యింటికోసం వెతుకుతూ కనబడ్డాడు"

యశో బలవంతంగా నవ్వు ఆపుకుంటూ "అబద్ధం చెప్పివుంటారు. అలా దేనికోసమైనా వెతకటం ఆయన స్వభావానికే విరుద్ధం. అలా నడుస్తూంటే అదే కనబడుతుందనుకుని వుంటారు. ప్రపంచంలో ఏదైనా ఆయన కాలికి వచ్చి తగలాలి. అప్పుడు స్వీకరిస్తారు. అంతేకాని దానికోసం ఆయన వెతకరు" అంది.

లథియా యశో వెనకాల నుంచుని నాకేసి చిరునవ్వుతో చూస్తూంది. అంతమందిలో యశో నా స్వభావాన్ని గురించి చర్చించటం నాకు నచ్చలేదు.

ఇంతట్లో లథియా "అది సరే సుందరీ! వీరికి బస ఎక్కడ చూపించుదాము. అదేదో చూడు. ఆలశ్యమవుతూంది" అంది.

ఇంతట్లో రాజేంద్ర లేచి నించుని "నేనింక వెళ్ళిపోవాలి సరళా! నువ్వు తరువాత ఎప్పుడు వస్తావు" అన్నాడు.

యశో ఆ మాట విని కంగారుపడుతూ "అప్పుడే ఎక్కడికి వెళ్తారు రాజేంద్రబాబూ! మా ఆతిథ్యాన్ని కొద్దిరోజులైనా స్వీకరించండి. తిరస్కరించకండి" అంది. సరళ భర్త తరఫున జవాబిచ్చింది. "అది

కాదు యశో. రాజేంద్రను వెళ్ళనీ. ఇప్పుడిప్పుడే కొన్ని కేసులు వస్తూన్నాయి. ఇవిగూడా సరిగ్గా చూడకపోతే వున్న ప్రాక్టీసుకూడా పోతుంది. మళ్ళీ వస్తారు. ఇప్పుడు ఈ ప్రదేశం ఆయనకి తెలుసుకదుక" అంది.

యశో. "అలా అయితే కాస్సేపాగండి. కాసిని పళ్ళు తీసుకుని వెళ్ళండి" అని ఆ మట్టిగోడ చాటుకు వెళ్ళి ఒక పళ్ళెంలో రకరకాల ఫలాలు పట్టుకువచ్చింది.

రాజేంద్ర కొన్ని పళ్ళుతిని మంచినీళ్లు తాగి "అయితే తిరిగి ఎలా వస్తావు? నన్ను రమ్మనమంటావా?" అన్నాడు.

యశో "అదంతా మేము చూచుకుంటాము. రాజేంద్రబాబూ.మీరు దిగులుపడకండి. కాని యిది జ్ఞాపకముంచుకోండి రాజేంద్రబాబూ! మీకు వీలున్నప్పుడల్లా మా ఆతిథ్యం ఎంత అల్పమయినదయినా లభిస్తుంది" అన్నది.

రాజేంద్ర "ఈ విషయం యీనాడు చెప్పేవుకనుక జ్ఞాపకం వుంచుకుంటాను. యశో. నేను మళ్ళీ రేపు సాయంత్రమో ఎల్లుండో వస్తాను సరేనా!" అని బయటికి వెళ్ళిపోయాడు.

అతని మాటలో కాస్త ఆవేశం పొడచూపింది.

ఆ తరువాత కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. అప్పుడు యశోని పరిశీలనగా చూశాను.ఎంత శాంత గంభీర సౌందర్యం. ఆ పచ్చటి శరీర చాయ. నిండైన విగ్రహం. తీర్చి దిద్దిన రూపం. అన్నీ అలాగే వున్నాయి. ఆకుపచ్చరంగు చీరకట్టుకుని వుంది. జుట్టు విరబోసుకుని ఒక ఎర్రటి రిబ్బను మెడక్రిందనుంచి లాగి నెత్తిమీద ముడివేసింది. ముఖంమీద చిన్న కుంకుమ బొట్టు వుంది. ఆ అపురూప సౌందర్యాన్ని అలాగే చూస్తూ కూర్చున్నాను. ఈ స్త్రీనేనా నేను మూడు సంవత్సరాల క్రితం మొదటిసారిగా రూన్ ప్లాట్ఫారంమీద చూచాను? చెంగుమని నవ్వుతూ నమస్కారమంది అంటే ప్రతినమస్కారం చెప్పడం మరచి పోయాను. ఈ స్త్రీయేనా నా కాళ్ళమీద తలపెట్టి "యిక్కడే కొంచెం చోటివ్వండి" అని అంది. మూడు సంవత్సరాల క్రితం యశోకి ఇప్పటి

యీ సుందరికి ఒకచే తేడా కనబడుతూంది. ఆమె ముఖంలో ప్రశాంతత వుంది. క్రోధం వారించి పోయినట్టు కనబడుతుంది.

ఆ మైకంనుంచీ బయట పడేటప్పటికి ఎదురుగుండా యశో కూర్చుని వుంది. సరళా, లభియా ఎక్కడికో వెళ్ళిపోయారు. యశో నవ్వుతూ — "ఏమిటి, యింత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు బాదల్‌బాబూ? యశోకి, సుందరికి పోలికలు కడుతున్నారా?" అంది.

అప్పటికి నాకు మత్తు పూర్తిగా వదిలింది. "నిజం చెప్పావు యశో. కాని యిది మొదట చెప్పు. ఇంత శాంతంగా, చక్కగా చిరునవ్వు నవ్వటం ఎక్కడ నేర్చుకున్నావు? నీ ముఖంలో యింత ప్రశాంతత ఎక్కడినుంచి వచ్చింది" అని అడిగాను.

ఆ చిరునవ్వు అలాగే వుంది. జవాబు మటుకు వచ్చింది — "ముఖం మనస్సుకు ప్రతిబింబం మాత్రమే బాదల్‌బాబూ. మనస్సుని పరిశుభ్రంగా ఉంచుకుంటే యిక శరీరానికి రోగాలుకూడా రావు. చూడండి మీరంతా శరీరారోగ్యం కోసమని అనేక పదార్థాలు, మందులూ తీసుకుంటారు. ఆరోగ్యం విషయంలో ఎంతో జాగ్రత పడతారు. కానీ రోగాలు వస్తూనే ఉంటాయి కాని యిక్కడ అలాంటివేమీ చొరలేవు. అయినా మే మెంత ఆరోగ్యంగా ఉంటామో చూడండి" అన్నది.

"అయితే యిదంతా ఎక్కడ నేర్చుకున్నావు అమ్మీ" అన్నాను.
'ఇంకెవరూ మా గురువుగారే. అన్నట్టు మరచాను. అమ్మీ అని నాకు కొత్తగా పేరు పెట్టారా? ఉత్తరంలో అలా ఒకసారి రాసినట్టు జ్ఞాపకం' అంది.

"కొత్తగా పేరుపెట్టలేదు. అప్పుడప్పుడు ఆప్యాయంగా అలా పిలవాలని బుద్ధిపుట్టింది. అస్తమానమూ ఒకే పేరుతో పిలుస్తే ఏమి బావుంటుందిచెప్పు. ఇప్పుడు నీకు మూడుపేర్లు, యశో, సుందరి, అమ్మీ" అన్నాను. యశో నవ్వింది. వీటన్నిటిలోకి నాకు సుందరి పేరు నచ్చింది. తెలుసా అంది. సరే బాగానేవుంది. తాగడానికి కాస్త కాఫీ, టీ, లాంటి

జల పదార్థాలు యిక్కడ దొరకుతాయా దొరకవా ? చాలా అలసి పోయాను"అని ఆ చాపమీద చేతులు తలకింద పెట్టుకుని పడుకున్నాను.

యశో దగ్గరికి వచ్చి నా ప్రక్కన కూర్చుని - "ఆ సదుపాయా లన్నీ రేపటినుంచి చేస్తాను. రణధీర్‌ని యీ సాయంకాలమే పంపి స్తాను. ఇక్కడకు పదిమైళ్ళ దూరంలో వున్న వూరులో యివన్నీ దొరుకుతాయి. ఈ సాయంకాలానికి పండ్లుతిని గడపాలి" అంది.

కంఠస్వరంలోంచి వ్యాకులపాటు కనబడింది. నామీద నాకే కోపం వచ్చింది. "వద్దు యశో. ఊరికే అన్నాను. ఇక్కడ నీకు ఎలా గడుస్తుందో అలాగే వుండనియ్యి. నీకు లభించని సుఖం నాకు అక్కర లేదు" అన్నాను.

యశో వ్యాకుల కంఠంతో "అలా మీరు వుండలేరు. వ్యర్థంగా పంతంకోసమని మీరలాంటి పనులుచేసి బాధపడి నన్ను బాధపెట్టకండి. మీరు ఈ ఆశ్రమంలోని వ్యక్తులు కారు. కనుక యీ నియమాలు మీకు వర్తించవు. ఇంకొకటి-యిక్కడకూడా మీ భారమంతా నేనే వహిస్తాను. ఇక్కడ మీకు లోపాలు చాలా కలుగుతాయి. వాటిని హృదయానికి పట్టించుకుని నన్ను కష్టపెట్టకండి" అంది.

"ఎంతోకాలం తర్వాత అలాంటి ప్రేమావాత్సల్య పూరితమైన మాటలు విన్నాను. కరుడుకట్టిన హృదయం కరిగిపోయింది.నీకు తెలుసు గదా యశో, నేను మానసికంగా ఎంత బలహీనుణ్ణో, ఎంత నిరర్థకు డినో. ఇలాంటి వాడిని దగ్గర పెట్టుకుని నీవేమి సుఖపడతావు అమ్మీ !" అన్నాను.

యశో నా చొక్కాగుండీ త్రిప్పుతూ "అదంతా నా బాధ్యతే బాదల్‌బాబూ ! మీ బలహీనత నాకు తెలుసు. సర్వవేళలా మిమ్మల్ని ఎవరో ఒకరు కనిపెట్టివుండాలి. కాని మీలో వజ్రంలాంటి కాఠిన్యత వుంది. మీకు కోపం వచ్చిందంటే నాకు ఒగని భయం. ప్రతి చిన్న విషయాన్ని హృదయానికి పట్టించుకోకండి. ముఖ్యంగా గతాన్ని గురించి విచారించకండి."

ఆమె ముఖం లజ్జా రాగరంజిత మయింది. ఈ మూడు సంవత్స రాలనుంచి దాగియున్న ప్రేమా, వాత్సల్యం, అనురాగమూ ఈనాడు వెల్లుబికి వచ్చాయి. ఆ ధాటికి తట్టుకోలేక పోయింది. పళ్ళు తీసుక వస్తాను అని లేచి ఒక పళ్ళెంలో పళ్ళూ, మంచినీళ్ళు తీసుకువచ్చింది.

అవి నాముందర పెట్టి — "తింటూ ఉండండి. నేను రణధీర్‌తో చెప్పి వస్తాను" అని బయట్‌కి వెళ్ళిపోయింది.

కొంత సేపటికి లఖియా "సుందరీ" అంటూ లోపలికి వచ్చింది. నన్ను చూచి గుమ్మంవద్ద ఆగిపోయి"సుందరి ఎక్కడికి వెళ్ళింది రామ బాబూ?" అని అడిగింది.

నేను లేచి కూర్చుని "యిప్పుడే వస్తుంది, లోపలికి రండి" అన్నాను. లఖియా లోపలికివచ్చి "సవ్వుతూ మీ కొక మాట చెప్దా మనుకున్నాను రామబాబూ! సరళనీ, సుందరినీ పిలిచినట్లే నన్నుకూడా పేరుపెట్టి పిలవండి" అంది.

నేను "తప్పకుండా అలాగే చేస్తాను లఖియా. మూడు సంవత్స రాల క్రితం నీ వృత్తాంతం చెప్పిననాటినుంచీ నీ గురించి చాలా ఆలో చించాను. అనేకసార్లు కన్నీరుకూడా కార్చాను. నీలో యింత సహ నమూ, ప్రేమ, ఔదార్యమూ ఎక్కడివి? అని అనుకునేవాడిని"అన్నాను.

లఖియా ఈ అప్రస్తుత ప్రశంశకి సిగ్గుపడింది. ముఖం క్రిందికి దించుకుని "మీ దయకూ, అభిమానానికీ కృతజ్ఞురాలిని రామబాబూ! కాని నాలోకూడా లోపాలు చాలా వున్నాయి. కళ్ళకు కనబడేటంత మంచి దానను కాదేమో!" అంది.

మొదట చూపించిన వ్యదేకానికి నేనుకూడా సిగ్గుపడ్డాను. "అది సరే లఖియా, జీవితంలో యిప్పటి వరకూ నీవు అనేక కష్టాలు అనుభ వించావు. ఇక యిప్పటినుంచీ నైనా సుఖపడాలని నా కోరిక" అన్నాను.

లఖియా ఏమీ జవాబివ్వలేదు. సంభాషణ మార్చుదామని- "నువ్వు యిల్లు వదలివచ్చిన తరువాత వెంటనే యిక్కడికి వచ్చావా లఖియా" అన్నాను.

"లేదు" అంది.

"అయితే తరువాత జరిగిందేమిటో వినాలని కోరికగా వుంది, లక్షియా" అన్నాను. లక్షియా తలపైకెత్తి మందహాసము చేస్తూ "అలా కోరికగా ఉండటము అస్వాభావికమేమీ కాదు రామబాబూ. ఇప్పుడుకాదు, మరోసారి చెప్తాను" అంది.

బయటనుంచి యశో, "చాలా ఆలస్యమయిపోయింది. ఏం చేస్తూఉన్నావు?" అంటూ లోపలికి వచ్చింది. లక్షియాను చూచి "అరే! రాణి, సరళను వదలి వచ్చావా ఇక్కడికి" అంది.

యశో వెనకాలనుంచి ఒక పద్దెనిమిది పందొమ్మిది సంవత్సరాల యువకుడు నెత్తిమీద ఒక మంచంపెట్టుకు నుంచున్నాడు - "చిన్నక్కా మంచం ఎక్కడ పెట్టను?" అన్నాడు.

యశో దారిలోంచి తప్పుకుని "లోపల పెట్టి బాబుగారికి నమస్కరించు" అంది. అక్కగారి ఆదేశాన్ని తమ్ముడు పాలించాడు. నాకు ఏమని ఆశీర్వదించాలో తెలియక మెదలకుండా వూరుకున్నాను.

యశో అదిచూచి - "అలా చూస్తారేమిటి? మీ కోసం ఈ మంచం చాలాదూరంనుంచీ తీసుకువచ్చాడు. ఏమయినా చెప్పండి. ఎక్కడయినా, ఎప్పుడైనా మీరు యింతే. సృష్టికర్త ఈ ప్రపంచాన్ని మీ సేవకోసం సృష్టించాడని మీ ఉద్దేశం" అంది.

యశోకి ఈ అలవాటు మొదటినుంచీ ఉంది. నా లోపాలను గురించి యితరులవద్ద ఎంతో మమకారంతో మాట్లాడుతుంది. అదొక విధమైన మానసిక సంతృప్తి నిస్తుందనుకుంటాను.

ఆ అభియోగానికి ఈసారి లక్షియా జవాబు చెప్పింది. "అదేమిటి సుందరీ! రామబాబుమీద ఎందుకు అలా దాడీలు చెప్తావు. వారికి నువ్వుచేసిన సేవ ఏమిటో కాస్త చెప్పు" అంది.

యశో — "అదే కర్మ. రాణీ చెపితే ఎవరూ నమ్మరు. బయటికి ఎంతో అమాయకులులా కనబడుతారు. నీకు తెలియదు. మూడు సంవత్సరాల క్రితం ఈయన నన్ను యెంత దుఃఖపెట్టారో. హృదయం

పగిలిపోయ్యేటట్టు కుమిలిపోతూంటే ఈయన ఒక సానుభూతి మాటైనా చెప్పలేదు. ఏడిచే దానిని యింకా ఏడిపించిపోయారు. పైగా నన్ను మరచిపో అని సలహా యిచ్చారు" అంది.

యశో మాటలతీరు నాకు నచ్చలేదు. మాటలు తప్పించుకుందామని "రణధీర్ నిన్ను ఆశీర్వదించలేదని మీ అక్కకు కోపంవచ్చింది. అందుకని ఆశీర్వదిస్తాను.అక్కగారి సేవలో సుఖంగావుండు"అన్నాను.

లఖియా నవ్వుతూ "బాగా ఆశీర్వదించారు రామబాబూ ! అన్నట్టు మా రణధీర్ ఎన్ని యుద్ధాలలో పాల్గొన్నాడో మీకు తెలుసా. ఒకసారి ఆశ్రమం చూడటానికి వచ్చిన మూడు పెద్ద పిల్లులను తరిమివేశాడు. ఇంకొకసారి ఒక నక్క....." అని ఏదో చెప్తూంటే రణధీర్ అడ్డు వచ్చాడు.

"పెద్దక్క ఎప్పుడూ యింతేనండీ. నన్ను వేళాకోళం చేస్తుంది. ఆమె మాటలు నమ్మకండి" అన్నాడు.

"సరే. యీ యువకుడికి పెద్దక్కకూడా వుందన్నమాట. చిన్నక్కతోపాటు కుర్రవాడు మంచివాడులాగే వున్నాడు. శరీర దారిద్ర్యం కలవాడని స్పష్టంగా కనబడుతోంది. యశో, రణధీర్ గురించి తరువాత మాట్లాడుకుందాం. ముందర సరళను చూద్దాం పదండి. లేకపోతే ఎక్కడికైనా వెళ్ళిపోతుంది" అంది.

సరళవద్దకు ముగ్గురమూ బయలుదేరాము.

* * *

పడమటి దిశలో సూర్యుడస్తమించాడు. అంతా కలిసి గంగ వద్దకు వెళ్ళాము. బాగా చీకటి పడిన తరువాత ఆశ్రమానికి తిరిగి వచ్చాము. భోజనాలయిన తరువాత సరళ లఖియాతో వెళ్ళిపోయింది. పనులన్నీ ముగించుకుని యశో నా పక్క వేస్తూంది. అప్పటివరకూ నాకు యీమాటే గుర్తుకురాలేదు. ఆ ఒక్క గదిలో మేమిద్దరమూ ఎలా పడుకుంటాము. ఈ ఆశ్రమంలోని సన్యాసులు, సన్యాసినులు ఏమను

కుంటారు ? లక్ష్మి యేమనుకుంటుంది ? యీ సమస్యకు పరిష్కారం నాకు ఏమీ కనబడలేదు.

నెమ్మదిగా, భయపడుతూ—"నేను బయట పడుకుంటానుయశో" అన్నాను. యశో పక్క వేయటం మాని నాకేసి తీక్షణంగా చూస్తూ— "ఈ చలిలో బయట పడుకుంటారా ? మీకంత మీలో నమ్మకం లేక పోతే, మీకంత భయమయి నట్లయితే నేను బయట పడుకుంటాను. మీరలా చేయవలసిన అవసరం లేదు" అంది.

నే నేమీ మాట్లాడలేదు. ఏమనాలో తెలియలేదు. నేను భయపడిందేమిటంటే, దీని ఫలితంగా యశోమీద అపవాదు పడుతుందేమోనని. ఒక అరగంట పోయిన తరువాత యశో ఒక చాప తీసుకుని బయటికి వెళ్ళిపోతుంది. అది నే నెలా సహిస్తాను. నే నెలాంటి వాడి నయినా పాషాణ హృదయుడినికాదు. నే నెవరిని ఆ యింటిలో — ఒక అతిధిని. అది మరచిపోయి అలాంటి పని జరగనిస్తానా?

నేను యశో చేయి పట్టుకుని, "నాకు హృదయమంటూ ఒకటి వుంది అమ్మీ. పద లోపలికి. ఈ రేయినుంచీ మనము ఒక నూతన అధ్యాయాన్ని ప్రారంభిద్దాము" అన్నాను.

యశో మాట్లాడలేదు. ఒకసారి నా కళ్ళలోకి చూచి తల వంచుకుంది. అప్పుడు నేనే ఆమె చేతిలోంచి చాప తీసుకుని గదిలో మట్టి గోడకు ఒకవైపున పక్క వేశాను.

ఆమె యింకా అక్కడే వుంది. నేను ఆమె దగ్గరకువెళ్ళి చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువచ్చాను. ఆమెలో యింత సిగ్గు హఠాత్తుగా ఎందుకు వచ్చింది.

# 14

మరునాడు మధ్యాహ్నం నన్నూ సరళనీ వెంటబెట్టుకుని యశో గురువుగారి వద్దకు బయలుదేరింది. వెళ్ళాలనే కోరిక మాలో ఏమంత ఎక్కువగాలేదు. అయినా యశో పట్టుపట్టింది. వారి ఆశీర్వాదం పొందితే శుభం చేకూరుతుందంది.

వెళ్ళటంవల్ల నష్టమేమీ లేదు. యశో యింత గౌరవించే యీ సన్యాసిని చూచినట్టవుతుంది. అంతవరకు నాకు సన్యాసులంటే నమ్మకమూ లేదు. అపనమ్మకమూ లేదు. అసలు నిజమైన సన్యాసిని నేను చూడలేదు.

దగ్గరలోనే ఉంది ఆయన నివాసం. మిగతావాటికంటె యీ కుటీరం పెద్దదిగా కనబడింది. నేనూ సరళా గుమ్మంవద్ద నిలుచుండి పోయాము. యశో ముందర లోపలికి వెళ్ళింది. ఇక్కడ కాస్త ఆగి యీ గురువుగారి గురించి చెప్పాలి. నేను అనుకున్నట్టు ముసలివాడు కాదు. నలుబది సంవత్సరాలు మించవు. నల్లటి పొడుగాటి గెడ్డంవుంది. ఒంటి నిండా బ్రహ్మాండమైన బొచ్చువుంది....ఎలుగుబంటువలె. ఒక పచ్చటి పంచ కట్టుకుని ఒక ఎత్తైన ఆసనముమీద కూర్చున్నాడు. క్రింద పాము కోడు పాదరక్షలున్నాయి. ఆయన చుట్టూ నలుగురైదుగురు స్త్రీలు గుమ్మికూడి వున్నారు. అందరూ వనకన్యల్లా వున్నారు.

కొంతసేపటివరకూ గురువుగారు శిష్యురాలిని అనుగ్రహించలేదు. యశో దగ్గరికి వెళ్ళి నమస్కరించింది. అప్పుడాయన ప్రసన్నులయినారు. గెడ్డం రాసుకుంటూ "వచ్చావా సుందరీ. నీ రాక కో.........ఆ, వీరెవరు ?" అన్నారు మాకేసి చూస్తూ. యశో మాకు చెప్పింది అలాంటి సమయాల్లో ఆయనకు వంగి నమస్కరించాలని. అలాగే చేశాము.

గురువుగారు చిరునవ్వు నవ్వుతూ "నీ అతిథులా సుందరీ. నూతన దంపతుల్లా వున్నారు. చిరకాలం యీ పవిత్ర బంధనలో ఇమిడి

ఉండండి నాయనలారా !" అన్నారు. కథంతా అడ్డం తిరిగింది. ఇదెక్కడ గురువు ఈయన. నేను యశోవైపు చూశాను. ముఖంలో నెత్తురు చుక్కలేదు. వెలవెలబోతూంది. సరళ తనలోతాను నవ్వుకుంటూంది.

యశో "కాని స్వామీజీ, వీరిద్దరూ దంపతులుకారు...." అని ఏదో చెప్పబోతూంటే స్వామీజీ అడ్డువచ్చారు. "అయినా ఏమీ ఫరవాలేదమ్మా! త్వరలోనే దంపతులవుతారు. నామాటకు తిరుగు వుండదమ్మా" అన్నారు. యశో నోట మాట రావటంలేదు. పెదిమలు కదులుతున్నాయి కాని మాటలు వినబడలేదు. ఇప్పుడు సరళ రంగంలో ప్రవేశించింది. "కానీ నాకు వేరే భర్త వున్నాడు స్వామీజీ. వారిని వదలిపెట్టమని మీరు సలహా యిస్తున్నారా ?" అంది.

ఇంత సూటిగా అడిగేటప్పటికి గురువుగారు చప్పబడ్డారు. కాస్త నెమ్మదిగా "ఏదయినా నా మాటకు తిరుగు వుండదమ్మా !" అన్నారు. సరళ వదలిపెట్టలేదు—"మీమాట ప్రకారం నేను నా భర్తను వదలి ఈయన్ను వివాహమాడితే మీరు నన్ను అనుగ్రహిస్తారా ?" అంది. ఆ ప్రశ్న నాకు నచ్చలేదు. సరళ చాలా దూరం పోతోందనుకున్నాను. ఈ మాటలతో యశో మరీ కృంగిపోతూన్నట్టు కనబడింది. అక్కడ ఉన్న సన్యాసినులు వింతగా చూస్తున్నారు, ఈ వాగ్యుద్ధాన్ని.

గురువుగారు కాస్త కంగారుపడుతూ "అవన్నీ నాకు తెలియవు యువతీ ! నా మాటకు తిరుగు ఉండదమ్మా !" అన్నారు. జవాబు చెప్పబోతూంటే సరళను వారించాను. యశోకి యేమనాలో, ఏంచెయ్యాలో తోచటంలేదు.

అప్పుడు నేను అన్నాను-"మీ ఆశీర్వాదానికి మేము కృతజ్ఞులం స్వామీజీ. ఇంక మేము వెళ్ళివస్తాము"

ఈ మాటలతో ఆయనకి ఊపిరి పీల్చుకోవటానికి సందు దొరికింది. "మంచిది నాయనా ! ఇంకా కొన్నాళ్ళుంటావనుకుంటాను. మళ్ళీ కనబడు ఎప్పుడైనా" అన్నారు.

ఆహ్వానం నాకు వచ్చింది. సరళకు కాదు. బయటికి వచ్చిన వెంటనే సరళ నవ్వటం మొదలుపెట్టింది.

"మా భలే గురువుగారు. మిమ్మల్ని మళ్ళా కలుసుకోమన్నారు. ఈయన గెడ్డం లాగి చూడండి. ఉంటుందో వూడుతుందో" అంది.

నేనేమీ మాట్లాడలేదు. నేను యశో గురించి ఆలోచిస్తూన్నాను. ఆమెకి కలిగిన మనోక్షోభ నేను గ్రహించాను. ఒకవైపు గురువుగారి ఎడ ఆమెకుగల అపరిమితమైన నమ్మకం. ఇంకొకవైపు ఈ భయంకర మైన శాపం. నన్ను నమ్ముకోవటమా లేక గురువుగారిని నమ్మటమా?

నా మొహాన్ని చూచి సరళ—"మీరుకూడా ఆయన మాటలకి విలువ యిస్తున్నారా? మిమ్ములను లేవదీసుకు పోతానని భయపడు తున్నారా రామబాబూ!" అంది.

సరళ స్వభావమేమో నాకు తెలుసు. ప్రతిదీ కుండ బద్దలుకొట్టి నట్లు చెప్పుతుంది.

"అదికాదు సరళా! నేను యశో గురించి ఆలోచిస్తూ వున్నాను. ఆ ఆశీర్వాదం ఎంత భయంకరమైనదో చూడు" అన్నాను. సరళ నాకేసి ఎంతో ఆశ్చర్యంగా చూచింది.

"భయంకరమా! ఇందులో నాకు భయంకరమైన దేదీ కనబడ లేదు రామబాబూ! మీరంతా ఒక దొంగ సన్యాసి మాటలకి ఎందుకు విలువ యిస్తున్నారో నా కర్థం కావటంలేదు. చక్కటి ఈ రోజును పాడు చేశాడు; ఈ దొంగ గురువు" అంది.

సరళతో యిక వాదించటము అప్రయోజకమూ, అనవసరమూ అని నేను ఊరుకున్నాను. ఈమె గురువుగారిని అనవసరంగా పురి కొల్పిందనే కోపంకూడా వచ్చింది. ఆ కోపం ఎంత అసమంజసమైనదో నాకు అప్పుడు తెలియలేదు. నే నేమీ మాట్లాడలేదు. మౌనంగానే ఋషియా కుటీరం వద్దకు వచ్చేశాను.

సరళ - "కాస్సేపు లోపలికివచ్చి కూర్చోండి రామబాబూ! యశో అప్పుడే రాదుకదా" అంది. ఆమెమీద యింకా కోపం తగ్గలేదు— ఉహూ, యిప్పుడు నేను పోతాను అన్నాను. కంఠంలో అనవసరమైన కాఠిన్యత వుందేమో. సరళ కాసేపు అలాగే నుంచుని - "సరే బాబూ!

నాకూ్కడా కొంచెం పనిఉంది. సాయంకాలం రాజేంద్ర వస్తాడనుకుంటాను. సామాను సర్దుకోవాలి" అంది.

"సరే సరళా! అలాగే కానీ. వెళ్ళేముందు కనబడతావు కదూ?" అన్నాను.

"కనబడతాననే అనుకుంటాను. లేకపోతేమటుకూ నష్టమేముంది. రామబాబూ! మనము బతకవలసిన రోజులు చాలా ఉన్నాయి" అని లోపలికి వెళ్ళిపోయింది.

నేను కాసేపు అలాగే నుంచుని వెళ్ళిపోవటానికి బయలుదేరుతూంటే హఠాత్తుగా లఖియా ఎదురైంది - "అరే, యిదేమిటి రామబాబూ! ఒంటరిగా బయట నుంచున్నారు. లోపలికి పదండి" అని లోపలికి దారితీసింది. అనుకోకుండానే ఆమె వెంట నేనూ బయలుదేరాను. తలుపు తోసి లోపలికి వెళ్ళేటప్పటికి సరళ మంచముమీద పడుకుని ఉంది. తలుపు చప్పుడు వినికూడా లేవలేదు.

లఖియా - "సరళా, ఏమిటి యిప్పుడు పడుకున్నావు. లే. రామబాబు వచ్చాడు" అంది. సరళ అప్పుడు ముఖం పైకెత్తింది. ఆ ముఖం చూచి నేను ఆశ్చర్యచకితుడనయ్యాను. రెండు మూడు నిమిషాల క్రితం చూచినదానికీ, దీనికీ పోలికేలేదు. ముఖమంతా ఎర్రగా గీచిన కందగడ్డలా ఉంది. సిగ్గుతో కృంగిపోతూన్నట్టు ఉంది. బొట్టంతా నుదురుమీద అలుక్కుపోయింది. తలలోని సన్నజాజి దండ క్రింద పడిపోయింది

నాకెందుకో అక్కడ ఉండబుద్ధి వెయ్యలేదు. "యిప్పుడుకాదు, లఖియా. మరొక్కసారి వస్తాను. యిప్పుడు వెళ్ళి పడుకుంటాను" అని బయటికి వచ్చేశాను.

బయటికివచ్చి ఎవరో తరుముకు వస్తున్నట్టు గబగబా నడిచాను. ఆ సరళ ముఖమే నన్ను తరుముకు వస్తూన్నట్టనిపించింది. దాని అర్థం యేమిటి? సరళలో అవ్యక్తమైన కోరికలు దాగిఉన్నాయా? గురువుగారి మాటలలో అపమేమైనా ఉన్నాయా?

లోపలికి వచ్చి చాలా సేపటివరకూ మంచముమీద కూర్చుండి పోయాను. గురువుగారి ఆశీర్వాదం, సరళ ఆయనతో అన్నమాటలు, యశో వ్యాకులపాటు, సరళ ఎఱ్ఱటి ముఖం. యివన్నీ కలసి నన్ను చాలా కలవరపరిచాయి. యివన్నీ వేటిని సూచిస్తూన్నాయి? ఈ గురువు దొంగ సన్యాసా? లేక భవిష్యత్తును చెప్పగల యోగిపుంగవుడా? రెండవదే నిజమైతే నే నింత నీచుడనా?

యెంతసేపు అలా ఉన్నానో సరిగా తెలియదు. తలుపు చప్పుడుతో మరల ప్రపంచంలో పడ్డాను. యశో లోపలికి వచ్చింది. ఆమె ముఖం నేను ఆశించినదానికన్నా ఉత్సాహంగానే ఉంది.

నా ప్రక్క మంచంమీద కూర్చుని - "ఇవాళ చాలా దుర్దినం. తప్పంతా నాదే. మీ యిద్దరినీ ఒకేసారిగా నమస్కరించమని ఎందుకు చెప్పాను? అయినా ఫరవాలేదు. ప్రాయశ్చిత్తం చేసుకుంటే వాటి ఫలితం పోతుందని చెప్పారు గురువుగారు" అంది.

నిన్న మిమ్మల్ని చూచి ఎంత సుదినం యివాళ అంది. ఈనాడు ఎంత దుర్దినం, అంటూంది.

"ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి తప్పు ఎవరు చేశారు ఇందులో తప్పేమైనా వుంటే అది మీ గురువుగారిదే." అన్నాను కోపం అణచుకుంటూ.

"అబ్బే, గురువుగారి తప్పేమీ లేదిందులో. నా మీదఉన్న అభిమానం వలన ఆయన అన మాటలని తిరిగి తీసుకోవటానికి అంగీకరించారు. కాని నా కెంతో భయం వేసింది ఆ మాటలు వింటూంటే."

గురువుగారి మీద యింత విశ్వాసం ఎందుకు కలిగిందో ఈమెకి? కంఠస్వరంలో కోపం వ్యక్తంచేస్తూ-"అయితే ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ఏమవుతుంది యశో. ఆయన శాపం నిజమవుతుం దంటావా? నా మీద నీ కంత అపనమ్మకమా?" అన్నాను.

"ఛీ, అలా అనకండి. మీ మీద నాకు నమ్మకం లేకపోవడ

మేమిటి. అదికాదు, ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే వాటి చెడు ప్రభావం వుండిపోతుంది."

"చెడు ప్రభావం వుండిపోతే ఏమవుతుంది యశో" అన్నాను.

"ఊరుకోండి మీరు. మీ కివన్నీ తెలియవు. అయినా చేసేదానిని నేను. మీరుకాదు. అలాంటప్పుడు మీకెందు కిదంతా ?" అంది.

ఇంక నేను వూరుకున్నాను. ఈ మూఢ విశ్వాసానికి హద్దులేదు.

* * *

ఆ రోజు సాయంకాలం కాదు, మరునాటి పొద్దున సరళ రాజేంద్రతో వెళ్ళిపోయింది. లఖియాని వదలి వెళ్ళనని చాలా పంతంపట్టింది. రాజేంద్రకి కొంచెం కోపంకూడా వచ్చింది. సరళ అక్కడ వుండటానికి తనకేమీ అభ్యంతరం లేదన్నాడు. లఖియా సరళకి నచ్చచెప్పి పంపించింది. వారాని కొకనాడైనా వస్తానని మాట యిచ్చింది సరళ. సరళా, నేనూ రాత్రి భోజనాలవద్ద కలుసుకున్నాము. భోజనం చేస్తూన్నంతసేపూ నాతో మాట్లాడలేదు.

వెళ్ళిపోయేముందు సరళ "మళ్ళీ ఎప్పుడు యిక్కడికి రమ్మంటారు రామబాబూ !" అని అడిగింది.

"అది నన్ను అడగవలసిన ప్రశ్నకాదు సరళా! నీకు భర్త వున్నాడు. అదీగాక యిక్కడ నేనొక అతిథిని మాత్రమే" అన్నాను.

"అది సరే రామబాబూ ! మీకు నేను సలహాలు యివ్వవలసిన దానిని కాదు. అయినా యిది చెప్తాను. తన శక్తికిమించిన పనిని ఎవరి వద్ద నుంచీ ఆశించకండి. మానవ బలహీనతకు కాస్త చోటివ్వండి. మరొకటి; మీకు చాలాకాలం క్రితం నేను చెప్పాను. తప్పులేకుండా మీరు ఎవరినీ శిక్షించకండి. అదే ఈనాడు మిమ్మల్ని తిరిగి అడుగుతున్నాను" అని బయటికి వెళ్ళిపోయింది.

మరునాడు కారులో భార్యను తీసుకుపోయాడు రాజేంద్ర.

# 15

క్రమబద్ధంగా నా జీవితం నడువసాగింది. చేసే పనిలేదు;బాధ్యత లేదు; విచారంలేదు. కాలంతోపాటు దొర్లిపోవటమే మిగిలింది. అదే చేశాను. పొద్దున లేచేటప్పటికి యశో గంగలో స్నానంచేసి వచ్చి కాఫీ కాస్తూ వుండేది. అప్పుడప్పుడు నేను కూడా ఆమెతో గంగవద్దకు వెళ్ళే వాడిని. ఆమె స్నానం చేస్తూంటే నేను పువ్వులు కోస్తూ వుండేవాడిని. నన్ను వాసనలేని పుష్పాలనే కోమయమనేది. "అంటే నేను కూడా ఒక వాసనలేని పుష్పాన్నా అమ్మీ" అన్నాను ఒకసారి.

యశో నవ్వి "కాదు. దానికి వ్యతిరేకం మీరు. మీలోని సువాసనే యితరులను ఆకర్షిస్తుంది. అందంకాదు" అంది.

స్నానంచేసి ఆమె దైవపూజకు పుష్పాన్ని కోసేది. నేను కోసిన పుష్పాన్ని జతచేసి తన తలలో పెట్టుకునేది.

మధ్యాహ్నం భోజనాలయిన తరువాత యశో గురువుగారి వద్దకు వెళ్ళిపోయేది. మళ్ళీ సాయంకాలంవరకు వచ్చేదికాదు. అంతవరకూ నేను ఒంటరిగా గడపవలసి వచ్చేది. సాధారణంగా లఖియా వచ్చేది. ఆమె దగ్గర వున్నంతసేపు శరవేగంతో కాలం గడచిపోయేది. అనేక విషయాలను గురించి చర్చించేవాళ్ళం. ఆమెతో చాలా విషయాలలో నేను ఏకీభవించే వాడినికాదు. కాని అన్నింటిలోను ఆమె అభిప్రాయాలను గౌరవించేవాడిని.చాలా వాటిలో నా అభిప్రాయలని కొంతవరకూ మార్చ గలిగేది. జీవితంలో నేను చాలామంది స్త్రీలనే చూచాను. అనేక ఉత్తమ స్త్రీల పరిచయ భాగ్యం నాకు లభించింది. అయినా యిలాంటి స్త్రీ నాకు ఎక్కడా కనబడిలేదు. సుశీ, యశో వీరిద్దరూ వుత్తమ స్త్రీలే. కాని వీరిద్ద రిలోనూ ఈమెలోని నిస్వార్థం, త్యాగశీలత, నిర్మలత్వమూ లేవు. అప్పు డప్పుడు ఆమెను చూస్తూవుంటే మనస్సుకి చాలా బాధ కలిగేది. అపు రూపమైన ఈ అసమాన యువతికి యిన్ని కష్టాలు ఎందుకు కలిగాయి?

తప్పులేకుండా దైవం ఈమెని ఎందుకు శిక్షిస్తున్నాడు? దైవంమీద నా విశ్వాసం మరింత సడలింది. పుష్పంలాంటి ఈ సుకుమారికి ఒక పశుప్రాయుడైన భర్తని ప్రసాదించాడు. స్ఫటికంలాంటి ఈ స్త్రీని విధవని చేశాడు.

ఒకనాడు లఖియా "రామబాబూ, సుందరి మీ గురించి చాలా సంగతులు చెప్పింది. కాని ఈ విషయం మీరే తప్పక చెప్పాలి. యశో ప్రేమను తిరస్కరించగల శక్తి మీకెక్కడిది? అది తప్పుకాదా?" అంది.

చాలా సూటిగా అడిగింది. జవాబుకోసం కాస్త తడుముకున్నాను. "నేను తిరస్కరించానని నువ్వు ఎలా అనుకున్నావు లఖియా? అలా అయితే నేనిక్కడ ఎందుకు వుంటాను చెప్పు. ప్రయత్నం చేశాను. కాని సఫలీకృతుడను కాలేకపోయాను. కాని వివాహ బంధరహితంగా స్త్రీ పురుషులు ఒకరికొకరు లభించలేరా, అంతకంటే ప్రేమించుకునే స్త్రీ పురుషుల మధ్య యింకేమీ ఔన్నత్యంలేదా?" అన్నాను.

లఖియా ఏమీ మాట్లాడలేదు. నేను కాసేపాగి "యశో నీకు సుఖి సంగతి చెప్పిందా?" అన్నాను.

"చెప్పింది"

"అయితే నేను చేసినదే ఉత్తమమయినది కదా? ఆమెని నేనెలా మరువగలను. వివాహబంధం అవిచ్ఛిన్నమైనదని నువ్వంటావు. ఆ మూడుముళ్ళూ వేయకపోతే విచ్ఛిన్నమయి పోతుందా అది లఖియా? ఎక్కడనుంచి వచ్చింది ఆ బంధనానికి అంత శక్తి? యశో ఒకసారి నాతో అంది. 'ఇతరులు మీకు లభించవచ్చు కాని, యితరులకు మీరు పూర్తిగా లభించలేరు' అని. ఈనాడు అనుకున్నాను అది నిజమేనని" అన్నాను.

లఖియా మెదలకుండా వూరుకుంది. తరువాత నెమ్మదిగా "మీకు తోచిన విధంగా చెయ్యండి రామబాబూ! ఈ విషయంలో మీమాటే నిజమేమో!" అంది.

సరిగ్గా అదే సమయానికి అనాటి యశో తిరిగి వచ్చింది. నవ్వుతూ "ఏమిటి లఖియా వద్ద చాడీలు చెప్తున్నారు" అంది. లఖియా మందహాసం చేస్తూ "చాడీలు చెప్పేవారయితే బాగానేవుండును. సుందరీ, వీరిని వంటరిగా వదలి యింతసేపు వెళ్ళిపోతూన్నావు కదా! ఈయన ఒక్కరూ ఏం చేస్తారు చెప్పు" అంది.

"నేనేంచెయ్యను లఖియా! అవతల గురువుగారు. యిక్కడ ఈయన. మధ్య నేను నలిగిపోతూన్నాను" అంది నీరసంగా.

"గురువుగారికి సేవ చేయటానికి చాలామంది వున్నాము సుందరీ! అందులో ఏమీ లోటువుండదు" అంది లఖియా.

యశో కాస్త సిగ్గుపడింది. అది చూచి నేను "సరే అమ్మా! కాస్త కాఫీ చూడు. కడుపులో ఎలుకలు పరుగెడుతూన్నాయి" అన్నాను.

* * *

ఒకనాడు యశో గురువుగారి దగ్గరకు చాలా త్వరగా వెళ్ళిపోయింది. ఇంట్లో ఏమీ తోచలేదు. మామూలుగా లఖియా చాలాసేపటి వరకూ రాదు. అందుకని ఆమె దగ్గరికి నేనే బయలుదేరాను.

తలుపువద్దకు వెళ్ళి 'లఖియా' అని పిలిచాను. లోపలినుంచీ జవాబు వచ్చింది. "లోపలికి రండి రామబాబూ! తలుపు తీసేవుంది" తలుపు తోసుకుని లోపలికి వెళ్ళాను. చాపమీద కూర్చుని చినిగిపోయిన తన చీర కుట్టుకుంటూ వుంది. నన్ను చూచి మందహాసం చేస్తూ "మీరు కూర్చొనటానికి యిక్కడ కుర్చీలులేవు రామబాబూ! చివరికి మంచమయినా లేదు. ఆ చాపమీదే కూర్చోవాలి" అంది. నా మనస్సు చివుక్కుమంది. "నువ్వలా అన్నావంటే చాపమీదకూడా కూర్చోను లఖియా. నేలమీద కూర్చుంటాను. నువ్వు కూర్చోగాలేదు. నేనెందుకు కూర్చోలేనో చెప్పు" అన్నాను.

"వద్దు అంతపని చెయ్యకండి. చాపమీదే కూర్చోండి" అంది నవ్వుతూ.

చాపమీద కూర్చున్నాను. ఒకసారి యిల్లంతా కలియచూచాను. యశో కుటీరం నిరాడంబరంగా వుంది. లఖియా కుటీరంలో దారిద్ర్యం కనబడుతూంది. ఒక మూల పూజ సరంజామా ఉంది. దేవతావిగ్రహాలు కూడా ఉన్నాయి. గదికి వెనుకపైపు ఒక దండెం వ్రేలాడుతూ ఉంది. దానిమీద తెల్లటి చీరలు మూడు ఉన్నాయి. గదిలో చిన్న పెట్టయినా లేదు. అటువంటి గదిలో చాపమీద కూర్చుని లఖియా తన చినిగిన చీర కుట్టుకుంటూన్న దృశ్యం వూహించుకుంటే ఎంత బాధ కలుగుతుంది? ఆమెకున్నవన్నీ తెల్లటి చీరలే.అందులో ఖరీదైన దొక్కటికూడా లేదు. తోటి స్త్రీలంతా రంగు రంగుల చీరలు కట్టుకుని, పువ్వుల జాకెట్లు వేసుకుని, ఘుమ ఘుమా సంపంగి, సన్నజాజీల వాసన వెదజల్లుతూ నడవగలుగుతూంటే, వారందరినీ మించిన సౌందర్యరాశి, గుణవంతురాలైన యీమెకి యిది ఎందుకు ప్రాప్తించింది? తల మీదపువ్వు వుండటానికి వీల్లేదు. ముఖంమీద కుంకుమ పెట్టుకోవటానికి వీల్లేదు. ఎందుచేత? భార్య చనిపోతే భర్త యీ కఠోర నియమాలని ఎందుకు ఆచరించడు. ఏ పాపఫలం యిది? దుష్టశిక్షణా, శిష్టరక్షణా విధులను నెరవేర్చే ఆ వ్యక్తి యిలా ఎందుకు చేశాడు?

ఆలోచనలన్నీ క్షణకాలంలో నా మెదడులో మెదిలాయి. అప్రయత్నంగా ఒక నిట్టూర్పు విడిచాను. లఖియా తల పైకెత్తి — "నా యిల్లు నచ్చిందా మీకు, రామబాబూ?" అంది.

ఆ చిరునవ్వు ఎప్పుడూ పెదవులమీద వెలుగుతూనే ఉంటుంది. "ఎందుకు నచ్చదు లఖియా? బాగానే నచ్చింది. నీకు వైధవ్యంతో పాటు దారిద్ర్యంకూడా సంప్రాప్తించిందా" అన్నాను. మనస్సులో బాధపడుతూ అన్న మాటలవి. కాని నాకుమాత్రం తెలియదా ఆమె ఎలాంటి స్థితిలో యిల్లు వదలిపెట్టిందో?

లఖియా మనస్సులోని నా భావాన్ని గ్రహించింది. నవ్వుతూ,

"కోపగించకండి, రామబాబూ! కోపగిస్తే మట్టుకు మనము మార్చగల దేమైనా ఉందా చెప్పండి" అంది.

"నిరపరాధికి అన్యాయం జరుగుతూంటే కూడా చూస్తూ వూరుకో మంటావా లక్షియా? మనసు ఏదీ చెయ్యలేకపోవచ్చు. అయినా బాధా కరమైన దానిని ఏవగించుకోవటంలో తప్పేముంది" అన్నాను.

"మీరన్నది నిజమే. అన్యాయం జరుగుతూంటే సహించ కూడదు. కానీ దైవం అకారణంగా ఎవరినీ శిక్షించడు, రామబాబూ. ఏ తండ్రికీ తన బిడ్డలని శిక్షించటం యిష్టంగా వుండదు" అంది.

"అయితే దోషం లేకుండా నిన్ను ఎందుకు శిక్షిస్తున్నాడో చెప్పు?" అన్నాను.

"దీనిని మీరు శిక్ష అంటారా? అంటే అనండి. నేను మీరను కునేటంత నిర్దోషినికాను, రామబాబూ. నా వైవాహిక జీవితంలో నాకు అనేక కష్టాలు ఎదురు వచ్చాయి. నా భర్త నన్ను ఆదరించకపోయి ఉండవచ్చు. అయినా ఆయనని నేను హృదయపూర్వకంగా ఎన్నడూ ప్రేమించలేకపోయాను. అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్తని ప్రేమిం చటం నా విధి. కానీ, నే నలా చేయలేకపోయాను. అన్నింటినీ సహించే దానిని కాని, ఆత్మార్పణ చేసుకోలేకపోయాను. అందుకనే మీ రనే యీ శిక్ష లభించింది" అంది.

నా చెవులకు ప్రపంచకం కూలిపోతూందా అనిపించింది. నోట మాట రాలేదు. లక్షియా జీవితంలోని కష్టాలు, అప్పటికింకా చాలా తెలి యవు నాకు. ఆమె చేసిన క్షంతవ్యం కాని తప్పులే కారణమట. తన స్వభావమూ అతనికి అర్థంచింది. క్షుద్రమైన అతని జీవితానికి కాస్త వెలుగు తీసుకవచ్చుండి. అతనిని క్షమించింది. హృదయపూర్వకంగా ప్రేమించలేక పోయింది. అదే ఆమె మహాపరాధం.

"మంచితనానికీ, అమాయకత్వానికీ కూడా ఒక హద్దు ఉంది లక్షియా. ఈ విషయం నే నెన్నడూ అంగీకరించను. అందరి తప్పుల్నీ నీ నెత్తిన వేసుకుని తరించుదామనుకుంటున్నావేమో అదంతా మిథ్య, మరేమీకాదు" అన్నాను.

లక్షియా, నాకు కోపం వచ్చిందని గ్రహించింది. నవ్వుతూ,

"అయితే మీకు తరించటం, స్వర్గం పోవటం మొదలైన వాటిలో నమ్మకముందా ?" అంది.

"లేదు లఖియా, కొంచెమైనా లేదు" అన్నాను.

"కానీ నాకు నమ్మకం ఉంది, రామబాబూ ! అవన్నీ మిథ్య అయితే నేనుకూడా మిథ్యే. ఆ దృష్టిలో చూస్తే ప్రపంచం అంతా మిథ్యే. సృష్టిలో మనకు తెలియని రహస్యా లున్నంతకాలం మానవుని బుద్ధికి మించిన శక్తులున్నంతకాలం. మనమూ మానవాతీతమైన పరమ శక్తి నొకదానిని గుర్తించాలి. ఈ శక్తినే మనము రకరకాలుగా పిలుస్తాము. దైవం, విధి, కర్మ అంటాము. చివరకు అన్నీ ఒకటే. అయితే మీరు దైవాన్ని కూడా గుర్తించరా ?" అంది.

"దైవాన్ని నేను గుర్తిస్తాను లఖియా ! కాని దైవపు పోకడయి నాకర్థంకావు. దైవపు బుద్ధి కుశలతతో నాకు నమ్మకం సన్నగిల్లుతూంది"

"అక్కడే మీరు పొరబడుతున్నారు. దైవాన్ని మీరు అంగీకరించినట్లయితే యివన్నీ మీరు అంగీకరించాలి. ఇక వేరేమార్గంలేదు. ఇక దైవబుద్ధి కుశలత సంగతి : దైవమేమీ ఒక నియంతకాదు. రన యిష్టాయిష్టాలకీ, చేష్టలకీ ఏమీ సంబంధంలేదు. అదొక పోష్టాఫీసు లాంటిది. కొంతమందికి శుభలేఖలు వస్తాయి. మరికొంతమందికి చావు కబురు వస్తుంది. ఎవరిఖర్మ వారిది" అంది.

"అంటే నువ్వనేది భగవంతుడికి హృదయం లేదంటావు అంతేనా ?" అన్నాను.

"ఒక విధంగా అదీ నిజమేకానీ, మనము మామూలుగా 'హృదయంలేదు' అనే పదాన్ని నిందాపూరితంగా వాడుతాము. మంచితనమూ, మార్దవమూ, సుగుణాలూ అన్నీ మనము హృదయంతో ముడిపెడతాము. దైవానికి అలాంటి హృదయంలేదు" అంది.

ఆద్భుతంగా వుంది. ఇకనేమనాలో తెలియలేదు. లఖియా తర్కశాస్త్రంలో యింత నిపుణురాలని నాకు తెలియదు.

"అయితే చెప్పు లఖియా, ఇవన్నీ ఎక్కడ నేర్చుకున్నావు ? కాలేజీలో నేర్చుకున్నావా ? లేక వేదాలూ, పురాణాలూ చదివేవా ?" అన్నాను. లఖియా నవ్వింది.

"లేదు రామబాబూ ! కాలేజీకి ఏమిటి. ఎన్నడూ స్కూలుకైనా వెళ్ళలేదు. కాని ప్రపంచంలోని ఉత్తమ స్త్రీలలో ఒకామెను నేను తల్లిగా పొందగలిగాను. అది నా అదృష్టం" అంది.

"అది నీ అదృష్టమే కాదు. మా అందరి అదృష్టమూ కూడాను. లేకపోతే నీలాంటి అద్భుతవ్యక్తి మాకు లభించకపోనేమో ?" అన్నాను. లఖియా ముఖం సిగ్గుతో జేవురించింది.

"వద్దు రామబాబూ ! మీరేమి చేసినా నన్ను పొగడకండి. నేను చాలా అల్పురాలిని. అల్పులను ప్రశంసిస్తే అహంభావం అవతరిస్తుంది. అయినా మీకు నా గతజీవితం పూర్తిగా తెలియదుకదా ?" అంది.

"నువ్వొకనాడు వాగ్దానం చేశావు అది అంతా చెప్తానని. అయినా నీమీద నాకున్న సదభిప్రాయం మారేటట్లు అయితే అది చెప్పవద్దు. నాకు వినాలనే కోరికలేదు" అన్నాను.

"కాదు రామబాబూ ! చెప్తాను వినండి" అని ఆమె కథంతా చెప్పింది. ఎంతో చక్కని భాషలో ఎంతో సున్నితంగా తన కష్టాలకి ఎవరిమీదా నింద మోపకుండా చెప్పింది. ఆలాగ యింతకాలం పోయిన తరువాత చెప్పడం నా చేతకాదు. అందుచేత నాకు తోచిన విధంగా చెప్తాను.

మరణశయ్యమీద లఖియా భర్తకు జ్ఞానోదయమయింది. లఖియా తల నిమురుతూ "నేను బ్రతికి వున్నంతకాలం నిన్ను నేను చాలా బాధ పెట్టాను లఖియా. నా తరువాతనైనా నువ్వు సుఖంగా వుండు. నా పాపాలు భార్య అయినందుకు నీకేమీ అంటకూడదని ఆఖరిసారిగా భగవంతుని ప్రార్థిస్తున్నాను. కంటతడివుంటే తుడవటానికి ప్రయత్నించు, నా భార్య వయినందుకు" అని చెప్పాడు. ఆ తరువాత రెండురోజులు బ్రతికాడు. అంతకంటె ఆనందకరమైన రోజులు తన జీవితంలో లేవని చెప్పింది

లఖియా. భర్త ఆదరం సంపాదించింది. భర్తను తనకు దక్కించమని ఎంతో ప్రార్థించింది. భర్త అనురాగం సంపాదించింది. కానీ భర్తనే కోల్పోయింది.

దైవం సన్మార్గుడైన భర్తనుంచీ లఖియాని వేరుచేశాడు. ఇంటినీ, యింటిలోని సామగ్రినీ అమ్మి భర్త అప్పులు తీర్చి అంత్యక్రియలు చేసింది. ఒక తెల్లటి చీర కట్టుకుని, ఇంకొక నాలుగు మూట కట్టుకుని, నుదుట కుంకుమ చెరిపివేసుకొని ప్రపంచంలో అడుగుపెట్టింది లఖియా. ఎక్కడకు వెళ్ళాలి? ఈ విశాల ప్రపంచంలో వుండటానికి ఒక యింటికప్పు చూపించే దాత ఎవరు? కట్టుకోవటానికి అయిదు తెల్లటి చీరలున్నాయి. తిండిలేకపోతే పస్తువుంటుంది. అందమైన స్త్రీ కోసం అర్రులుచాచే క్రూర మృగాలున్నాయి అరణ్యంలో వుండటానికి తలుపువున్న ఒక యిల్లు వుండాలి. అది ఎక్కడ లభిస్తుంది? చటుక్కున తల్లి ఒకనాడు ఆమెకు చెప్పినమాట జ్ఞప్తికి వచ్చింది— 'ఎప్పుడయినా కష్టాలలోవుంటే మామయ్య దగ్గరకు వెళ్ళమ్మా, కాదనడు' అని.

ఆ మామయ్య ఢిల్లీలో వున్నాడు. చాలాకాలం క్రితం చూచింది. అక్కడకు బయలుదేరింది. మామయ్య మేనకోడలికి చాలా ఆప్యాయంగా స్వాగతం చెప్పాడు. పాపం రెండు సంవత్సరాల క్రితం భార్య హఠాత్తుగా కాలం చేసింది. నలుగురు ఆడపిల్లల్ని, యిద్దరు కొడుకుల్ని భర్తమీద, గాలిమీద వదిలి. అప్పటినుంచీ యీయన అష్టకష్టాలూ పడుతున్నాడు. ఏళ్ళైపై ఏళ్ళు దగ్గిరకి వస్తున్నాయి. ఒక్కడు ఏం చెయ్యగలడు? ఒక వంటమనిషిని కుదుర్చుకున్నాడు. ఒక దాయిని పెట్టుకున్నాడు. అయినా తల్లిలేని ఆ అనాథలలో వదలేకపోతూన్నాడు. లఖియా కిదంతా చెప్పి కంట తడిపెట్టుకుని సిల్కు పంచతో తుడుచుకున్నాను. "నువ్వు వచ్చావు ఈనాడు. మీ అమ్మకి ఒకనాడు నేను మాట యిచ్చాడు. నీ కూతురుమీద ఈగ వాలకుండా చూస్తానని. ఆ మాట నేను నిలుపుకుంటాను. పవిత్రమైన స్మృతిలో మునిగి తేలుతూన్న నా భార్య. నీ సుగుణాలని పొగడటానికి ఒక నోరు చాలదనేది యింటి తాళం చెవులు నీకే యిస్తాను. ఇనప్పెట్టె తాళం చెవులు

నా దగ్గరే పెట్టుకుంటాను. ఎందుకయినా మంచిది. పాడు పట్టణం. ఢిల్లీలో దొంగలకీ, దొరలకీ తేడా తెలియదు" అన్నాడు.

లఖియా కరగిపోయింది. ఇంత మంచి మామయ్య ఉండగా తను చింతించవలసిన అవసరం లేదనుకుంది. "ఎందుకైనా మంచిది, మామయ్యా! ఘోషాణం తాళం చెవులుకూడా నీ వద్దే వుంచుకో" అని. అవి తీసి యిచ్చివేసింది. పిల్లలంతా ఈమెమీద ఎగబారేరు. చిన్నమ్మో చిన్నమ్మో అంటూ. అందరికంటె పెద్దవాడు—కృష్ణుడు కాలేజీలో మూడేళ్ళబట్టీ బి. ఎ. చదువుతున్నాడు. యింకొక రెండేళ్ళలో తప్పక ప్యాసవుతానని పదే పదే నొక్కి చెప్పాడు. పెద్దకూతురు సుజాత - పెళ్ళియీడు వచ్చింది. చాలా మంచిపిల్ల. అందంగానే వుంది. కానీ శరీరఛాయ నలుపు. కొద్దికాలంలోనే లఖియా హృదయం వశపరచుకుంది. మిగతా వారంతా పసికూనలు. ఎతతెరిపిలేని అల్లరి. భయం భక్తులూ బొత్తిగా శూన్యం.

ఆమె గుమ్మంలో అడుగుపెట్టిన వారం రోజులకి దాయి మానేసింది. యింకొక వారానికి వంటమనిషి వుద్యోగానికి స్వస్తి చెప్పింది. వీరిద్దరూపోగా ఒక నౌకరు మటుకు కుదిరాడు. వీడు చూడటానికి నిండుగా వుంటాడు. పనివరకూ వచ్చేటప్పటికి నీరసమంటాడు. కొంచెం పిల్ల సుజాత ఏమేమో చెప్పింది - తన తండ్రే కావాలని వారిద్దరినీ మానిపించివేశాడని. కాని అదేమీ నిజంకాదు. పాపం ఒక వారం రోజులు రాజధాని అంతా తెగ వెతికాడు. అలాంటివాళ్ళు వందయాపాయలు యిస్తామన్నా దొరకలేదు. ఆయన ఏం చేస్తాడు! యింటి చాకిరీ అంతా లఖియామీద పడింది. సుజాత సహాయం చేసేది. కాని అది యేమూల కొస్తుంది. ఇటు పసికూనలను చూడాలి, కృష్ణుడికి కాలేజీకి వంట చెయ్యాలి. మామయ్య ప్రతి చిన్నపనీ ఆప్యాయంగా తనచే చేయించుకుంటాడు. కాస్త పొద్దున్నే పూజ చేసుకుందామని కూర్చుంటే ఒక పసికూన బాకా తీసేవాడు. అంటువ్యాధి ఆ గదిలో అందరూ సోకేది. పిల్లలంతా "చిన్నమ్మా" అంటూ పరుగెత్తుకుని వచ్చి మీద పడేవారు.

అలాగే కాలం గడచిపోతూంది. సుజాతకి పెళ్ళి చేద్దామని మామయ్య వెదికేవాడు. ఎక్కడో ఢిల్లీలో కూర్చుంటే సంబంధాలు ఎక్కడనుంచీ వస్తాయి. చూచినవారు పెదిమ విరిచారు. ఆమె శరీర ఛాయ ఆమె శత్రువయిపోయింది. సుజాత కృంగిపోయేది. ఒకనాడు పెళ్ళికొడుకు వచ్చి చూచి కాదని వెళ్ళిపోయిం తరువాత కృష్ణుడు అన్నాడు-"నాన్నా, చిన్నమ్మలాంటి అందకత్తె మనయింట్లో వుండగా సుజాతకు పెళ్ళెలా అవుతుంది? పెళ్ళికొడుకు చిన్నమ్మకేసి వేలెట్టి చూపిస్తూంటే నేను చూచాను"

మామయ్య "నోరెముూయి, భడవా!" అని హూంకరించాడు. పెళ్ళికొడుకు చాటుగా కబురు పంపాడు-లఖియా అయితే అభ్యంతరం లేదని, పెళ్ళంటే అట్టే పట్టింపులేదని.

ఆ మాటలు విని లఖియా చాలా దుఃఖించింది. అప్పటినుంచి సుజాతని చూడటానికి ఎవరైనా వచ్చినప్పుడు ఆమె ఎక్కడో దాక్కునేది. అయినా పెళ్ళి కుదరలేదు. సుజాత దుఃఖానికి మేరలేదు. ఒకనాడు ఏడుస్తూ 'అసలు నేనెందుకు పుట్టాను చిన్నమ్మా? మూడు సంవత్సరాల క్రితం టైఫాయిడు జ్వరం తీవ్రంగా వచ్చింది. అప్పుడు నేనెందుకు చనిపోలేదు. దేముడు యీ చర్మానికి నలుపురంగు ఎందుకు పూశాడు? నాకంటే నల్లగావున్న అబ్బాయిలకి నేను ఎందుకు తగను' అని లఖియా ఒడిలో వాలిపోయింది. లఖియా బ్రతుకుమీద దుర్భరమయిపోయింది. సుజాతకు పెళ్ళి సంబంధం దొరకకపోవడంతో మామయ్య కూతురుని నానామాటలు అనేవాడు. అప్పుడప్పుడు ఆ కోపం లఖియా మీదకూడా ప్రసరించేది. లఖియా ఒకవైపున సుజాతని ఓదార్చాలి; యింకొకవైపున మామయ్య కోపం చల్లార్చాలి.

మామయ్య కృష్ణుడిని పెండ్లి చేసుకోమన్నాడు. ఏదో ఒకటైనా అయిపోతుందని, కట్నంకూడా వస్తుందని, సుజాతకి యివ్వటానికి పనికి వస్తుందనీ. కాని కృష్ణుడు ఒప్పుకోలేదు. నేను 'లక్ష్మిణినే పెండ్లి చేసుకుంటానన్నాడు ఒకనాడు.

మామయ్య "అలాగే చెయ్యరా నాకేమీ అభ్యంతరంలేదు" అన్నాడు.

కృష్ణుడు "ఎలాగ నాన్నా! రుక్మిణి బి. ఏ. ప్యాసయిపోయింది. నేను ప్యాసవకుండా ఆమె నన్నెలా పెళ్ళి చేసుకుంటుంది. నేనెలా చేసుకుంటాను?" అన్నాడు.

ఒకనాటి తెల్లవారుఝామున సుజాత లఖియాని లేపి ఒళ్ళోపడి ఏడ్వటం మొదలుపెట్టింది. లఖియా ఖంగారుపడుతూ "ఏం జరిగిందో చెప్పు సుజాతా! మామయ్య ఏమైనా అన్నాడా అన్నది. "కాదు పిన్నమ్మా, నేను నిన్ను వదలి వెళ్ళిపోతున్నాను" అని బావురుమంది. "ఎక్కడికి సుజాతా? నాకు అంతా చెప్పు" అంది.

"ఇంక ఈ యింట్లో నేను వుండలేను చిన్నమ్మా! నేను యీ యింటిలో అందరికీ అంటరానిదాని నయ్యాను. నువ్వొక్కత్తివే నన్ను ఆదరించావు. మళ్ళీ జన్మలో నీ కడుపున పుట్టి నీ ఋణము తీర్చుకుంటను" అంది. ఇంతలో కిటకీవద్దనుంచీ 'సుజాతా' అని ఒక మగ గొంతు వినబడింది. అప్పుడు సుజాత "వారు పిలుస్తున్నారు. ఇక నేను వెళ్ళిపోతాను చిన్నమ్మా!" అంది. లఖియా ఆశ్చర్యానికి మేరలేదు. అంతవరకూ సుజాతకి కోపం వచ్చిందని, కాస్త బుజ్జగించితే యదాస్థితికి వస్తుందనుకొంది. సుజాత ఒక పురుషునితో పారిపోతుందని కోలేదు.

లఖియా "వారు ఎవరు సుజాతా? నాకు అంతా చెప్పు. కంగారులోనూ, కోపంలోనూ ఏపనీ చెయ్యకూడదు" అంది.

"అంతా నీకు తరువాత తెలుస్తుంది చిన్నమ్మా! నా నోటితో నేను అవంతా చెప్పలేను. నారాత ఎలా వ్రాసివుందో అలా అనుభవిస్తాను. నా గురించి నీవేమీ బాధపడకు. నన్ను ఆఖరిసారి ఆశీర్వదించు చిన్నమ్మా!" అంది.

మళ్ళీ బయటనుంచీ పురుషకంఠం 'సుజాతా' అని పిలిచింది. ఆ ధ్వనిలో కాస్త విసుగుబాటుకూడా వుంది.

సుజాత లక్షియా ఆశీర్వాదం లభించకుండానే బయటికి గబగబా వెళ్ళిపోయింది. రెండవ పిలుపుకి రాకపోతే వెళ్ళిపోతానని చెప్పాడేమో.

లక్షియాకి కాస్సేపటివరకూ జరిగిందంతా పూర్తిగా అర్థంకాలేదు. సుజాత అంత సాహసం చేస్తుందని ఆమె అనుకోలేదు. మామయ్యకి చెప్పటమా, మానటమా అని ఆలోచించి చివరికి చెప్పకూడదనే నిశ్చయించింది.

సుజాత ఎవరో ఒక పురుషునితో లేచిపోయింది. ఎవరా పురుషుడు? సుజాత ఎక్కడా ప్రేమకలాపాలు సాగించినట్లు లక్షియాకు ఏ కోశానా తెలియదు. ఇంత హఠాత్తుగా యిది ఎలా పరిణమించింది?

మామయ్య ముందర విచారించాడు. సుజాత ఆత్మహత్య చేసుకుందని. కాని ఆమె శవం ఆ చుట్టుపక్కల ఎక్కడా తేలలేదు. జమునలో కూడా ఎక్కడా తేలినట్లు పోలీసులు రిపోర్టు చెయ్యలేదు. సుజాత మాయమైన మరునటిరోజునుంచీ వారి నౌకరు రావటం మానేశాడు. వాకబుచేస్తే వాడుకూడా ఆరాత్రే అంతర్ధానమయ్యాడని తెలిసింది. వాడి చర్మం రంగు తెలుపు. మామయ్య కోపానికి అంతులేదు. జమునలో దూకినా బాగుండునన్నాడు. మచ్చలేని వారి కుటుంబానికి మాయని మచ్చ కలిగించిందన్నాడు. కృష్ణుడు చెల్లెలి ధైర్యానికి ఆశ్చర్యపోయాడు. రుక్మిణికి చెల్లెలకు వున్నంత ధైర్యం లేదని విలపించాడు.

సుజాతను నేను ఎన్నడూ చూడలేదు. ఇకముందు చూస్తాననే ఆశకూడా లేదు. లక్షియా ఆమె కథ చెప్పినప్పుడు ఆమె సరియైన పని చేయలేదనుకున్నాను. అతగాడు ఆమెని వివాహం చేసుకొన్నాడనుకోవటానికి అవకాశాలు చాలా తక్కువ అలాంటి సందర్భాల్లో ఆ విధంగా చాలా అరుదుగా జరుగుతాయి. సుజాత యింటినుంచీ బయటికి వచ్చిన క్షణంనుంచీ తన సమాజం, తండ్రి, భవిష్యత్తూ అన్నీ కాలదన్నింది. సంఘం గీచిన గీటు దాటింది. ఇక దానికి తిరుగులేదు. ఇవన్నీ ఒక పురుషుడి కోసం వదిలింది. ఇక ఆమెకు అతనే ఆధారం. కాని అతగాడికి అలాకాదు. ఆ మరునాడు అతడు సుజాతను వదలి సమాజంలో

తిరిగి ప్రవేశిస్తే చేతులు జాపి చేరదీస్తుంది. అదే సుజాత తనతప్పు తెలుసుకుని మళ్ళీ వస్తే కుక్కలను పురిగొల్పి తరిమివేస్తుంది. కులట, పాపి, కళంకిని అనే పదాల్ని విరివిగా వెదజల్లుతుంది. దైవంకూడా అలాంటి స్త్రీల ఎడ కరుణ, కనికరం చూపించడు. పురుషుల పాపాల నెన్నిటినైనా కప్పివేస్తాడు. బయటకు వాటి సూచనలేమీ వుండవు. స్త్రీకి మాతృత్వాన్ని ప్రసాదిస్తాడు. దానితో ఆమె తప్పులన్నీ బయటపడు తాయి. స్త్రీ సాధారణంగా మాతృత్వంకంటె ఎక్కువగా మరేమీకోరదు. తన బిడ్డను లాలించటంకంటె మిన్నగా ఆమె ఆశించేది మరొకటి వుండదు. కాని యిలాంటి పరిస్థితిలో మాతృత్వం ఆమెకొక శిక్ష. తల్లి కాబోతున్నదనే విషయం తెలిసిన వెంటనే అతగాడు ఆ రాత్రి పలా యనం చిత్తగిస్తాడు. హోటలు బిల్లు చెల్లించకుండా అతడు ఎంతమంది స్త్రీలనైనా తల్లులను చేయగలడు.తను ఎన్నడూ తల్లి కాలేడుగా.అందరూ యిలాంటివారని నేనెన్నడూ అనను. అలా అయినట్లయితే లఖియాతో నేను తరువాత చెప్పినట్లు తల బద్దలుకొట్టుకుని ఆమెవద్ద చచ్చేవాడిని. ఇలాంటి స్త్రీలుకూడా వుంటారు. తేడా ఏమిటంటే, వీరు బయటపడ తారు; పురుషులు బయటపడరు-అంతే.

ఏమయితేనేం, సమాజంమీద సుజాత తన కక్ష తీర్చుకుంది. తన చర్మం నల్లగా వుందని వెళ్ళకొడుకులంతా ఆమెని తిరస్కరించారు. అందుచేత ఒక తెల్లటి పురుషుని తీసుకుని ఆమె యింట్లోనుంచి బయట పడింది. ఆ పురుషుడు ఒక నటుడు. నౌకరయినా ఫరవాలేదు. ఆమె అదృష్టం బాగుంది. అతడు మంచివాడేమో, ఆమెని ఆదరించి ఆమె జీవి తం సుఖవంతం చేసేదేమో. అవును, అలా ఎందుకు కాకూడదు.చెడుగా ఎందుకు భావించాలి మనము. కాని నా మనస్సు ఎందుకో అశుభాన్నే సూచిస్తూంది. ఆ జరిగినదాని తీరు, విరుద్ధమైనదాని సూచించటంలేదు. అలాంటి అభాగినుల గురించి పిన్నప్పుడు మనము చేయగలిగింది ఒక్కటే. కష్టాల్లోకూడా తోటి మానవులను ఏవగించుకోకుండా వుండా లని ప్రార్థించటమే.

సుజాత యిల్లు వదలటంలో లభిస్తున్న ఒక్క సహాయం,

ఓదార్పు కోల్పోయింది. సుజాతను చూచే ఆ బరువంతా మోయగలిగింది. కాని ఏం చేస్తుంది. అలాగే కాలం గడుపుతూ వుంది.

ఒకనాడు మామయ్య లఖియా గదిలోనికి వచ్చి "చూడు లఖియా! నువ్వు మాకొక దేవతలా దొరికావు. ఇన్నాళ్ళూ నువ్వు యీ యింటి భారమంతా వహించావు. నువ్వు లేకపోతే ఏమి జరిగివుండునో ఊహించటంకూడా కష్టం. మా కుటుంబంలో ఒక వ్యక్తిగా మెలిగావు. నువ్విక్కడ శాశ్వతంగా వుండిపోతే ఎంతో ముదావహంగా వుంటుంది. ఏమంటావు?" అన్నాడు.

మామయ్య ఎంత మంచివాడు. లఖియా హృదయమంతా కృతజ్ఞతతో నిండిపోయింది. "ఇదంతా నీదయ మామయ్యా! అలాగే చేస్తాను. నాకు నువ్వుతప్ప యింకెవరున్నారు" అంది.

ఇంత త్వరగా ఒప్పుకునేసరికి మామయ్య కాస్త కంగారుపడ్డాడు. "చాలా సంతోషం. అయినా చూడు. దగ్గర చుట్టరికంలేందే ఎల్లకాలం వుండిపోతే నలుగురూ నాలుగు విధాలూ అనుకుంటారు అందుచేత నువ్వు........" అని మామయ్య ఆగిపోయాడు.

లఖియాకు యేమీ అర్థంకాలేదు నెమ్మదిగా వెళ్ళిపొమ్మంటున్నాడనుకుంది. "ఏమిటి మామయ్యా! ఏమిటి చేయమంటావు" అంది.

"చూడు లఖియా! నీకేమంత వయస్సు మించిపోలేదు. అయినా వయస్సులో యేముంది. అందుచేత నిన్ను నేను........నిన్ను యింటి యజమానురాలిని చేస్తాను. అలాగయితే నువ్విక్కడే వుండిపోవచ్చు. ఎవ్వరూ నోరు విప్పలేరు" అన్నాడు.

లఖియా నోటివెంట మాట రావటంలేదు. రాతి బొమ్మలా చూస్తూంది. మామయ్య మాటల స్ఫూర్తి అర్థం తెలిసేటప్పటికి కొంతసేపు పట్టింది లఖియా మాట్లాడకపోయేసరికి మామయ్య ఉత్సాహం హెచ్చింది.

"నాకు తెలుసు యిది నీకిష్టమేనని. వచ్చేనెల మంచి ముహూర్తాలున్నాయి" అన్నాడు.

లఖియా చెవులు గట్టిగా మూసుకుని "మామయ్యా, చాలు. ఇక

అలా మాట్లాడకు. నేను నీ కూతురులాంటి దానిని. నన్నిలా అవమానం చేస్తావా ?" అని బయటకి వచ్చేసింది.

మామయ్యకు ఎవరో చెప్పివుంటారు-స్త్రీలు కాదంటే అవును, అవునంటేకాదు అని. అందుచేత ఆయన నిరుత్సాహపడలేదు. దాని ఫలితం యేమిటంటే ఆ మరునాటి రాత్రి నళ్ళీ తన నాలుగు చీరలు మూట కట్టుకుని యింటిలోంచి బయటికి వచ్చేసింది. అభాగిని లఖియా, మామయ్య పోలీసులకు రిపోర్టుయిచ్చి తనను తిరిగి తీసుకుపోతాడేమో నని భయపడింది. తరువాత మూడురోజులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని తిరిగింది. పోలీసు కనబడితే శరీరం వణికేది. ఢిల్లీపట్టణంలో ఎక్కడని వెతుకుతాడు మామయ్య. అందుకని వదలివేసి వుంటాడు. చివరకు ఎవరో పుణ్యాత్మురాలు దయతలచి యిలాంటి ఆశ్రమాల గురించి చెప్పి వెళ్ళటానికి కావలసిన డబ్బు యిచ్చింది. లఖియాకి జీవితంలో సహాయం చేయగల యిద్దరిలోని ఈ అజ్ఞాతస్త్రీ ఒకామె - రెండవది నరక. నేను ఎప్పుడూ ఏమీ చేయలేకపోయాను.

తిరిగి తిరిగి చివరకు యిక్కడకు చేరింది. గురువుగారు ఎంతో దయతో ఈమెను ఆశ్రమంలో చేర్చుకున్నాడు. జరిగిందంతా చెప్పి లఖియా అంది - "మామయ్యని వదలిపెట్టి రావటం సరియైనదా కాదా" అని. యిప్పటికీ నేను అనుమానపడుతూనేవున్నాను. మామయ్య మంచివాడే. క్షణమాత్రం ఏదో పాడుబుద్ధి పుట్టింది. వేచివుంటే తన తప్పు తెలుసుకునేవాడు. ఇంట్లో ఆడదిక్కులేదు. తరువాత ఎంత కష్టపడ్డాడో ఆ పిల్లలతో పాపం? మామయ్య నాకెంతో సహాయం చేశాడు. ఆయనకి ఈ విధంగా ప్రతిఫలం చూపించాను.

ఆ మాటలు వింటూంటే నన్ను నేను సంబాళించుకోలేక పోయాను. కోపంతో అన్నాను - "చాలు లఖియా యింక అలా మాట్లాడకు ! లేకపోతే నేను బయటికి వెళ్ళిపోతాను"

లఖియా బిత్తరపోయి - "ఏమిటి రామబాబూ నేనేమన్నాను ?" అంది. నాకు దుఃఖము ముంచుకొచ్చింది. "యింత అమాయకురాలివి

ఈ ప్రపంచంలో నీకు ఎలా గడుస్తుంది లక్షియా ?" లేకపోతే నువ్వ నేదేమిటి ? ఆ మామయ్యతో వుండకపోవటం నీ తప్పంటావా ? నువ్వు పడిన ఈ కష్టాలు యింకొక స్త్రీ పడినట్లయితే పురుషధంటేనే అస హ్యించుకుంటుంది. పురుషజాతి తరుపున నిన్ను వారినంతా క్షమించ మని వేడుకుంటాను. నీకు జీవితంలో తారసిల్లిన వారంతా చాలా అన్యా యం చేశారు. అయినా అందరూ అలాంటివారు కాదు, లక్షియా. లేక పోతే నేను యిక్కడ తల బద్దలు కొట్టుకుని చస్తాను" అన్నాను.

లక్షియా నా ఆవేశానికి చాలా ఆశ్చర్యపోయింది. కొంచెంసేపు మాట్లాడలేదు. ముఖంమీద ఎప్పుడూ వెలిగే ఆ మందహాసం మాయ మయింది. మేఘావృతమైంది. తరువాత నెమ్మదిగా అంది — పురుషు లంతా అలాంటి వారని నే నెప్పుడూ అనుకోలేదు. వారినిగురించి కూడా నేను చెడుగా భావించటంలేదు. పరిస్థితుల ప్రాబల్యంవల్ల మనము అనేక పనులు చేస్తాము. నా జీవితంలో తటస్థపడ్డ వ్యక్తులంతా మంచి వారే. ఎవర్నికూడా చెడ్డవారనటానికి కారణం లేదు" అంది నా ఆవే శానికీ నేను కాస్త సిగ్గుపడ్డాను. లక్షియా చెప్పిందే నిజమేమో ? మామయ్య మంచి ఉద్దేశ్యంతోనే అలా చేశాడేమో ?

"అయితే మామయ్య పేరు ఏమిటో చెప్పు లక్షియా ! ఈసారి అక్కడికి వెళ్ళినపుడు వారికి నా నమస్కారాలు చెప్పుకుంటాను" అన్నాను. లక్షియా నవ్వుకుంటూ "వద్దు మీ నమస్కారాలు ఆయన యింటికి వెళ్ళి చెప్పనక్కరలేదు. యిక్కడనుంచే చెప్పండి. నాకు తెలుసు మీరు యిలా అంటారని. అందుకనే పేరు చెప్పలేదు" అని కాస్సేపాగి,

"అయినా మీరు వారిని దోషిగా పరిగణించకండి. రామబాబూ ! వారి తప్పు అట్టే లేదేమో. ఆ పరిస్థితులలో చాలామంది అలాగే చేస్తా రేమో" అంది.

"వద్దు లక్షియా, మళ్ళీ అలాంటి మాటలనకు" అన్నాను.

లక్షియా కాస్త బాధపడుతూ "నేను మిమ్మల్ని అలాంటి వారితో ఏమీ పోల్చడంలేదు రామబాబూ ! అది ఎలాంటి తప్పిదమో నాకు

తెలుసు. నేను అనేదేమిటంటే, కూతురుని కోల్పోయిన తరువాత అడ దిక్కులేక బాధపడుతూన్న సమయంలో మామయ్య నోరుజారి ఆమాట లన్నాడు. అది పరిస్థితుల ప్రభావం. ఆయన తప్పుకాదు" అంది.

"సరే! లక్షియా, నీలో యింత ఔదార్యమూ, క్షమాశక్తివున్న ప్పుడు నేను అడ్డురాను. జీవితంలో మానవుడు నీకు చేయగలిగిందేదైనా ఉంటే నువ్వు మొదట అడగవలసిన వాడిని నేను!" అన్నాను.

"అవసరంవస్తే అలాగే చేస్తాను. రామబాబూ! ఇక వెళ్ళండి మీరు. సుందరి తిరిగివచ్చే వేళయింది" అంది.

అవును. నిజమే యశో మాటే మరచిపోయాను.

# 16

కాలం దొర్లిపోతూంది. జీవితం సుఖంగా ఆహ్లాదకరంగా నడచి పోతూంది. యశో-లక్షియా వీరిద్దరూ నాకు యేమీ లోటు రానిచ్చేవారు కారు. ఈ యిద్దరి స్త్రీలలోనూ ఎన్ని పోలికలున్నాయి. ఎంత వ్యత్యాస ముంది. ఇద్దరూ సహృదయులే. ఒకామె విధవ, ఇంకొకామె అవి వాహిత ప్రేయిసి. ఒకామెలో శాంతమూ, సహనమూ మూర్తీభవిం చాయి. ఇంకొకామెలో సహనం వుంది. శాంతిలేదు. (యశో ఉత్తరంలో యిదే రాసింది) ఒకామె జీవితంలో చెప్పరాని కష్టాలుపడింది, లోకం చాలా అన్యాయం చేసింది ఆమెకు. అయినా ఆమెలో కోరికలులేవు. క్రోధం అసలేలేదు. ఎవరిమీదా యీర్ష్యలేదు. కక్ష అసలేలేదు. ఇంకొ కామె జీవితంలో కష్టాలను చవిచూడలేదు, అయినా శాంతితో బాహ్య ప్రపంచకాన్ని కాలదన్నింది. ఈమెలో కోరికలు దాగివున్నాయి. ఒక వ్యక్తి రాకలో అవి తిరిగి తల ఎత్తుతున్నాయి. కోపంవుంది. ఈర్ష్య లేదు. ఒక్కమాటలో ఒకామెసర్వస్వాన్ని హృదయపూర్వకంగా త్యజిం చింది. ఇంకొకామె త్యజించాలని ఆశిస్తూ వుంది. కానీ సాధ్యపడటం

లేదు. అలా చేయవలసిన కారణంకూడా నాకు కనబడదు. ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి అమితమైన ప్రేమా, పూర్తి విశ్వాసమూ వున్నాయి.

పగలల్లా యశోకి ఏమీ తోచక వుండేదికాదు. నాకు సేవ అన్నీ సమకూర్చడమూ, గురువుగారికి సేవ చెయ్యడంతో సరిపోయేది. రాత్రిళ్లే మాకు కులాసాగా కబుర్లు చెప్పుకోవడానికి వీలు దొరికేది. వెన్నెల రాత్రులలో గంగ ఒడ్డునకు వెళ్ళేవాళ్ళము. గంగ ఇంకా కొంత దూరంలో వుందనగానే యశోకి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చేది. నా చెయ్యి పట్టుకుని లాగుతూ పరుగెత్తేది. నల్లతాచులాంటి జడను ముందువేసుకుని, తామరతూడుల్లాంటి చేతులు నా భుజాలమీద వేసి కిలకిల నవ్వుతూ, "బాదల్ బాబూ" అని కళ్ళల్లోకి చూస్తూ, తెల్లని లతలాంటి ఆ చేయి, మృదువైన ఆ వంకీలు, పల్చని ఆ చర్మంలోంచి తొంగి చూసే ఆ నీలి నరాలు నన్ను సమ్మోహితుని చేసేవి. సన్నగా, నున్నగా వున్న ఆ బాహువులను చూస్తుంటే ఒళ్ళు పులకించేది. [illegible]మితే లోపల నరాలు బయట పడతాయేమో ననిపించేది. స్త్రీ సౌందర్యానికి ఎవరు ముగ్ధులవలేదు? ఎంతమంది కవులు కొనియాడలేదు? ఎంతమంది చిత్రకారులు చిత్రించలేదు?

ఒకసారి అడిగాను—"నీ చేతుల గాజులు ఏమయ్యాయి యశో?" అని. చేతులు పూర్తిగా బోడిగా వున్నాయి.

యశో నవ్వుతూ—"అన్నింటితోపాటు అవీ పోయాయి బాదల్ బాబూ. ఇప్పుడు వాటిపని ఏముంది చెప్పండి?" అంది.

"అయితే బంగారం కూడా అమ్మేశావా? అమ్మా!" అన్నాను.

"అమ్మలేదు. అవసరంకోసం దాచాను" అంది నవ్వుతూ.

పౌర్ణమినాడు నిజంగానే పిచ్చెక్కేది యశోకి. గాలిలో తేలి పోతూ—"నన్ను పట్టుకోండి చూద్దాము"ని లేడిలా పరుగెత్తేది. కాళ్ళలో చీరపడి ఇసుకలో క్రిందపడి "నన్ను లేవదీయండి" అనేది.

ఇలాంటి యువతి సన్న్యాసిని ఎలా కాగలదు? ఒక వెన్నెల రాత్రిని వదులుకోలేని ఈమె సర్వస్వాన్నీ ఎలా త్యజించగలదు?

అయినా ఆమె నియమాలన్నింటినీ పాటించేది. పొద్దున్నే నదిలో స్నానం చేసి కోసిన పూలతో పూజా, గురువుగారి సేవా, వుపవాసాలూ అన్నీ క్రమబద్ధంగా ఆచరించేది. అయితే ఈమెలో ఏమైనా అంత ర్యుద్ధం జరుగుతోందా ?

గురువుగారు మళ్ళీ ఆయనను కలుసుకోమని ఆహ్వానించారు. దానిని పురస్కరించుకుని ఒకసారి యశోతో ఆయనవద్దకు వెళ్ళాను. ఈసారి గుమ్మంవద్ద వుండగానే ఆహ్వానం వచ్చింది. నా వెనుక కాస్త పరికించి చూచారు స్వామీజీ ; సరళ జాడలేమైనా కనబడుతాయేమోనని.

లేదని తెలుసుకుని చిరునవ్వుతో "రా నాయనా, కూర్చో" అన్నారు. ఎక్కడ కూర్చోను ? అక్కడ ఏమీ ఆసనం, కనీసం చాప కూడాలేదు. యశో నేలమీద కూర్చొని నన్నుకూడా అలాగే చెయ్యమని సంజ్ఞ చేసింది. నేను యింకా సందేహిస్తూంటే యశో నా జేబులోంచి రుమాల తీసి క్రిందవేసింది. ఏంచేస్తాను ? అలాగే కూర్చున్నాను. కాస్సేపు గురువుగారు మాట్లాడలేదు. సరళ చెప్పింది. ఆ గెడ్డం ఒకసారి లాగిచూడమని. నాకు ధైర్యం చాలలేదు.

"నీ కిక్కడ కాలం ఎలా గడుస్తూంది నాయనా ?" అన్నారు.

"బాగానే గడుస్తూంది స్వామీ !" అన్నాను వినయంగా.

"నువ్వు మామూలుగా ఏమి చేస్తూంటావు నాయనా !" అన్నారు.

"ఏమి చెయ్యను స్వామీజీ !" అన్నాను.

సంభాషణ ఏమిటి యిలా నడుస్తూంది ? యశో నాకేసి చిరాకుగా చూస్తూంది. ఏదో మాట్లాడాలనే ఆతురతలో తప్పు ప్రశ్న వేశాను.

"తమకు జ్ఞానోదయం ఎప్పుడు కలిగిందో, ఎలా కలిగిందో చెప్పండి స్వామీజీ !" అన్నాను.

గురువుగారు ఆ ప్రశ్న కోసమే ఎదురు చూస్తూన్నారు. తడుము కోకుండా మొదలుపెట్టారు.

"నా యిరువది అయిదవ ఏట కలిగింది నయనా! అంతకు రెండు సంవత్సరాల క్రితం వివాహమయింది. వివాహమయిన మరునటి దినం

నుంచీ నాకు తుచ్ఛ ప్రాపంచక భోగాలంటే విరక్తి కలిగింది. మానవుడు ఎందుకు పుట్టాడు ? ఎక్కడకు పోతాడు ? జీవితంయొక్క అర్థమేమిటి ? ఈ ప్రశ్నలతో సతమతమయ్యేవాడిని. భార్యమీద వున్న మమకారం ఒక్కటే నా దారికి అడ్డువచ్చేది. ఇలా వుండగా నాకొక పుత్రుడు పుట్టి ఆరు నెలలకి పోయాడు. ఆ దుఃఖంతో నా భార్యకు మతి పోయేటంత పనయింది నాకు జీవితంమీద విరక్తి పుట్టింది. ఎక్కడకు పోయాడు నా పుత్రుడు ? నేను జీవించి వుండనా ? ఆ ప్రశ్నకి సమాధానం కోసం యిల్లు వదలి వచ్చేశాను. ఆ ప్రశ్నకి సమాధానం ఎలా దొరికిందో తెలుసుకోవాలనే కుతూహలం నాలో లేదు"

"మీకు జ్ఞానోదయం చాలా ఆలశ్యంగా కలిగింది గురూజీ ! అది మీకు వివాహం కాకముందు జరిగినట్టయితే చాలా బావుండును" అన్నాను.

"యెందుచేత నాయనా ?" అన్నారు.

"మీ సుఖంకోసం మీ భార్య సుఖం త్యాగం చేశారు కదా ? అది తప్పుకాదా ? ఆ తరువాత ఆమె గతి ఏం కాను ? అది ఆలోచించారా ? మనము ఏపని చేసినా దానివలన మనకు సుఖము లభించినా, యితరులకు అన్యాయం చెయ్యకూడదనే సూత్రం మంచిదికాదా ? గురూజీ !" అన్నాను. నా మనస్సు పుత్రశోకంతో బాధపడుతున్న ఆ తల్లి, భర్త త్యజించటమనే గొడ్డలి పెట్టుకు ఎలా తట్టుకుందా అని ఆలోచిస్తూంది. అందరికీ చెప్పినట్టే తన కథను, తన త్యాగాన్ని అనర్గళంగా చెప్పుక పోదామనుకున్నారు గురువుగారు. అడ్డుప్రశ్న వేసేసరికి కాస్త కంగారుపడ్డారు.

అయినా తన మేధాశక్తి నంతా ఉపయోగించి - "ఆవిధంగా యోచిస్తే మనము ఏ పనీ చెయ్యలేము నాయనా ! మహానుభావుడు గౌతమబుద్ధుడు ఏం చేశాడు" అన్నారు.

నాకు నిజంగానే కోపం వచ్చింది ఈసారి — "బుద్ధుడు పుత్రశోకంతో ఉన్న భార్యని వదలి రాలేదు స్వామిజీ. తోటి ప్రజల కష్టాలు చూచి సర్వం త్యజించాడు. తన కష్టాలకోసంకాదు. అన్నీ వున్నా లోక

గురువుగారు లేచి నించుని "అవును నాయనా. రణానికి చాలు. ఇంకా యిక్కడ ఎన్నాళ్ళు వుంటావు నాయనా!" అన్నారు.

"ఆ విషయం నాకు సరిగా తెలియదు స్వామీజీ!" అన్నాను.

యశో కేసి చూస్తూ "సరే మంచిది. తరువాత కలుసుకుందాము." అని లోపలికి వెళ్ళిపోయారు. యశో కూడా ఆయనవెంట వెళ్ళిపోయింది. నాతో ఒక్కమాటయినా మాట్లాడలేదు. గురువుగారితో నా సంభాషణ ఆమెకు కోపం తెప్పించిదని తెలుస్తూనే వుంది. గురువుగారిమీద ఆమెకు అమితమైన గౌరవమూ, విశ్వాసమూ వున్నాయి నేనెందుచేత అలా పరిగణించలేక పోయాను? యశోకంటె సరళ అభిప్రాయాలకి, నా అభిప్రాయాలకి దగ్గర సంబంధం కనబడింది. దీనివలన ఆమెకు క్షోభ కలుగుతుందని నేను గ్రహించాను. అసలు ఈ గురువుగారిని తిరిగి కలుసుకోవటమే నా తప్పిదం. ఇక మళ్ళీ ఆయనవద్దకు వెళ్ళకూడదని నిశ్చయించాను.

వేమన పంచాయతీ గ్రంథాలయం, తేలప్రోలు :: కృష్ణా జిల్లా

# 17

నాను రాను గురువుగారిమీద అపనమ్మకం హెచ్చింది. అంతేకాక కాస్త యీర్ష్యకూడా వుందేమో? నామాటకంటే గురువు మాటకు యశో ఎక్కువ విలువ యిచ్చేది. ఎప్పుడూ ఆయన మాట జవదాటదు. సేవకు లోటు రానిచ్చేదు కాదు. తనమీద యింత అధికారం ఎలా వచ్చింది ఈయనకి?

అదీగాక గురువుగారిని కలుసుకున్న మరునటిదినం నుంచీ యశో వర్తనలో మార్పువచ్చింది. పూర్వమంత శ్రద్ధా, మమకారమూ నా ఎడ చూపించటంలేదు. రాత్రిళ్ళు అస్వస్థంగా పడుకున్నా ఏమీ అనేది కాదు. భోజనం సరిగ్గా చెయ్యకపోయినా పట్టించుకునేదికాదు. రాత్రిళ్ళు

ఏమైనా సరదాగా మాట్లాడుదామనో, గంగవొడ్డుకు వెళ్దామనో నేనంటే "నిద్రొస్తుంది. అలసిపోయాను" అనేది. ఆ ప్రవర్తనకి కారణం నాకేమీ కనబడలేదు. మనస్సులో కాస్త బాధపడేవాడిని. లక్ష్మియాకూడా సంగతి కొంచెం గ్రహించినట్లు కనబడింది. కాని ఆమెకూడా ఏమీ అనలేదు.

అప్పుడప్పుడు సరళ వచ్చేది. ఆమెతోకూడా నేను పూర్వమంత చనువుగా వుండేవాడినికాను. ఆమెమటుకు యథాప్రకారంగానే వుండేది. వీటినన్నింటినీ చూచి నేను అప్పుడప్పుడు భయపడేవాడిని. భవిష్యత్తులో ఏం కాబోతుంది ? నాకు ఎంత నమ్మకం లేకపోయినా గురువుగారి మాటలు తలపుకు వచ్చేవి. ఆ దుష్ట మాటలు ఏపాటిశక్తి చెప్పించం దీయనచేత ? యశో ఏదో ప్రాయశ్చిత్తం చేస్తానంది. అది ఏమిటో నేను ఎప్పుడూ అడుగలేదు. ఆమె చెప్పనూలేదు. ఈ గురువుమీద ఆమెకున్న నమ్మకం చూస్తుంటే మనస్సు పరిపరి విధాల పోయేది.—చివరకు ఏం జరుగుతుంది ?

కాలం గడిచేకొద్దీ యశో నాకు దూరమవజొచ్చింది. ఇద్దరమూ ఒకే యింటిలో, ఒకే గదిలో వుంటూన్నా పూర్వపు చనువంతా మాయమైంది. నా సదుపాయాలకు లోటు అట్టే రానిచ్చేది కాదు. కాని అంతే. తన హృదయపు ద్వారబంధనాలన్నీ మూసివేసింది నానుంచీ. నేను అప్పుడప్పుడు వాటిని తెరవటానికి ప్రయత్నించాను. కాని అది నాశక్యం కాలేదు. యశో కూడా ఏవో ఆలోచిస్తూన్నట్టు కనబడేది. మసక చీకటిలో అప్పుడప్పుడు కళ్ళు తుడుచుకుంటున్నట్లు కూడా కనబడింది.

ఒకసారి సరళ వచ్చింది. వెళ్ళిపోయేముందు "నాతో ఈసారి వచ్చి కొన్నాళ్ళు మాయింట్లో అక్కడ వుండకూడదూ రామబాబూ !" అంది. యశో అక్కడేవుంది. నాకేమనటానికి తోచలేదు. మామూలుగా యశో జవాబు చెప్పేది. కానీ ఈసారి ఏమీ అనలేదు. నాకు కొంచెము కోపం వచ్చింది. సరే అందామనుకుంటే లక్ష్మియా అంది. "అదెలా సాధ్యపడుతుంది సరళా ? వారు సుందరిని విడిచి ఎందుకుంటారు? ఇంత దూరం వచ్చింది అందుకోసమేగా ? ఏమంటావు సుందరీ ?"

యశో నీరసంగా నవ్వుతూ "అదే మంచిది లఖియా" అంది. సరళ నావైపు చూచి నవ్వింది. సంగతి ఆమెకూడా గ్రహించింది. ఇంకా కొన్ని దినాలు గడిచిపోయాయి. యశో ప్రవర్తనలో ఏమీ మార్పు రాలేదు. అలా ఎన్నాళ్ళు ఒకే యింట్లో అతిధిగా వుంటాను? ఏమయినా యశోని అడగాలని నిశ్చయించుకున్నాను.

ప్రతి రోజూ యశో పక్క వేసేది. ఒకనాటి రాత్రి నేనే వేసుకోవటం మొదలుపెట్టాను. యశో కాసేపు చూస్తూ వూరుకుంది. తరువాత దగ్గరకువచ్చి - "నేను వేస్తాను వుండండి" అని తను వేయటం మొదలుపెట్టింది.

నేను మాట్లాడలేదు. అలాగే అక్కడ నుంచుని వున్నాను. పక్క వేసి వెళ్ళిపోతూంటే యశో చెయ్యి పట్టుకున్నాను. ఆమె కాసేపు అలాగే వుండనిచ్చి "వదలండి" అంది పక్కకు చూస్తూ. ముఖం నాకు కన బడకుండా వుండాలని ప్రయత్నిస్తూంది.

నే నన్నాను — "నీ వింత ప్రవర్తనకి కారణం చెప్పేవరకూ నేను చెయ్యి వదలను" అన్నాను.

యశో చెంపమీద కన్నీరు కారుతూంది. చెయ్యి లాక్కుంటూ — "వదలండి నన్ను నిష్కారణంగా ఎందుకు ఏడిపిస్తారు? నేను ఏమి చేశాను మిమ్మల్ని? మీదేమైనా రాతిగుండా? వదలండి" అంది. ఆ మాటలూ, ఆమె పరిస్థితి చూచి నిశ్చేష్టుడనయి, చెయ్యి వదలివేశాను. యశో రివ్వున పక్కమీదపడి ఏడ్వటం మొదలుపెట్టింది. నాకు ఏమి చెయ్యాలో తోచలేదు.

నెమ్మదిగా దగ్గరకువెళ్ళి 'యశో' అన్నాను. యశో ఏడుస్తూనే అంది - "దయయుంచి నన్ను వదలిపెట్టండి సాదల్ బాబూ! మీరు యింకా ఏమయినా అన్నారంటే బయటకు వెళ్ళిపోతాను."

ఇంక నేనేమి చేస్తాను?

యశో పూర్తిగా మారిపోయింది. అవసరం వస్తేగాని మాట్లా డేదికాదు నేను అనేక సంశయములతో బాధపడేవాడిని. నేను అక్కడి

వాడు. అంత్రే నేను వచ్చి అదంతా పటాపంచలు చేశాను. హృదయంలో అణగారిపోయిన కోర్కెలు చిగిర్చాయి. ఆగిపోతూన్న నిప్పు తునక లను దగ్గరచేర్చి మంటచేశాను. దాని ఫలితమే యిది. పైగా గురువుగారు మొదటనే శపించారు. ఆమెకి అక్కడి జీవితం నచ్చిందనటానికి సందే హంలేదు. ఆ ఆశ్రమంలోనే జీవితాంతం వుండిపోదామని ఆమె అను కున్నదనే విషయం నాకు తెలుసు. ఇవన్నీ ఈనాడు తారుమారవుతాయా?

అయితే నేను ఏం చెయ్యాలి? చాలాసేపు ఆలోచించాను. నా సంగతి మాత్రమే ఆలోచిస్తే యశో నాతో వుండటం చాలా ముఖ్యము. మళ్ళీ నా భారాన్ని నేను వహించలేను. కానీ యశో సంగతివేరు. నాతో వుండటంవల్ల ఆమెకు కష్టాలు. కన్నీరు తప్పవు. ఆమె సుఖపడటానికి అవకాశాలు ఏమీలేవు. నా స్వభావమే అంత. యశో చెప్పినట్లు నేను అందరివద్ద అన్నీ ఆశిస్తాను. స్వీకరిస్తాను. ఉపయోగించుకుంటాను. తిరిగి ఏమీయివ్వను. ఇంత కృతఘ్నుడితో ఈమె ఏమి సుఖపడుతుంది?

అసలు యశో ఏమనుకుంటూంది? నన్ను వెళ్ళిపొమ్మని చెప్ప లేక బాధపడుతుందా? నా అంతట నేనే వెళ్ళిపోతానని చెప్తాను. ఆ మాత్రం సహాయం నేను చేయలేనా? మూడు సంవత్సరాల క్రితం నా అంతట నేను ఆమె యిష్టానికి వ్యతిరేకంగాఆమెని వదలిపెట్టిపోయాను. ఆ తరువాత ఆమె విలువ గ్రహించాను.ఆమెను వెదుక్కుంటూ చివరకు ఈ ఆశ్రమం చేరుకున్నాను. ప్రేమా, వాత్సల్యం, అనురాగం అన్నీ దొరికాయి. ఈసారి యివన్నీ వదలి నా యిష్టానికి వ్యతిరేకంగా వెళ్ళి పోవాలా? నాకు యశోకి మధ్య ఈ గురువుగారున్నారు. ఆయన నిజ మైన సన్యాసేనా?

ఆనాటి రాత్రి....

యశో పడుకున్న తరువాత దగ్గరకు వెళ్ళి "యశో నాకు లక్ష్మి అంతా చెప్పింది" అన్నాను ఉపోద్ఘాతం ఏమీ లేకుండా. యశో ఒక్క సారి తుళ్ళిపడింది. కొన్సేపు నిశ్శబ్దంగా వుండి "అయితే ఏం చేస్తారు" అంది. ఏవిధంగా చెప్పాలో తెలియలేదు. తలవని తలంపుగా "నేను వెళ్ళి

పోతాను యశో !" అన్నాను. అసలు అంతవరకూ నేనొక నిశ్చయానికి రాలేదు. కాని నోట ఆ మాటలు వచ్చేశాయి.

సుందరి కాస్సేపు మాట్లాడలేదు. కళ్ళు మూసుకుని నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ "అదే మంచిది" అంది.

దగ్గరలో పిడుగు పడినట్లయింది. అదేమంచిది అంటే అర్థమేమిటి ? ఇంతకుముందు ఒకసారి సరళ నన్ను తనతో రమ్మనినప్పుడు లక్షియాతో యిదేమాట అంది. ఆ రెండు మాటలలో మా యిద్దరి భవిష్యత్తూ తేల్చివేసిందా ? ఇంతకుముందే నన్ను వదిలేయటానికి నిశ్చయించి వుంటుంది.లేకపోతే అంత హఠాత్తుగా ఎలా అనగలదు అలాంటి మాటలు. ఇక ఏమనాలి ? మనస్సంతా ఎంతో బరువైపోయింది. "రేపే వెళ్ళిపోతాను యశో !" అన్నాను.

"రేపే వెళ్ళిపోతారా ? ఇంకా కొన్నాళ్ళు వుండకూడదా?" అంది గొంతుక పెగలదీసి.

"ఉహుఁ" అన్నాను.

యశో "అదేమంచిది" అని అవతలవైపుకు తిరిగిపోయింది.

యశో అటు ప్రక్కకు తిరిగి తనలోతాను నవ్వుకుంటూందా ? అనే ఘోర అనుమానం కలిగింది. ఎంత మారిపోయింది ? ఎంత కటువుగా త్రోసివేసింది నన్ను ? వెళ్ళిపోవటానికి నేను సిద్ధంగా వున్నాను. కానీ యిలాంటి వీడ్కోలుకి నా హృదయం సిద్ధంగా లేదు.

హృదయమంతా కల్లోల పూరితమయిపోయింది. హఠాత్తుగా ఎంతో అలసిపోయాను. మంచంమీదకు వెళ్ళి పడుకున్నాను. క్షణంలో నిద్రపోయాను.

అలా ఎంతసేపు నిద్రపోయానో తెలియదు. హఠాత్తుగా బాదల్ బాబూ ! అని తట్టి లేపినట్లయి కళ్ళు తెరచాను. ఎదురుగుండా నీలిచీర కట్టుకుని యశో నుంచుని వుంది.

"లేవండి. బయట బండి సిద్ధంగావుంది. పదండి" అంది.

అప్పటికి నాకు పూర్తిగా మెలుకువ వచ్చింది. ఏమిటి యశో నన్ను నిద్రలేపి బండిలో యిక్కడనుంచీ పంపించివేస్తుందా? దుఃఖముతో నాకు గొంతుక బొంగురుపోయింది.

"అయితే శాశ్వతంగా నన్నీ నిశిరాత్రి వదలిపెట్టి వేస్తావా అమ్మా!" అన్నాను.

"ఎంత చెడ్డదాన్నయినా నేను అలాంటి దానినికాను బాదల్ బాబూ! పదండి నేనూ మీతో వచ్చేస్తూన్నాను" అంది నవ్వుతూ.

మొదట నాకేమీ అర్థంకాలేదు. యశో శాశ్వతంగా ఈ ఆశ్రమం వదలి నాతో వచ్చేస్తుందా? ఇంతలో ఈ మార్పెలా వచ్చింది? చెయ్యి పట్టుకుని బయటికి తీసుకువచ్చింది, ఆ వెనుక రణధీర్ వున్నాడు. యశో "బాబుగారి పక్కచుట్టి బండిలోపెట్టు రణధీర్!" అంది.

బయట లఖియా నించుని వుంది. ఎందుకో మనస్సులో నాకు చాలా బాధ కలిగింది ఆమెను చూడగానే. దగ్గరకు వెళ్ళి "నేను వెళ్ళిపోతూన్నాను లఖియా. యశోని నీవద్దనుంచి తీసుకపోతూన్నాను" అన్నాను.

సన్నటి ఆ బండి దీపం వెలుగులో లఖియా ముఖం చాలా అస్పష్టంగా కనబడింది. ఆమె కంటతడి వుందా? కాని ఆమె జవాబును బట్టి ఆమె ముఖం కాస్త ఊహించుకున్నాను.

"వెళ్ళండి రామబాబూ! మీసొత్తును మీరు తీసుకువెళుతున్నారు. దీనినుంచీ మిమ్మల్ని ఎవరూ వేరుచేయలేరు. అందర్నీ కాపాడే ఆ భగవంతుడు మీ యిద్దర్నీ కాపాడుతాడు" అంది.

"నువ్వు నాకొక మాటివ్వాలి. జీవితంలో నీకు ఏ విధమైన సహాయము కావలసివస్తే మాకు కబురుచెయ్యి. నీకు ధనం యిస్తానని నిన్ను నేను కించపరచను. అందులకు మేము అర్హులము కామేమో! ఎల్లప్పుడూ మా హృదయకవాటాలు నీకు తెరిచి వుంటాయి. లఖియా! భవిష్యత్తులోనువ్వు సుఖపడాలనే నేను ఎప్పుడూ ప్రార్థిస్తుంటాను. ఎక్కడో అక్కడ నువ్వు సుఖపడాలి" అన్నాను.

లఖియా – "అలాగే చేస్తాను రామబాబూ! అవసరంవస్తే మీ వద్దకే వస్తాను. మీ యిద్దరికీ నామీదవున్న అభిమానం, దయా నాకు తెలుసు. అందుకు నేను తగినదానిని కావాలనే నా కోరిక" అని నా దక్షిణహస్తాన్ని యశో చేతిలోపెట్టి "రామబాబూ! యశోని నీ చేతిలోపెట్టే భారంకూడా నేనే వహిస్తాను. సుందరీ, వీరిని గురించీ, నా కర్తవ్యం గురించీ నీకు నేను చెప్పదగిన దానను కాను. కాని యిది చెప్తాను. వీరిని కాపాడుకోవటంకన్న నీ కిక వేరే కర్తవ్యంలేదు" అంది.

మరో క్షణంలో వా రిరువురు గాఢాలింగనములో యిమిడిపోయారు. యశో అంటూంది – "ఈనాడు నాకు యిది లభించటానికి కూడా నువ్వే కదా కారణం లఖియా. లేకపోతే వీరిని పారవేసుకునే దానిని కదా! ఈ రాత్రి నువ్వు నాకీ మార్గం చూపించకపోతే నేనే మయి పోయేదానినో? ఈ విషయం నే నెన్నటికీ మరువను. వీరన్నట్టు మా హృదయపు కవాటాలు నీకోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి."

అయితే యశో నాకు లభించటానికి కారణంకూడా లఖియాయే అన్నమాట. ఈమె ఋణం నే నెలా తీర్చుకునేది. ఈ పవిత్రస్త్రీని అపవిత్రం చెయ్యకుండా నేనేమి సమర్పించగలను?

లఖియా నా మనస్సులోని భావాల్ని గ్రహించింది. "వద్దు రామబాబూ! మీ హృదయంలోని భావాలు వుద్దేశాలు నాకు తెలుసు. వాటిని బయటికి వెల్లడించనవసరంలేదు. శేష జీవితంలో మనము తిరిగి కలుసుకుంటామో లేదో నేను సరిగా చెప్పలేను. కాని యశో, మీరూ నా మనోవీధిలో ఎప్పుడూ మెదుల్తూ వుంటారు. కష్టసమయాల్లో మీ జ్ఞాపకం నాకొక ఓదార్పు" అంది.

లఖియా చాలా శాంత స్వభావిని, మితభాషి. ఆవేశాల కెన్నడూ లోనుకాదు. సర్వవేళలందూ ఆమె ముఖంమీద మందహాసం, దివ్యకాంతితో వెలుగుతూంటుంది. అలాంటి లఖియా యీనాడు కాస్త ఆవేశంలో ఆ చివరివాక్యాలు పలికింది. ఈ స్మృతిని హృదయంలో భద్రంగా దాచుకుంటాను. యిక నే నేమీ ఆశించను.

యశో కళ్ళవెంట నీరు కారుతూంది. ఎడబాటు, వీడ్కోలు

ఎప్పుడూ దుఃఖాన్ని కలగజేస్తాయి. సన్నిహితులనూ, ప్రేమపాత్రులను వదలవలసి వచ్చినప్పుడు యిది మరీ ప్రబలంగా వుంటుంది.

యశో గబ గబా కళ్ళు తుడుచుకుని — "పదండి రామబాబూ, ఆలస్యమవుతూంది" అంది. లఖియాకేసి మరొక్కసారి చూశాను. చిరునవ్వుతో నా చెయ్యి పట్టుకుని బండివద్దకు తీసుకువచ్చి బండి ఎక్కించింది. యశో అప్పుడు లఖియాకి పాదాభివందనము చేసింది. మరొక్కసారి యిరువురూ కౌగలిలో యిమిడిపోయారు. లఖియా యశోనికూడా బండి ఎక్కించింది. 'ఇక పద రణధీర్' అంది.

రణధీర్ కొరడాదెబ్బ తిని ఎద్దులు పరుగెత్తాయి. లఖియా చీకటిలో లీనమైపోయింది. చేతులు జోడించి నమస్కరించాను ఆమెకు.

చాలాసేపు లఖియా ఆలోచనతో హృదయమంతా నిండిపోయింది. యశోకూడా ఏదో ఆలోచిస్తూవుంది.

"మనము పారిపోతూన్నామా యిక్కడనుంచీ యశో?" అన్నాను. హఠాత్తుగా గాఢాంధకారములో యశోనిలించిన చీకటిలో కలిసిపోయింది. వెంటనే జవాబు రాలేదు. నిద్రపోతుందేమో అనుకుంటూంటే జవాబు వచ్చింది.

"ఎవరినుంచి పారిపోతున్నాము బాదల్‌బాబూ? ఇది పారిపోవటంకాదు. మన యిద్దరి జీవితాల్లో ఒక అధ్యాయం ముగిసింది. అబ్బ! నాకు విపరీతంగా నిద్రవస్తూంది. పడుకుంటాను" అని బండిలో గడ్డిమీద పడుకుంది. కొద్దిసేపటిలోనే గాఢంగా నిద్రపట్టింది.

కొంతసేపు పోయింతరువాత గడ్డిలో ఏదో చప్పుడయినట్టుంది. వెంటనే నాలో భయంకరమైన అనుమానం ఒకటి ప్రవేశించింది. యశో పక్కలేకుండా వుత్త గడ్డిమీద పడుకుంది. ఈ గడ్డిలో ఏదైనా పాము పురుగువుంటే నా గతి ఏం కాను? గడ్డిలో పాములుంటాయి అంటారు. అమ్మో! యింకేమైనా వుందా. యశో అలా నిద్రపోతూంతగా ఏదైనా కరుస్తేఅన్న ఆలోచనకలిగి వెంటనే ఆ గడ్డంతా చెయ్యిపెట్టి తడవటం మొదలుపెట్టాను. కటికాంధకారం చేతికి ఏదో కాస్త మెత్తగా

తగిలినట్లుంది. శరీరం ఒకసారి వణికింది. బయటికి విసరివేశాను. అది ఏమిటో అప్పటికీ నాకు తెలియదు. బహుశా అది నా భ్రమే అయి వుంటుంది. పామయితే కుట్టకుండా అంతసేపు అలా ఎందుకు వుంటుంది ? యింకా భయం పోలేదు. యశో తల నెమ్మదిగా ఎత్తి నా ఒడిలో పెట్టుకున్నాను. గాఢనిద్రలో వుందామె. వజ్రంలా ఆ చీకటిలో తెల్లటి ఆమె ముఖం తళ తళ మెరుస్తూంది. ఎంత అందంగా ప్రశాంతంగా వుంది.

బయట అంతా కటిక చీకటి. భయంకరమైన నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ, ఎడ్ల మెడలోని గంటలు చప్పుడుచేస్తున్నాయి. వుండి వుండి దూరంనుంచీ జంబూకపు కూతలు వినబడుతున్నాయి. ఆకాశం నిర్మలంగా వుంది. గగనాన్ని తూట్లుపొడుస్తూ నక్షత్రాలు మిల మిలా మెరుస్తున్నాయి. చీకటిని చీల్చుకుంటూ వుల్కాలు పచారులు చేస్తున్నాయి. చందమామకు అది శలవుదినం కామోసు. ఎక్కడా అలికిడిలేదు.

మనస్సంతా కల్లోలంగా వుంది. గతించిన అనేక స్మృతులు మనోనేత్రాలముందు మెదలసాగాయి. ఆ ఆశ్రమానికి సరళతో కలసి వచ్చాము. కారులో రాజేంద్ర సారధ్యం వహించాడు. యీసారి గాఢ నిద్రలో వున్న యశోని తీసుకుని విశిరాత్రి రెండెడ్లబండిలో తిరుగు ప్రయాణం చేస్తున్నాను. రణధీర్ కునికిపాట్లు పడుతూ బండి నడుపుతున్నాడు. రాకకీ, పోకకీ యెంత వ్యత్యాసముంది. యింతకీ మేము ఎక్కడికి వెళుతూన్నట్లు ? యశో అదేమీ చెప్పనేలేదు. రణధీర్‌ను అడగటం యిష్టంలేకపోయింది. యశో ప్రక్కన వున్నంతకాలం ఎక్కడికయితేనేమిటి ?

హఠాత్తుగా సుశీ జ్ఞాపకం వచ్చింది. ఆమె జీవించి వుంటే నాకివన్నీ తప్పేవికదా ? అప్పుడు యశో ఏమవును ? సరళ ఏమవును ? లలితా ఏమవును ? మానవ జీవితం యెంత గమ్మత్తుగా వుంది ? ప్రతి సంఘటనా ఎన్నో సంఘటనలకు దారితీస్తుంది. అలా ఒకవిధంగా జరిగి యుండకపోతే తరువాత ఏమవుతుంది? అనే ప్రశ్నకు జవాబు చివరకు విధాతకూడా యివ్వలేడు. మానవ జీవితం క్షణభంగురమే కావచ్చు. కాని మనము అనుకునేటంత అర్ధరహితం కాదేమో ?

యశో నాకోసం సర్వం త్యజించింది. కాని ఆమెకి నేను యివ్వ గలిగింది శూన్యం. నావద్ద వున్నదేదో అది సుశీ తీసుకుపోయింది. నా వద్ద మిగిలిందేమైనా వుంటే ఈమెకు సమర్పించుకుంటాను. ఈ వ్యర్థ జీవితాన్ని ఈమె చేతిలో పెట్టివేస్తాను.

కొంతసేపటికి అలా కూర్చొనే నిద్రపోయాను. మెలకువ వచ్చే సరికి తెల్లవారుతూంది. ఇంకా యశో నిద్రపోతూనేవుంది. ఆమె తల నా ఒడిలో అలాగే వుంది. ఉదయభానుని లేత కిరణాలు ఆమె ముఖాని కొక వింతశోభ నిస్తూన్నాయి.పాపిడిలోంచి వదులు పడిన కురులు నుదు టిని ముద్దు పెట్టుకుంటూన్నాయి. ఆ ముగ్ధ సౌందార్యాన్ని కన్నార్పకుండా చూస్తూన్నాను. నుదుటపైన ముంగురులు సరిచేశాను. యశో కళ్ళు తెరి చింది. గబుక్కున లేచి కూర్చుంది. "అరే,యిదేమిటి రాత్రింతా ఇలాగే కూర్చున్నారా ?" అంది.

"లేదు, ఇప్పుడే లేచాను.రాత్రి యిలాగే పడుకున్నాను"అన్నాను.

"మీరుకూడా పడుకోలేకపోయారా ?" అంది.

"ఎక్కడ పడుకోమంటావు అమ్మీ !" అన్నాను.

యశో ముఖం సిగ్గుతో ఎర్రబడింది. "నన్ను లేపవలసింది. నేను మేలుకుని వుందును" అంది.

"అదిసరే, ఈ ఎడ్లకి ఏమైనా గమ్యస్థానం వుందా? లేక స్వేచ్ఛా విహారమా ?" అన్నాను.

యశో నా చలోక్తికి నవ్వలేదు. "ముందర ముస్సోరీ వెళ్ళాలి. అక్కడ బ్యాంకులోంచి డబ్బు తీసుకోవాలి. ఆ తరువాత ఎక్కడకు వెళ్దాం చెప్పండి" అంది.

ముస్సోరీ అనగానే గుండెల్లో రాయిపడింది. సరళను మళ్ళీ కలుసుకోవలసి వస్తుంది ఈ పరిస్థితిలో. కానీ తప్పదు. డబ్బులేకుండా ఏం జరుగుతుంది ? నాదగ్గర పట్టుమని మూడు పచ్చనోట్లయినా లేవే ?

అక్కడనుంచీ ఢిల్లీ వెళ్ళాము. "అక్కడ నేనేదైనా ఉద్యోగం

కోసం ప్రయత్నిస్తాను. ఏదో ఒకటి దొరకకపోదు. పెద్ద పట్టణం. మన గురించి పట్టించుకునేవారు కూడా వుండరు" అన్నాను.

యశో ఎంతోకాలం తర్వాత స్వచ్ఛంగా నవ్వింది."మీరు ఉద్యోగం చేస్తారా ? మా భలేగావుంది ! ఆఫీసుకు రోజూ మీతోపాటు నన్నూ తీసుకుపోతూంటారా ? లేకపోతే మీకు గడవదేమరి. ఎవరుకూడా మిమ్మల్ని ఉద్యోగంలో ఒకవారంకంటే ఎక్కువకాలం వుంచుకోరు" అంది.

నా మనస్సు కాస్త చివుక్కుమంది. నేను అంత పనికిరానివాణ్ణా? అయినా యశో చెప్పిందే నిజం.ఉద్యోగం నా స్వభావానికి గిట్టదని నాకు తెలుసు. ఇదేమాట సుశీకూడా అనేది. అయితే యిక మిగిలిందేమిటి ? యశో చుట్టూ ఒక గ్రహంలా తిరగటమేనా ?

"కానీ ఉద్యోగం చెయ్యకుండా ఎన్నాళ్ళు బ్రతుకుతాను.అమ్మనీ దగ్గరవున్న ధనం అక్షయం కాదుకదా ? వూరికే కూర్చుని తింటూంటే ఎన్నాళ్ళు వస్తుంది చెప్పు? ఆ తరువాత కూడా డబ్బు సంపాదించి పోషిస్తావా నువ్వు ?" అన్నాను.

"వాటిని గురించి మీరనవసరంగా బాధపడకండి. మీ భారమంతా నాది. అవన్నీ నేను చూచుకుంటాను. నా దగ్గరవున్న డబ్బేమీ తక్కువ కాదు. మనవి రెండు జీవాలు. తినటానికి తిండి, కట్టుకోవటానికి బట్ట కంటే యింకేమి కావాలి? అది వాటికి సరిపోతుందనుకుంటాను. అదీ అయిపోతే నగలున్నాయి. అవికూడా బ్యాంకిలో వున్నాయి.వద్దు మీరేమీ అనకండి. నాకు తెలుసు మీరేమంటారో; స్త్రీ నగలమీద బతుకుతానా అంటారు. మీరు నాకు యిప్పుడు మాట యివ్వాలి. నాడబ్బు మీడబ్బు అనే విభేధం పాటించవద్దు అంతా ఒకటే. అదీకూడా అయిపోతే మీరు ఉద్యోగం చేద్దురుగాని. అంతేగాని అదంతా అట్టేపెట్టుకుని మన తరువాత ఎవరికిస్తాము ! చెప్పండి !" అంది.

నేనేమీ మాట్లాడలేదు.జరగవలసింది జరుగుతుంది.నా జీవితంలో నేను అనుకున్నట్లు ఏదీ జరుగలేదు. మొదటినుంచీ అది వక్రగతులు పట్టింది. నా చేతిలో లేని దానిని గురించి నేనెందుకు బాధపడాలి. యశో

ఈనాకు నన్ను వెంటబెట్టుకుని అస్పష్టమైన భవిష్యత్తులో అడుగుపెడు తూంది. సరే చూద్దాం! ఏమవుతుందో?

యశో అంటూంది-"రణధీర్ కాస్త బండి ఆపు బాబుగారికి కాఫీ కాచియివ్వాలి" రణధీర్ బండిని ఒక పెద్ద చెట్టుక్రింద ఆపాడు. యశో బండిలోంచి కావలసిన సరంజామా అంతా తీసింది. రణధీర్ ఎండిన కర్రముక్కల్ని ఏరి తీసుకొచ్చాడు.

కాఫీ కాస్తూంటే అడిగాను "అయితే మనము ముస్సోరీకి తిన్నగా ఈ బండిమీదే వెళ్ళుతున్నామా యశో!"

కాఫీ కాచటం ఆపి నవ్వుతూ "భలేప్రశ్న వేశారు. డెభ్భై మైళ్ళు రెండెడ్ల బండిమీద వెళ్తామనుకున్నారా? ఇక్కడ దగ్గరలోనే ఒక పెద్ద పల్లెవుంది. ఏ పల్లె రణధీర్?"

"అయిదారు మైళ్ళకంటె ఎక్కువుండదు. ఉన్నగా మధ్యాహ్నం భోజనసమయానికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు.

"అలాగే కానీయి నాయనా. మీరు అక్కడ కాస్త ఎంగిలి పడ తారు" అంది. అంటే దాని అర్థం ఆ పూట యశో పస్తు ఉన్నదన్న మాట. ఇలాంటి విషయాల్లో ఆమెతో వాదించటం అనవసరం. యశో కాసిని పళ్ళుకూడా యిచ్చింది. అవి తిని కాఫీ త్రాగి మళ్ళీ బయలు దేరాము.

సరళని మళ్ళీ కలుసుకోవచ్చునని వస్తుందన్న ఆలోచనే నన్ను యింకా పీడిస్తూంది."అయితే మనము ముస్సోరీలో ఎన్నాళ్ళు వుండవలసి వస్తుంది?" అని అడిగాను.

"రెండు మూడు రోజులకంటె ఎక్కువ వుండనక్కరలేదు" అంది.

"అయితే మనము ముస్సోరీలో ఎక్కడ వుందాము?" అని అడి గిన వెంటనే నా మనస్సులోని ఆలోచన గ్రహిస్తుందేమోనని 'సరళ దగ్గరేనా' అన్నాను.

"అవును. ఇంకెక్కడ? లేకపోతే సరళ యింకెప్పుడూ మర

ముఖం చూడదు. రాజేంద్రికుకూడా చాలా కోపం వస్తుంది. అయినా వుండేది రెండుమూడు రోజులేకదా? ఆ తరువాత ఏంచెయ్యాలి అని నేను ఆలోచిస్తున్నాను. జీవితమంతా గూడులేని పక్షిల్లా తిరుగుతూ వుండలేం కదా?" అంది.

వింటూ వూరుకున్నాను. "హే భగవాన్! జీవితంలో సమస్య లేని సమయం కాలగర్భంలోంచి ఆవిర్భవించలేదు. అబ్బా! జీవితంలో యింకా ఎన్ని సంవత్సరాలు గడవాలో, ఎప్పటికి గమ్యస్థానం చేరుతాము" అంది పరధ్యానంగా.

ఆ మాటలు వింటూంటే నాకు ఎంతో బాధకలిగింది. ఇరువది నాలుగు సంవత్సరాల అందమైన యువతి-అవివాహిత అనవలసిన మాటలా యివి? జీవితంలో యింత విరక్తి కలగిందీమెకు? మూడున్నర సంవత్సరాల క్రితం నేను మొదటిసారి ఈమెను కలుసుకున్నప్పుడు ఈమెకు బాధ్యతా, బాధా అంటే తెలియవు. ఎప్పుడూ చిలిపిగా వేళాకోళం చేస్తూండేది. అర్ధ నిమిషంలో మూడుసార్లు నవ్వేది. ఇప్పుడు చిరునవ్వే కరువైపోయింది. మందహాసమే మరుగైపోయింది. నేను ఎంత శోచనీయమైన పరిస్థితిలో వున్నాను. నాకోసం సర్వస్వాన్ని త్యజించి, నాకు సర్వస్వాన్ని సమర్పించిన ఈమెకు వుండటానికి ఒక యిల్లు అయినా చూపించలేకపోతూన్నాను. నాకు ఒక యిల్లువుంది. అయినా ఏం లాభం?

ఇంకా నేనేమీ మాట్లాడలేదు. రణధీర్ హుషారుగా బండి తోలుతూన్నాడు. యజమానిలోని ఉత్సాహం ఎడ్లలోలేదు. కొరడాదెబ్బ తిన్న వెంటనే పరుగెడుతూన్నాయి. లేకపోతే ఆగిపోతూన్నాయి.

మౌనాన్ని భంగంచేస్తూ యశో "ఒకలా చేస్తేసరి. ముందర తీర్థయాత్రిలకి వెళ్దాం. రిషీకేశ్ అంత దగ్గరలోవున్నా ఎప్పుడూ వెళ్ళలేదు. హరిద్వార్, బృందావనం, ప్రియాగ, కాశీ, నాసిక్ యివన్నీ చూద్దాము. ఆ తరువాత కాశీలోనే ఎక్కడో ఒక యిల్లు కొనుక్కుని వుండిపోదాం" అంది.

"సరె అమ్మీ, నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. ఎక్కడికిపోయినా నన్ను నీతో తీసుకునిపో" అన్నాను.

మళ్ళీ నిశ్శబ్దంలో మునిగిపోయాము. యశో బండిలోంచి బయటకు చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూంది. ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచి - "నిన్నరాత్రి మీరు పడుకున్న తరువాత ఏం జరిగిందో తెలుసుకోవాలని లేదా ?" అని అడిగింది.

"లేదు యశో ! తెలుసుకోవాలని లేదు. తెలుసుకునిమాత్రం చేసేదేముంది ! కానీ నా భవిష్యత్తూ, నా సర్వస్వమూ ఒక తక్కెడలో వూగిసలాడాయని తెలుసు" అన్నాను.

"అయినా చెప్తాను. చెప్తే నా మనస్సు కాస్త తేలికపడుతుంది. మీరు పడుకున్న తరువాత నేను చాలాసేపు మేల్కొని వున్నాను. మనస్సంతా వేదనాపూరితమై పోయింది. మరునాడు మీరు వెళ్ళిపోతారని మాటి మాటికి జ్ఞప్తికి వచ్చింది. అలాంటి స్థితిలో వుండగా బయటి నుంచి లఖియా పిలుపు వినబడింది. ఆ సమయంలో లఖియా నా పాలిటి దేవతలా కనబడింది. బయటికి వెళ్ళి లఖియాకు అంతా చెప్పివేశాను."

"అయితే నన్నేమి చేయమంటావు ? మళ్ళీ నాకు ఆ బాహ్య ప్రపంచంలోకి వెళ్ళమంటే చాలా భయంగా వుంది. ఇక్కడే నాకు యెంతో బాగుంది" అన్నాను.

లఖియా అప్పుడు "అంతా యిలాంటి పరిస్థితుల్లో ఫలితాలనీ, పరిణామాలని పరిగణించకూడదు సుందరీ ! ఎవరికి తెలుసు ఏ వస్తువుకి ఎంత విలువుందో ? కర్తవ్య పాలనతప్ప మరే యితర ప్రశంసా వుండకూడదు. స్వీయసుఖమే సమస్తమూ కాదు. యింకొకటి ప్రపంచములో వుత్తములు, అనదగవారు బహు కొద్దిమంది వున్నారు. సుందరీ! వారిలో నువ్వు ఎవరినైతే వదలుకోవటానికి సిద్ధపడుతున్నావో వారొకరు."

ఎంత చక్కగా, సున్నితంగా ప్రబోధం చేసింది. వెంటనే నిశ్చయానికి వచ్చేశాను. ఆ నిశ్చయానికి వచ్చినతరువాత అక్కడ వుండ

మనస్కరించనాను లఖియా గాడా అడ్డుపెట్టలేను. లఖియా నేను కలిసి సామానంతా సర్దాను. ఏం చుకుంటూంచే భయం వేస్తుంది. లఖియా నాకు మార్గం చూపి చకపోతే నేను మిమ్మల్ని పారవేసుకునే దానినే కదా" అంది.

మనస్సులో మళ్ళీ ఒకసారి లఖియాకి నమస్కరించుకుంది. ఎక్కడకు పోతాను నేను - "అమ్మో ! తిరిగి తిరిగి మళ్ళీ నీ వద్దకే వస్తాను" అన్నాను.

"అయినా నా అంతట నేను మిమ్మల్ని నానుంచి తరిమివేసినట్టు కాదా ? అంతకంటె మహా పాతకం యింకేమైనా వుందా?" అంది.

"అయితే ప్రాయశ్చిత్తం చేసుకుంటావా ?" అన్నాను.

యశో నవ్వింది. "మీరు జ్ఞాపకం చేశారు. ఏమో చేసుకోవాలేమో ! కాశీలో మళ్ళీ జ్ఞాపకం చెయ్యండి."

"అయితే ఈసారి సలహా యివ్వడానికి గురువుగారు లేరుకదా?"

గురువుగారి పేరువిని యశో దాన సిగ్గుపడింది. ముఖం ఎర్రబడింది. ప్రయత్న మాత్రంచేత నిగ్రహించుకుని - "ఇప్పటినుంచీ మీరున్నారుకదా ! ఆయన బదులు అన్నీ మీరే" అంది.

రణధీర్ బండి ఆపాను. మేము బస్సు ఎక్కవలసిన గాత్రిమము వచ్చేసింది బస్సుఎక్కి కూర్చున్నాము. బస్సులోంచి వంగి రెండు పదిహాపా ల నోట్లు యశో రణధీర్ చేతికో పెట్టింది. వాడి సుఖమే చెప్తూ ది. దుఃఖం బయపడుతాన్న అపుకం న్నాడని. ఆశ్చర్యంగా— "ఇదేమిటి ?" అన్నాడు.

యశో రణధీర్ గుమిటచూసి - "చిన్నక్క అభిలాష, రణధీర్ ! అంతకంటే యింకేమి కాదు ! నన్ను మరచిపోవుకదూ ?" అంది. యింక వాడి నిబ్బరం పరాపంచలేదు. కళ్ళవెంట నీరు బొట బొటా కారసాగాయి.

యశో అడిచూచి "ఛా ! చిన్నక్క ఇత్తవాని.టికి వెళ్తూంచే ఏడుస్తారా ఎవరైనా రణధీర్ ! నువ్వు ఒక్కడివే నా తమ్ముడివి. నీవు

యింకా నిన్ను ప్రేమించే పెద్దక్క వుంది. నా కెవరున్నారు చెప్పు ? పెద్దక్కని కనిపెట్టి వుండు. ఆమెకు నా నమస్కారాలు చెప్పు" అంది.

అప్పటికి వాడిదుఃఖం ఆగింది. కళ్ళు తుడుచుకుని — "నన్ను ఆశీర్వదించు చిన్నక్కా" అన్నాడు.

యశో కళ్లు కాస్త చెమర్చాయి. "ఎప్పుడూ సహృదయుడై సుఖంగా వుండు. రణధీర్, భగవంతుడు ఎప్పుడూ నిన్ను కాపాడుతూం టాడు" అంది.

నా దగ్గరకి వచ్చాడు "చిన్నక్కను మీరు తీసుకుపోతున్నారు. బాబూగారూ నా లోటుకూడా మీరే తీర్చండి" అన్నాడు.

ఎంత అమాయకుడు — "నీ చిన్నక్క గురించి నీవేమీ దిగులు పడకు రణధీర్. ఆమె ఎక్కడున్నా సుఖంగా వుంటుంది" అన్నాను. లఖియా నన్ను యశో చేతిలో పెట్టింది. రణధీర్ యశోని నా చేతిలో పెట్టాడు.

"మీరుకూడా ఆశీర్వదించండి బాబుగారూ" అన్నాడు.

"చిన్నక్క చెప్పిందికదా రణధీర్. నీలాంటి వాడికి దైవం యెన్నడూ అన్యాయం చేయడు" అన్నాను.

బస్సు కదిలింది. "వెళ్ళివస్తాను తమ్ముడూ" అంది యశో. బహుశా ఆ మాటలు వాడికి వినబడి వుండవు. కొంతదూరం పోయిన తరువాత వెనుదిరిగి చూస్తే కళ్ళు తుడుచుకుంటూ బంగళావైపు వెళు తున్నాడు యశో తమ్ముడు.

జీవితంలో మనకు ఎంతోమంది తారసిల్లుతూ వుంటారు. కొద్ది కాలం జీవన బాటలో కలసి ప్రయాణం చేస్తాము. కొంతమంది చాలా కాలం వుంటారు చాలామంది స్వల్పకాలమే వుంటారు. తరువాత దారులు విడిపోతాయి. కాని జీవి ఎంతో బాధపడుతుంది. విడనాడటానికి ఒవరి ఘడియవరకూ పాకులాడుతుంది. కాని తప్పదు.-జననమూ, మరణమూ ఎంత అనివార్యములో యివికూడా అంతే। ఈ పరమసత్యం తెలిసి కూడా మానవుడు ఎంత బాధపడుతాడు ?

# 18

ఆ మరునాటి రాత్రి నేనూ రాజేంద్రా మేడమీద కూర్చుని వున్నాము. సరళా యశో క్రింద వున్నారు.

"అయితే రామబాబూ! మీరిక్కడే వుండిపోకూడదా? అక్కడికీ, యిక్కడికీ ఎందుకు మీరు వెళ్ళటం? మా సొంత యిల్లువుంది. ఏం చేసుకుంటాము చెప్పండి మేమిద్దరమూ. మా మామగారుకూడా యిక్కడకు రావటం మానివేశాపు కూడా" అన్నాడు రాజేంద్ర.

మేము అక్కడికి వెళ్ళినప్పటినుంచీ యిదే ధోరణి. అక్కడ యశోని సరళ, ఇక్కడ నన్ను రాజేంద్ర ఒప్పించటానికి ప్రయత్నిస్తూన్నారు. అందుకనే అనుకున్న ప్రకారం మమ్మల్ని విడదీసినట్టున్నారు. "మీరలా అన్నందుకు చాలా థాంక్స్ రాజేంద్రబాబూ! కానీ అది ఎలా సాధ్యపడుతుంది చెప్పండి. ఇది ఏమైనా నెలా రెండునెలల మాటా? చివరకు మేము ఎక్కడో అక్కడ స్థిరపడిపోవాలి కదా. పూర్వపు స్మృతులకు ఎంత దూరంగావుంటే అంత శ్రేయస్కరం కదా?" అన్నాను.

రాజేంద్ర ఏదో చెప్పబోతూంటే సరళ పరుగెత్తుకుంటూ వచ్చింది 'పోస్టు పోస్టు' అంటూ. రాజేంద్ర వీపు చరుస్తూ—"రాజేంద్రా! వీరి ప్రయాణం ఒక వారంరోజులు వాయిదా వేయించాను. సోఫార్, సోగుడ్. మిగతాది తరువాత చూద్దాము" అంది. సరళ వెనకాల యశో వచ్చింది. నేను యశోకేసి కాస్త కోపంగా చూచాను. సరళ అది కనిపెట్టి "దీనికి మీ అనుమతికూడా కావాలి రామబాబూ! లేకపోతే అంగీకారం అమలులోకి రాదని చెప్పింది"

యశో అంది—"అలాంటి సమయంలో నేను కాదంటే సమంజసంగా వుండదు"

"సరే సరళా ! యశో అంగీకరిస్తే నేను ఒప్పుకున్నట్టే. ఆ తరువాత మమ్మల్ని వెళ్ళిపోనీయి. అలా వుంటున్న కాలదీ వుండాలని పిస్తుంది. ఎప్పటికైనా ఒకరోజు వెళ్ళిపోవలసిందేగా ?" అన్నాను.

"మీరు అదేమాట అంటారు. ఎందుకు వెళ్ళిపోవాలి మీరు ? మా యింటిలో మీకు యిష్టంలేకపోతే వద్దు. ఈ ఊరిలోనే ఇంకొక యిల్లు కొనుక్కునో, అద్దెకు తీసుకునో వుండిపోకూడదా ? మాకు తెలిసినవారు చాలామంది వున్నా రిక్కడ. చవకగా దొరుకుతాయి ఎక్కడికో కొత్త ప్రదేశానికి ఎందుకు వెళ్ళిపోవాలి చెప్పండి. యశోకి ఈ ఊరంటే ఎంతఇష్టమో మీకు తెలుసుకదా? అదిగాక లఖియాకి దగ్గరగా వుంటారు. అప్పుడప్పుడు వెళ్ళి చూడవచ్చు. ఆమె ఎంతో సంతోషిస్తుంది. మీరిలా చేస్తే ?" అంది.

ఇవన్నీ నిజమే. తిరుగులేని ప్రశ్నలివి. ఆ విషయం నాకు మొదటి నుంచీ తెలుసు. అందుకనే నేను మొదటినుంచీ ముస్సోరీ వెళ్ళటానికి భయపడ్డాను. నేను మాట్లాడకపోవడంతో సరళ అవకాశం జారవిడవ టం యిష్టంలేక-"జవాబు చెప్పు రామబాబూ ! ఈసారి మిమ్మల్ని వదలి పెట్టను" అంది.

యశోకేసి చూచాను. యశో చీకటిలో చూస్తూంది. అంటే ఎక్కడ నుంచీ ఏమీ సహాయం లభించదన్నమాట. రాజేంద్ర చిరునవ్వు నవ్వు తున్నాడు. భార్య తెలివితేటలకు ఆశ్చర్యపోతూ "ఇక లాభంలేదు. సర ళకు మళ్ళీ తిరుగులేని సమాధానం చెప్పాలి"

"నూతన జీవితం నూతన ప్రదేశంలోనే ప్రారంభించాలి సరళా." అన్నాను. యశో ముఖం సింధూరంలా ఎర్రబడింది. సరళ తబ్బిబ్బైంది. రాజేంద్ర రేడియోకేసి చూస్తూన్నాడు. నేను నాలిక్కరుచుకున్నాను.

* * *

మూడురోజులు గడిచిపోయాయి. ముస్సోరీలో మా పనులన్నీ అయిపోయాయి. ఇంకా వారంరోజు లుండాలి అంగీకారం ప్రకారం. సరళ ఎంత బలవంతం చేసినా యశో పూర్వంలా హక్‌మన్స్‌కి, పిక్చ

ద్నకీ సుతరామూ రానంది. అందుచేత మేము సాధారణంగా యింట్లోనే వుండిపోయేవాళ్ళం. రాజేంద్రి కళ్ళల్లో యిప్పటికీ యశోపై అతని పూర్వపు మమతా, అనురాగం కనబడేవి. య పూర్వంలా కటువుగా వుండేదికాదు. ఎంతో సున్నితంగా వుండేది. దానితో నా హృదయం కాస్త తేలికపడింది. ఇక సరళ మా యిద్దరినీ వదలి ఒక్కక్షణంకూడా వుండేదికాదు. వీలున్నప్పుడల్లా ఇక్కడ వుండిపొండీ అనే మాట మంత్రంలా జపించేది. అప్పుడుకూడా ఆమె నాకొక సమస్యగా వుండిపోయింది. వివాహం ఆమెలో ఏమీ మార్పు తేలేదు. హఠాత్తుగా నవ్వేది. అప్పుడప్పుడు కళ్ళలోంచి అనిర్వచనీయమైన విచారమూ, దుఃఖమూ వుట్టిపడేవి.

సరళను నేనూ ఎప్పుడూ అర్థంచేసుకోలేక పోయాను. ఆమె అంటే అప్పుడప్పుడు జాలివేసింది. అప్పుడప్పుడు కోపం వచ్చేది. నా మీద ఆమెకున్న అభిమానం తలచుకుంటే కృతజ్ఞతకూడా హృదయంలో మెరిసేది. కొన్ని కొన్ని సమయాల్లో ఆమె హద్దుమించుతుందనుకునేవాడిని. అప్పుడప్పుడు ఆమె తలపుకు వస్తే రోబెర్టు బ్రౌనింగు తన భార్య ఎలిజబెత్ బ్రౌనింగ్ గురించి అన్న మాటలు నాకు గుర్తుకు వస్తాయి. సోల్ ఆఫ్ ఫైర్ యిన్ ఎ షెల్ ఆఫ్ పెరల్. ఈమె జీవితంలోని తాత్పర్యమేమిటి? ఇంత అశాంతిగా ఎందుకు వుంటుంది? ఈమె వైవాహిక జీవితం సుఖంగా లేదా? అలాంటి ఆలోచన వచ్చినందుకు అప్పుడప్పుడు నేను బాధపడేవాణ్ణి. రాజేంద్రి ఆమె మాట ఎప్పుడూ కాదనగా నేను చూడలేదు. యవ్వనం, ధనం, ప్రేమించే భర్త యివన్నీ వున్నాయి. అయినా ఏమిటి యీ అశాంతికి కారణం?

ఆ రోజు మధ్యాహ్నం రాజేంద్రి ఏవో కేసులు చూడటానికి డూన్ వెళ్ళాడు. క్రింద హాలులో మేము ముగ్గురమూ కూర్చుని వున్నాము. కొంతసేపు పోయినతరువాత యశో కొంచెం తల నొప్పిగా వుందంది. సరళ యేదో తెచ్చి నుదిటిపై రాసింది. యశో అలాగే కాసేపు కూర్చుని నిద్రపోయింది. పోయి పడుకుంటానని మేడమీదికి వెళ్ళిపోయింది.

యిక మే మిద్దరమూ మిగిలాము. సన్నగా రేడియో పాడుతూంది. సరళ పూలు అల్లుకుంటూవుంది సోఫాలో కూర్చుని. నేను ఏదో పుస్తకం చదువుతున్నాను.

సరళ అల్లుకుంటూ తల ఎత్తకుండానే—"అయితే మీరు ఇక్కడనుంచి వెళ్ళక తప్పదా రామబాబూ?" అంది.

నాకు కాస్త విసుగు పుట్టింది. ఆ ప్రశ్నకి అంతంలేదా! యెంతో ప్రయత్నంమీద దానిని అణచుకుని - "చెప్పాను కదా? సరళా తప్పదని. జీవితంలో మనకు ఒక వ్యక్తి సాహచర్యమే జీవితాంతం వరకూ లభిస్తుంది. అదయినా అదృష్టవంతులకే. మిగతా వారంతా ఎప్పుడో వచ్చి ఎప్పుడో పోతారు. ఆఖరుకి ఆనవాలుకూడా వుంచకుండా వారిని మనము కఠినహృదయులూ, నిర్దయులూ అని లాభంలేదు. మానవ జీవితమే అంత" అన్నాను.

సరళ తల పైకెత్తలేదు. కొంచెముసేపు వూరుకుని. "అయితే సరే వెళ్ళండి. కాని నాకు యీ మాట యివ్వండి. నా మీద కోపం వచ్చికాని, నన్ను చూచి అనుమానపడికాని మీరు వెళ్ళిపోవటంలేదని" అంది.

"నీమీద కోపగించటానికి నే నెవరిని సరళా! అయినా నువ్వు మాకు యింత ఆదరంతో ఆతిథ్యం యిచ్చినందుకు నీమీద కోపగించి ప్రతిఫలం చూపించాలా!" అన్నాను. సరళ తలఎత్తకుండా పూలు అల్లుకుంటూవుంది. అప్రయత్నంగా, అనాలోచితంగా అన్నాను "కాని నిన్ను నేను పూర్తిగా ఎప్పుడూ అర్థంచేసుకోలేకపోయాను సరళా!"

సరళ అప్పుడు తల పైకెత్తింది. "ఎప్పుడూ అర్థంచేసుకోలేకపోయారా నన్ను?" అంది.

"అవును సరళా! అసలు నేను ఎప్పుడూ కోలేదు" అన్నాను.

"అదే నా బాధ రామబాబూ! అయ్యా, యశో, రాజేంద్ర వీరెవ్వరూ నన్ను అర్థంచేసుకోలేరు. మీరుకూడా యింతేనా? జీవితాంతము వరకు అలాంటి వ్యక్తికోసం వెతుకుతూ వుండవలసిందేనా? ఈ అన్వేషణకి అంతంలేదా?"

"రాజేంద్ర నిన్ను ఎందుకు అర్థంచేసుకోలేదు సరళా ! నిన్ను సరిగా చూడడా ?" అన్నాను.

"అదికాదు రామబాబూ ! రాజేంద్ర భర్తగా నాకేలాటి లోటు రానివ్వడూ; నేను భార్యగా అతనికి యేలాటిలోటు రానీయను. అంతే. అంతకంటె యింకేమీలేదు. నాకు కావలసింది నాకు లభించదు" అంది. అలా మాట్లాడుతూండగానే ఆమె కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి. ముఖం క్రిందకు దించివేసుకుంది. నేను చకితుడనయ్యాను. సరళ కన్నీరు చూడడం యిది రెండవసారి. మొదటిసారి తిరిగి కలుసుకున్నప్పుడు చూచాను. యశోలాగ సరళ ప్రతి విషయానికి కన్నీరు కార్చదు. నేను ఏమంటే ఆమెకు ఓదార్పు కలుగుతుంది ? ఆమెకు కావలసింది నావద్ద లేదు. అది యశోకే లభించలేదు.

"నీకు నేను సహాయం చేయవలసిందేదైనా వుంటే చెప్పు సరళా. నాకు సాధ్యమయితే చేస్తాను" అన్నాను. సరళ మళ్ళీ తల పైకెత్తింది. కళ్ళల్లోంచి ఆశ తొంగి చూస్తూవుంది.

"ఇక్కడే వుండిపోండి రామబాబూ ! మీరు అవునంటే యశో కాదనదు. మీతో మళ్ళీ ఎప్పుడూ ఈ విధంగా వుండను. నా హృదయాన్ని ఎప్పుడూ బయటపెట్టను. ఎప్పుడూ మీతో ఒంటరిగా మాట్లాడను. సరే అనండి రామబాబూ ! మీకు జీవితమంతా కృతజ్ఞురాలిగా వుంటాను. ఆ వొక్కమాట అనండి. ఆ తరువాత మీరేమి చేయమన్నా చేస్తాను" అంది. ఏమిటిదంతా ? మళ్ళీ కథ అడ్డం తిరుగుతుందా? అలా అనటానికి వీల్లేదు. గుండె రాయిచేసుకోవాలి.

"ఈ విషయంలో నీవు పట్టుపట్టకు సరళా! నేను బాగా ఆలోచించి చెప్తున్నాను. మొదట కొన్నాళ్ళు కాస్త కష్టంగా వుండవచ్చు. ఆ తరువాత నా మాటల్లోని వివేకాన్ని నీవే గ్రహిస్తావు. ఇంక ఈ విషయం గురించి ఆలోచించకు. మరి ఏ విషయంలోనైనా నేను చేయగలది చేస్తాను" అన్నాను.

"అయితే ఈ విషయం చెప్పండి. మీరు నన్ను గురించి చెడుగా

భావించటంలేదు కదా ?" అంది. ఇక ఫరవాలేదు. తుఫాను తగ్గే సూచనలు కనబడుతున్నాయి.

"నీ గురించి నేను ఎందుకు చెడుగా భావిస్తాను సరళా ! నువ్వు నాకు సరిగా అర్థంకాకపోవచ్చు. కానీ నీలోని మంచితనాన్ని. ఔదార్యాన్ని, విశాల హృదయాన్ని నేను గుర్తించాను. నీకొకమాట చెప్పాలని చాలాకాలం పట్టి అనుకుంటూన్నాను. చెప్పమంటావా ?" అన్నాను.

సరళ అప్పటికి మామూలుస్థితికి వచ్చింది "చెప్పండి" అంది.

"నువ్వు చంచల స్వభావినివే కావచ్చు. కాని ఆ చంచలత్వాన్ని ప్రేరేపించకు. జీవితంలో మనము ఆశించినవన్నీ జరగవు. మన మనస్సులో కోరినవన్నీ నెరవేర్చలేము. చాలా కోరికలు తీరని వాంఛలగానే వుండిపోతాయి. ప్రతి మానవుడి జీవితంలోను ఇలాగే జరుగుతూంటుంది. వాటిని హృదయానికి పట్టించుకోకూడదు" అంతే అన్నాను.

"మీరు చెప్పింది నిజమేకావచ్చు. కాని వివాహమైనంత మాత్రాన స్త్రీకి యింక కోరికలూ, అభిమానాలూ, ఆవేశాలూ వుండకూడదంటే నేను వొప్పుకోను. స్త్రీ జీవితంలో వివాహం ఒక ముఖ్యమైన సంఘటన మాత్రమే. అది సర్వస్వమూ ఎన్నటికీ కానేరదు. మీరంతా నువ్వు వివాహితవు కనుక బయటి ప్రపంచంతో సంబంధం వుండకూడదు. నీ హృదయమే ప్రపంచకం. నీ భర్త సర్వమానవకోటి అంటారు. అది ఎప్పటికీ నేను ఒప్పుకోను" అంది. మూడు సంవత్సరాలయినా సరళ యేమీ మారలేదు. అసలు ఆమె వివాహం ఎందుకు చేసుకుంది ?

"సరే సరళా ! నీ అభిప్రాయాలూ, ఉద్దేశ్యాలూ నాకు తెలుసు. కొంతవరకు కొన్నింటిని గౌరవిస్తాను కూడా. కోరికలు వుండకూడదని నేను ఎప్పుడూ అనలేదు వాటిని అదుపులో వుంచుకోవాలన్నాను.నువ్వు నాకొక మాటివ్వాలి.ఈ వారం అయిపోయిన తరువాత మమ్మల్ని సంతోషంతో సాగనంపు. మేము ఎక్కడున్నా నిన్ను తలుచుకుంటూనే వుంటాము. భవిష్యత్తులో మళ్ళీ కలుసుకోమని ఎందుకనుకోవాలి. బుల్లి పాపలు ఈ యింట్లో పాకుతూంటే చూడటానికి వస్తాము" అన్నాను.

సరళ యింతసేపటికి నవ్వింది. "పిల్లలు పుట్టటానికి ఎంత అవకాశంవుందో, పుట్టకపోవటానికి అంతే అవకాశం వుంది. అయినా పుట్టటమే తటస్థిస్తే మొట్టమొదటి కొడుకుపేరు 'బాదల్ బాబూ !' అని పెట్టుకుంటాము" అంది.

ఆమె నవ్వుమాటల తీపు వట్టి పిల్లలు పుట్టాలనే కాంక్ష ఆమెలో వుందనిపించింది. "అలాగే చెయ్యి సరళా. మీ వాడికి నేను గాడ్ ఫాదర్‌ని అవుతాను" అన్నాను.

గోడమీద గడియారం గర్వంగా మూడుగంటలు కొట్టింది. సరళ లేచి నించుని - "అరే, మూడు అయింది. నేను కాఫీ తయారు చేయమని చెప్పివస్తాను.. మీరు యశోని లేపండి" అని లోపలికి వెళ్ళిపోయింది.

నేను నెమ్మదిగా మేడమీదికి దారితీశాను. గదిలోకి వెళ్ళిచూస్తే యశో గాఢనిద్రలో వుంది. పగలు పడుకోవడమనే అలవాటు యశోకి లేదు. తల నొప్పిగా కూడా వుందంది. నేను కాస్త ఆందోళనుడనయ్యాను. పక్కమీద కూర్చుని నెమ్మదిగా పిలిచాను. నుదుటిమీద చెయ్యిపెట్టి చూస్తే సల సలా కాగిపోతూంది. నా గుండె లవిసిపోయాయి. ఎంత జ్వరంగావుంది ? ఇంత జ్వరంతో యీమె బాధపడుతూంటే, నేను సరళతో కబుర్లు చెప్పుతున్నాను. కాస్త గట్టిగా పిలిచాను. యశో కళ్ళువిప్పి చూచింది. కాళ్ళు ఎర్రగా వున్నాయి. ముఖం కూడా కాస్త ఎర్రబడింది.

"జ్వరంగా ఉందా యశో ?" అని అడిగాను. అవునని తల వూపింది. "తల నెప్పిగా వుందా ?" అన్నాను. మళ్ళా తలవూపి— అవ్వు ! అని కళ్ళు మూసింది.

ఇంతట్లో సరళ లోపలికి వచ్చింది. సంగతి చెప్పాను. సరళ వెంటనే రాజేంద్రకి ఫోనుచేసి వచ్చింది.

లోపలికివచ్చి యశో నుదిటిమీద మెత్తగా నిమిరింది. యశో కళ్ళువిప్పి చూచింది మొదట నే స్తనుకుంది కాబోలు చాలా ఆశ్చర్యంగా చూసింది. "నువ్వా సరళా" అంది.

"అవును, నేనే యశో. ఇంత జ్వరంగా వుంటే ఎందుకు చెప్ప లేదు. రాజేంద్రకి ఫోనుచేశాను యిప్పుడే వస్తానని చెప్పాడు" అంది.

రాజేంద్ర తనతో యింకొక డాక్టరుని కూడా తీసుకవచ్చాడు. యిద్దరూ యశోని పరీక్షించారు. జ్వరము మామూలుదే త్వరలోనే తగ్గి పోతుంది అన్నారు. 'త్వరలో అంటే ఎంతకాలమని' అడిగాను. నాలు గయిదురోజు లన్నారు. యిద్దరూ ఏదో సంప్రదించుకున్నారు. రెండవ డాక్టరు వెళ్ళిపోయారు. యశో నెమ్మదిగా – "మిమ్మల్ని చాలా కష్ట పెడుతున్నాను, రాజేంద్రబాబూ ! రాక రాక జ్వరం మీ యింట్లోనే రావాలా చెప్పండి" అంది.

"అలా అనకు యశో, ఇది మా అదృష్టం. నీకు సేవచేయగలిగే అవకాశం మాకు లభించింది. జ్వరం చాలా త్వరలో తగ్గిపోతుంది. ఏమీ కంగారు పడక్కరలేదు" అన్నాడు.

యశో యింకేమీ మాట్లాడలేదు. కళ్ళు మూసుకుంది. సరళ లోపలికివెళ్ళి కాఫీ తీసుకొచ్చింది. యశో నెమ్మదిగా లేచి కూర్చుని తాగింది. సరళా, రాజేంద్రా బయటికి వెళ్ళారు. గదిలో నే నొక్కడ్నే వున్నాను. ఆ సమయంలో యశో యెడ అనురాగంతో నా హృదయం పెల్లుబికి పోతూంది. దీనిని వెల్లడించటం ఎలా ?

పక్కమీద కూర్చుని-"అమ్మీ" అన్నాను.

యశో కళ్ళువిప్పి నాకేసి చూస్తూ - "చూడండి. మీరు అనవస రంగా కంగారు పడకండి ! నా దగ్గరే మీరు వుండండి, ఎక్కడికీ వెళ్ళ కండి" అంది.

బలవంతాన కన్నీళ్ళు ఆపుకుంటూ ... "అది నువ్వు నాకు చెప్పాలా అమ్మీ !" అన్నాను. రాజేంద్ర మందు తీసుకవచ్చాడు. మూడు గంటల కొకసారి మోతాదు వెయ్యమన్నాడు. ఏదో ఒక ఇంజక్షన్ యిచ్చాడు.

రాత్రి పది గంటలయింది. నేను యశో పక్క దగ్గర కుర్చీ వేసుకుని కూర్చున్నాను. మనసులో ఎన్నో ఆలోచనలు మెదులు

తున్నాయి. అప్పుడు సుశీ, యిప్పుడు యశో. సుశీకి జబ్బుగా వున్నప్పుడు ఆమె పక్కవద్ద యిలాగే కూర్చునేవాడిని. ఆమెని నేను రక్షించుకోలేక పోయాను. ఆమె నా చేతుల్లోంచి జారిపోయింది. ఆమె బదులు నాకు ఈ రత్నం లభించింది. ఈమెను నేను ఎన్నడూ పారవేసుకోను. ఆకాశం భూమైనా, మూడు ఆరయినా, ఆరు మూడయినా ఈమెను నేను రక్షించుకుంటాను. యశోకి నేను ఎప్పుడూ యిసుమంతైనా సేవచేసి ఎరుగను. నా గురించి ఈమె ఎన్నో కష్టాలు పడింది. యెంతో త్యాగం చేసింది. ఈసారి ఈ అవకాశాన్ని జారవిడువను.

హఠాత్తుగా యశో మూలుగు వినబడింది. పక్కమీద కూర్చుని నెమ్మదిగా - 'అమ్మీ' అని పిలిచాను.

యశో కళ్ళు తెరువకుండానే - "మీ రిక్కడే ఉన్నారా?" అని నెమ్మదిగా అంది.

"అవును యశో యిక్కడే ఉన్నాను. వుంటాను" అన్నాను.

మళ్ళీ యశో నిద్రపోయింది. సరళ లోపలికివచ్చి - "మీరింక వెళ్ళి పడుకోండి రామబాబూ. నేను కూర్చుంటాను యశోదగ్గర" అంది

"అదేమిటి సరళా నువ్వెందుకు? నే నుంటాను. యశోకి నేను ఎప్పుడూ ఏమీ చేయలేదు. ఈసారయినా ఈ మాత్రం చేయనియ్యి" అన్నాను.

"అలాంటి అవకాశాలు భవిష్యత్తులో మీకు చాలా లభిస్తాయి లెండి. యశో మా అతిథి. స్నేహితురాలు. సోదరి. నా కిలాంటి అవకాశం తిరిగి రాదు" అంది. మాటలతో యశోకి మెలకువవచ్చింది.

కళ్ళు తెరచి చూచి "ఇదేమిట సరళా! నువ్విక్కడున్నావు. నువ్వు వెళ్ళి పడుకో. వీరికి యిక్కడ పక్కవేయించు. ఇక్కడే పడుకుంటారు. అంతకంటే యింకేమీ అవసరంలేదు" అంది.

సరళ ఏదో అనబోతూంటే యశో సరళని తనమీదికి లాక్కుని బుగ్గమీద ముద్దు పెట్టుకుని "ఇంకేమీ అనకు సరళా! వెళ్ళు" అంది.

సరళ నిరుత్సాహంతో వెళ్ళిపోతూంటే యశో "సైమయినట్టుంది. కాస మందిచ్చివెళ్ళు సరళా !" అంది.

సరళ ముఖం కాస్త వికసించింది. ఎంతో ఆప్యాయంగా మందిచ్చి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోయిం తర్వాత యశో "సరళా, రాజేంద్రి కష్టపడుతున్నారనే నాకు బాధగావుంది. మీరు కష్టపడుతున్నారని చింతగాలేదు. అందుకు కృతజ్ఞత చూపించాలనే ఆలోచనకూడాలేదు. ఇది మీ కర్తవ్యం. విధిలా అనిపిస్తూంది" అంది.

"అవును అమ్మీ ! నువ్వు చెప్పిందే నిజం. జీవితమంతాకూడా నేను నా కర్తవ్యాన్ని పాలించేటట్టు చెయ్యి. భారమంతా నువ్వే మోస్తే నాకు కష్టంగా వుంటుంది" అన్నాను.

బంట్రోతు వచ్చి మంచంతెచ్చి పక్కవేశాడు. రాజేంద్రి వచ్చి ఒకసారి చూచి వెళ్ళాడు. కాని పక్క అవసరం లేకపోయింది.రాత్రిల్లా కుర్చీమీదే కూర్చున్నాను. అప్పుడప్పుడు కునికిపాట్లు పడ్డాను. యశోని రెండుసార్లు లేపి మందిచ్చాను.

మరునాడు యశో నిద్రలేచేటప్పటికి నేను కుర్చీమీద జోగుతున్నాను. కోపమూ, మార్దవమూ మిశ్రమైన దృక్కులు ప్రసరిస్తూ "రాత్రిల్లా యిలాగే వున్నారా ?" అంది.

"అబ్బేలేదు. యిప్పుడే కూర్చున్నాను యిక్కడ" అన్నాను.

కంగారుపడుతూ "ఎందుకలా పొద్దున్నే అబద్ధాలాడుతారు.పక్క చూస్తే తెలియదా పడుకున్నదీ లేనిదీ ? మీరిలా చేశారంటే అసలు మిమ్మల్ని ఈ గదిలోకి రానీయను. సరళను రమ్మంటాను" అంది.

హడలిపోయాను ఆ బెదరింపుతో. ఇంకొక రెండురోజులు గడచిపోయాయి. జ్వరం తగ్గుముఖం పట్టింది. ఇంకొక మూడురోజులలో జ్వరం తగ్గిపోతుందన్నారు రాజేంద్రి. పగలల్లా నేనూ, సరళా యశో వద్దే వుండేవాళ్ళం. ఆ రెండురోజులూ రాజేంద్రి గుమ్మం కదలలేదు. సాయంకాలాల్లో మటుకు అర్జంటు కేసులు చూడటానికి వెళ్ళేవాడు. రెండు గంటల కొకసారి వచ్చి యశోని చూచేవాడు.ఒకసారి మళ్ళీ ఆ డాక్టరుని

తీసుకవచ్చాడు. తన జీవితంలో అలాంటి అవకాశం దొరకనట్లు ప్రవర్తించేవాడు.

రాత్రిళ్ళు నేను ఆ గదిలోనే పడుకునేవాడిని. కానీ సరిగ్గా నిద్ర పట్టేదికాదు. యశోకి ఏదైనా కావలసి వస్తుందేమో; నిద్రపట్టితే మెలకువ రాదేమోనని భయపడేవాడిని. ఆరోజు రాత్రికూడా అలాగే మగత నిద్రలో వున్నాను. ఇంతలో ఏదో అడుగుల చప్పుడు విని ద్వారంవైపు చూచాను. ఒక పురుషాకారం గదిలోకి వస్తున్నట్టు కనబడింది. గదిలోని బెడ్‌లైటు మసకకాంతిలో ఆ వ్యక్తి రాజేంద్రలా కనబడ్డాడు. గదిలోకి వచ్చి యశో మంచంముందు ఆగి కొంచెంసేపు అలాగే నుంచున్నాడు. నా మంచంవైపు ఒకసారి చూచాడు. తరువాత నెమ్మదిగా యశో నుదుటిపై చెయ్యిపెట్టి చూచాడు. దుప్పటి సరిగ్గా కప్పుతూంటే యశోకి మెలుకువ వచ్చింది. కళ్ళు తెరువకుండానే 'ఎవరు ? బాదల్‌బాబూ !' అంది. రాజేంద్ర గబగబా బయటికి వెళ్ళిపోయాడు. నేను యశో మంచము దగ్గరకు వెళ్ళి "అవును అమ్మీ, నేనే" అన్నాను. యశో నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని పక్కకు ఒరిగింది.

ఆ దృశ్యం నా కిప్పటికీ కళ్ళకు కట్టినట్టు కనబడుతుంది మనసులోని మమతా, మమకారం మాసిపోవటమనేది ఎంత కష్టమో గ్రహించాను. ఒక్కసారి ఒకవ్యక్తిని ప్రేమించటం తటస్థిస్తే దాని ప్రభావం నుంచీ విముక్తవడం ఎంత అసంభవం. అవకాశం దొరికినప్పుడల్లా అది తలఎత్తుతుంది. మనస్సు, శరీరం ఎవరికి చెందినా ఆప్రేమ హృదయంలో నివసిస్తూనే వుంటుంది. అది రావణాసురుని కాష్టములాంటిది. ఆ అగ్ని ఎన్నటికీ ఆగిపోదు. ఆ మంట ఎన్నటికీ చల్లారదు.

రాజేంద్ర చెప్పినట్లు మూడురోజులకి జ్వరం తగ్గిపోయింది. కాని యశో చాలా నీరసంగా వుంది. అనుకున్న వారము గడిచిపోయింది. అలాంటి స్థితిలో యశోని తీసుకుని తీర్థయాత్రలకు ఎలా వెళ్ళటం. యశో ఫరవాలేదు పోదామంది. ఈసారి నేను అడ్డుపెట్టవలసి వచ్చింది. సరళ సంతోషానికి మేరలేదు. ఒకసారి ఎగిరి గంతువేసి యశో మెడ చేతులలో చుట్టి రెండు బుగ్గలమీదా ముద్దులు పెట్టుకుంది.

రాజేంద్ర "మీరు ఎంతకాలంవుంటే అంత సంతోషం మాకు రామబాబూ! యశో చాలా నీరసంగా వుంది. నా శక్తివంచన లేకుండా ఆమెకు నేను వైద్యం చేస్తాను. ఆమె మామూలుగా ఆరోగ్యవంతురా లయ్యేవరకూ మీరిక్కడే వుండిపోండి. ఇది చాలా ఆరోగ్యవంతమైన ప్రదేశం. ఆరోగ్యంకోసం అనేకమంది యిక్కడకు వస్తూవుంటారు" అన్నాడు.

జవాబు యశో నోటివెంట వచ్చింది. "మేమంటే మీకింత దయా, కరుణా ఎందుకు చెప్పండి. బదులు తీర్చలేని దయకూడా భరించటం కష్టంగా వుంటుంది రాజేంద్రబాబూ! మీఫీజు ఏమిటి యివ్వమంటారు?" అంది.

రాజేంద్ర నేత్రాల్లోంచి అవ్యక్తమైన బాధ క్షణమాత్రం గోచరించింది. "దీనిని దయా, కరుణా అని మమ్మల్ని కించపరచకు యశో. మీరు దగ్గరవుంటే మాకెంతో సంతోషంగా వుంటుంది. కేవలం స్వీయ లాభంకోసం చేస్తూన్నపని. మీరు యింకా కొన్నాళ్ళు యిక్కడ వుండటమే నాఫీజు" అన్నాడు.

రాజేంద్ర ఎంత గంభీరుడో, సుశిక్షితుడో నాకు తెలుసు. అవసరంవస్తే పెదవులు విప్పుతాడు. లేకపోతే తాళం వేస్తాడు. అటువంటి రాజేంద్ర ఎంత బాధపడుతూ ఆ మాటలన్నాడో నేను గ్రహించాను. అతనిని యశో పరాయివానిగా చూస్తూందనీ, తన పూర్వ ప్రేమకు విలువయేమీ యివ్వడంలేదని గ్రహించి బాధపడివుంటాడు. కాని యీ సమస్యకు పరిష్కారమేముంది? సుశి మరణించకపోతే, యశోను నేను కలుసుకోకపోతే, బహుశా యశో రాజేంద్రను వివాహమాడియుండును. విధి యింకొక విధంగా తలచింది.

* * *

ఇంకొక నాలుగురోజులు గడచిపోయాయి. రాజేంద్ర యేవో టానిక్కులు తీసుకోమన్నాడు. యశో భారమంతా సరళ వహించింది. త్వరలోనే ముఖంలోకి పూర్వపు తళుకూ, కళా వచ్చాయి.

ఒకనాటి మధ్యాహ్నం నేను యశో గదిలోకి వచ్చేటప్పటికి సరళ ముందర వీణ వేసుకుని కూర్చునివుంది. నేను ఆశ్చర్యపోయాను. సరళ వద్ద వీణ వుందనీ, ఆమె దానిమీద పాడుతుందనీ నాకు తెలియదు. కంఠస్వరం బాగానే వుంటుంది. నన్ను చూచి నవ్వుతూ "రండీ, మీ కోసమే యశో యిదంతా బయటకు తీయించింది" అంది. నాకేమీ అర్థం కాలేదు. కర్మకాలి వీరు నన్ను పాడమనరుకదా?

యశో-"కంగారుపడకండి. సరళ యీ మధ్య వీణ వాయించటం నేర్చుకుంది. అందుచేత పాడి చూపించమన్నాను" అంది.

"అదంతా నాకు బాగానేవుంది. నాక్కావలసింది యిందులోకి నే నెందుకు వచ్చాను? మంచిదే, పాడమను" అన్నాను.

"నేను పాడను. రామబాబు వీణవాయిస్తాడు; యశో పాడుతుంది. ఆమె కంఠం బావుంటుంది. నాలుగు సంవత్సరాల క్రితం బాగా పాడేది" అంది.

"నాకెవరైనా ఫరవాలేదు సరళా! ఎవరు పాడినా శ్రద్ధగా వింటాను" అన్నాను.

యశో కాస్త సిగ్గుపడింది. "మీరు నన్ను ఎప్పుడూ పాడమని అడిగాలేదు. పాడితే నవ్వరుకదా?" అంది.

"నిన్ను యిప్పటివరకూ అడగపోవటానికి కారణం నువ్వు పాడ తావని తెలియకపోవటమే. చక్కగా పాడేవారిని చూస్తే నాకెంతో ముచ్చట" అన్నాను.

సరిగ్గా అదే సమయానికి రాజేంద్ర లోపలికి వచ్చి "అరే, సరళా! ఏమిటి ఎప్పుడూలేంది ఈవేళ వీణతీశావు?" అన్నాడు.

"నాకోసంకాదు రాజేంద్రా! యశో పాడతానంది" డాక్టరుగారికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. కుర్చీలో కూర్చుని "ఆలస్యందేనికి శుభస్యశీఘ్రం, ప్రారంభించు యశో!" అన్నాడు. యశో రాజేంద్ర ముందు పాడటానికి కాస్త సంశయించింది. ఆలశ్యం చేస్తూంటే సరళ యశో చెవిలో ఏదో చెప్పింది. యశో ముఖం లజ్జాపూరితమైంది.

సరళ వీణ వాయించటం ప్రారంభించింది. యశో పాట అందు కుంది. పాట సరిగ్గా జ్ఞాపికిలేదు. ఏదో 'ముద్దుల నవ్వుల మోహన కృష్ణా....' అంటూ పాడినట్టు జ్ఞాపకం. పాట పాడుతున్నంతసేపు సరళ నాకేసి చూచి నవ్వుతోంది.

యశో అంత చక్కగా పాడగలదని నేనెన్నడూ ఊహించలేదు. యశో కూనిరాగాలు తప్ప పాడగా వినలేదు. ఎంత విచిత్రంగా వుంది. అది నాకు తనంతట తాను తెలియపరచటం యిష్టంలేక మానివేసినట్టుంది. సౌందర్యమూ, సుగుణాలతోపాటు మనస్సుని రంజింపచేసే ఈ శ్రవణా నందకరమైన శక్తికూడా వుందని నాకు తెలియదు. మూడున్నర సంవత్స రాలు గడిచిన తర్వాత ఈనాడు తనంటతాను యిది వెల్లడించింది. సరళ కూడా వీణ బాగా వాయించింది. వీణ వాయించే ఆ భంగిమలో కూర్చుని తీగెలను మీటుతూంటే ఎంతో మనోహరంగా వుంది.

పాటంతా అయిపోయిన వెంటనే రాజేంద్ర లేచి నుంచుని— "కంగ్రాచ్యులేషన్! చాలా బాగుంది యశో! నాకు కాస్త అర్జంటుపని వుంది. బయటికి వెళ్ళాలి" అని బయటకు వెళ్ళిపోయాడు.

ఆ మాటల్లో కాస్త ఆవేశం వుంది. ఆ పరిస్థితులలో తనను తాను నమ్ముకోలేక వెళ్ళిపోయాడు. అతనికి పాట నచ్చటంలో ఆశ్చ ర్యంలేదు. పాట బాగుంటే మరొకటి పాడమంటారు. కాని అతనలా చేయలేదు. యింకొకటి పాడుతుందేమో నను భయంతో బయటికి వెళ్ళి పోయినాడు. మానవుడు ఆవేశాలకి బానిస. వుత్సాహం అణచుకోవచ్చు కాని, ఉద్రేకం అణచుకోలేము. యశో అదేమీ గుర్తించినట్టులేదు. "ఎలావుంది మీకు?" అంది.

"ఐస్‌క్రీమ్‌లా ఉంది. యిన్నాళ్ళు నాకు ఎందుకు దీని రుచి చూపించలేదు!"

సరళ - "నా వాయిద్యం ఎలాఉంది? రామబాబూ" అంది మధ్యలో.

"అదికూడా చాలా బావుంది. యశో కంఠము, నీ వీణ వాయిద్యమూ యెంతో చక్కగా కలిసాయి" అన్నాను.

* * *

ఆ రాత్రి యశోని అడిగాను. "నాకు యింతవరకూ ఎందుకు చెప్పలేదు యశో. నీది యింత మధురకంఠమని ?"

"మీరు నన్ను అడుగలేదు. అనేకసార్లు చెప్పుదామనుకున్నాను కాని, సిగ్గూ, పౌరుషమూ అడ్డువచ్చేవి."

"అయితే సంగీతం నేర్చుకున్నావా?" అన్నాను.

"మీరు ముస్సోరి ఒక సంవత్సరంలో వస్తారనగా మాని వేశాను. సంగీతపు మాస్టరు యీ వూరువదలి వెళ్ళిపోయాడు" అంది.

"అది సరే. యిన్నాళ్ళూ నాకు చెప్పనందుకు లోపం భర్తీ చెయ్యాలి. యిప్పుడొక జోలపాట పాడు" అన్నాను.

యశో నవ్వుతూ - "నకు జోలపాటలు రావు. కృష్ణుడిమీద పాటలే వచ్చు" అంది.

* * * *

రాజేంద్ర వైద్యంవల్ల, సరళ శ్రద్ధవల్లా యశో పూర్తిగా ఆరోగ్యవంతురాలైంది. అపుడే అక్కడికి వచ్చి పక్షమురోజులు దాటిపోయాయి యింక యెన్నాళ్ళుంటాము. యశోకి చికిత్స చేయడంలో రాజేంద్ర మమత చిగుర్చింది. అలాంటి స్థితిలో యింకా ఎక్కువకాలం వుండటం మంచిదికాదు. నన్ను ఆశ్చర్యపరచిందేమంటే యశో దీనిని గుర్తించినట్లే కనబడలేదు. ఆమె ప్రేమించని పురుషుని ప్రేమను ఎంత నిర్దయగా తిరస్కరిస్తుంది స్త్రీ ! కనీసం సానుభూతి, కనికరం అయినా చూపించదు.

వెళ్ళిపోతామని ఎప్పుడన్నా సరళ "ఇంకొక రోజు యింకొక రోజు" అనేది. డాక్టరుగారు యశో యింకా మామూలు స్థితికి రాలేదు అనేవారు. డాక్టరుగారి మాటలకు ఎదురుచెప్పలేక యింకొక వారంరోజులు గడిపివేశాము. చివరకి ఒకరోజున చెప్పాము మరునటి దినం ప్రయాణ

మని, యశోని తీసుకొని అక్కడికి యిక్కడికి ఆ స్థితిలో తిరగటం యిష్టంలేకపోయింది నాకు. రాజేంద్ర కూడా అదే అన్నాడు. అందుచేత ముందర కాశీవెళ్ళి అక్కడ కొంతకాలం వుందామని నిశ్చయించుకొన్నాము.

* * *

డెహ్రాడూన్ ప్లాటుఫారంమీద నించునివున్నాము. ఇంకా రైలు బయలుదేరటానికి పదినిముషాలుంది. రాత్రి నిద్రపోయిన చిహ్నాలు ఎక్కడా సరళముఖంలో కనబడటంలేదు. యశో, సరళా ఏదో మాట్లాడుకుంటూన్నారు.

ఇక రైలు కదలబోయే వేళయింది. యశో రాజేంద్ర దగ్గరకు వెళ్ళి "డాక్టరుగారికి ఫీజు యివ్వలేకపోయాము రాజేంద్రబాబూ! ఆలోటు కూడా మీరే భర్తీ చేయండి" అంది.

రాజేంద్ర -"నువ్వు త్వరలో తిరిగి రావాలి యశో. అప్పుడు యిద్దువుగాని" అన్నాడు.

యశో రైలెక్కుతూ "లఖియాకి నా నమస్కారాలు చెప్పు సరళా!" అంది.

గార్డు పచ్చజండా పడుతున్నాడు. రైలు కూసింది. రైలెక్కుతూ "వస్తాను సరళా!" అన్నాను.

సరళ దగ్గరకు వచ్చి నెమ్మదిగా "నాకు మనస్సులో అన్యాయం చేయకండి రామబాబూ!" అంది.

జవాబిచ్చేలోగా రైలు కదిలింది. చెయ్యి మాత్రం ఊపాను.

# 19

మరునాడు ఉదయాన్నే కాశీ చేరుకున్నాము. ఇల్లు దొరికేవరకూ హోటలులో వుందామన్నాను. యశో వొప్పుకోలేదు. హోటలు భోజనం

చేయనని, నాకలాంటిది పెట్టడంకూడా యిష్టంలేదని చెప్పింది. అందు చేత యిక గత్యంతరంలేక ఒక సత్రింలో వున్నాము. వారంరోజులలో ఒక యిల్లు అద్దెకు దొరికింది. ఆ యింటిలో మూడు నెలలున్నాము. గంగ ఒడ్డున ఒక యిల్లు ఖరీదుచేసింది. మొత్తం మూడుగదులున్నాయి. "మనకి రెండుగదులు చాలు. ఒకటి వంటగది. మరొకటి పడకగది. మూడవది ఏం చేద్దాం చెప్పండి" అంది యశో.

ఆ యింటిలో యింకొక ఆరునెలలు గడచిపోయాయి. యశో పొద్దున్నే గంగాస్నానం చేసేది.వారాని కొకసారి విశ్వేశ్వరాలయంలో పూజచేసేది. చాలాసేపు ఆ శివలింగం ఎదుట అరమోడ్పు నేత్రాలతో నుంచునేది. ఒకసారి అడిగాను. "దేముడినుంచి నీవు ఏమి కోరుకుంటూంటావు అమ్మా!" అని.

పూజచేసిన పుష్పాలలో ఒక పువ్వు తలలో పెట్టుకుంటూ "మీ కంటే ముందర నేను పోవాలని" అంది.

సాయంకాలం బోటుమీద గంగపై విహరించేవాళ్ళం. అన్నిటి కన్నా నాకు అదే నచ్చింది. అప్పుడప్పుడు ఒకరాత్రికి బోటు అద్దెకు తీసుకుని రాత్రింతా అందులోనే గడిపేవాళ్ళం.

యశో బలవంతంమీద తీర్థయాత్రలకు బయలుదేరాము.ముందర ఉత్తరాది క్షేత్రాలంతా తిరిగాం. హరిద్వార్, ఋషీకేష్, బృందావనం, కురుక్షేత్రం, నాసిక్, ప్రయాగ యివన్నీ తిరిగాము. ఒక్కొక్కచోట నెలా రెండునెలలూ చొప్పున వుండిపోయేవాళ్ళం. వెంటనే వెళ్ళిపోదామంటే "వెళ్ళి చేసేదేముంది చెప్పండి" అంది.

ప్రయాగలో వుండగా ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఆనాడు త్రివేణిలో స్నానానికి బయలుదేరాము. గంగా, యమున కలుసుకునే సంగమ స్థానం ఒడ్డుకి కొంచెం దూరంలోవుంది. అక్కడకు పడవలో వెళ్ళాం. అక్కడ కొన్ని కొన్ని చోట్ల ఎర్రటి జండాలు ఎగురుతున్న పడవలున్నాయి. అవి బాగా లోతైన స్థలాలు. అక్కడ ఎవరూ స్నానం చేయకూడదు. నాకు కొంచెం యీతవచ్చును. దానిని ప్రదర్శించటంలో

అలాంటి దానిలో చిక్కుకున్నాను. ఇంకేముంది. కాళ్ళకు నేల అందటం లేదు. చిన్న సుడిగుండముకూడా వున్నట్లుంది. అందులో గిర్రున తిరుగుతున్నాను. యశో అది చూచి గట్టిగా పిలిచింది. 'బాదల్‌బాబూ. యింక బయటకు రండి' ఆమె కేక వినబడింది. కాని జవాబు చెప్పలేకపోయాను. చేతులు ఊపడం మొదలుపెట్టాను. యశో పరిస్థితి శరవేగంతో గ్రహించింది. దగ్గరలో పడవలో తిరుగుతున్న పోలీసుతో చెప్పటం చూచాను. తరువాత స్పృహతప్పింది. మళ్ళీ మెలకువ వచ్చేసరికి ఆస్పత్రిలో ఒకగదిలో వున్నాను. నా మంచందగ్గిర కుర్చీలో యశో కూర్చునివుంది. తెల్లని బుగ్గలమీద కన్నీటి చారలు స్పష్టంగా కనబడుతున్నాయి. కిటికీలోంచి బయటకు పరధ్యానంగా చూస్తూంది. శరీరంలో ఎంతో నీరసంగా వుంది. కాస్త తలనొప్పిగా వుంది.

నెమ్మదిగా "అమ్మీ!" అని పిలిచాను.

యశో ఉలిక్కిపడి నావైపు తిరిగింది. మరుక్షణంలో తన ముఖాన్ని చేతులలో దాచుకుని ఏడవటం మొదలుపెట్టింది. లేవడానికి ప్రయత్నించాను. దానితో తలనొప్పి ఎక్కువయింది. 'అబ్బా' అని తిరిగి పడుకున్నాను.

యశో చేతులు విప్పి "లేవకండి; మీకు యింకా స్వస్థత చిక్కలేదు" అంది.

నీరసంగా - "అసలు జరిగిందేదో చెప్పు యశో" అన్నాను.

యశో చీరచెంగుతో కళ్లు తుడుచుకుంటూ — "ఎంత భయపెట్టారు మీరు నన్ను? మీ గురించి నేను ఎంత యాతన పడ్డాను. తలుచుకుంటే గుండె అవిసిపోతూంది. అనుక్షణము మిమ్ములను నేను ఎక్కడ చూడగలను చెప్పండి. ఈనాడు మిమ్మల్ని భగవంతుడు రక్షించకపోతే నా గతి యేమగును?" అంది.

"రక్షించింది నువ్వు. అమ్మీ! భగవంతుడుకాదు. ఇక నాకు ఆ అవసరంలేదు. ఒక విధంగా ఆ స్థానాన్ని నీవే ఆక్రమిస్తున్నావు. ఈనాటినుంచీ నా ప్రాణంకూడా నీదయి పోయింది. ఇక నా వద్ద మిగిలిందేమిటి?" అన్నాను.

యశో పక్కమీదకు వచ్చి కూర్చుని - "నేను మిగిలాను బాదల్ బాబూ! ఏమి పోయినా నా సర్వస్వమూ మీదే. ఇలాంటి పనులు ఎప్పుడూ చేయనని నాకు మాటివ్వండి. జీవితంలో ఎప్పుడూ ఈ రోజు భయపడినంతగా నేను భయపడలేదు. అచేతనమైన మీ శరీరాన్ని చూస్తుంటే గుండె లవిసిపోయాయి. ఏడుస్తూ ఈ ఆస్పత్రికి తీసుక వచ్చాను" అంది.

"ఈ నాటినుంచీ నేను నీ మాట జవదాటను అమ్మీ!"అన్నాను.

జరిగినసంగతి తరువాత తెలిసింది. పోలీసులు నన్ను బయటికి తీసేటప్పటికి బాగా నీరు తాగి వున్నాను. అలాంటి స్థితిలో యశో పరిస్థితి ఎంత హృదయ విదారకరంగా వుండి వుంటుంది. ఎంత క్షోభపడి వుంటుంది. ఒంటరి స్త్రీ. నిస్సహాయురాలు. నూతన ప్రదేశం. ఏడుస్తూ చుట్టుప్రక్కలవారిని "ఈయనని ఆస్పత్రికి తీసుకువెళ్ళండి. మీ మేలు ఎన్నటికి మరచిపోను." అని విలపించిందట. పడవలో వేసి ఒడ్డుకు తీసుకొచ్చారు. పడవలో స్పృహలేని నా శరీరాన్ని దగ్గరపెట్టుకుని,ఆమె యెంత దుఃఖించి వుంటుంది. ఒడ్డుకు తెచ్చి ప్రథమ చికిత్స చేసి అప్పుడు ఆస్పత్రికి తీసుకవచ్చారు.

తడిబట్టలతో ఆస్పత్రికి పిలపిస్తూవచ్చి - డాక్టరుతో "డాక్టరు గారూ! నాకు పతిభిక్ష పెట్టండి. ఈయనని రక్షించండి" అందిట.

డాక్టరు - "యేమీ ఫరవాలేదమ్మా త్వరలోనే నయమవుతారు" అన్నారు.

"కాదు డాక్టరుగారూ! ఒకసారి కళ్ళువిప్పి నన్ను చూచేటట్లు చేయండి. నా రక్తం తీసుకోండి కావాలంటే" అందిట.

"రక్తం అక్కరలేదమ్మా! కావలసిందంతా నేను చేస్తాను.నువ్వు బయటికి వెళ్ళమ్మా" అన్నారుట.

ఆస్పత్రిలో నాలుగు రోజులున్నాను. యశో నన్ను కంటికి రెప్పలా కాచుకుంది. తరువాత యింకా వారంరోజులు కదలకుండా పడుకోవలసి వచ్చింది. యింక అప్పటినుంచీ ఎక్కడకు వెళ్ళినా

నదిలో ఈదనిచ్చేదికాదు. తనతోపాటు ఒడ్డునే నిలబడి స్నానం చేయమనేది. అప్పుడప్పుడు ఆ పనికూడా తానే చేసేది. ఎక్కడైన జనసమూహంలో నాచెయ్యి గట్టిగా పట్టుకునేది. ఆ విధంగా నన్ను ఎన్నో ఊర్లు తిప్పింది. ప్రతి చిన్న పనీ ఆమే చేసేది. ఏమైనా నేను చేయబోతే "మీరు ఊరుకోండి. మీరేమీ చేయనక్కరలేదు. కాస్త మిమ్మల్ని మీరు చూచుకుంటే చాలు" అనేది.

ఈ విధంగా రెండు సంవత్సరాలు తిరిగి తిరిగి కాశీ చేరుకున్నాము. ఇంకొక ఆరు నెలలు గడిపివేశాము. దక్షిణాది క్షేత్రాలను చూడటానికి వెళ్దామంది. నేను ముందర వద్దన్నాను. తిరిగి తిరిగి ఎంతో అలసిపోయాను. రైలు ప్రయాణమంటేనే విసుగెత్తిపోయింది. అయినా యశో పంతంమీద వెళ్ళటం తప్పలేదు. జ్ఞానం వచ్చిన తరువాత తెలుగుదేశం ఎప్పుడూ చూడలేదట. మాతృదేశం చూడాలని కోరికగా వుందంది.

మళ్ళీ రైలెక్కాము. తిరుగుడికి అంతేముంది? జీవితంలో నాకొక ఆశయంలేదు. యశోవద్ద నాకు కావలసిన ఆదరం, అనురాగం, రక్షణా లభించాయి. నా భారమంతా ఆమే మోస్తోంది. వీటినన్నింటినీ నేనెందుకు కాలదన్నాలి? ఎదురీత చేతకానప్పుడు ప్రవాహంలోపడి కొట్టుకుపోవుటే శేషించింది. అదే చేశాను.

అనేక పుణ్యక్షేత్రాలు తిరిగాము. అప్పుడు మేము తిరుపతినుంచీ పూరీ వెళ్తున్నాము. రాజమండ్రిస్టేషన్ దారిలో తగులుతుంది యశో- "మీఊరు ఒకసారి వెళ్దాం. మీ యిల్లు చూపించండి. ఈ కోరిక నాలో చాలాకాలంబట్టీ వుంది. అందరూ చూస్తారని భయంగావుంటే రాత్రి వెళ్ళి చూద్దాం. దూరంనుంచైనా ఒకసారి చూద్దాం" అంది.

ఈ కోరికను ఎలా నిరాకరించగలను? ఆమెను యింటికి తీసుకు వెళ్ళకుండా వుండటానికి అందరూ నన్ను వేలెట్టి చూపిస్తారనికాదు. యశోకి ఏమైనా అవమానం జరుగుతుందేమోనని భయం. ఎవరైనా ఏమైనా అంటే నేనేమి చేయగలను? ఇల్లు వదలిపెట్టి వచ్చినప్పటినుంచీ అన్నింటితోపాటు యింటి వ్యవహారంకూడా బాబయ్యే చూస్తున్నాడు.

ఇల్లు ఎవరికో అద్దె కిచ్చానని ఒకసారి వ్రాశాడు. దానిమీద వచ్చిన డబ్బు భూములమీద దానితో కలిపి అప్పుడప్పుడు పంపిస్తూ వుండేవాడు. నేను ఏదో దేశసంచారం చేస్తానని ఆయన అభిప్రాయం. నాతోటి ఒక స్త్రీ కూడా వుందని తెలిస్తే ఆయన ముఖంమీద ఉమ్మివేస్తాడు. ఇక మా పిన్ని, ఆయన రెండవ పెళ్ళాం సంగతి చెప్పనక్కరలేదు. పురాతన స్త్రీ మాత్రమే కాదామె. అంతకంటె అందకత్తె మా కుటుంబంలో ఎక్కడాలేదని ఆమె గర్వం. యశోని చూడిందంటే లలితాదేవి మండి పడుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో యశోని రాజమండ్రి తీసుకు వెళ్ళటం వివేకవంతమయినదికాదు. ఆమె కోరిక సమంజసమైనది. తన యిల్లు తనకు చూపించమంటూంది.నా తలిదండ్రుల ఆశీర్వాదం ఆమెకు లభించ లేదు. వారు స్వర్గస్థులయ్యారు. ఇక యిల్లయినా చూపించలేనా ? అవూరు దారిలో ఎలాగా తగులుతుంది. సరే రాత్రి ఎవరూ చూడరు. ఒకసారి చూపించుదామని నిశ్చయించాను.

ఒకరోజు రాత్రి తొమ్మిదిగంటలకు రాజమండ్రి చేరుకున్నాము. సామాను స్టేషనులో వదలి రిక్షామీద యిన్నీసుపేట బయలుదేరాము. ఇల్లు కొంచెం దూరంలో వుండగానే రిక్షా దిగి నడచివచ్చాము. లోపల లైట్లు వెలుగుతున్నాయి. తలుపులన్నీ వేసివున్నాయి. "ఇదే నాయిల్లు. ఇక్కడే నేను జన్మించాను. ఇక్కడే పెరిగాను. ఎన్నో స్మృతులతో నిండివుందా గృహం. అన్నపత్రిలో చేర్చకముందు గదిలోనే సుశీ పడు కునేది. ఆ యెడమవైపు గదిలోనే రోహిణీ నక్షత్రంలో పుట్టానని మా అమ్మ చెప్పేది"

ఈ యింటిని చూడటానికి యశోని తీసుకుని రాత్రిపూట చాటుగా వచ్చాను. లోపలికి వెళ్ళి నేనెవరినో చెప్పుకునే ధైర్యం నాకులేదు.నేను చేసిన దోషమేమిటి? తలిదండ్రులు జీవించివుంటే ఎంతో సంతోషించే వారు. యశోని చూస్తే మా అమ్మ హృదయం కరిగిపోయేది. ఎంత చక్కటి రూపమమ్మా నీది. బంగారపు బొమ్మలావున్నావు. మా లలిత పొగరు అణుస్తావు నువ్వు. పద యిప్పుడే ఆమెకు చూపిస్తాను అనేది. యశో చాలాసేపు యింటివైపు చూస్తూ నించుంది. ఆమె మెదడులో

సాగుతున్న ఆలోచనలేమిటి ? యశో ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి 'ఈ యింటికి యజమానురాలిని నేను. అయినా లోపలికి వెళ్ళలేను. దొంగతనంగా రాత్రి వచ్చి చూచిపోతున్నాను. కాస్త యిల్లు లోపలికి చూపించరా ?" అంది.

"ఎలాగ యశో ! వారికి తెలుస్తుందేమో !" అన్నాను.

"ఎలా తెలుస్తుంది చెప్పండి ? మిమ్మల్ని వారు ఎప్పుడూ చూడలేదుకదా ? బాటసారులమని చెప్పుదాం. ఏదో వంక పెడదాం. మంచి నీళ్ళు కావాలంటాను" అంది.

"రాత్రివేళ మంచి నీరేమిటి యశో ?" అన్నాను.

"లేకపోతే రాత్రి పడుకోవటానికి కాస్త చోటివ్వమందాము" అని నా చెయ్యి పట్టుకుని లాగుతూ "కాదనకండి. ఒకసారి చూచివద్దాం" అంది.

తలుపు తట్టాము. ఒక ముసలాయన తలుపు తీశారు. బయటికి వచ్చి - "ఏం కావాలి నాయనా ? ఎవరు మీరు ?" అన్నారు.

"మేము బాటసారులం. కాస్త రాత్రి మీ యింటిలో పడుకోవటానికి చోటివ్వండి" అన్నాను.

ఎంతో వినయంగా నా వినయ విధేయతలకి ఆయనేమీ లొంగలేదు. "ఇదేమి సత్రం కాదబ్బాయి. వూరిలో బాటసారులకి వేరే సత్రం వుంది. అక్కడకు వెళ్ళండి" అన్నాడు.

ఆయన ఆ మాటలు చెప్తూంటే యశో నిబ్బరించుకోలేక గడప దాటి లోపలికి వెళ్ళింది.

అది చూచి ముసలాయన - "యిదేమైనా వేశ్యా గృహమనుకుంటున్నావా ? అబ్బాయీ ! ఎవతెనో తీసుకవచ్చి యింట్లో జొరబడుతున్నావు బయటికి పొండి" అన్నాడు.

ఆ మాటలువిని కోపంతో నేను వణికిపోయాను. నా యింట్లో యశోని యిలాంటి మాటలంటాడా ? అప్రయత్నంగా చెయ్యి ఎత్తాను

యశో గబగబా వచ్చి నా చెయ్యి పట్టుకుని. "వూరుకోండిమీరు ఒక ముసలాయనమీద చెయ్యి చేసుకుంటారా? ఎవరితో ఎలా మాట్లాడాలో తెలియదు." అని ముసలాయనవైపు చిరునవ్వుతో చూస్తూ— "అది కాదు తాతగారూ. కాస్త యిల్లు చూస్తున్నాను. ఈ పటంచూడండి ఎంత బావుందో. ఆహా ఎంత అందంగా వుంది. ఎవరు ఈమె? మీ మనుమరాలా?" అంది.

తాతగారు అని పిలవటంతో ముసలాయన శాంతించారు. పటాన్ని పొగడటంతో ప్రసన్నులయ్యారు. ఇంతట్లో లోపలినుంచీ యశో ఎవరి ఫొటోని ఎవరి అందాన్ని పొగిడిందో ఆమె ఆ గదిలోకి వచ్చింది.

"ఏమిటిదంతా తాతయ్యా? ఈ రాత్రివేళ ఎవరితో దెబ్బలాడుతున్నావు. వీ రెవరు?" అంది.

యశో తాతగారిని జవాబు చెప్పనీయలేదు. ఆ అమ్మాయిదగ్గరకు వెళ్ళి చెయ్యి పట్టుకొని - "మేము బాటసారులం చెల్లీ, ఈ రాత్రి పడుకోవటానికి కాస్త చోటివ్వమంటున్నాము" అంది.

యశో చిరునవ్వుతో, చెల్లి అనే పిలుపుతో, ఈమెకూడా కరగిపోయింది. యశోని చూస్తే ఎవరైనా అంతే. ఆమెకూడా నవ్వుతూ— "తప్పకుండా అలాగే చెయ్యండి అక్కయ్యా. ఈ యింటిలో మే మిద్దరమే వున్నాము. కావలసినంత చోటుంది" అంది.

ముసలాయన - "అదికాదు సురేఖా—ముక్కూ ముఖమూ తెలియని...."

అని ఏదో అనబోతూంటే మనమరాలు - "నీకు తెలియదు తాతయ్యా. ఇంట్లో పడుకోవటానికి ముక్కూ మొగమూ తెలియ నక్కరలేదు. అయినా ఈమె నా అక్కయ్య. అందుచేత నీ కూడా మనుమరాలే తాతయ్యా. చూడు ఈమె ఎంత చక్కగా వుందో, సాక్షాత్తు లక్ష్మీదేవిలా వుంది" అంది.

యశో అవకాశం జారవిడువలేదు. ముసలాయనకు వంగి నమస్కరించింది. ముసలాయన యింక అడ్డుచెప్పలేదు. "నీ యిష్టమమ్మా ముసలివాండ్ల మాట ఎవరు వింటారు" అని లోపలికి వెళ్ళిపోయాడు.

అప్పుడు ఆ అమ్మాయి-"రా అక్కయ్యా. కూర్చో. మీరుకూడా కూర్చోండి బావగారు" అని యశోని కుర్చీలో కూర్చోబెట్టి - "యిక చెప్పండి మీ రెవరో, ఎలా వచ్చారో అంతా" అంది.

యశో - "మా గురించి చెప్పటానికి అట్టే ఏమీ లేదు చెల్లీ. మేము దూరదేశస్థులం. తీర్థయాత్రలు చేస్తూండగా ఈ రాత్రి రాజమండ్రి స్టేషన్‌లో గడపవలసి వచ్చింది. వూరు చూద్దామని బయలు దేరాము. ఈ యిల్లు చూస్తే నా కెందుకో మమత కలిగింది. తిరిగిపోయి ఆ స్టేషన్‌లో పడుకునేబదులు ఈ యింటిలో పడుకుందామనే కోరిక కలిగింది. తెల్లవారి నాలుగుగంటలకి మా రైలు. అప్పటివరకూ కాస్త చోటివ్వండి" అంది.

"దానికేముంది అక్కయ్యా. మీరు యింత త్వరగా వెళ్ళిపోతారంటే నాకు చాలా విచారంగా వుంది. నాకు అక్కయ్యలుగాని, చెల్లెండ్రుగాని ఎవ్వరూ లేరు. నువ్వు దొరికావనుకున్నాను. నాకు తాతయ్యతప్ప యింకెవరూ లేరు. చిన్నతనం నుంచీ ఈయనే పెంచాడు. యిప్పుడు ఈయన హఠాత్తుగా గుటుక్కుమంటే నాగతి ఏం కాను ? నాకు పెళ్ళి చెయ్యాలని చూస్తూవున్నాడు. కానీ ప్రతివాడికి పెద్ద పెద్ద కట్నాలు కావాలంటున్నారు. ఎక్కడినుంచీ తేగలడు ఈయన పాపం. నన్నేం చేయమంటావు అక్కయ్యా" అంది.

చెల్లెలు యీ ఆప్యాయతతో అక్కయ్య హృదయం పూర్తిగా వశపరచుకుంది.

"నీ అందాన్ని, నిన్నూ చూచి పెళ్ళిచేసుకునేవాడు, నీకు నచ్చినవాడు ఎవరూ లేరా చెల్లీ ?" అంది.

సురేఖ కాస్త సిగ్గుపడింది చెప్పటానికి.

యశో - "ఫరవాలేదమ్మా చెప్పు. అక్కవద్ద, బావవద్ద నీకు సిగ్గెందుకు" అంది.

సురేఖ సిగ్గుపడుతూనే - "మధు వున్నాడు. చాలా మంచివాడు. ఏ వాళ్ళ తలిదండ్రులు పేరుకైనా కట్నం లేకపోతే చేసుకోవటా

నికి వీలు లేదంటున్నారు. మధు ఎక్కడికైనా వెళ్ళిపోదా మంటున్నాడు. తాతయ్యని వదలి ఎలా వెళ్ళను ? చెప్పు" అంది.

నాకు సుజాత జ్ఞాపకాని కొచ్చింది. సురేఖకూడా అలాగే అవుతుందా.

యశో "నువ్వేమీ చింతపడకు చెల్లీ ! మధు తలిదండ్రులు ఎంత కట్నం కావాలంటారు చెప్పు ?" అంది.

సురేఖ నిరాశతో "లాభంలేదు అక్కా ! కనీసం రెండువేలైనా కావాలంటున్నారు" అంది.

"నీకేమీ ఫరవాలేదు. రేపే మధూతో చెప్పు. మీ అక్కయ్య నీకు రెండుమూడు నెలల్లో పంపిస్తుందని. నువ్వేమీ అడ్డుచెప్పకు చెల్లీ ! ఇది అక్కయ్య అభిలాష" అంది.

ఈ దెబ్బకు చెల్లెలు తట్టుకోలేకపోయింది. యశోని కౌగలించుకుని "నువ్వు నిజంగా మానవ మాతురాలివి కాదు అక్కయ్యా ! మీ యిద్దరూ యీ రూపంలో వచ్చి నన్ను పరీక్షిస్తున్నారు. ఇంత అందంగా మానవులుండరు" అంది.

యశో నవ్వుతూ "అలాంటి అనుమానాలు పడకు చెల్లీ ! మేము కూడా నీబోటి వాళ్ళమే. నా దగ్గర కాస్త డబ్బుంది. అది చెల్లెలికి కట్నంగా యిస్తాను. అంతే" అంది.

చెల్లెలికి యింకా నమ్మకం కుదరక అక్కయ్య అడ్రసు అడిగింది. యశో కాశీ అడ్రసు యిచ్చింది. యశో యిల్లు చూపించమంది. ఎడమవైపు గదిలోకి వచ్చినప్పుడు మెల్లగా చెవిలో చెప్పాను, 'ఇక్కడ నేను పుట్టానని.' యశో నా ముఖంకేసి చూచి నా చెయ్యి దృఢంగా పట్టుకుంది.

రెండు మంచాలు తెచ్చి పక్కలు వేసింది. చాలాసేపటివరకు అనేక కబుర్లు చెప్పింది. మధు ఆ ఊరిలో అందరికంటె అందంగా వుంటాడట. కాలేజీలో బి. యస్. సి. చదువుతున్నాడు. ఒకసారి విజృంభించినఆబోతు తరుముతూవుంటేచూస్తువెళ్ళి చెయ్యి విరక్కొట్టుకున్నా

అక్కయ్యని ఆరాత్రి కాబోయే మరిదిని కూడా చూడమంది. అక్కయ్య ఒప్పుకోలేదు. ఎంత అమాయకురాలు ఈ సురేఖ !

యశో "ఈ యింటి యజమాని ఎవరు ? సురేఖా !" అంది.

సురేఖ "ఆయనని మేమెప్పుడూ చూడలేదు అక్కా. ఇక్కడ వాళ్ళ బాబయ్య వున్నాడు. వారు చెప్పగా విన్నాను. ఆయన చిన్నతనంలో ఎవరినో ప్రేమించారట. ఆవిడ చనిపోవటంతో ఆయన ఇల్లు వదలి దేశసంచారం చేస్తున్నారట. చాలా మంచివారని అందరూ చెప్పుకుంటారు. పాపం ఎంత విషాధగాధ" అంది.

ఆ మాటలు వింటూంటే యశో కళ్ళు నీళ్ళు చెమర్చాయి.

"అవును చెల్లీ ! నీవు చెప్పింది నిజం. చాలా విషాధగాధ" అంది.

రాత్రి చాలా ఆలశ్యమైన తరువాత పడుకున్నాము. యశో గాఢంగా నిద్రపోయింది. నాకు నిద్రపట్టలేదు. మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది. నా యింట్లో నేను అతిథిగా పడుకుంటూన్నాను. పూర్వకాలంలో యిది మా నాన్నగారి ఆఫీసుగది. తెల్లవారకట్ల మెలకువ రాకపోతే నా గుట్టు బయటపడుతుంది. అందుకని కొంచెం నిద్ర వస్తూన్నా ఆపుకున్నాను.

తెల్లవారి మూడుగంటలకే యశోని లేపివేసాను. చెల్లెలివద్ద వీడ్కోలు తీసుకుంది. డబ్బు తప్పకుండా పంపుతానని మాట ఇచ్చింది. వచ్చేముందు సురేఖ "బావగారూ ! అక్కయ్యని జాగ్రతగా చూచుకోండి" అని హెచ్చరించింది. ఆనాడు రణధీర్ కూడా అలాగే చెప్పాడు. అతను ఈమె తమ్ముడు. ఈమె చెల్లెలు !

బయలుదేరి వచ్చేశాము. ఆ రాత్రి తనకు పట్టినంత గాఢనిద్ర ఎప్పుడూ పట్టలేదంది. ఆ రాత్రి ఆ యింటిలో గడిపినందువల్ల తనకు ఎంతో మనశ్శాంతి లభించిందంది. సురేఖలాంటి చెల్లెలు తనకు దొరకినందుకు చాలా సంతోషంగా వుందంది. మేము తీర్థయాత్ర ముగించుకుని కాశీ తిరిగి చేరుకునేటప్పటికి సురేఖ పుత్రరమూ, పెండ్లి శుభలేఖ

కనపడ్డాయి. ఉత్తరంలో అక్కయ్యని, బావని రమ్మనమని నొక్కి వ్రాసింది.

'ఈ శుభకార్యము నీ దయవల్లనే అవుతూవుంది. అక్కయ్యా నువ్వు రాకపోతే ఆ వెలితి తీరదు. మధుకూడా యిదే అంటున్నాడు, పెళ్ళి అయింతరువాత నీకు మే మిద్దరమూ నమస్కరిస్తాము అక్కా! నీవు రావాలి. నాకు అమ్మలేదు, ఇంకెవరూ లేరు. నువ్వు వచ్చావంటే ఆ లోటులన్నీ తీరుతాయి. రాకపోతే పెళ్ళిరాత్రి నేను ఏడుస్తూ కూర్చుంటాను. చెల్లి వివాహం నీవు చూడకపోతే యింకెవరు చూస్తారు. అక్కా తప్పక రావాలి. బావగారికి నా నమస్కారాలు"

ఉత్తరం పట్టుకుని యేడుస్తూ కూర్చుంది యశో. ఏ మాత్రం వాత్సల్యం చూపినా ఈమె గుండె కరగిపోతుంది. ఇక చేసేదేముంది? చాలా నెలలక్రితం వచ్చిన వుత్తరంయిది. పాపం ఎంత బాధపడిందో అక్కయ్య రాకపోతే. చివరకి వుత్తరమైనా రాకపోతే నిజంగా దేవతలే అలా వచ్చారనుకుందేమో. యశో ఒక పెద్ద ఉత్తరం వ్రాసింది. అందులో తను ఎందుకు పెళ్ళికి రాకపోయిందో వ్రాసి, పెళ్ళి కానుకగా ఒక ఖరీదయిన బెనారస్ చీర పంపింది.

## 20

కాశీ తిరిగి వచ్చిన కొద్దికాలానికి యశో సరళకీ, లతియాకీ ఉత్తరాలు వ్రాసింది. మూడు సంవత్సరాలనుంచీ వారి సమాచారం మాకు యేమీ తెలియలేదు. దానికి బాధ్యులం మేమే. అక్కడికీ యిక్కడికీ తిరుగుతూండటంవల్ల ఉత్తరం వ్రాయలేదు.

ఒకనాటి మధ్యాహ్నం నేను నిద్రపోతూన్నాను. యశో గబగబా గదిలోకి వచ్చింది. "బాదల్‌బాబూ! బాదల్‌బాబూ!" అంటూ త

లేపింది. నిద్రమత్తు యింకా వదలలేదు. 'ఏమిటి సుందరీ సంగతి?' అన్నాను. యశో చెవులు మూసుకుని "రామ-రామా మళ్ళీ ఎప్పుడూ అలా పిలువకండి." నేను ఆశ్చర్యపోయాను. సుందరీ అనే పేరు తనకు నచ్చిందని ఆమె ఒకసారి చెప్పింది. పరిహాసమేమో అనుకున్నాను. ముఖం చూస్తే పాలిపోయింది. యశో చేతిలో ఉత్తరం నామీద పడవేసి బయటకు పోయింది. వణికే చేతులతో ఉత్తరం తీసుకుని చదవటం ప్రారంభించాను. అది సరళవద్ద నుంచీ వచ్చిన లేఖ.

"ప్రియమైన యశోకి,

చాలాకాలం తర్వాత జాబు వ్రాసావు. మీ గురించి సంగతులు తెలియక మేము చాలా కంగారుపడుతున్నాము. ఎక్కడున్నా ఉత్తరం వ్రాస్తానని చెప్పావు. ఇన్నాళ్ళు ఎందుకు వ్రాయలేదు. రామబాబూ, నీవు కులాసాగా వున్నారని తలుస్తాను.

"నా సంగతి తరువాత చెప్తాను. మొదట లఖియా విషయం చెప్పనీ. ఎలాచెప్పేది? ఆ విషయం తలచుకుంటూంటే హృదయం పగిలిపోతూంది. నువ్వు ఒకసారి అన్నావు లఖియా! కథ విని కష్టాలు ఓరిమితో సహించే వాళ్ళనే సమాజం, చివరకు దైవం కష్టపెడతారు. అది ఎంత యదార్థమైం దిప్పుడు. సంగతి చెప్పకుండా నిన్ను నేను బాధపెడుతున్నాను

"అయిదు సంవత్సరాలైంది మీరిక్కడనుంచీ వెళ్ళిపోయి. నేను వారాని కొకసారి ఆశ్రమం వెళ్ళి లఖియాని కలుసుకునేదానిని. లఖియా నువ్వు ఆమెకు వ్రాసిన ఉత్తరాలు కూడా చూపించేది. రెండు సంవత్సరాలైన తరువాత నీవద్దనుంచీ జాబులు రావటం మానివేశాయి. మామూలుగా నేను ఒకసారి లఖియా కోసమని ఆశ్రమం వెళ్ళాను. ఆసారి మామూలుకంటె ఎక్కువ ఆలశ్యం చేశాను. ఒక పదిహేను రోజులయిన తరువాత వెళ్ళాను. దురదృష్టవంతులకు సమయానికి ఏవో ఆటంకాలు వస్తూవుంటాయి. ఆశ్రమం వెళ్ళేటప్పటికి అక్కడ లఖియాలేదు. దారుణమైన వార్త ఒకటి విన్నాను. ఎలా చెప్పేది? లఖియా గురువు

గారిని తీవ్రంగా గాయపరచిందట. ఆమెని పోలీసులు వచ్చి పట్టుకు పోయారట. లఖియా ఆ నేరాన్ని ఒప్పుకుందిట. నా చెవులను నేనే నమ్మలేకపోయాను. ఇందులో ఘోరమైన అసత్యమేదో వుందనుకున్నాను. వివరాలు అడిగాను. అవి ఎవరికీ తెలియవు. రణధీర్ ఆశ్రమం ఆరాత్రే వదలి వెళ్ళిపోయాడు. ఆ ఘోర సంఘటన లఖియా కుటీరంలో జరిగిందట. తలమీద ఒక యినుపదండెంతో కొట్టిందట. తల పగిలి ఒక వారంరోజులు స్పృహలేకుండా వున్నాడట. ఆ గాయానికి కారకురాలు తనే అని చెప్పిందట. పోలీసుల కారణమడుగుతే నా వైధవ్యాన్ని కాపాడుకునేందుకు ఆపని చేయవలసి వచ్చింది. అని ఒకేమాట చెప్పిందట. ఇంకెన్ని ప్రశ్న లడిగినా జవాబు చెప్పలేదట. వాకబుచేస్తే డెహ్రాడూన్ జైలులో వుందని తెలిసింది. అక్కడికి వెళ్ళి ఆమెను కలుసుకున్నాను. వివరాలు చెప్పమని వేడుకున్నాను. దుఃఖము పట్టలేక తలను గోడకేసి కొట్టుకున్నాను. ఆమె యింకేమీ చెప్పలేదు. "సరళా! ఆ వివరాలు తెలుసుకుని నీవు చేసేదేముంది? ఆ నేరం చేసింది నేనే. దానికి శిక్ష అనుభవించాల్సిందే. నాకు ఏమి శిక్ష వేసినా చింతలేదు. దీనిని సులభంగానే దాటివేస్తాను. ఆ తరువాత భగవంతుని ముందు నిలబడి నేనేమి చెప్పుకోగలను? ఆ విషయమే నన్ను బాధపెడుతూంది" అంది. ఇక నేనేం చేస్తాను. లఖియాని రక్షించుకోవటానికి నాచేతనయినదంతా చేశాను. ఆమె వద్దంటూన్నా, ఈ ఊరిలోని ఒక పెద్ద లాయరుని కుదిర్చాను. ఆయనమటుకు ఏంచేస్తాడు? లఖియా ఆ ఒక్కమాట తప్ప యింకేమీ చెప్పలేదు. తీర్పు చెప్పేరోజున నా పరిస్థితి నేను చెప్పలేను. నేను ఎప్పుడూ దైవాన్ని ప్రార్థించలేదు. ఆనాడు అలా చేశాను. ఏడు సంవత్సరాల సింపిల్ యింప్రిజన్‌మెంటు వేశారు. ఆమె పూర్తి వివరాలు చెప్పినట్లయితే వదలిపెట్టివేతురేమో కూడాను. లఖియా గురించి మనకు తెలుసు. కోర్టువారికేం తెలుసు?

"లఖియా ఎలాంటి పరిస్థితులలో అలాంటిపని చేసిందో సులభంగానే ఊహించుకోవచ్చు. యీ గురువు యిలాంటివాడని కలలోనైనా ఊహించుకోలేను. అయినా నాకు మొదటినుంచీ ఆయనమీద అనుమానంగానే వుంది. కాని యింత నీచుడని నేను అనుకోలేదు.

"లఖియాని పదిహేనురోజుల కొకతూరి వెళ్ళి కలుసుకుంటూ వుంటాను. అదయినా యిపవది నిముషములే. డూన్‌లోని స్త్రీల జైలులో వుందామె. ఇంకా నాలుగు సంవత్సరా లుండాలి. తనకేమీ కష్టంగా లేదంటూంది లఖియా.

"ఇదంతా చెప్పిన తరువాత నా గురించి ఏమీ చెప్పబుద్ధి వెయ్యటంలేదు. ఇప్పుడు నావద్ద రెండు సంవత్సరాల కొడుకున్నాడు. పేరు 'రామబాబూ' దగ్గరవుంటే అడుగు. బాదల్‌బాబూ కంగారుపడకు. నీ అనుమతి లేకపోయినా రామబాబూ అనుమతి తీసుకున్నాను. ఏమిటో జీవితంలో అనుకున్నవన్నీ జరుగవు. లఖియా సంగతి విని మీరు చాలా దుఃఖపడతారు. ఆమెకి ఎవరిని చూడాలనీ లేదంటుంది. అయినా మిమ్మల్ని చూస్తే కాస్త మనశ్శాంతి లభిస్తుందామెకు. లఖియాను కలుసుకోవలసిన రోజు బుధవారం. అంటే మీరు యిక్కడికి రావాలంటే వెంటనే బయలుదేరాలి. రామబాబూ, మా బాబుకి గాడ్‌ఫాదర్ అవుతానని ఒకసారి మాట యిచ్చాడు. అందుకని వస్తున్నట్లు మీరు నాకు వైర్ చేయండి."

ఆ ఉత్తరం ఎలా చదివానో నాకు తెలియదు. అది పట్టుకుని అలాగే కూర్చుండిపోయాను. పిడుగులాంటి ఆవార్త విని స్తంభించిపోయాను. లఖియామీద దైవానికి ఈ కక్ష ఎందుకు ? అడుగడుగునా ఈమెని ఎందుకిలా వెంటాడుతున్నాడు ? మొదట కట్టుకున్న భర్త, తరువాత మామయ్య, ఆ తరువాత గురువు-వీరందరినీ ఎందుకు పుట్టించాడు. యశో చెవులు మూసుకుని తనను 'సుందరీ' అని ఎందుకు పిలవద్దందో నాకు అప్పుడు అర్థమైంది. యశో నాకు వ్రాసిన ఉత్తరంలో ఆశ్రమంలోని సన్యాసుల సౌంధర్యారాధనని నిష్కల్మషమైనదనీ, ఇతరులకి హాని చెయ్యదని వ్రాసింది. అదే దృష్టితో గురువుగారి నోటి నుంచీ 'సుందరీ' అనే పిలుపుని సహించింది. ఈనాడు గురువుగారి నిజరంగు బయటపడింది. మొదటినుంచీ ఆమెకు ఆయనంటే గౌరవమూ, నమ్మకమూ ఏర్పడ్డాయి. ఆయనమాట విని నన్నుకూడా వదలుకోవటానికి సిద్ధపడింది. లఖియామే వుండిపోయింది. చివరకు యిలా జరిగింది.

ఈవార్త యశోకు ఎంత క్షోభ కలిగించిందో నేను గ్రహించాను. తను అనుకున్నవన్నీ తారుమారయ్యాయి.

యశో నెమ్మదిగా లోపలికి వచ్చి నా ప్రక్కన కూర్చుంది. బయటకు వెళ్ళి కన్నీరు కార్చిందనటానికి సందేహంలేదు. నా చేతిలో తన చెయ్యి పెట్టి–"జరిగిందానికి క్షమించండి. వెళ్ళ సెలిగ్రాం యిచ్చిరండి. ఈ రాత్రి బయలుదేరి వెళ్దాం" అంది.

లభియాని నేను ఒకసారి ఒక భిక్ష యాచించాను. "మానవుడు నీకు చేయవలసిన సహాయమేమైనా వుంటే నువ్వు అడుగవలసిన మొదటివ్యక్తిని నేనే" అని. అలాంటి అవకాశం లభించినప్పుడు నేను ఏమీ చేయలేకపోయాను. ఆమె పిలుపుకి అందనిచోట్ల ప్రేయసివెంట తిరుగుతున్నాను. ప్రపంచకంలో నా అనేవాళ్ళు లేని యీ అసహాయ స్త్రీమీద సానుభూతితో నా హృదయం పెల్లుబికింది. సరళ మొదటినుంచీ లభియాకు ఎంతో సహాయం చేసింది. ఈసారి కూడా ఆమె చేయగలిగింది. సరళలో ఎన్ని దోషాలున్నా వాటినన్నింటినీ కడిగివేస్తుంది. అప్పటినుంచీ సరళను కొంచెం గౌరవించాను. మామూలుగా మనం చూచే స్త్రీలలా కోరికలనీ, అభిప్రాయాలనీ అణగదొక్కి బయటికి నవ్వుతూ ఆమె ప్రవర్తించదు. ఎవరన్నా భయం లేదామెకి. తన అభిప్రాయాలని నిష్కర్షగా చెప్పుతుంది. అగ్నిలాంటి హృదయ మామెది. లోపాల్ని కప్పిపుచ్చదు. అన్యాయాల్ని సహించదు. ఇలాంటి వ్యక్తి కనుకే లభియాకి ఆమె సహాయం చేయగలిగింది.

ఈ మూడు సంవత్సరాలనుంచీ లభియా ఆలోచనలు ఏవిధంగా సాగుతున్నాయి ? పూర్వపు చిరునవ్వు, అంతర్గతంలోని వెలుగు మాయమయ్యాయా ? ఆమెచేత దెబ్బ కొట్టించింది. ఆ భగవంతుడే అందుకు సందేహంలేదు. తనను రక్షించుకోవటానికి చేతికందిన దానిలో కొట్టివుంటుంది. ఆ దెబ్బ తలమీదే తగలాలా ? ఇలా ఆలోచిస్తూంటే హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. అసలు ఆ దెబ్బ లభియా కొట్టలేదేమో ? రణధీర్ ఆరాత్రి ఆశ్రమం వదలిపెట్టాడని సరళ వ్రాసింది. అక్కను రక్షించటానికి అతను కొట్టాడేమో ? రణధీర్‌ని రక్షించటానికి అతనిని

బ్రతిమాలో, ఆత్మహత్య చేసుకుంటానని భయపెట్టో పంపించి వేసిం దేమో ? అందరి తప్పులూ, దోషాలూ తననెత్తిన వేసుకోవటం లక్ష్మియాకి అలవాటే.

ఆరాత్రి బయలుదేరాము. ఆ మరునాడు అంటే బుధవారం మధ్యాహ్నం మూడుగంటలకు డూన్ చేరుకున్నాము. స్టేషనుకు రాజేంద్ర, సరళ వచ్చారు. దాయి వాళ్ళ బాబుని ఎత్తుకుని వచ్చింది. పిల్లవాడు చాలా ఆరోగ్యంగా వున్నాడు. తల్లి పోలికలే వచ్చాయి వాడికి. ముఖ్యంగా ఆ కళ్ళు ముమ్మూర్తులా సరళవే. నేను ఎత్తుకునేటప్పటికి ఏడుపు లంకించుకున్నాడు.

నా చేతుల్లోంచి యశో "మీకు పిల్లల్ని ఎత్తుకోవటం చేతకాదు. అన్నింటితోపాటు" అని తీసుకుంది. యశో వద్దకూడా ఊరుకోలేదు వాడు. అప్పుడు సరళ కొడుకుని తీసుకుంటూ "నీక్కూడా పిల్లల్ని లాలించటం చేతకాదు యశో. అయినా పిల్లలు ఎవరూ యింట్లోలేందే ఎలా చేతనవుతుంది. అందుచేత...." అని సరళ నవ్వుతూ ఆగిపోయింది.

యశోకూడా నవ్వుతూ "ఎందుకులేరు సరళా ? వీరులేరా పది మంది పిల్లలకు సమానము" అంది.

నాకు కాస్త కోపంవచ్చింది. నా మనస్సంతా లక్ష్మియామీద లగ్నమైంది. అలాంటి సమయంలో యీ పరాచకాలేమిటి ? రాజేంద్ర నా భావాల్ని గ్రహించినట్లున్నాడు. "అయితే యిక పదండి ఆలశ్యమవుతుంది. ఇంటికి వెళ్ళి సామాను పడవేసి వెళ్దామా లేక తిన్నగా లక్ష్మియా వద్దకు వెళ్దామా చెప్పండి రామబాబూ !" అన్నాడు.

"తిన్నగానే వెళ్దామా రాజేంద్రబాబూ ! మళ్ళీ యింటికి వెళ్ళి తిరిగి రావటం ఎందుకు ?" అన్నాను.

నలుగురుమూ కారులో బయలుదేరాము. దారిలో చాలాసేపటి వరకూ మౌనంగానే వున్నాము. యశో సరళ ఏదో రహస్యాలు చెప్పుకున్నారు. ఇప్పటివరకూ నా గురించి చెప్పటానికి ఎవరూ దొరకలేదు.

ఎంతోకాలం పోయిం తరువాత ఈ సరళ లభించింది. తీర్థయాత్రి విశేషాలు చెబుతూందని గ్రహించాను.

కారు డూన్ జెయిలుముందు ఆగింది. మమ్మల్ని ఒక చిన్న గదిలోకి తీసుకువెళ్ళింది సరళ. అదే ఖైదీలను కలుసుకోనిచ్చే గది. పిల్లవాడిని తీసుకుని దాయి కారులో వుండిపోయింది. గదిలో యిద్దరు స్త్రీ పురుషలున్నారు. ఆ స్త్రీ ఒక కుర్చీమీద కూర్చునివుంది. పురుషుడు ఆమె కాళ్ళమీదపడి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. ఆమె ఒక శిలా ప్రతిమలా వుంది. చేతనారహితంగా కళ్ళల్లోంచి నీరు కారటంలేదు. తిన్నగా గోడకేసి రెప్పవాల్చకుండా చూస్తూంది. ఇంతట్లో లోపల్నించి పోలీసు వచ్చి లాటీతో తలుపుమీద మూడుదెబ్బలు కొట్టాడు. ఆ స్త్రీ హఠాత్తుగా లేచి నించుంది. ఆమె లేచిపోయినా పురుషుడు అలాగే కింద కూర్చున్నాడు. ఏడుస్తూ ఒక్కమాటైనా మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది. ఆ స్త్రీ కాస్సేపు పోయిం తరువాత అతనుకూడా వెళ్ళిపోయాడు. అలాగే ఏడుస్తూ—

ఇదంతా మేము గుమ్మంవద్ద నుంచి చూస్తున్నాము. వీరిద్దరిమధ్య వున్న నిగూఢ రహస్యం ఏమిటి? నేరం చేసింది స్త్రీ అని స్పష్టంగా తెలుస్తూంది. అయితే అతను ఎందుకు అలా ఏడుస్తున్నాడు? ఆమె హృదయంలో దయా, దాక్షిణ్యం, కరుణ, కన్నీరు యివన్నీ ఎగిరిపోయాయా? ఇంకొక విషయం ఏమిటంటే స్త్రీ ఇంకా పౌఢ వయస్సులోనే వున్నట్టుంది. చూడటానికి యిప్పుడు ఏమంత బాగులేదు. కాని ఒకప్పుడు అందంగా వుండివుండాలి. పురుషుడు యవ్వనం వదలి చాలా కాలం అయినట్టు కనబడుతూంది. వీరిద్దరి మధ్యా సంబంధ మేమై వుంటుంది. భార్యాభర్తలా? అన్నా చెల్లెలా? తండ్రి కూతురులా? మూడవది అయివుండదు. మొదటి రెండిటిలో ఏదైనా కావచ్చు. లేకపోతే యే అన్యాయంచేసిన పరదేశీమో యీ పురుషుడు. తప్పు తెలుసుకుని ఈ నాడు క్షమాభిక్ష వేడుకుంటున్నాడేమో. అయితే యీమెలో క్షమాశక్తి కూడా అడుగంటిపోయిందా?

మేము లోపలికి వచ్చి అక్కడ ఒక బల్లమీద కూర్చున్నాము.

లక్షియా చాలా లోపలినుంచీ రావాలి. అందుకు కాస్త అలస్యమవుతుం దని చెప్పింది సరళ. ఆ కాస్తసేపు కొన్ని యుగాల్లా గడిచాయి. నేను పరధ్యానంగా కిటికీలోంచి బయటకు చూస్తూన్నాను. ఎవరో వస్తూన్న చప్పుడయినట్లు వినబడి నాదృష్టి గుమ్మంవైపు మరల్చేటప్పటికి అక్కడ లక్షియా నిలబడివుంది. మాసిన తెల్లటిచీర కట్టుకుని వుంది. ఇంకా ఆమె దగ్గర ఆ అయిదు తెల్లటి చీరలూ వున్నాయా? ఒక మాసిన దుప్పటి కప్పుకుని తలమీదకు లాక్కుంది. అప్పుడే మట్టిలో పనిచేసిన చిహ్నాలు స్పష్టంగా కనబడుతున్నాయి. జుట్టు కాస్త రేగియుంది. ముఖంలో ఆ అందం అలాగేవుంది. కాని కళ్ళలోంచి ఏదో మాయమయినట్టనిపిం చింది. అదేదీ సరిగ్గా నాకు అప్పుడు తట్టలేదు. బహుశా విశ్చలతయేమో!

లక్షియా మమ్మల్ని చూచి క్షణకాలం ఆశ్చర్యపోయింది. తన శక్తినంతా వినియోగించి ఒక చిరునవ్వు నవ్వింది. ఆ మందహాసానికి నేను తట్టుకోలేకపోయాను. ఒకసారి ఆమె కాళ్ళమీదపడి యిందాకా ఆ పురుషుడు ఏడ్చినట్టు ఏడవాలనిపించింది. ఏకాంతంగా వుంటే బహుశా అలాగే చేసేవాడినేమో! అలా అయితేనే హృదయంలోని భారం తీరును. వీరందరి ఎదుటా నేనలా చేయలేను.

"ఎప్పుడు వచ్చారు మీరు యశో. చాలాకాలమయింది మిమ్మల్ని చూచి" అంది. మరుక్షణంలో యశో లక్షియా పాదాలమీద పడిపోయింది. లక్షియా ఆమెను పట్టుకుని హృదయానికి హత్తుకుంది. కొన్నిక్షణాలు అలాగే గడిచాయి. యశో నెమ్మదిగా లక్షియాని వదలి 'ఇప్పుడే వచ్చాం లక్షియా. నిన్ననే మాకు నీ కబురు తెలిసింది' అంది.

లక్షియా నాకేసి చూచి నవ్వుతూ "రామబాబూ! మళ్ళీ మనం కలుసుకోమేమోనని భయపడ్డారు అప్పుడు. చూడండి ఎంత త్వరలో కలుసుకున్నామో!" అంది.

కాస్సేపు నేనేమీ సమాధానం చెప్పలేదు. ఆ సమయంలో ఏమి మాట్లాడాలో తెలియడంలేదు. అప్రయత్నంగా "అయిదు సంవత్సరా లైంది లక్షియా" అని హృదయంలోని ఆవేదన భరించలేక 'ఈలోపున

చనిపోయినా బాగుండేది' అన్నాను. లఖియా ముఖం క్షణకాలం మేఘావృతమైంది.

"అలాంటి మాటలు ఎప్పుడూ అనకండి రామబాబూ ! యశో యిక్కడేవుంది. ఆమెకు ఎంత బాధ కలుగుతుంది చెప్పండి. నాకూ్కడా కష్టంగా వుంటుంది" అంది.

అవును. నిజమే. ఆవేశాలను అణచుకోవాలి. లఖియాని చూడటానికి వచ్చింది ఆమెకు కాస్త సంతోషం చేకూరుద్దామని. ఆమెని కష్టపెట్టడానికి కాదు."

"నీ కష్టాల్లో నీకు మేమేమీ సహాయం చేయలేకపోయాము లఖియా. బహుశా అందుకుకూడా తగమేమో ! ఈ సారయినా నా కోరిక నెరవేర్చు. నాకొక భిక్ష పెట్టగలవా లఖియా ?" అన్నాను.

"మీకు నేనిచ్చిన మాట మరచిపోలేదు రామబాబూ! కాని ఇందులో యితరుల సహాయంవల్ల జరిగేదేమీలేదు. ఎవరి చేష్టల ఫలితం వారనుభవించవలసిందే"

"సరే లఖియా ! దానిగురించి నేను నీతో వాదించి నిన్ను కష్టపెట్టను. నా అభిప్రాయాలు నీకు తెలుసు. నా యాచన ఒకటి వుండిపోయింది. చెప్పమంటావా ?" అన్నాను.

"చెప్పండి. నేను చేయగలదవుతే చేస్తాను. వాగ్దానం చేయలేను" అంది.

"నిన్ను యిక్కడనుంచీ వదలిపెట్టిన తరువాత మాతో తీసుకుపోతాము. శేషజీవితమంతా నువ్వు మాతోనే గడపాలి" అన్నాను.

మనస్ఫూర్తిగా కోరుకున్న కోరికది. అంతకుముందు దీనిని గురించి ఆలోచించలేదు. అలాంటి ఆలోచన తట్టినందుకు నాకు ఎంతో ఆనందం కలిగింది.

యశోకూడా వెంటనే "ఈ కోరికను తోసిపుచ్చకు లఖియా. అంటరాంబె వారిసీ. నన్నూ సంతోష పరిచేదింకేమీలేదు. నా కోసం

కాకపోయినా, వారికోసమైనా అవును లఖియా !" అంది. లఖియా ఇంకా ఏమీ మాట్లాడలేదు. నెమ్మదిగా వెళ్ళి కుర్చీలో కూర్చుంది. ఆమె మనస్సు మారిపోతుందేమోనన్న భయంతో "ఆనాటి నీ జీవితంలో దుఃఖ పునాదులు అంతరించిపోయాయి లఖియా. జీవితంలో పూర్తిగా కష్టాలే అనుభవించావు నీవు. ఆనాటితో వాటికి స్వస్తి చెప్పాలి. నిన్ను మా కులదైవంగా చూచుకుంటాము" అన్నాను.

లఖియా ఎంతో బలవంతాన కన్నీరు ఆపుకుంటూంది. క్షణకాలం క్రింది పెదిమ వణికింది.

"అలాంటి మాటలనకండి రామబాబూ ! మీరూ, యశో, సరళా ఈ దీనురాలిమీద మీ ముగ్గురి దయకూ భగవంతుడు మిమ్మల్ని కాపాడుతాడు. భగవంతునినుంచీ నేను కోరుకునే అంతిమ కోరిక యిదే. మీకు కష్టాన్ని కలిగించటం నాకు యిష్టంకాదు. అయినా మీరన్నది చాలా అసమంజసము. జీవితంలో మనకు అనేకమంది తటస్థపడుతూంటారు. వారిలో కొంతమంది సన్నిహితులవుతారు; కొంతమందిని ప్రేమిస్తాము; చివరకి ఎక్కడో అక్కడ ఎవరి దారిని వారు పోవాలి. ఇది భగవత్ విర్ణీతమయింది. దీనికి మీరూ, నేనూ ఏమీ చేయలేము" అంది.

ఈ మాటలంటూంటే సరళ నా కళ్ళల్లోకి చూచింది. ఇదే మాటలు నేనొకసారి ఆమెకు చెప్పాను. మమ్మల్ని వదలిపెట్టలేక మమతతో బాధ పడుతూంటే ఆమెకు సహనశక్తి యివ్వటానికి చేసిన ప్రయత్న మది. ఈనాడు భగవంతుడు పగబట్టి యీ అనాధ స్త్రీని రక్షించుకోవటానికి ప్రయత్నిస్తూంటే అవేమాటలు లఖియా వెంట వచ్చాయి.

లఖియా నా యాచన తిరస్కరించింది. నాలుగు సంవత్సరాలు ఏదో విధంగా గడిచిపోతాయి. ఆ తరువాత ఈమె మా వద్దకు వస్తుంది. నా యిహపరాలను లక్ష్యం చేయకుండా ఈమెను సుఖపెడుతాను. జీవిత మంతా చీకటిమయం కాదని నిరూపిస్తాను. ఈ దారిలో ఎన్ని ఆటంకాలున్నా లెక్కచెయ్యను. ఈ ఆశలన్నీ లఖియా మాటలతో నేలకూలి పోయాయి. ఈమె యింకా ఎన్నికష్టాలు పడాలని వ్రాసివుందో! లఖియాని

ధనసహాయం స్వీకరించమని అర్థించగలిగే ధైర్యం ఎవరికీలేదు. ఎవరి వద్దనుంచీ ఏమీ స్వీకరించదు.

"లఖియా! ఎప్పుడూ నీకు నేనేమీ సహాయం చేయలేకపోయాను. అదే నాబాధ. ఈ కోరికకూడా కాదన్నావు. ఇక్కడనుంచీ ఎక్కడికి వెళ్ళిపోతావు? ఎలా గడుస్తుంది?" అన్నాను.

"ప్రపంచంలో యింతమంది బ్రతుకుతున్నారు రామబాబూ! వారందరిలాగే నాకూ గడుస్తుంది. ప్రతివారికి ఏదో ఒకదారి దైవం చూపిస్తాడు. అలాగే ఏదో ఒకటి ఆయనే చూపిస్తారు. అయినా అది చాలాకాలం తరువాత సంగతి. ఇదంతా అప్పటివరకూ బ్రతికివుంటే" అంది.

సరళ అప్పటివరకూ మాట్లాడలేదు. లఖియా మాటలకు ఆమెకి కోపం వచ్చింది. "అలాంటి మాటలన్నావంటే మళ్ళీ ఎప్పుడూ ఇక్కడికి రాము లఖియా!" అంది.

లఖియా నీరసంగా నవ్వుతూ "అన్నీ మన యిష్టప్రకారమే జరుగవు సరళా! కారాగార నివాసం నేను కోరుకుంటే వచ్చిందా చెప్పు. కాని యిదేమంత చెడు ప్రదేశంకాదు. శ్రీకృష్ణుని జన్మస్థానం యిదే"అంది.అలాంటి దుఃఖసమయాల్లో కూడా ఆమె దుఃఖాన్ని పోగొట్ట డానికి ప్రయత్నిస్తుంది.

అంతసేపూ రాజేంద్ర మెదలకుండా కూర్చుని వున్నాడు. లఖియా అప్పుడు అతనితో "నన్ను మీరు క్షమించాలి రాజేంద్రబాబూ! రామబాబూ, యశో మాటలలోపడి మిమ్మల్ని కించపరిచాను" అంది.

"అలా అనకు లఖియా! మీ మాటలు వినడమే నా అదృష్టం"- అతను ఆ మాటలు చెప్తూంటే లోపల్నుంచి పోలీసు వచ్చాడు. తలుపు మీద లాటీతో కొట్టాడు. ఇరువది నిముషాలు గడువైపోయింది. లఖియా యింక తిరిగి పనిలోకి వెళ్ళిపోవాలి.

అప్పుడు యశో "లఖియా, మళ్ళీసారివరకూ బహుశా మేమిక్కడ వుండము. అయినా అప్పుడప్పుడు వస్తూంటాము.నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. ప్రపంచంలో నువ్వు ఏకాకివికావు. నిన్ను

ప్రేమించేవారు చాలామంది వున్నారు. వారందరికోసమైనా నువ్వు ఈ బాధ్యత వహించాలి" అన్నది.

"అవును. సరిగ్గా నేనూ అదే చేద్దామనుకుంటూన్నాను. అలాగే చేస్తాను యశో. ఆత్మహత్యలాంటి పనులంటే నాకు గిట్టదు. అయినా నా గురించి ఆలోచించి,ఆలోచించి మీమనస్సు పాడుచేసుకోకండి.ముఖ్యంగా మీరు రామబాబూ ! నా గురించి మీరేమీ చింతించకండి. వారి పాదాల వద్ద నన్ను వదలి నిశ్చింతగా వుండండి" అంది.

పోలీసువాడు మళ్ళీ తలుపుమీద కొట్టాడు. లఖియా లేచి నించుని గుమ్మంవైపు నడిచిపోతూ "సరళా ! బాబు కులాసాగా వున్నాడా ?" అన్నది.

ఎంత ఆశ్చర్యం ! మమ్మలనందరినీ వదలి వెళ్ళిపోతూన్నందుకు హృదయం ఎంతో క్షోభపడి వుంటుంది. అలాంటి సమయంలోకూడా ఆమె బాబుని మరచిపోలేదు. ఆఖరిప్రశ్న ఆ పసిపాప గురించి వేసింది. ఉన్న యిరువది నిముషాల కాలంలోనూ ఆమె ఎవరినీ పలుకరించకుండా వుండలేదు. అందరితోటి తలొక్కమాట మాట్లాడింది.

జవాబుకోసం క్షణకాలం గుమ్మంవద్ద ఆగింది. సరళ గబగబా లఖియా వద్దకు వెళ్ళి బుగ్గమీద నెమ్మదిగా ముద్దుపెట్టుకుంది. 'కులాసాగానే వున్నాడు లఖియా. మళ్ళీసారి తీసుకొస్తా'నంది. లఖియా గుమ్మం వద్ద ఆగిన ఒక్కక్షణంకూడా వృథా చెయ్యబుద్ధి పుట్టలేదు.

లఖియా గుమ్మం దాటింది లోపలికి వెళ్ళేదారి ఒక పొడుగాటి బాట. పొడుగైన వరండాలోంచీ పోవాలి. నెమ్మదిగా అడుగులు వేసు కుంటూ నడిచిపోతూంది.ఆమె ప్రక్కన భుజానికి తుపాకీ తగిలించుకుని పోలీసువాడు నడుస్తున్నాడు. ఆ దృశ్యం నా హృదయంలో హత్తుకు పోయింది. లఖియా పారిపోకుండా చూడటానికి వాడు ఆమె ఛాయలా వెంటాడుతున్నాడు. ఆ ఆలోచన వచ్చిన వెంటనే నా రక్తం వుడికింది. ఇది మానవత్వానికే ఒక మాయని మచ్చ. భూకంపం వచ్చి ఆ జైలంతా కూలిపోయి. అక్కడివారంతా చనిపోయినా ఆమె అక్కడనుంచీ కద

లదు.సీతాదేవిలాగ భూదేవి ఈమెనుకూడా తన ఆలింగనంలో యిముడ్చు కోవాలి. అంతకంటే మార్గంలేదు.

అంతా రెప్పవాల్చకుండా నడచిపోతూన్న ఖైదీని చూస్తూనాం. కొంతదూరం నడచి మలుపు తిరిగి మాయమైంది. ఆమె అడుగుల్లో తొట్రుపాటులేదు. మా అందరి కళ్ళఎదుట ఆ దృశ్యం అంతరించి పోయింది. ఒకసారైనా వెనుదిరిగి చూస్తుందేమోనని ఆశించాము.మలుపు దగ్గిర క్షణకాలం ఆగినట్టనిపించింది.కాని వెనుదిరక్కుండానే ముందుకు సాగిపోయింది. వెనుదిరగటమనేది ఆమె స్వభావానికే విరుద్ధమని నే నా నాడు గ్రహించాను. కష్టాలు తండోపతండాలుగా వచ్చి మీదపడినా యీ అబల చెక్కుచెదరదు. కన్నీరు కార్చదు. ఇంత జరిగినా ఆమెకు భగ వంతునిమీద విశ్వాసం అచంచలంగా వుంది. తన కష్టాలకు కారకుడైన అతగాడినే కొలుస్తూంది. లఖియానుంచి నేను నేర్చుకున్నది ఒక్కటే వుంది. అదేమిటంటే జీవితంలో ప్రతి మానవుడు దేనినో దానిని విశ్వ సించాలి. అది ఏదైనాకావచ్చు. దైవమే అయివుండనక్కరలేదు. మాతృ గర్భంలోంచి జన్మించినప్పటినుంచీ చచిపోయేవరకూ నేను నాస్తికుడిని. అని చెప్పగలిగిన వారెంతమంది వున్నారు. సరళకు భగవంతునితో నిమిత్తంలేదు. అతగాడంటే భయంతో ఆమె ఏపనీ చెయ్యదు. తనకు తోచినట్లు తాను చేస్తుంది. ఇలాంటి ఈమెకూడా లఖియా అనుభవించ వలసిన శిక్ష వెల్లడించే రోజున భగవంతుని ప్రార్థించానని రాసింది.అది అక్షరాలా నిజం. ఏదో ఒక సమయంలో ప్రతి మానవుడు దైవాన్ని ప్రార్థిస్తాడు. తను ప్రేమించినవ్యక్తిని కోల్పోయే సమయంలో కన్నీరు కారుస్తూ చేతులు జోడిస్తాడు. తన ప్రార్థన మాత్రంతో వారిని తను రక్షించుకోలేడు. అయినా అలా చేస్తాడు.

బరువైన హృదయాలతో మేము వెనుదిరిగాము. బయటకు వస్తూంటే యశో ఒకచేత్తో నాచెయ్యి, ఇంకొక చేత్తో సరళ చెయ్యి పట్టుకుంది. సరళ తన రెండోచెత్తో రాజేంద్ర చేయి పట్టుకుంది. అలా నలుగురుమూ కారువైపు నడిచాము. దాయి వడిలో బాబు సుఖంగా నిద్ర పోతున్నాడు.

# 21

కాశీ తిరిగివచ్చి ఒక వారంరోజులైవుంటుంది. ఆనాడు ప్రొద్దున యశో నాకొక టెలిగ్రామ్ తెచ్చియిచ్చింది. అందులో మామయ్యకి చాలా జబ్బుగా వుందనీ తక్షణం బయలుదేరి రమ్మనీవుంది. టెలిగ్రామ్ చదివి యశోవైపు చూచాను. ఆమె అక్కడలేదు. ఎప్పుడు వెళ్ళిపోయిందో లోపలికి!

మళ్ళీ ఒకసమస్య ఎదురైంది. తండ్రితరువాత తండ్రిలాంటివాడు బాబయ్య. లలితపిన్నికి యిక మగదిక్కెవ్వరూలేరు. అలాంటిసమయంలో ఆమెకు సహాయం అవసరం. అదీకాక నా వ్యవహారాలన్నీ బాబయ్యేచూస్తున్నాడు. వెళ్ళకతప్పదు. కానీ యశోని తీసుకొని వెళ్ళలేను. ఆ సమయంలో అలాంటిపని చేయడంకంటె తెలివితక్కువపని యింకొకటి వుండదు.

టెలిగ్రాం చేత్తోపట్టుకుని లోపలికి వెళ్ళాను. యశో వంటచేయడంలో నిమగ్నురాలయింది. నెమ్మదిగావెళ్ళి వెనకనుంచొని "యశో నన్నేమి చేయమంటావు?" అన్నాను.

చేస్తున్నపని ఆపి నావైపుతిరిగి "చేసేదేముంది చెప్పండి. మీరు తప్పకుండా వెళ్ళాలికదా ? నన్నుతీసుకుని వెళ్ళడమా లేక మీరొక్కరే వెళ్ళడమా అనేదిప్రశ్న. తీసుకుని వెళ్లితే సురేఖనుకూడా చూడవచ్చు" అంది.

"నేనొక్కడనే వెళ్ళాలి యశో! నిన్ను యిప్పుడు తీసుకుని వెళ్ళలేను" అన్నాను.

"అదేమంచిది" అంది యశో గరిటెతిప్పుతూ. అంటే ఆమెకి కోపం వచ్చిందన్నమాట. "చూడుయశో" అని ఏదో అంటూంటే యశో అడ్డువచ్చింది "నాకు అంతా తెలుసు, మీరేవెళ్ళండి. ఆయనకి స్వస్థత చిక్కాలనీ మీరు త్వరలో రావాలని యిక్కడనుంచే ప్రార్థిస్తూంటాను" అంది.

ఆ సాయంకాలమే బయలుదేరటానికి నిశ్చయించుకున్నాను. ఒకవైపు కర్తవ్యము, రెండవవైపు యశో — ఈ రెంటిమధ్యా మనసు వూగిసలాడింది కానీ చేసేదేముంది? యశో తనఅంతర్యాన్ని, ఆలోచననీ బయటపెట్టలేదు. నేనుకూడా వాటిని రేకెత్తించలేదు. అలాచేస్తే అణచివున్న దుఃఖము విజృంభిస్తుంది. అంతకంటె వేరేలాభంలేదు.

రైలు బయలుదేరటానికి యింకాపైముంది. ఒకరిచెయ్యి నొకరు పట్టుకుని ప్లాటుఫారంమీద నడుస్తున్నాము. యశో నేను చేయవలసిన పనులన్నీ చెప్పి; "నేను మీ ఆరోగ్యముగురించే ఆందోళనపడుతున్నాను. నేను లేకుండా మీకు జరుగదు. అంతమందిలో అలాంటి పరిస్థితులలో మిమ్మల్ని ఎవరు చూస్తారు?" అంది.

"ఎప్పుడూ ఎవరో ఒకరు ఎందుకు కనిపెట్టి వుండాలి యశో! ఎవరూ చూడకపోతే బహుశా నన్ను నేనే చూసుకుంటానేమో; అలా అయితే ఇదికూడా ఒకందుకు మంచిదే" అన్నాను. "కాదు మీకు జరుగదు. మీ స్వభావమే అంత" అంది.

ఆమె ఆరోగ్యం సరిగా చూసుకోమనిగాని, జాగ్రతగా వుండమనిగాని చెప్పే అర్హత నాకులేదు. ఎంతో హాస్యాస్పదంగా వుంటుంది విని వూరుకున్నాను. రైలు కదలబోయే వేళయింది. యశో పూర్తిగా ధైర్యాన్ని కోల్పోయి బేల అయిపోయింది.

నిబ్బరాన్ని గాలిలో వదలిపెట్టి నా చేతులు పట్టుకుని "చూడండి; మీరు నాకు ఎంత అవసరమో - నేను ఎప్పుడూ మీతో చెప్పలేదు. త్వరగా వచ్చేస్తారు కదూ!" అంది.

అలాంటిస్థితిలో మాటలు పెంచి లాభంలేదు. మౌనమే దానికి మందు. "సరే యశో; వెళ్ళినవెంటనే వుత్తరం వ్రాస్తాను" అన్నాను.

యశో పూర్తిగా రైలు కదిలేవరకూ వుండలేదు. గబగబా బయటకు వెళ్ళిపోయింది.

* * *

బాబయ్య పరిస్థితి ప్రమాదకరంగానే వుంది. జబ్బుయేమిటంటే ముసలితనం, ఉబ్బసం. "కాలం సమీపించిందంటే అన్నీ కలిసి వస్తాయి." అంది అవిత పిన్ని.

బాబయ్య ముసలివాడని నా కంతవరకూ తెలియదు. యాభై సంవత్సరాలు దాటివుండవు. ఈమె మాటలు వింటూంటే నిర్వికారంగా వున్నట్టనిపించేది. మనిషిని చూస్తే దానికి పూర్తి విరుద్ధం. చాలాకాలం నుంచీ స్నానపానాదు లున్నట్టు కనబడలేదు. ఎప్పుడూ బాబయ్య మంచాన్ని అంటిపెట్టుకుని వుండేది. బాబయ్య నన్నుచూచి కండ్లనీళ్ళు నింపుకున్నాడు. "చచ్చిపోతూంటేకాని బాబయ్య గుర్తురాలేదా? రామం" అన్నాడు.

"లేదు బాబయ్యా అలా అనకు. నువ్వు మళ్ళీ కోలుకుంటావు. నీకు అనారోగ్యంగా వుందని తెలియలేదు. లేకపోతే ముందరే వచ్చేవాడిని" అన్నాను.

పిల్లలంతా చుట్టూమూగి - "అన్నయ్యా కాశీనుంచి మాకు ఏమి తెచ్చావు?" అని మారాంచేశారు. ఒకసారి పిన్ని హూంకరించేటప్పటికి నలుమూలలా పరుగెత్తారు.

బాబయ్య రోగవివరాలూ, వైద్యమూ మొదలైనవన్నీ చెప్పడం అనవసరమనుకుంటాను. నేను వచ్చిన పదిరోజులతరువాత ఒక ఆదివారం తెల్లవారుఝామున బాబయ్య, లలిత పిన్నిని దుఃఖసాగరంలో ముంచి పరలోకయాత్ర చేశాడు. చేయవలసిన తతంగమంతా చేశాను. బాబయ్య మరణవార్తవిని, పిన్ని తలిదండ్రులు వచ్చారు. తాను బ్రతికుండగా కూతురు విధవవటంచూచి ఆ తల్లి హృదయం తరుక్కుపోయింది. దుఃఖం భరించలేక భర్తను నిందించింది. 'రెండవ పెండ్లికి యివ్వద్దంటూంటే యిచ్చారు, దాని ఫలితమే యిది' అంది.

లలితపిన్ని అక్కడేవుంది. 'అమ్మా' అని ఒకసారి గట్టిగా అరచి 'నాన్నగారిని అలాంటి మాటలనకమ్మా. ఎవరి కర్మఫలం వారనుభవించాలి.' అని ఏడుస్తూ తల్లి ఆలింగనంలో యిమిడిపోయింది.

లలిత ముప్పదిసంవత్సరాలుమించని అందమైన వనిత। బయటకు ఏవిధంగా కనబడినా మనస్సుమాత్రం మంచిది. భర్త జీవితకాలంలో ఆమెకంటె ఎక్కువ సుఖాన్ని ఎవరూ అనుభవించలేదు. ఆదరించే భర్త, దైవప్రాసాదితులైన ముగ్గురు సుపుత్రులు, తన గృహమే స్వర్గమని భావించింది. భర్త మరణించిన మరుక్షణంనుంచీ

జీవితమంతా చీకటిమయమయిపోయింది. ఇద్దరు సవతిపిల్లలూ, ముగ్గురు కొడుకులూ, యీమె భుజస్కంధాలమీద పడ్డారు. వీరిని పెంచి పెద్ద చేయవలసిన బాధ్యతంతా యీమెది. సవతిపిల్లలని ఆమె ఎన్నడూ విభేదం పాటించలేదు. నిజంచెప్పాలంటే వారిమీదే ఆమె అనురాగం చూపించేది - నవ్వుతూ - "ఈ యింటిలో అడుగుపెట్టినప్పటినుంచీ వీరిని నేను పెంచాను. మిగతవారంతా తరువాత వచ్చారు. పుట్టుకలో ఏముంది?" అనేది.

యశో యిచ్చిన వుత్తరం జేబులోపెట్టుకొని సురేఖని కలుసుకోవటానికి ఒకరోజు బయలుదేరాను. వివాహమయినతరువాత సురేఖ తాతగారిని తీసుకుని అత్తవారింటికి వెళ్ళిపోయిందని తెలిసింది. అక్కడికీ బయలుదేరాను. ఇంటినిబట్టి, గుమ్మంవద్ద వున్న నౌకరునుబట్టి బాగా కలవారని గ్రహించాను.

బంట్రోతు నన్నుచూచి "ఎవరు కావాలి" అన్నాడు.

"మధు వున్నాడా?" అన్నాను.

వాడు నన్ను ఒకసారి ఆపాదమస్తకంచూచి "చిన్నబాబుగారు, విశాఖపట్నంలో వున్నారు" అన్నాడు.

ఏమనాలో తెలియలేదు "పోనీ సురేఖాదేవి వున్నారా?" అన్నాను. దానితో వాడి అనుమానం హెచ్చింది. కొస్త చిరాకుగా "ఇక్కడే వుంటంది" అని లోపలికి వెళ్ళిపోయాడు.

సురేఖ బయటికివచ్చింది. ఆమె ముఖంచూస్తే నన్ను గుర్తుపట్టలేదని తెలిసిపోయింది. గుమ్మంవద్ద ఆగిపోయి "వారు విశాఖపట్నంలో వున్నారండీ. యం. యస్ సి. చదువుచున్నారు." అంది.

నేను నవ్వుతూ- "మరదలా" అన్నాను.

సురేఖ కళ్ళు తళుక్కుమని మెరిశాయి. నా దగ్గరకు ఒక గంతువేసి నా చెయ్యిపట్టుకుని "బావగారూ-" అంది.

"అవును సురేఖా. అక్కయ్యనీ బావనీ యింత త్వరగా మరచిపోయావా?"

"అక్కయ్యనికూడా జ్ఞాపకపరచకండి. బావగారు, ఆమె చెయ్యి మందిరోకూడా ప్రకాశిస్తుంది: హఠాత్తుగా మీ రొక్కరూ వచ్చారు.

అందుకని గుర్తుపట్టలేకపోయాను. ఎప్పుడు వచ్చారు? అక్కయ్య ఏది? అరే బయటే నించున్నారు. లోపలికి రండి" అని లోపలికి తీసుక వెళ్ళింది.

కుర్చీలో కూర్చుంటూ- "అయితే సురేఖా, మధు అక్కడ, నువ్వు యిక్కడ మధ్యన మేఘాలు యేమిటి? నువ్వూ వెళ్ళలేక పోయావా?" అన్నాను.

సురేఖ సిగ్గుతో తలవంచుకుని "అది ఎలా వీలవుతుంది బావ గారూ. నేను దగ్గరవుంటే బొత్తిగా చదవరు. ఇప్పటికీ పదిహేను రోజులకొకసారి వస్తూంటారు. అదిసరే అక్కయ్యఏధి? మీరు ఎప్పుడు వచ్చారు? అంతా చెప్పండి" అంది.

జేబులోంచి ఉత్తరంతీసి "యిది ముందర చదువుకో తరువాత కావలసింది చెప్తాను" అన్నాను.

సురేఖ ఎంతో ఆత్రుతతో ఉత్తరం చదువుకుంది. చాలా పెద్ద ఉత్తరంలావుంది. చదవటానికి చాలాకాలం పట్టింది. చదువుతూ చాలా సార్లు నాకేసిచూచి నవ్వింది. ఉత్తరం చదవటం అయినతరువాత "అక్కయ్య అంతా వ్రాసింది బావగారూ, మీ గుట్టు బయటపడింది" అంది.

"ఇంకా ఏమివ్రాసింది మీ అక్కయ్య?"

"ఆవిడ ఇక్కడికి రాకపోవడానికి కారణం మీరేనని వ్రాసింది. ఎందుచేత తీసుకురాలేదు. చెప్పండి. అక్కయ్యను చూడాలని ఎంతో కోరికగా వుంది. ఆమె ఋణం నేనెలా తీర్చుకోగలను?" అంది.

"నేనెలా తీసుకురాగలను సురేఖా. సమాజపుదృష్టిలో మీ అక్కయ్య నాకేమీ కాదు. బాబయ్య చనిపోయాడు. ఇప్పుడు నాపరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది."

"అవును ఆయన చనిపోయారని విన్నాను. అక్కయ్య మిమ్మల్ని త్వరగా పంపించివేయమని వ్రాసింది." అంది.

"త్వరగా ఎలా వెళ్ళగలను సురేఖా? మొదటిసారి అన్ని వ్యవహారాలూ బాబయ్యమీద పెట్టివెళ్ళాను. ఇప్పుడు ఎవరిమీద పెట్టగలను? నేను ఏ పనీ స్వంతంగా చేయలేనని మీ అక్కయ్య అంటుంది. ఆమె

దగ్గరవుంటే అన్నీ ఆవిడమీద పెట్టేవాడిని. ఇప్పుడెలాగ?" అన్నాను. అదంతా ఏకరువుపెట్టడం అనవసరం. అయినా అప్పుడప్పుడు మనసుని వేధించే ఆలోచనన్ని బయటికి పెడితే ఎంతో తేలికవుతుంది.

సురేఖ చాలా శ్రద్ధతో అంతావింది. "ఆ పరిస్థితి నేను గ్రహించాను. మీ గాధ ఎంత విషాదంగా వుంది" అని ఒక నిట్టూర్పు విడిచింది.

అంత చిన్నతనంలో యశో ప్రియసోదరి నాగురించి చింతించడం ఇష్టంలేకపోయింది. యశోని దుఃఖపెడుతున్నాను అది చాలదా?

"అదిసరే సురేఖా. ఆ రాత్రి జరిగిందంతా చాలా గమ్మత్తుగా వుందికదూ?"

"అలా నెమ్మదిగా అంటూన్నారేమిటి? బావగారు మరునాడు అదంతా ఒక కలలా కనబడింది. తరువాత కొన్నాళ్ళకి అక్కయ్యవద్ద నుంచి డబ్బు వచ్చేటప్పటికి నా ఆశ్చర్యానికి మేరలేదు. ఒకరాత్రి పరిచయంలో అంత డబ్బు దేవతలుతప్ప ఎవరిస్తారు? అనుకున్నాను. అక్కయ్య వివాహానికి రాకపోయేటప్పటికి నేను ఆ రాత్రి ఎంత దుఃఖించానో చెప్పలేను. దానితో సగం సంతోషం హరించిపోయింది. వివాహమంటపందగ్గరకూడా నాకు కన్నీరు ఆగలేదు. మీరు మానవమాత్రులు కారేమో అనే అనుమానం కలిగింది. తరువాత చాలాకాలానికి అక్కయ్యదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. అప్పటికి అనుమానం పోయింది. ఆమె మానవులలోని దేవత అని తెలిసింది."

"ఆగు సురేఖా. ఇంకచాలు. కావాలంటే ఇదంతా ఉత్తరంలో వ్రాసియివ్వు. సురక్షితంగా ఆవిడకి అందజేస్తాను. అదిసరే అయితే నాకు మీ ఆయనని చూపించవా?" అన్నాను.

"ఎందుకు చూపించను బావగారూ? మీరు ఇంకా వుంటారుగా? ఇవాళే మధుకి టెలిగ్రాం యిచ్చాను. వచ్చే వీక్ ఎండ్‌కు రమ్మనమంటాను" అంది.

"అయితే యిక నేను వెళ్తాను. ఎన్నాళ్ళుంటానో చెప్పలేను. వెళ్ళేముందు యింకొకసారి కనబడుతాను." అని లేచి నించున్నాను.

"ఒకసారి ఏం బావా! రోజూరావాలి మీరు. లేకపోతే నేనే

మీ యింటికివస్తాను. అరెమరచి పోయాను. కాస్సేపాగండి యిప్పుడే వస్తాను." అని లోపలికి వెళ్లి పోయింది.

కాఫీ తీసుక వచ్చింది. అడ్డుచెప్పకుండా తాగివేశాను. బయటకు వస్తూంటే సురేఖ "మా తాతగారినీ, అత్తమామలనీ చూడరా బావ గారూ ?" అంది.

"మరొకసారి వచ్చినప్పుడు చూస్తాను. అయినా నాసంగతంతా మధూకితప్ప యింకెవ్వరికీ తెలియకూడదు తెలుసా ? " అన్నాను. గుమ్మంవరకూవచ్చి సాగనంపింది. బయటకు వచ్చేస్తూవుంటే జ్ఞప్తికి వచ్చి "సురేఖా" అని పిలచాను. ఆమె వెనుదిరిగి దగ్గరకు వచ్చింది.

"అన్నట్టు మాయింటికి వస్తానని చెప్పావు. ఇప్పుడు అలా చెయ్యటం మంచిదికాదు. వీలున్నప్పుడు నేనే వస్తూంటాను. మధు వస్తాడుగా" అన్నాను.

సురేఖముఖం దిగజారిపోయింది. అదిచూచి "ఈ లోపున యింకొకసారి వస్తానులే సురేఖా ! అలాంటి ముఖం మాత్రం పెట్టకు." అన్నాను.

* * *

సురేఖముఖం పద్మంలా వికసించింది. నేను బయటకు వచ్చేశాను.

ఆదివారం లోపున వెళ్ళటం వీలుకాలేదు. అనేకవ్యవహారాలు చూడవలసివచ్చింది. స్వతహాగా సోమరిపోతును నేను. అయినా అప్పుడు గత్యంతరంలేక అన్నిపనులూ చేశాను. రోజువిడిచి రోజు యశోకి ఒకవుత్తరం వ్రాసేవాడిని. ఆపనిమట్టుకు క్రమం తప్పకుండా చేసేవాడిని. అలాచేస్తానని వాగ్దానంచేశాను. మాటతప్పితే ఆమె చాలా బాధపడుతుంది. బయలుదేరి వచ్చేసినా రావచ్చు. యశోనినేను పొందిన తరువాత ఇదే మొదటి ఎడబాటు మాకు. ఇది ఆమె ఏవిధంగా సహిస్తూంది ? ఆమె మనస్సంతా యిక్కడేవుండి వుంటుంది. నా గురించీ, సురేఖగురించీ ఆలోచిస్తూ కూర్చునివుంటుంది. ఒంటరిగా ఆమె ఏమిచేస్తూవుంటుంది ? శరీరాలు దూరంగావుంటే మనసులు దగ్గరకు వస్తాయంటారు. మా శరీరాలు దగ్గరగావున్నా ఎప్పుడూ లీనమవ

లేదు. హృదయాలు ఎప్పుడో ఏకమయ్యాయి. ఇక ఎడబాటువలన మాకు కలిగే లాభమేమిటి?

అనుక్షణము ఆమెమనస్సులో మెదిలేది కావలసిందిలభించక పోయినా వేళకి ఏమయినా జరుగక పోయినా నామనస్సడిగేది. యశో వుంటే యిలాజరుగనిచ్చునా? అంటే నాకు లోపాలు కలిగాయనికాదు. లలిత పిన్నినన్ను ఎంతో ఆప్యాయంగా చూచేది. అయినా ప్రియురాలు యశోరాజ్యం వేరు, పిన్ని లలితాదేవి వేరు.

ఆదివారం సురేఖదగ్గరకు బయలుదేరాను. సురేఖ తంతి అందు కుని మధుమెయిలులో వచ్చాడు. సురేఖ ఆరాత్రి మధు ఆవూరిలో అందరికన్న అందంగావుంటాడని చెప్పింది. నేను అంతదూరంపోను. కాని యీ యువకుడు అందంగానే వుంటాడు. సురేఖ మధు ఒకరి ప్రక్కన ఒకరు నించుని నవ్వుతూంటే నామనస్సు సంతోషంలో నిండి పోయింది. ఎంత చక్కనిజంటయిది! ప్రేమించి పెళ్లిచేసుకున్న యువకదంపతులు వీరు! నా అనుభవంలో యిది వక్కటే యిలా పరిణ మించింది. వారి వివాహపుబాటలో ఆటంకాలులేవు. మనస్పర్ధలులేవు. ఒకరినొకరు మనస్ఫూర్తిగా ప్రేమించుకున్నారు. సురేఖకి సుజాతకీ ఎంత విభేధముంది. ఈ సుఖపరిణామానికి బాధ్యులెవరు? యశో రాజ్యమంటే ఒక వుత్తమనారీమణి! కాని యీ సుఖమే, యీ దాంపత్య సౌఖ్యమే ఆమెకు లభ్యంకాలేదు. అందుచేతనే ఆమెను నాతో తీసుకరాలేక పోయాను. దీనికంతకీ కారకుడిని నేనే-నేనే.

"నమస్కరించటానికి వచ్చాము, బావగారూ" అందిసురేఖ.

నేను ఒక్కఅడుగు వెనక్కువేసి "అలాంటిపనులు చేయకు సురేఖా! నేనేమంత పెద్దవాడినికాను. నన్ను అప్పుడే ముసలివానిని చెయ్యకండి." అన్నాను.

"అలా అడ్డుపెట్టకండి బావగారూ! అక్కయ్యలేదు. ఇక మమ్మల్ని మీరైనా ఆశీర్వదించండి. వివాహసమయంలో మాకిది లభించలేదు" అంది.

ఇకనేను అడ్డుచెప్పలేదు. మనస్ఫూర్తిగా దైవాన్ని కోరు

కున్నాను. వీరిద్దరికైనా కష్టమూ దుఃఖమూ అనేవి అంటకుండా చూడమని.

మధు నెమ్మదిగా అంటున్నాడు "మీకు ఏవిధంగా కృతజ్ఞత వెల్లడించాలో తెలియటంలేదని సురేఖచెప్పింది"

"పొరబడుతున్నావు మధూ, నువ్వు నాకొాదు యీ సత్కారా లన్నీచేయవలసింది. ఆవిడ వేరొకచోటవుంది. మీ కృతజ్ఞతకీ మీ నమస్కారాలకీ అర్హురాలు ఆమె" అన్నాను.

"అవును బావగారూ మీరు చెప్పిందినిజమే. మా అక్కయ్య నిజంగా పూజ్యురాలు. కాని ఆమెకు మీకంటే ఆప్తులులేరు. ప్రాణం కంటేమిన్నగా మిమ్మల్ని ప్రేమిస్తూంది. అందుకని మీరు పూజ్యులే" అంది.

"సరే సురేఖా" అయితే అయ్యాను కాని ఆ పనిమటుకు చెయ్యకు. కావాలంటే ఫోటో ఒకటి యిస్తాను. దానికి చెయ్యండి" అన్నాను.

"నిజమే బావగారూ! అక్కయ్యా మీరు కలసివున్న చిత్రం ఒకటి యివ్వండి" అంది.

"వుంటే అలాగే తప్పకుండా చేసును. కాని మేమయిద్దరమూ కలసివున్న చిత్రమేలేదు. చివరకు మీ అక్కయ్యఫోటోకూడా లేదు నావద్ద. అన్నట్టు నీకు తెలియదనుకుంటాను. ఆ గోడమీదవున్న ఫోటో మీ అక్కయ్య చాలా మెచ్చుకుంది తెలుసా" అన్నాను.

సురేఖ ఆశ్చర్యంతో - "ఎప్పుడు? అక్కయ్య ఎప్పుడు చూచింది అంది."

"ఆరాత్రి మీ తాతగారు బయటకు తరిమివేస్తూంటే మీ అక్కయ్య అదిచూచి 'ఆహా ఎంత అందంగావుంది. ఈవిడ మనుమరాలేకమా' అంది" అన్నాను.

"నిజంగా అక్కయ్య అలా అందా? అయినా పరిహాసానికి అని వుంటుంది".

మధు పకపకానవ్వాడు.

"భలేపోలిక పట్టావు రేఖా! నువ్వు చెప్పిందే నిజమయితే మా

వదినెగారు చాలా అందకత్తె అయివుండాలి. ఎందుకంటె నీలాంటి అంద కత్తె మా కాలేజీలోలేరు" అన్నాడు.

సురేఖకాస్త సిగ్గుపడింది. "అయితే నీకాలేజీలో ఏలాంటి వారున్నారో సులభంగా నేనూహించుకోవచ్చు మధూ! "అంది నవ్వుతూ. ఈ సంపత్సరంపుపురిలోనూ ఎవరిది పైచేయో నేను గ్రహించాను. మధుకి కాస్త సహాయంచేద్దామని "మధూ నీవు యీ వూరిలో అందరికన్నా అందంగా వుంటావటగా?" అన్నాను.

మధు యెంతో ఆశ్చర్యంతో - "లేదండీ యెవరు చెప్పారు?" అన్నాడు.

"సురేఖ" అన్నాను.

నేను ఆ మాటచెప్పకుండానే గదిలోంచి సురేఖ పారిపోయింది.

* * *

రాజమండ్రివచ్చి ఒక నెల కావచ్చింది. లలితపిన్ని తల్లి దండ్రుల హాతురితో అక్కడవుండిపోవటానికి ఒప్పుకున్నారు. దానితో నామీదవున్న పెద్దబరువు తీరింది. మిగతా సమస్యలు సులభంగానే పరిష్కారమవుతాయని ధైర్యంకలిగింది. మా ఇంటి అద్దె తిన్నగా కాశీ అందేటట్టు యేర్పాటుచేసుకున్నాను. భూములమీద వచ్చే రాబడికికూడా అదే ఏర్పాటుచేసుకున్నాను. పనులన్నీ అయిపోయిన మరునాడే బయలుదేరటానికి నిశ్చయించుకున్నాను. యశోకి తంతియిచ్చాను.

ఈ నెలలోనూ, సురేఖతో నా పరిచయం యెక్కువైంది. వీలు న్నప్పుడల్లా వాండ్లయింటికి వెళ్ళేవాడిని. అక్కచెల్లెళ్లు లేనికొరత సురేఖ ఆరోజుల్లో తీర్చింది. అది నాకొక కొత్త అనుభూతి. యశోలో, తల్లి, సోదరి, ప్రేయసి యిన్నీ మిళితమైవుండేవి. ఆమెయిక్కడ దగ్గిర వుంటే యెంతో బాగుండును. చెల్లెలా, మనిషి చిన్ను పువ్వులలోపెట్టి పూజిస్తూంటే ఆమె యెంత సుఖించేదో? నేనెంత ఆనందించేవాడిని.

ఆరోజే నా ప్రయాణం. రైల్వేస్టేషన్‌లో యెవరివద్దో ఒకరి నుంచీ నా తిరుగుళ్ళతో కన్నీళ్ళతో వీడ్కోలు తీసుకోటం నాకు పరి పాటి అయిపోయింది. హృదయవిదారకమైన అనేక సంఘటనలకి అది రంగస్థలమైపోయింది. యిలాంటివాటితో నా హృదయం కఠినుకట్టి

పోయింది. సురేఖ యింకా రేతయస్వసంలో వుంది. ఇప్పటివరకూ జీవితంలోని వెలుగుమాత్రమే చూచింది. అలాంటిస్థితిలో నాకు వీడ్కోలు చెప్పటానికి స్టేషన్‌కు వచ్చింది. నేను వద్దనలేను. రాజ మంత్రితో చాలావరకూ నా సంబంధము తీరిపోయింది. ఇక తమెను తిరిగి చూస్తాననే నమ్మకం నాలోలేదు. దానిగురించి నే నట్టే చింతించ లేదు. సురేఖకి భవిష్యత్తులో కష్టాలు, కన్నీరు యెదురుకాకూడదని వాంఛించాను. యశో, సరళ, లక్ష్మియా, సుజాతా వీరందరికీ ఏవో దుఃఖ కారణా లున్నాయి. సురేఖమాత్రమే యిప్పటివరకు యీ దుఃఖాలలో చిక్కుకోలేదు. ముందర బాటలోకూడా ముళ్లులేకుండా వుండాలి, అదే నా వాంఛ.

"ఈ వెళ్లేది అక్కయ్య మనతోవుంటే ఎంత బాగుండేది —" అంది సురేఖ బండిలో. తనలో తను అనుకున్నట్టు వుంది ఆ వాక్యం.

"ఎందుకు బాగుండదు సురేఖా! చాలా బాగుండేది" అన్నాను.

"అక్కయ్యని చూడాలని వుంది. బావగారూ!" అంది.

"దానికి ఒకే ఒకమార్గం వుంది సురేఖా! మీరు కాశీ రావాలి అంతే!" అన్నాను.

సురేఖ దీర్ఘంగా నిట్టూర్చి "అది చాలాకాలం తరువాత మాట" అంది.

ఆమె భుజంమీద చెయ్యిపెట్టి "అక్కయ్యను మరచిపోవాలి సురేఖా! ఆమె నీకు అందుబాటులో లేదు. ఇకముందు వుండదుకూడా! ఆమె నాకు చాలా అవసరం. ఇలాంటివాటినిగురించి నీవు ఆలోచించ కూడదు. ఇంకా చిన్న పిల్లవి. నీకు అన్నిటికన్నా మిన్నగా మధు వున్నాడు. ఈ వూరిలో అందరికంటే అందగాడు. బావ ఎలావుంటాడు సురేఖా!" అన్నాను. సురేఖ వసికే పెదవులమీద చిరునవ్వువెలసింది.

# 22

ఒక నెల ఎడబాటుతరువాత యశోని తిరిగి కలుసుకున్నాను. మనిషి ఎంతో చిక్కిపోయింది. ముఖంమీద అలసట, నీరసమూ స్పష్టంగా కనబడుతున్నాయి. చలికాలం అది. చేతులో నా వులన్ కోటు పట్టుకుని శాలువ కప్పుకుని వణకుతూ ప్లాటుఫారంమీద ఎదురు చూస్తూంది. రైలు దిగిన వెంటనే నా కోటు ఇచ్చి వెంటనే తొడుక్కోమంది. టాక్సీలో ఇంటికివస్తూ అడిగాను.

"జబ్బుపడ్డావా అమ్మీ" అని.

యశో నీరసంగా నవ్వుతూ "లేదే ఎందుకలా అడుగుతున్నారు?" అంది.

"నీ రూపం అలావుంది" అన్నాను.

హఠాత్తుగా ఒడిలో తలపెట్టి కళ్ళుమూసుకుని అంది - "ఇదంతా విరహం బాద బాబూ! ఇక ఇప్పటినుంచీ మిమ్మల్ని ఒక్కరినీ ఎక్కడికీ పంపించను. ఎడబాటంటే ఏమిటో తెలిసి వచ్చింది" అంది.

"నే నెలా వున్నాను" అన్నాను రుద్ధకంఠంలో.

"మీరు ఏమీ మారలేదు. మునుపటిలాగే వున్నారు. నేను లేని లోటు మిమ్మల్ని కష్టపెట్టలేదా?" అంది.

"అది చాలామటుకు సురేఖ తీర్చింది అమ్మీ" అన్నాను.

"సురేఖ ఏమంది, నాగురించి ఏమని చెప్పింది?" అంది.

"జేబులోంచి ఉత్తరంతీసి - యిదిగో నీ వుత్తరానికి జవాబిచ్చింది" అన్నాను.

యశో లేవలేదు. నా ఒడిలో కళ్లుమూసుకుని - యిప్పుడు కాదు. తరువాత చదువుతాను. నన్ను యిలాగే పడుకోనివ్వండి. ఈ నెల్లాళ్ళూ ఈ సుఖంకోసమే పరితపించాను" అంది.

శాలువ సరిగ్గా ఆప్యాయంగా కప్పి అన్నాను. "నేను నీకు ఇంత అవసరమని చెప్పలేదేమి అమ్మీ? చెప్పివుంటే నిన్ను వదలి వెళ్ళేవాడిని కాను."

"అభిమానం అడ్డువచ్చింది. ఇక ఎన్నడూ యీ పొరపాటు చెయ్యను" అంది.

నా హృదయం పూర్తిగా కరిగిపోయింది. నెమ్మదిగా ఆమె తలను ముద్దుపెట్టుకుని" అలాగే చెయ్యి అమ్మీ. నేను ఎప్పుడూ ఇక నీ మాటకు అడ్డుచెప్పను." అన్నాను.

"మీరు ఎప్పుడూ అలాగే అంటారు" అంది మెల్లగా.

కాదు అమ్మీ ఈనాడు నిజంచెప్తూన్నాను. నేనంటే నీ కింత ప్రేమని నా కింతవరకూ తెలియదు" అన్నాను.

యశో దీనికి జవాబివ్వలేదు. అలాగే కళ్ళుమూసుకుని నా ఒడిలో వుండిపోయింది. కనుకొలుకుల్లో కొంతసేపటికి కన్నీటిబిందువులు కన బడ్డాయి. నెమ్మదిగా, మృదువుగా వాటిని తుడిచివేశాను. ఆనాటి రాత్రి:-

వెళ్లాక్కతరువాత వచ్చిన మొదటిరాత్రి అది. యశో అందంగా కనబడింది, ఆ రాత్రి. హఠాత్తుగా నాకు అప్పుడు జ్ఞాపకంవచ్చింది. ఇంతవరకూ ఆ విషయంగురించి ఎప్పుడూ ఆలోచించలేను. యశో నా దగ్గరవుండటము ఎంతసహజమో, ఆమె అందంగా వుండటం అంత సహజమని తోచింది। అదేదో నా హక్కులాగ భావించేవాడిని.

హఠాత్తుగా అప్పుడు "మీ అమ్మగారు అందంగా వుండేవారా యశో?" అని అడిగాను.

ఆమె ఆశ్చర్యంతో "ఏం అలా అడిగారు?" అంది. "అసలు చెప్పు." అన్నాను.

"అవును. మా అమ్మ చాలా అందంగా వుండేదని మా నాన్న గారుచెప్పేవారు. ఆవిడ పోలికలే నాకు వచ్చాయనేవారు. నాకు సరిగ్గా గుర్తులేదు. చాలా చిన్నతనంలో ఆవిడను కోల్పోయాను."

"అది నిజమే అయివుండాలి. లేకపోతే ఇంతఅందం నీకెక్కడి నుంచి వస్తుంది?" అన్నాను.

యశో ముఖం వికసించింది. "నేను అందంగావుంటానా?"అంది నవ్వుతూ.

"నెమ్మదిగా అంటావేమిటి అమ్మీ?" అన్నాను.

"కాస్త అందం వర్ణించండి చూద్దాము." అంది నవ్వుతూ పెదిమ నొక్కిపెట్టి.

"నాకు కవిత్వం రాదు. లేకపోతే అలాగే చేసేవాడిని. అయినా నీకూ, యితర అందకత్తెలకూ తేడా ఏమిటంటే, నీకు అందమైన కళ్ళే కాదు. అందమైన ముక్కుకూడా వుంది. జేన్ ఆస్టిన్ చెప్పినట్లు, ఒక నూరు అందమైన నేత్రాలకు, మనకు ఒక అందమైన ముక్కు కనబడుతుందనే సంగతి జ్ఞాపకం వుంచుకుంటే, యిక వేరే చెప్పాలా?" అన్నాను.

యశో నవ్వుతూ "చాలు చాలు. మీరు అలా అన్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నన్నుచూచిన ప్రతివాడూ, నేను అందంగా వుంటానని అంటారు. కాని మీ రెప్పుడూ యింతవరకూ అలా అనలేదు. చాలాసార్లు కోపం వచ్చిందికూడా మీ మీద. మీరు మొదటిసారి చూచినప్పటికీ యిప్పటికీ ఏమైనా మారిపోయానా చెప్పండి" అంది సగర్వంగా.

"ముమ్మూర్తులా అలాగేవున్నావు. ఇంకా చెప్పాలంటే ఇప్పుడే అందంగా వున్నావు. వయస్సుతోపాటు, వయ్యారం, వంకరలూ వచ్చాయి" అన్నాను.

"చాల్లెండి. యింకవూరుకోండి. నాకుతెలుసు. మీరు యితర పురుషుల్లాగ శరీరం తళుకూ, మెరుపూ చూచి లొంగిపోరని. అయినా నే నప్పుడప్పుడు ఆశ్చర్యపొయేదానిని మీరింత నిర్లక్ష్యంగా యెలా వుండగలుగుతున్నారని" అంది.

"నే నెలా వుంటాను చెప్పు అమ్మీ!" అన్నాను.

ఆమాటతో యశోకి ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చింది. క్షణకాలంలో పచ్చటిముఖం ఎర్రగా కుంకుమలా అయిపోయింది. మనసులోని భావమేనా ఆమె ముఖంమీద స్పష్టంగా కనబడింది. ముఖం క్రిందకి దించివేసుకుంది.

చేత్తో ముఖం పైకెత్తి "అరే యింత సిగ్గెందుకు అమ్మీ?" అన్నాను.

కళ్ళు క్రిందికి దించుకునే అంది. "నేను ఆనాడు చెప్పానుకదా

మీరు సువాసనగల పుష్పంలాంటివారవి, అదే అందరినీ మీలో ఆకర్షిస్తుంది. మీకు అందంవుంది. కానీ అవి ఎవరినీ మోసపుచ్చదు. మిమ్మల్ని చూచిన మరుక్షణంలోనే మీలోని ప్రత్యేకత కనబడిపోతుంది" అంది.

"ఇది చెప్పడానికి యింత సిగ్గెందుకు అమ్మీ" అన్నాను.

ఆ సంభాషణ ఫలితంగా నేను యింతవరకూ ఒక విషయం గ్రహించాను. అదేమంటే ప్రతి స్త్రీ తాను అందంగా వున్నానని యితరులు — ముఖ్యంగా ఆమెని ప్రేమించేవారు — చెప్పాలని కనీసం రహస్యంగానైనా ఆశిస్తుంది. అపరిచితుడుచెప్పినా హృదయం ఒకసారి స్పందిస్తుంది. ప్రశంసనీయవాక్యాలు వీనులవిందుగా వుంటాయి. వారికి సౌందర్యాన్వేషణ పురుషులేచేస్తారు. ఈ విషయంలో వీరికంటె స్త్రీలే సమంజసంగా వుంటారు. వారు అందచందాలగురించి అట్టే పట్టించుకోరు. అలా చేసినట్లయితే వారిలో చాలామంది యావజ్జీవ బ్రహ్మచారిణులుగా వుండిపోవలసివస్తుంది. సాధారణస్త్రీ వాంఛించేది అందంకాదు. ఆదరణ, అనురాగమూను. యశో నాకు వ్రాసిన పెద్ద వుత్తరంలో "శరీరంగురించిన ఆలోచనల్ని కట్టిపెట్టాను, ఇన్నాళ్ళు దీని పోషణలోనే గడిపివేశాను. ఇంకా ఆ అజ్ఞానాంధకారంలోనే పడి కొట్టుకుపోమంటారా ?" అని వ్రాసింది.

ఆ రోజుల్లో ఆమె నిజంగా అలా చేసియుండవచ్చు. కాని అది అణగారివుంది. అంతరించిపోలేదు. నేను ఆ కుటీరంలో అడుగుపెట్టిన క్షణంలోనే తిరిగి తలఎత్తింది. నేను ఆనాడు అనుకున్నది నిజమే. లఖియాలాగ యశోరాజ్యం ఎప్పుడూ సర్వసంగపరిత్యాగి కాదు. ఈమె ఎన్నడూ సన్యాసిని కాలేదు. లఖియాని గురువుగారు సుందరీ అని పేరుపెట్టి పిలిస్తే ఆమె సహించి వుండేదికాదు. గురువుగారు ఆ విషయం గ్రహించి ఆమెకు రాణీ అని పేరుపెట్టారు. యశోని సుందరీ అని పిలిస్తే ఆమె ఏమీ పట్టించుకోలేదు. ఆమె అది నిష్కల్మషమైన హృదయంతో పెట్టిన పేరనుకున్నదనే విషయం నిస్సందేహమయింది. అయినా ఆమె సౌందర్యాన్ని యితరులు కొనియాడటం చాలా స్వాభావికమయినదని ఆమె అనుకొనివుంటుంది. అందుకనే

ఆ పేరు ఆమెకి వచ్చిందని నాకు చెప్పింది. కాని ఆ పేరుపెట్టిన వ్యక్తి కల్మషహృదయుడని తెలసినవెంటనే చెవులుమూసుకుని దానిని కాశీలో వదలివేసింది.

*    *    *

కాశీలోకాలం గడిచిపోతూంది. మనస్సును బాధించే ఆలోచనలు కట్టిపెట్టాను. ఎందుకు వాటినిగురించి బాధపడాలి? దానివలన నాకు కలిగేలాభమేమిటి? జీవితంలో అంతసుఖం నేనెప్పుడూ అనుభవించ లేదు. ప్రాణసమానంగా ప్రేమించే ప్రేయసి, నిందారహితమైనమనస్సు, ఈ రెండూ ఎప్పుడూ నాకు యింతకుముందు కలసిరాలేదు. అంతవరకూ ప్రవాహంలోపడి కొట్టుకుపోయాను. అప్పటినుంచీ ప్రవాహంలో పయ నించాను. నేను వాంఛించిందంతా నాకు ఆమెవద్దలభించింది. కాని ఆమె వాంఛించింది నానుండి ఆమెకు లభించలేదు. నేనుతప్ప యింకెవరైనా ఆమెను సుఖపెట్టేవారు. అలాంటిస్త్రీకి ఏలోటు రానిచ్చివుండేవారుకారు. పిల్లలంటే యశోకివున్న మమకారం నేను గ్రహించాను. సరళకొడుకు బాదల్‌బాబూగురించి చాలాసార్లు మాట్లాడేది.

ఒకసారి "సుశీకి మీకు వివాహం జరిగివుండినట్లయితే మీ మను మడికి పెట్టుకోవలసినపేరది" అంది.

"అప్పుడు బాదల్‌బాబూ అనేపేరు నాకువుండదు. యశో! యింకెవరికో ఆపేరు పెట్టివుండువు" అన్నాను.

యశో వినివూరుకుంది. ఆమెవుద్దేశ్యం నేను గ్రహించాను. ఆమె అన్న ఆ వాక్యంలో సుశీకిబదులు యశో అనిచేరిస్తే సరిపోతుంది. అది ఆమె చెప్పలేక అలాఅంది. కాని ఆమెలోని నిగ్రహశక్తి నన్నుఎంతో ఆశ్చర్యపరచేది. లేకపోతే ఏం జరిగేదో?

అప్పుడప్పుడు లఖియాని చూడటానికి వెళ్ళేవాళ్ళం. సరళా రాజేంద్రకూడా వచ్చేవారు. మేము నలుగురుమూ ఆ యిరువది నిమిషా లనీ పంచుకునేవాళ్ళం. లఖియాగురించి నేను ఎంతో ఆలోచించేవాడిని. ఇన్నికష్టాలనుభవించినా ఈమెలో యింత విశ్వాసమెక్కడిది. ప్రపంచ కంలో అందరూ తనలాగే మంచివారనుకుంటుంది. నిర్మలమైన ఆమె హృదయాన్నిగురించి ఎంతో తలపోసేవాడిని. లఖియా నిజంగా నేరం

చేసిందా ? లేదా ? అనేఅనుమానం నన్ను వదలలేదు. అంతగట్టిదెబ్బ యీ అబల చేయిచేసుకోవటం వలన కలిగిన ఫలితమయివుండదు. ఆ కుటీరంవద్ద ఆ ఘోరమైనరాత్రి నేనెందుకులేను. ఎంత అడిగినా ఆరాత్రి ఏమిజరిగిందో ఆమె చెప్పలేదు. మందహాసంచేస్తూ- "తెలుసు కొని లాభంఏమిటి రామబాబూ ?" అనేది. ఆ ప్రశ్నకు జవాబేముంది.

లఖియాని విడుదలచేసేదినం సమీపిస్తోంది. ఆరునెలలు మంచి ప్రవర్తనకారణంగా ముందర విడుదల చేయటానికి నిశ్చయించారు. లఖియా, సత్ప్రవర్తనా, ఈ రెంటికి ఏదో అవినాభావసంబంధం యిమిడివుంది. కొన్నాళ్ళయినా మా ఆతిథ్యము స్వీకరించమని అడిగాము.

"సరేయశో నా తిరుగుడు కాశీతో ప్రారంభిస్తాను." అంది.

మేమంతా గుమ్మంవద్దనుంచుని పొద్దుగాటి ఆ దారిని అవలో కించాము. లఖియా మలుపుతిరిగి మాకు ప్రత్యక్షమయింది. ఈసారి ఆమె ప్రక్కన పోలీసువాడులేడు. చేతిలో ఒక చిన్నమూటపట్టుకుని ఒంట రిగా నడచివస్తూంది. మావద్దకురాగానే సరళ, యశోలతో ఆలింగనం చేసింది.

ఇక నావంతు వచ్చింది-నవ్వుతూ "చూచారా రామబాబూ, జైలులో ప్రవేశించినప్పటికంటే యిప్పుడే నేను ధనవంతురాలిని" అంది.

ఆమె చేతిలో కొన్ని రూపాయినోట్లున్నాయి. కారాగారవాస మయిన తరువాత ఖైదీలకిచ్చే డబ్బయివుంటుంది.

"ఈ మూటలోని నాలుగు తెల్లచీరలు యింకా వున్నాయా లఖియా ?" అన్నాను.

లఖియా నవ్వుతూ "మీరు ఎప్పుడూయింతే రామబాబూ. అన్నిం టికీ కోపగిస్తారు, నాకు యింతకంటె ఎందుకు చెప్పండి." అంది.

నేనేమీ మాట్లాడలేను. దుఃఖాన్ని కోపాన్ని దిగమింగాను. నేను ఎత్తుకున్న బాబుని ఒకసారి ముద్దుపెట్టుకు "రాజేంద్రబాబూ మీ ఆరోగ్యం యిప్పుడు సరిగావుందా ?" అంది.

రాజేంద్రకి ఆరోగ్యం సరిగాలేదని మాకు తెలియదు. యివన్నీ ఎలాతెలుసు యీమెకు ? ఎలా జ్ఞాపకముంటాయి ? "అప్పుడేపోయింది లఖియా. అసలు నిన్ను చూడటానికి క్రిందటిసారే వద్దామను

కున్నాను. సరళ వద్దంది" అన్నాడు. అంటే క్రిందటిసారి సరళ లఖియాని చూడటానికి వచ్చినప్పుడు, రాజేంద్ర ఆరోగ్యం సరిగ్గాలేదని చెప్పియుంటుంది. తరువాత అంతా బయటకువచ్చాం.

* * *

మేమంతా ముస్సోరీలో మూడు రోజులుండి కాశీకి బయలు దేరాము. లఖియాతోకూడా సరళ వచ్చింది. రాజేంద్రకి పనివుండి రాలేకపోయాడు. లఖియా మా యింట్లో ఒక వారంరోజు లుండటానికి అంగీకరించింది. వీరిద్దరూ మా యింటికివచ్చిన మొదటి అతిథులు. ఖాళీగావున్న మూడవగది యిప్పుడు ఉపయోగపడింది. ఎంతచెప్పినా వినకుండా కొడుకుని వదలివచ్చింది సరళ.

మా యింటికివచ్చిన మొదటిరోజున లఖియాని నేను అడిగాను— "లఖియా మేము ఏమిచేస్తే నువ్వు సుఖపడతావో చెప్పు? నువ్వు మాదగ్గర వున్నంతకాలమైన సుఖపడాలి" అన్నాను.

"సుఖమూ, సంతోషమూ అంతర్యంలోవుంటాయి రామబాబూ. నేను ఎప్పుడూ సుఖంగానేవున్నాను. బహుశా మీ అందరికంటేకూడా."

"అయితే మేము నీకు చేయగలిగింది ఏమీలేదంటావు అంతేనా?"

"మీ అందరితోటికలసి కొన్నాళ్ళు వుండగలుగుతున్నాను. నాకదేచాలు. ఇది చాలాకాలంవరకూ జ్ఞాపకం వుంచుకుంటాను" అంది.

"కాశీ మనదేశంలోని పుణ్యక్షేత్రా లన్నిటిలోనూ పవిత్రమైన దంటారుకదా లఖియా? నువ్వు అక్కడికి యిక్కడికి వెళ్ళడమెందుకు చెప్పు. ఇక్కడే వుండిపోకూడదా? మనమంతాకలసి వుండవచ్చు" అన్నాను.

ఆ మాటలువిని సరళ కళ్ళలోకిచూచింది. ఆ చూపు అర్థం నేను గ్రహించాను. "ఈ కోరికే నేను మీవద్దనుండి ఒకసారి యాచించాను. మీరు తిరస్కరించారు. నేనుచేసిన నేరమేమిటి?" అని అడిగింది.

లఖియా "అడుక్కునేవారు ఆయాసపడితే అర్థంలేదు రామబాబూ! వారు ఎప్పుడూ తిరుగుతూనేవుంటారు" అంది.

యశో— "మేమంతావుండగా నువ్విలా చేయవలసిన అవసరం

ఏమిటి లఖియా! ఒంటరిగా నువ్వు లోకాన్నీ, విధినీ ప్రతిఘటించలేవు. అది భ్రాంతిమాత్రమే" అంది.

"నేను ప్రతిఘటించడంలేదు. నేను లోకాన్ని ప్రార్థించే దేమిటంటే నాదారిని నన్ను పోనివ్వండి. యీ దీనురాలిని కన్నెత్తికూడా చూడవద్దు. ఇంతే నేను కోరుకునేది" అంది.

కొంచెం కోపంగా— "ఈ దీనురాలికోరిక నెరవేరదు లఖియా. అందరూ నీలోటివారు కారనేవిషయం నువ్వు గుర్తుంచుకోవాలి. అరణ్యంలో క్రూరమృగాలుకూడా వుంటాయి. అవి కనబడినవారిని కబళించివేస్తాయి" అన్నాను.

"ఈ అడవిమృగాలను అదుపులోవుంచి ఆదేశించగలశక్తి వేరొకటి వుంది రామబాబూ! ఆ శక్తి రక్షణలోనే నన్ను వదలండి" అంది.

"ఆ శక్తి యింతవరకూ ఏం చేస్తోందో."

లఖియా—"ఆరాత్రి ఏంచేస్తుంది. రణధీర్ రూపంలో నా రక్షణకు వచ్చింది రామబాబూ!" అంది నవ్వుతూ.

ముగ్గురమూ క్షణకాలం దిగ్భ్రాంతులైనాము. లఖియా నిరపరాధి. నిర్దోషి అని తెలిసి కాస్త సంతోషంకూడా కలిగింది.

లఖియా— "నన్ను క్షమించాలి మీరంతా. అప్రయత్నంగా అన్నాను" అంది.

"జరిగిందేమిటో చెప్పు లఖియా" అన్నాను.

"జరిగిందట్టే ఏమిలేదు రామబాబూ. ఆరాత్రి రణధీర్ నా రక్షణకి వచ్చాడు. ఎవరు పంపించారతనిని? మీరు పరిహసించే ఆ శక్తి మాత్రమే. లేకపోతే ఆరాత్రి నేను ఆత్మహత్య చేసుకునేదానిని" అంది.

"అంటే ఆరాత్రి రణధీర్ నీ రక్షణకు వచ్చి ఆ గురువు తలమీద కొట్టాడన్నమాట. రణధీర్‌ను నీవు అక్కడనుంచి పంపించివేసి ఆ నేరం నీమీద మోపుకున్నావు. ఈ అనుమానం నాకు మొదటినుంచీ వుంది. ఎంతపని చేశావు లఖియా" అన్నాను.

సరళ యిప్పటికి సంగతి పూర్తిగా అర్థంచేసుకుంది. లఖియా భుజంమీద తలమోపి "ఇదంతా నాకు అప్పుడు ఎందుకు చెప్పలేదు.

ఇతరులుచేసిన నేరానికి నువ్వు యీ శిక్ష అనుభవించాలా? జరిగిందంతా ఎందుకు చెప్పలేదు. ఇదంతా తప్పునుకదా" అంది.

లఖియా— "దెబ్బ ఎవరుకొడితేనేం సరళా! నన్ను రక్షించే ప్రయత్నంలోనేగదా అలా జరిగింది. నా రక్షణకు నా వైధవ్యాన్ని రక్షించటానికి వచ్చిన రణధీర్‌ని జైలుకి పంపించమంటారా రామబాబూ?" అంది.

"జైలుకు పంపించమనటంలేదు లఖియా! జరిగిందంతాచెప్తే ఎవరికీ శిక్ష పడకపోను" అన్నాను.

"లేదు రామబాబూ! అంతఃకరణలో నా గురించి ఎవరు కష్ట పడినా నేను సహించలేను. పరిణామాలనుగురించి నేను చింతించను" అంది.

యశో యింతవరకూ మౌనంగానేవుంది. ఇప్పుడు ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చి— "నువ్వు చెప్పిందే నిజం లఖియా. భవిష్యత్తులో నీకు దైవం మేలు చేకూరుస్తాడు" అంది.

* * *

కాశీలోని పుణ్యస్థలా లన్నిటికి లఖియాను తీసుకవెళ్ళాం. నాకు యిలాంటివాటిమీద నమ్మకం, ఆసక్తి లేకపోయినా లఖియాని వదలి పెట్టడం యిష్టములేక వెళ్ళేవాడిని. సరళకూడా నన్ను అనుకరించింది. ప్రతిచోటా ఏదో అడ్డుప్రశ్నలు వేసేది. విశ్వేశ్వరాలయానికి వెళ్ళివస్తూంటే సరళ— "ఈ ఆలయం ఎవరు కట్టించారు రామబాబూ?" అంది.

ఇలాంటిప్రశ్న ఎప్పుడూ ఎవరూ వేశియుండరు. నాకు ఎప్పుడూ తట్టలేదు.

"నాకు తెలియదు సరళా— యశోని అడుగు" అన్నాను.

"నాకు తెలియదు సరళా"— అంది యశో.

"ఆలయం ఎవరు కట్టించారో తెలియకుండా పూజ ఎలాచేస్తావు యశో" అంది.

యశో— "దైవాన్ని పూజచేయడానికి పూజారిపేరు తెలియ

నక్కరలేదు. అలాగే ఆలయంలో ప్రార్థించడానికి ఆలయం కట్టించిం దెవరో తెలియనక్కరలేదు" అంది.

లఖియా— "యశోచెప్పిందే నిజం. సరళా — దానికీ, దీనికీ ఏమీ సంబంధంలేదు. అయినా ఎవరో మహారాణి అహల్యాదేవి కట్టించినదని విన్నాను" అంది.

ఈమెకు యివన్నీ ఎలా తెలుస్తాయి. కాశీ యీమె మొదటిసారి వచ్చింది. అక్కడ చాలాకాలంపట్టీ వుంటున్న మాకు తెలియని యీ వివరాలు, అప్పుడే కారాగారమునుండి వచ్చిన యీమెకు ఎలా తెలిశాయి ?

ఇంటికి వచ్చేస్తూంటే సరళ అడిగింది— "గంగలో స్నానంచేస్తే పాపాలు పోతాయంటారు. నిజమేనా లఖియా ?"

లఖియా జవాబు చెప్పకమునుపే నేను— "అలాంటిదేదో కాస్త చెప్పు లఖియా. నేనూ రోజూ స్నానంచేస్తూంటాను. చేసినవన్నీ పోవడమేకాకుండా చేయబోయేవాటిని కడిగివేయగలంత పుణ్యము మూటగట్టుకుంటాను" అన్నాను.

సరళ— నా కళ్ళలోకిచూస్తూ "మీరు చేసిన పాపాలు ఏమిటి రామబాబూ" అంది.

"చేసినపాపాలు తెలిస్తే మనమెందుకు చేస్తాము సరళా ? ఏది పాపమో, ఏది పుణ్యమో విచారించగలవారెవరు ?" అన్నాను.

లఖియా— "గంగలో స్నానంచేస్తే పాపాలుపోతాయని నలుగురూ అనగా విన్నానుగాని ఎక్కడా చదువలేదు సరళా ! గంగ పవిత్రమైనదనిమాత్రమే చదివాను. అదే నా నమ్మకం. ఏదివున్నా లేకపోయినా మానవునికి విశ్వాసమనేది వుండాలి. అది గంగ కావచ్చు లేక గోవిందుడు కావచ్చు" అంది.

సరళ— "చేతుల్ని కాళ్ళని అదుపులో పెట్టుకోవచ్చు లఖియా. మనస్సుని మానవులు శాసించలేరుకదా ?" అంది కాస్త నీరసంగా.

సరళ పరిహాసానికి అన్నమాటలు కావవి. నాకు ఆ ముఖం చూస్తేనే తెలిసింది. ఆమె చెప్పింది నిజమే. మనము ఏం పనిచేసినా మనసును శాసించలేము. ఇదే అతి విషాదమైన విషయం.

ఒకరోజు అంతాకలసి సారనాథ్ బయలుదేరి వెళ్ళాం. అన్ని

సంవత్సరాలు కాశీలోవున్నా అయిదుమైళ్ళ దూరంలోవున్న అక్కడికి నేను వెళ్ళలేదు. యశో యింతకుముందు ఒకసారి ఎవరితోనో వెళ్ళి వచ్చింది, అందుచేత నాయకత్వం ఆమె వహించింది.

బండి దిగినవెంటనే యశో సరళవేపిచూస్తూ "సరళా దీనిని పూర్వకాలంలో మృగాడవ అని పిలిచేవారు. ఆ తరువాత బోధిసత్వ సారంగధరుని నామంనుంచీ సారనాథ్ అనేనామం వచ్చింది. ఇక్కడే తనను వదలిపెట్టిపోయిన అయిదుగురుశిష్యులనూ బుద్ధుడు తిరిగి కలుసుకుని మొదటిబోధన చేసాడంటారు. ఇక్కడ బుద్ధదేవాలయం ఒకటి వుంది" అంది.

సరళ నవ్వుతూ— "నువ్వు స్కూలుమేష్టారువైతే అభివృద్ధిలోకి వస్తావు యశో! రామబాబుకి పాఠాలు బాగా చెప్పడానికి" అంది.

ఎత్తైన ఒక స్థూపందగ్గరికి వచ్చాము. ప్రశ్న లడుగకుండానే యశో "దీనిపేరు సరిగ్గా గుర్తుకురావటంలేదు. ఈ స్థలంవద్దే బుద్ధుడు వారిని కలుసుకున్నాడంటారు" అంది.

లక్షియా మెల్లగా— "చౌకండీ అంటారుగదా దీనిని" అంది.

యశో— "అవును అదే. నీకెలా తెలిసింది లక్షియా?" అంది.

"ఎక్కడో చదివినగుర్తుయశో" అంది.

ములగంధకుటి విహారంలోకి వెళ్ళాం. అదే యశోచెప్పిన బుద్ధదేవాలయం.

"చెప్పవలసిందేమైనావుందా యశో" అంది సరళ.

"లేదుసరళా, బుద్ధుని జీవితచరిత్ర పుస్తకాల్లో చదివేవుకద్దా?" అంది.

హఠాత్తుగా ఆ అప్రాచ్యుడు గురువుగారు జ్ఞాపకంవచ్చాడు. తనను ఆనాడు గౌతమబుద్ధునితో పోల్చుకున్నాడు. నేను ఆయనను ధిక్కరిస్తే యశోకి ఎంతో కోపంవచ్చింది. కానీ చివరకు యిలాగ అవుతుందని ఎవరనుకున్నారు? యశోవైపు చూచాను. కలవపువ్వులాంటి ఆ కళ్ళతో నా కళ్ళు వకసారిచూచి క్రిందికి దించుకుంది. దాని అర్థం నేను గ్రహించాను. "ఈ గాయంతో యింకా నేను బాధపడుతున్నాను బాదల్‌బాబూ. మీరు నాకు యింకా అది ఎందుకు జ్ఞప్తికి తెస్తారు" అంది.

మేమంతా చాలాసేపు బుద్ధుని విగ్రహాన్ని తదేకంగా చూస్తూ వున్నాము. ఒకప్రక్క లఖియా మరోప్రక్క యశో తలవంచుకుని వున్నారు. బుద్ధుని ముఖంలోంచి వుట్టిపడే శాంతము, ప్రశాంతలా లఖియా నిమీలితనేత్రాలతో నాకు కనబడ్డాయి. ఎప్పుడూలేంది సరళ కళ్ళుమూసుకుని మౌనంగావుంది.

బయటికివస్తూంటే నేను సరళని— "బుద్ధుని విగ్రహంముందు నించుని ఏమి కోరుకున్నావు సరళా? ఎప్పుడూ నిన్నిలా చూడలేదు" అని అడిగాను.

నీరసంగా నా కళ్ళలోకి చూస్తూ "మనస్సులోని అశాంతి పోవాలని కోరుకున్నాను రామబాబూ" అంది.

నా కళ్ళలోకి ఎప్పుడూ ఎందుకు చూస్తుంది? వాటిలో ఆమె ఏమి వెదకుతుంది! "నువ్వేమి కోరుకున్నావు లఖియా" అన్నాను.

"నేను ఏమీ కోరుకోలేదు. శ్రద్ధాంజలి అర్పించాను. అంతే" అంది. నేను విని పూరకున్నాను. ఆ తర్వాత సరళ నవ్వుతూ—"యశోని అడుగలేదెందుచేత రామబాబూ?" అంది.

"అది నాకు తెలుసు. బాదల్‌బాబుకంటె ముందు నన్ను తీసుకుపొమ్మని కోరుకుని వుంటుంది" అన్నాను నవ్వుతూ.

యశో— "అబద్ధం. నేనలా ఏమీ కోరుకోలేదు. లఖియా జీవితం సుఖవంతం చేయమని కోరుకున్నాను" అంది,

అది నిజమో కాదో నాకు తెలియదు. నేను కోరుకున్నదీ అదే.

వారంరోజులు గడువూ అయిపోయింది. ఇకరేపే లఖియా ప్రయాణం. ఎక్కడికి? మొదటిసారి భర్తమరణం తర్వాత యిల్లువదలినప్పుడు మామయ్యదగ్గరకు పోయింది. అక్కడనుంచీ ఒకరాత్రి పారిపోయి ఆశ్రమం వచ్చింది. అక్కడనుంచి జైలుకిపోయింది. ఇకయిప్పుడు ఎక్కడికి వెళ్తుంది. లఖియాను యింకా కొన్నాళ్ళుండమని ఆ రోజు అడిగాను.

"దీనికి అంతువుండదు రామబాబూ! నా దారిని నన్ను పోనీవండి. రేపటికి మనదారులు విడిపోతాయి. తిరిగి కలుసుకోమని ఎలాచెప్ప

గలము. విడిపోయాయనుకొన్న మనబాటలు యింతకుముందు ఒకసారి కలుసుకోలేదా?" అంది.

"నువ్వు రేపు వెళ్ళిపోతూన్నావని నాకట్టే విచారంలేదు లఖియా. రేపు సరళకూడా వెళ్ళిపోతుంది. అదికాదు ఎక్కడకు వెళ్తావో? అది అర్థంకాని అజ్ఞానమే మమ్మల్ని కలవరపరుస్తూంది. నువ్వు ఎక్కడ వుంటున్నావో అప్పుడప్పుడు తెలియ పరచగలవా?" అన్నాను. యశో, సరళా అక్కడే వున్నారు.

"ప్రపంచంలో అందరికంటె మీ మాటలకు ఎక్కువ విలువ యిస్తుంది లఖియా." అంది సరళ. యశో 'అవు' నంది.

లఖియా— "అదినేను చెప్పలేను రామబాబూ! మీరంతానన్ను మరచిపోవాలి. నన్నుగురించి చింతించటం మానివేయాలి. అదొక్కటే మార్గం." అంది.

"అయితే రేపు ఎక్కడకు వెళ్తావోచెప్పు లఖియా. దేశదిమ్మరికి కూడా మొదటి మజిలీవుంటుందికదా." అన్నాను.

"ఎందుకుండదు రామబాబూ! ఏదోఒకటి వుండాలి. మీరన్నది నిజమే. బహుశా ముందర కురుక్షేత్రంవెళ్తాను. నాలాటివారికది సరియైన స్థానమని చెప్పగా విన్నాను." అంది.

* * *

మేమంతా "మొగల్‌సరాయి" స్టేషన్‌లో నించునివున్నాము. అక్కడనుంచీ సరళకు — లఖియాకీ వీడ్కోలు చెప్పడానికి కాశీనుంచీ మేముకూడా వచ్చాము. లఖియావెళ్ళవలసిన రైలుకి యింకా అరగంట టైముంది. సరళ రైలుకి నలుబదియైదునిముషాల వ్యవధివుంది.

లఖియా బట్టలమూటను రెండవతరగతి స్త్రీలడబ్బాలో పెట్టాను. "భిక్షకురాలు వెళ్ళే డబ్బాకాదది రామబాబూ. అది మరొకచోట వుంది" అంది లఖియా.

నాకు కోపంవచ్చింది. లఖియా మమ్మల్ని విడచిపోతూందనే విచారంవెల్లుబికింది. "ఇక్కడ నేనున్నంతకాలం నువ్వు భిక్షకురాలి వేమీకావు లఖియా. రైలుకదలిపోయినతరువాత తోటి ప్రయాణీకులతో

కావాలంటే ఆ మాటచెప్పు" అన్నాను. మాట్లాడుతూవుండగా కంఠం అవరుద్ధమయింది.

"సరే అలాగే కానీయండి రామబాబూ. ఈ రోజున మిమ్మల్ని కష్టపెట్టడం నా కిష్టములేదు. నాదగ్గిర డబ్బువుంది. అదితీసుకుంటారా లేక టిక్కెట్టు మీరే కొనిపెడ్తారా. చెప్పండి?" అంది.

నేనేమీ జవాబివ్వలేదు. గబగబా లోపలికి వెళ్ళిపోయాను. టిక్కెట్టుతీసుకొనివచ్చేటప్పటికి వారంతా కంపార్టుమెంటులో కూర్చొని వున్నారు. ఆ స్త్రీల డబ్బాలో యింకొక యిద్దరు ప్రయాణీకు లున్నారు. మిగతదంతా ఖాళీగానేవుంది. లఖియా యిద్దరి భుజాలమీదా చెరొక చెయ్యివేసి వారిని ఆమె అప్పటివరకూ బుజ్జగిస్తున్నట్లు కనబడింది.

నన్నుచూచి "నామీద కోపగించారా రామబాబూ" అంది.

"కోపగిస్తే నువ్వుబాధపడుతావా లఖియా?" అన్నాను, ఆమెకు ఎదురుగుండా కూర్చుంటూ.

"ఎందుకు బాధపడను రామబాబూ?" అంది.

"కోపంలేదు లఖియా. దుఃఖముతో హృదయం దహించుకు పోతూంది. జీవితంలో నీకు నేను సేవా, సహాయం చేయలేకపోయాను. నీకు ఎంతో ఋణపడి వున్నాను. యశోకూడా నాకు నీవల్లనే లభించింది. ఇవి అంతా ఎలాతీరుతుంది?" అన్నాను.

"ఎందుకు చేయలేదు రామబాబూ! చాలా చేశారు. అంతకంటే శతవిధాలా విలువైనదేమంటే మీలో నేనంటే సానుభూతి, అభిమానమూ వున్నాయి. ప్రపంచకంలో అవి నాకు చాలా తక్కువమందివద్ద దొరికింది" అంది.

"భవిష్యత్తులో యికనిన్ను చూడలేననే ఆలోచన నేను సహించలేను, లఖియా! మమ్మల్నందరిని వదలి నీవు ఎందుకుపోతూన్నావో చెప్పు?" అన్నాను.

లఖియా నెమ్మదిగా "నేను విధవను, రామబాబూ! హిందూస్త్రీని. భర్తమరణంతర్వాత ప్రపంచకంలో ఆప్తులుండరు. విశ్రమించే నివాసస్థలం భర్తయిచ్చినది తప్ప యింకేమీ వుండదు. నేనుకూడా ఆపథంలోనే సాగిపోవాలి. నా జీవితమంతా వైధవ్యాన్ని కాపాడుకోవటంలో గడిపి

వేసాను. మీ అందరి అభిమానానికి నేను కృతజ్ఞురాలిని. అంతకంటె నేను చేయగలిగింది యింకేమీలేదు" అంది.

నేను కాస్సేపు మౌనంగానే వున్నాను. ఆమె నిశ్చయం తిరుగు లేనిదని గ్రహించాను. "ప్రపంచంలో ధనంలేకుండా ఏమీజరుగదుకదా లక్షియా. ఆనాడు మామయ్య యిల్లువదలిన తరువాత ఒక అపరిచితవ్యక్తి డబ్బు స్వీకరించావు కదా. మేము చేసిన పాపమేమిటిచెప్పు?" అన్నాను.

"అలాంటి దేమీలేదు రామబాబూ. మీ అందరివద్దనుంచీ నేను చాలా పుచ్చుకొన్నాను. అరె! రైలు కదలిపోతూన్నట్లుంది" అంది.

నిజంగా రైలు కదలిపోతూంది. గబగబా సరళనీ, యశోనీ దింపి నేనూ దిగిపోయాను. లక్షియా కిటికీలోంచి చెయ్యివూపుతూవుంది. హఠాత్తుగా లక్షియాని యిక చూడలేననే ఆలోచన కలిగింది. నేనేమి చేస్తూన్నానో నాకే తెలియలేదు. రైలువెంట పరుగెడుతూ ఫుట్ బోర్డు ఎక్కి అప్రయత్నంగా "జీవితంలో నీకంటే అధికంగా ఎవరినీ ప్రేమించలేము లక్షియా!" అన్నాను.

లక్షియా ముఖంమీద అత్యంతమైన ఆవేదనా ఆతురతా కనబడ్డాయి. రైలుప్లాటుఫారందాటి చాలాస్పీడైంది. అదిచూచి నేను దిగటానికి ప్రయత్నించాను.

లక్షియా కంగారు పడుతూ "వద్దు రాంబాబూ దిగకండి" అంది.

ఆమెమాటలు నేను వినిపించుకోలేదు. ప్లాటుఫారం చివరన యశోకట్టుకున్న ఆకుపచ్చటిచీర కనబడింది. నాకంగారు మిన్నుముట్టింది. గబగబా క్రిందమెట్టువరకూ దిగి క్రింద కాలుపెట్టాను. అంతే! తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు.

## 23

కళ్ళుతెరచి చూచేటప్పటికి ఆస్పత్రిలో మంచంమీద పడుకున్నాను. నాలుగురోజులు స్పృహలేకుండా వున్నానని తరువాత తెలిసింది. యశో నాకాళ్ళవద్ద కూర్చునివుంది. లక్షియా, సరళ మంచంవద్ద రెండు కుర్చీలలో కూర్చొని వున్నారు. లక్షియాని చూచిన వెంటనే నాకెంతో సంతోషం కలిగింది. అప్పటికి సంగతి గ్రహించాను. రైలు

లోంచి దిగే ప్రయత్నములో కాస్త దెబ్బలు తగిలివుంటాయి. అందుకే లఖియా ప్రయాణం ఆపివేసి వుండిపోయింది. దెబ్బలు తగిలితే నష్టమేమిటి? లఖియా నాలో కొంతకాలం యింకా వుంటుంది. నా దుడుకుతనం మంచినే కలగజేసింది. వారంతా పరధ్యానంగావున్నారు. అందరి ముఖాలు వాడిపోయివున్నాయి. శరీరంలో ఎంతో నీరసంగావుంది.

"నీ ప్రయాణం ఆపివేశాను లఖియా." అన్నాను.

అందరూ ఒక్కసారి ఆశ్చర్యపడ్డారు. క్షణకాలం అంతా నివ్వెరపోయారు. యశో గబగబా లేచివచ్చి నాగుండెలమీద వెక్కివెక్కి ఏడుస్తూ పడిపోయింది. అంతదుఃఖాన్ని నేనింతవరకూ ఎప్పుడూ చూడలేదు.

యశో తల హృదయంమీద వుండడంతో ఆయాసంకూడా పుట్టుకు వచ్చింది "కాస్త తలతియ్యి యశో—ఆయాసంగావుంది. ఎందుకు చెప్పు యింతఏడుపు." అన్నాను.

లఖియా చటుక్కున లేచినించుని యశోని లేవదీసింది. యశో ముఖంచూస్తే నాకెంతో భయంవేసింది. ఎంతపాలిపోయింది ? కుడికాలిలో శూలంపెట్టి పొడిచినట్టయింది. భయంకరమైన ఆలోచన ఒకటి మెదడులో మెరిసింది. గబుక్కునలేచి కాళ్ళమీద కప్పివున్న దుప్పటి తీసిచూచాను. రెండుకాళ్ళచుట్టూ అనేక కట్లున్నాయి. కుడికాలి క్రింద భాగమంతా ఏదో తెల్లగా వుంది. అది కదపటానికి ప్రయత్నించాను. ఇసుమంతయినా అది నేనుచెప్పినట్లు వినలేదు. ఎడమకాలు కొంచెం కదిలింది. తలకుకూడా కట్టుకట్టివుందని అప్పుడే గ్రహించాను. లేచి కూర్చోవటంతో విపరీతంగా బాధపెట్టింది. "నాకాలుకి ఏమయింది?" అని గట్టిగా అరచాను. మరుక్షణంలో స్పృహతప్పి పోయింది.

నేను కుంటివాడనయి పోయాను. కుడికాలు రూపం అలాగే వుంది. కాని క్రిందభాగం ఎందుకూ పనికిరాదు. కనీసం కొన్ని సంవత్సరాలవరకూ—బహుశా శాశ్వతంగా — అది నాకెందుకూ వుపయోగపడదని డాక్టరు చెప్పాడు. ఒకమనిషి సహాయంకాని, లేక కనీసం ఒక దృఢమైన కర్రకానీ లేకుండా యిక నేనునడువలేను. కుడికాలు నా ఆదేశాన్ని శిరసా వహించదు. అది నాశరీరంలోని భాగమే, అయితేనేం దానికీ నాకూ సంబంధం తీరిపోయింది. జీవితంలో ఎందుకూ పనికిరాను. ఏపనీ నేను

స్వంతంగా చేయలేను. కనీసం పైనందిన కార్యక్రమాలుకూడా నా అంతట నేను నిర్వహించలేను.

చిన్నతనంలో ఒకసారి మద్రాసులో ఒకకుంటివానిని గేలిచేస్తే చిన్నపిల్లయినా సుశీ మందలించింది "తప్పు రామం, పాపం వాడేమిచేయ గలడు చెప్పు? నవ్వకూడదు." అంది. ఈనాడు ఆప్రాప్తి నాకే కలిగింది. సుశీల జీవించివుంటే ఏమనివుండును. స్వర్గంలో సుఖంగావుంది. అదీ మంచికే జరిగింది. ఇదంతా భరించవలసిన భారము యశోమీద పడింది. ఆమెనుగురించే నేను ఎక్కువగా ఆలోచించేవాడిని మిసమిస లాడుతున్న యవ్వనంలోవున్న అందాలభరణి యీమె, అలాంటి స్త్రీ ఎందుకూ పనికిరాని యీ అంగవికలుని ఆకారాన్ని ఎలా భరించ గలదు? ఆమెకు నా మీదవున్న ఆశలన్నీ దానితో నేలకూలిపోయి వుంటాయి. తను చేసిన పొరపాటు యీ పాటికి గ్రహించివుంటుంది, నాలో అనేక ఆలోచనలు రేకెత్తాయి.

తరువాత ఒక వారంరోజులవరకూ చాలా బాధపడ్డాను. తీవ్రమైన జ్వరానికి తలనొప్పి తోడువచ్చింది. కాళ్ళలో సూదులు గ్రుచ్చుతున్నట్లని పించేది. యశోని సముదాయించవలసిన భారమంతా లక్ష్మియావహించింది. లక్ష్మియా మనసులోని సంఘర్షణ నేను తెలుసుకోలేకపోయాను.

ఆరోజే నాకు కులాసాగావుంది. జ్వరమూ,తలనొప్పి చాలావరకూ తగ్గాయి. లక్ష్మియా వక్కరైనా దగ్గరవున్నప్పుడు "ఏమిజరిగినా నామనసు లోనిమాట నీకుచెప్పేశాను లక్ష్మియా! నువ్వేమనుకున్నావు?" అన్నాను.

"తప్పు రామబాబూ! మీరలాంటి మాటలనకూడదు. జరిగిందానికి కారణభూతురాలిని నేనే. మిమ్మల్ని ఎంతో కటువుగా ద్రోసివచ్చాను. జీవితంలో నేనింకా ఎంతమందిని నాశనంచేస్తానో తెలియదు." అంది. లక్ష్మియా.

మనస్సులో ఆవేశమూ, ఆవేదనా వుప్పెనలాలేచాయి. తల అడ్డంగా త్రిప్పుతూ "వద్దు లక్ష్మియా మళ్ళీ అలా అనవద్దు. నీకు మొదటినుంచీ వున్న అభ్యాసమే యిది. అందరి తప్పులీన్నీ నీ నెత్తి మీదవేసుకుంటావు. దీనికంతకీ బాధ్యులెవరైనావుంటే అది వారొక్కరే. నువ్వు ఎవరినైతే నమ్ముకుంటూన్నావో వారే" లక్ష్మియా అన్నాను.

కన్నీరు తుడుచుకుంటూ మీరు ఏమాత్రమూ ఆవేశపడకూడదని డాక్టరుగారు చెప్పారు" అంది.

నేనేమీ మాట్లాడలేను. లఖియా మందుయిచ్చింది. అదిత్రాగి "లఖియా యికముందు ఏమిచేయదలచుకున్నావు. నీ ప్రయాణం ఆగిపోయింది. మళ్ళీ యిక్కడనుంచీ వెళ్ళిపోతావా?" అన్నాను.

"మీరు ఏంచేయమనిచెప్తే అది చేస్తాను. ఇంత జరిగిన తర్వాత మీమాటకు ఎదురుచెప్పే అధికారం నాకులేదు. న్యాయంచెప్పండి" అంది.

లఖియాని వుండమని ఆదేశించే అర్హత నాకులేదు. కాశీలోవుండి లఖియా చేయగలిగిందేమిటి? నేనెందుకు అడ్డుపెట్టాలి? నావద్దవుంటే ఆమె మానసికక్షోభ కలకాలం అలాగే వుండిపోతుంది.

ఆ దుర్భర సంఘటనలో తనభాగంకూడా వుందనే ఆలోచన ఆమె మనస్సులోంచి తొలగిపోదు. అదీకాక నన్ను నేను నమ్ముకోలేకపోయాను. లఖియా నా దగ్గర వుండిపోతే యశోయెడ నా కర్తవ్యం నెరవేర్చలేనేమోననే అనుమానంకూడా కలిగింది. భవిష్యత్తులో కుంటివానికి ఆధారం ఆమే! లఖియా దగ్గరవుంటే యశోని ప్రేమించవలసినంతగా ప్రేమించలేనేమో. చాలాసేపు యిద్దరమూ మౌనంగావున్నాము. ప్రయత్నరహితంగా నిట్టూర్పువిడుస్తూ "నీ దారిని నీవు వెళ్ళిపో లఖియా. నా దగ్గర వుండటమువలన నీకు లభించేది దుఃఖముమాత్రమే ఇంకేమీకాదు. అయినా యింకా కొన్నాళ్ళుండు లఖియా" అన్నాను.

లఖియా మౌనంగా కిటికీలోంచి బయటకు చూస్తూంది.

"అబ్బా! జీవితం యింత దుఃఖంగా ఎందుకు వుంటుంది లఖియా? యశోగురించి ఆలోచిస్తూంటేనే నాకు ఎంతో బాధ కలుగుతోంది. నన్నుచూచిన మొదటిక్షణంనుంచీ ఆమె ఎప్పుడూ సుఖపడలేదు. ఇప్పుడు యిక వేరేచెప్పాలా?" అన్నాను.

అస్పష్టంగా లఖియా కంఠస్వరం వినబడింది. "యశో ఒక అపూర్వ స్త్రీ రామబాబూ! మీరంటే ఆమెకున్న విశ్వాసమూ, ప్రేమా అసమానమైనవి" అంది.

"అవును లఖియా! నీవు చెప్పిందే నిజం. అయినా ఆమెకూడా మానవమాత్రురాలే. కుంటివానిలో ఏమి సుఖపడగలదు చెప్పు."

నేను ఆ చివరిమాట లంటూంటే యశో లోపలికి వచ్చింది. ఆమెచేతిలో ఫ్లాస్కువుంది. దానిని బల్లమీదపెట్టి తిన్నగా మంచందగ్గరకువచ్చి కూర్చుంది. మృదువుగా— "యిప్పుడు ఎలావుంది" అంది.

"బాగానేవుంది యశో! అప్పుడే భోజనంచేసి వచ్చావా. ఇప్పుడే గదా వెళ్ళావు?" అన్నాను.

"ఎంతసేపు చెప్పండి. మీకు ఓవల్‌టిన్ ఆలస్యమయిపోదా? మిగిలినపనులు సరళ చేస్తూంది. వీరిద్దరి ఋణము మనమెలా తీర్చుకోగలము" అంది. లఖియా లేచి నుంచుని "ఋణంమాట అలావుంచు యశో. ఇక నేను యింటికి వెళ్తాను" అంది.

యశో "సాయంకాలం సరళని తీసుకురా" అంది.

లఖియా వెళ్ళిపోయినతరువాత కొంతసేపటివరకూ యిద్దరమూ మౌనంగానే వున్నాము. యశో ఫ్లాస్కులోంచి ఓవల్‌టిన్ గ్లాసులోపోసి చల్లారబెట్టింది. నెమ్మదిగాలేచికూర్చుని తాగివేశాను. జుట్టును చేత్తో సరిచేస్తూ-"చూడండి ఈనాడు మీరు నాకొక వాగ్దానంచెయ్యాలి,దీనినిగురించి మీరేమీ చింతింపకండి. అసలు ఆలోచించకూడదు. మీ ఒకకాలుకి బదులు నారెండుకాళ్ళు, రెండుచేతులూ వున్నాయి. మీకాలు ఎలా వాడుకుంటారో నన్నుకూడా అలా వాడుకోండి. నేను మీకు చాలాసార్లు చెప్పాను, మీదికానిది నావద్ద ఏమీలేదని. మీకు నేనేమీ లోటురానీయను. నా జీవితంలో నాకిక వేరే పనిలేదు" అంది.

నేను లఖియాతో అన్నమాటలు వినదని గ్రహించాను. ఆమాటలు నాకెంతో వుపశమనాన్ని కలిగించాయి.

"సరే అలాగేచేస్తాను. యశో! ఆలోచించనని నేను మాట ఇవ్వలేను. నన్ను మిధ్యావాదినికూడా చేయకు. అది నా శక్యంలోలేదు. నీ జీవితంలోకూడా అన్నీ కష్టాలే వ్రాసివున్నాయి. అమ్మీ! నీవు నాతో ఏమి సుఖపడగలవు చెప్పు?" అన్నాను,

"ఎందుకు పడలేను చెప్పండి. మీలో యిప్పుడు వచ్చిన లోటేమిటి? పూర్వంకంటె యిప్పుడు నామీద కాస్త ఎక్కువగా ఆధారపడతారు. అంతేనా? అదీ మంచిదేగా. పూర్వముకంటే నామీద అనురాగము, అభిమానము నాకు లభిస్తాయి. నా కంతేచాలు" అంది.

"నేను నీ జీవితంలో ప్రవేశించకపోతే ఎంత బావుండును అమ్మీ! ఎవరినో పెళ్ళిచేసుకుని పిల్లలతో సుఖంగా వుండివుందువు." అన్నాను ఆ ధోరణిలోనే. వెచ్చటి రెండు కన్నీటిబొట్లు నుదుటిమీద పడ్డాయి. "నన్ను కష్టపెట్టాలని కోరికగావుంటే అలా అనండి. ఎన్నిసార్లు చెప్పినా నా మాటలు మీరు ఎందుకునమ్మరు చెప్పండి" అంది.

"నమ్మకపోవటం కాదుఅమ్మీ! నిన్ను చూస్తూవుంటే నాకలా అనిపిస్తూంటుంది. ఇంత అందమూ, బూడిదలోపోసిన పన్నీరయి పోయిందిగదా అని బాధగావుంటుంది" అన్నాను.

యశో మెల్లగా నవ్వుతూ– "బూడిదలో ఎందుకుపోస్తారు, బాదల్ బాబూ! పన్నీరునుదాచుకున్నారు. లేకపోతే అందరిమీద జల్లుతారా చెప్పండి" అంది. నేనేమీ జవాబివ్వలేదు. అంగవికలుడననే ఆలోచన పోలేదు. కాలుకేసిచూచినపుడల్లా చురుక్కుమని జ్ఞప్తికివచ్చేది. "నేనొక ప్పుడు వుద్యోగం చేస్తానంటె వద్దన్నావు. అమ్మీ ఇక నీకా భయం అక్కరలేదు. నీ డబ్బంతా అయిపోయిన తరువాతకూడా నువ్వే నన్ను పోషించాలి" అన్నాను.

"డబ్బునుగురించి ఆలోచింపవద్దని మీ కెన్నిసార్లు చెప్పను చెప్పండి. అవును. అవసరంవస్తే గడించిపెడ్తాను. అందులో తప్పే ముంది. కాని ఆ అవకాశం రాదనే నా నమ్మకం. మీ యింటి అద్దె, భూములమీద శిస్తు కలసే మన యిద్దరికీ గడిచిపోతూంది. నా డబ్బు ఖర్చుచేయటమేలేదు. ఆ తరువాత యింకా నగలున్నాయి. ఇవన్నీ అయిపోతే నా చేతులున్నాయి" అంది.

యశో కుడిచెయ్యి నా రెండుచేతులలోకి తీసుకుని "నీకొకమాట చెప్పాలి అమ్మీ. రైలువెంట పరుగెడుతూ లఖియాతో నేను ఏమన్నానో నీకు తెలుసా?" అన్నాను.

"తెలుసును. లఖియాచెప్పింది"అంది. లఖియా చెప్పిందని విని కాస్త ఆశ్చర్యపోయాను "విని ఏమనుకున్నావు. బాధపడ్డావా?"-అడిగాను.

"బాధపడటానికి ఏముంది చెప్పండి. మిమ్మల్నిగురించి మీ కంటె బాగా నాకే తెలుసు. ఆవిషయం నాకు చాలాకాలంపట్టీ తెలుసు."

"ఏమిటి తెలుసు అమ్మీ!" అన్నాను కాస్త భయపడుతూ.

"మీ మనస్సు మీకే తెలియదు. మీలో నేనంటే అమితమైన కృత జ్ఞతా, లక్షియా అంటే అమితమైన జాలి వున్నాయి. జీవితంలో మీరు ఎవరినైనా నిజంగా ప్రేమించివుంటే ఆమె సుశీ మాత్రమే" అంది.

"అదినిజమోకాదో నాకుతెలియదు. బహుశా నిజంకాదు. అది నిజమనినమ్మితే యింతత్యాగం ఎలా చేయగలుగుతున్నావు."

"ఇదంతా త్యాగంకాదు, బాదల్‌బాబూ. స్వలాభంకోసమే యిలా చేస్తున్నాను. మీరులేకుండా నేను ఒక్క రోజుకూడా బ్రతకలేను.

నామీద ఆమెకు వున్న యీ మమతని యింతచక్కగా ఎప్పుడూ ఆమె విప్పిచెప్పలేదు. ఆనాడు ఆమె హృదయంవిప్పి నాముందర పెట్టింది. లోపల ఏముందోనని కుతూహలంగా తొంగిచూచాను. బాదల్ బాబూ అనే ఒక్కమాట వ్రాసింది. పొంగిపొర్లే ఆ నిర్మలప్రేమను చూస్తూంటే హృదయమంతా అనురాగంలో నిండిపోయింది. "నీకు నేను తిరిగి ఏమీ యివ్వలేనా అమ్మీ? ఇవ్వటంతప్ప పుచ్చుకోవటం నీకు చేతగాదా?" అన్నాను.

"ఇవ్వగలిగిందంతా యిస్తున్నారు. నేను అంతకంటె ఏమీ ఆశిం చను. ఏమీకోరుకోను." అంది.

సరిగ్గా ఆసమయానికి డాక్టరూ, నర్సూ, తలుపుతోసుకుని లోపలికి వచ్చారు. డాక్టర్ దగ్గరకువచ్చి "ఎలావున్నావు రామబాబూ?" అన్నారు.

"చాలాకులాసాగావుంది డాక్టరుగారు. అంతా మీదయ" అన్నాను.

"నా దయకాదు మిస్టర్. మీ మంచంమీద కూర్చున్న ఆవిడది. ఈ పదిహేనురోజులూ యీపిడ మిమ్మల్ని కంటికిరెప్పలా కాచుకొని వుండకపోతే ఏమయివుండునో చెప్పలేం. ముఖ్యంగా మొదటినాలుగు రాత్రులూ చాలా కష్టపడ్డారు. విపరీతమైనజ్వరం. వొళ్ళుతెలియని ప్రేలా పన, గిలగిలా కొట్టుకోవడం, యివన్నీచూస్తూంటే మా సిస్టర్స్‌కే భయ మేసేది. ఇంతనిబ్బరమూ, ధైర్యమూ కలస్త్రీని నే నెక్కడా చూడలేదు." అన్నారు ఆయన.

నరుసు నాకేసి చూసి సన్నగా నవ్వింది. నేను కూడా మీ కోసం కష్టపడ్డాను. డాక్టరుగారి మాటలువిని నన్ను మరచిపోకండి అని చెప్పడానికి కాబోలు. యశో మందహాసంచేస్తూ "అది ధైర్యమూ నిబ్బరమూ కాదుడాక్టరుగారూ, అదేమిటో మీ భార్య నడగండి" అంది.

యశోకి డాక్టరుగారికి దగ్గర పరిచయం ఏర్పడింది. ఎవరితోనైనా చాలా సులభంగా స్నేహము చేసుకోగలదు యశో. ఆమె ముఖాన్ని మాటలనీ మందహాసాన్ని ఎవరూ జయించలేరు. ఆయన నవ్వుతూ "నా భార్య సంగతి నీకెలా తెలుసునమ్మా? బంగాళీ యువతులను గురించి నీకు తెలుసునా?" అన్నారు. "బంగాళా వారైనా బర్మా వారైనా ఒక్కటే డాక్టరుగారూ. స్త్రీ హృదయం ఎక్కడవున్నా ఒక రకంగానే వుంటుంది" అంది యశో.

"మీరు చెప్పింది సత్యంకాదమ్మా. నేను అనేకమంది రోగులను చూస్తూ వుంటాను. స్త్రీలలోకూడా క్రూరులు కుత్సితులు వున్నారు. భర్తని వదలి పరులవెంట పోయే క్షుద్రమైన స్త్రీలను నేను చాలా మందిని చూచాను" అన్నారు.

"వారంతా బయటకు కనబడేటంత చెడ్డవారు కారు డాక్టరుగారూ. ఏదో ఒక బలవత్తరమైన కారణం లేకుండా ఏ స్త్రీ కూడా భర్తను వదలిపెట్టదు. నా వుద్దేశ్యంలో వారు నిర్దోషులు. సరళ అక్కడేవుంటే లేడిలా గంతేసి హియర్ హియర్ అని వుండును. డాక్టరుగారు....ప్రమీలకూడా యిలాగే అనేది. మా యిద్దరికీ ఎప్పుడూ దీనిమీదే వివాదం. కాని మీరు అందరూ మీ యిద్దరిలాగే వుంటారని అనుకుంటారు. మీ రేమంటారు, రామబాబూ" అన్నది.

"చాలా వరకూ యశో చెప్పిందే నిజం డాక్టరుగారూ" అన్నాను.

"అరే, మీరు కూడా యిలాగే అంటున్నారేమిటి. బహుశా ఆవిడను చూచిభయపడి అలా అంటున్నారు. పురుషులయివుండి మీరు నాకు చాలా అన్యాయం చేశారు. ఇక రండి, నేను మీ డాక్టరుని, మీరు చేసిన దానికి శిక్షగా యివాళ రెండు యింజక్షన్లు యిస్తాను."

సాయంకాలం సరళా, లఖియా కలసివచ్చారు. సరళతో నేను అంతవరకూ సరిగా మాట్లాడనేలేదు. ఆమె వచ్చి యిరువది రోజులు కావచ్చింది రాజేంద్రని, బాబునీ వదలి యింతకాలం ఎందుకు వుండి పోయింది ఎప్పుడూ వుండే ఆ వుత్సాహం, కాంతీ ఆమె ముఖంలో నాకు కనబడలేదు. "ఇన్నాళ్ళుండిపోయావు సరళా, రాజేంద్ర ఏమను కుంటాడో, బాబూ నీ కోసం బెంగపెట్టుకున్నాడేమో?"

నా కళ్ళలోకి ఒకసారిచూచి తలదించుకుని, "రాజేంద్రకి వుత్తరం వ్రాశాను. బాబూ కులాసాగే వున్నాడని వ్రాశాడు. నా దగ్గరకంటె వాడికి దాయి దగ్గరే ఎక్కువ అలవాటు. మీకు కొంచెం స్వస్థత చిక్కేవరకు వుందామనివున్నాను." అంది. 'రాజేంద్రని బాబుని తీసుకురమ్మని వ్రాయ లేదా' అన్నాను.

"వ్రాయలేదు రామబాబూ! ఇలాంటి సమయంలో వారంతా యెందుకు చెప్పండి, మీకు బాగా స్వస్థత చిక్కిన తరువాత తీసుక వస్తాను."

స్వస్థత అనే మాట విన్నపుడెల్ల మనస్సులో ముల్లు గుచ్చు కున్నట్లయింది. స్వస్థత చిక్కడమంటే యేమిటి? జబ్బుచేసిన తరు వాత కొంతకాలానికి స్వస్థత చిక్కుతుంది. కుంటివాడికి పరలోకం లోనో, పునర్జన్మలోనో స్వస్థత చిక్కుతుంది.

మళ్ళీసారి యశో నావద్ద వంటరిగా వున్నపుడు "యశో, నాకు స్వస్థతచిక్కుతుందని అందరూ అంటున్నారు, మళ్ళీ నా అంతట నేను నడువగలుగుతానా," అన్నాను.

"నాకు వాగ్దానం చేశారుగదా బాదల్‌బాబూ, అలాంటి మాటలు మాట్లాడనని, దానిని గురించి మీ రెందుకు ఆలోచిస్తారు." అని కాస్సే పాగి గద్గద స్వరంతో "చూడండి మీకు నే నేమైనా లోటు చేస్తు న్నానా" అంది.

"నీకు తెలియదు అమ్మీ. మనస్సుకు యిది యెలాంటిగాయమో కుంటివాడి ననే మాట జ్ఞాపకం వచ్చినపుడల్లా హృదయాన్ని రంపం

పెట్టి కోసినట్లనిపిస్తుంది. నదిలో మునిగిపోయినపుడు నన్ను రక్షించు కున్నావుకదా, ఈసారి కాలు వదలివేశావా !" అన్నాను.

యశో తల నా హృదయంమీద పెట్టి కన్నీరు కారుస్తూ "నే నేమిచెయ్యను చెప్పండి. నే నెంత బాధ పడ్డానో నా అంతరాత్మకి తెలుసు. చచ్చిపోదామనుకున్నాను. కాని ఆ తరువాత మిమ్మల్ని యెవరు చూస్తారు ? మొదట కాలు కోసేయాలన్నారు. అలా పరిగితే గుండె పగిలి చచ్చిపోయి వుండును" అంది.

శరీరమంతా వణికిపోతూంది. కళ్ళల్లోంచి రెండు సెలయేరులు నిరాఘాటంగా ప్రవహిస్తున్నాయి. నే నేమీ మాట్లాడలేదు.

"మీ దుఃఖాన్ని చూసి నా దుఃఖాన్ని అపకుంటూవున్నాను బాదల్ బాబూ" అంది.

"వద్దు యశో, యింకెప్పుడు అలా అనను. జన్మలనేవే వుంటే మళ్ళీ నువ్వు నాకు కావాలని ప్రార్థించుకుంటాను. అప్పు డంగవికలుడ నవను. అందంగా వుంటాను" అన్నాను.

# 24

ఇంకొక వారంరోజులు గడిచిపోయాయి. సరళ ఆ సాయ్యం కాలమే బయలుదేరుతూంది. వుండమంటే బహుశా వుండును. కాని మేము వుండమనలేదు. ఆమె వచ్చి నెల దాటిపోయింది. ఇంకా వుంటే రాజేంద్ర యేమనుకుంటాడు. యశో భోజనానికి వెళ్ళినపుడు లఖియా వచ్చి నాతో వు.డేది. ఆ రోజు సరళ వచ్చింది. అంటే నాతో ఏకాంతంగా మాట్లాడటానికి వచ్చిం ని గ్రహించాను. సరళను చాలావరకూ తప్పించుకుంటూవచ్చాను. ఎందుకో ఆమెనుచూస్తే యెంతోసిగ్గు వేసేది. సరళ దృష్టిలో నేను చులకనయి పోతానేమోనని మనస్సు బాధగావుంది.

లోపలికివచ్చి మంచందగ్గర కుర్చీలో కూర్చుంది. ముఖమంతా వుద్రేకపూరితంగా వుంది. అభిమానంతోటి, నిర్లక్ష్యంతోటి, కోపంలోటి

వణికిపోతూ యేమయినాసరే యీ అవకాశం జారవిడచకూడదని నిశ్చయించుకున్నట్టు కనబడింది. పరిణామాలతో నిమిత్తం లేదనే మొండి ధైర్యం ఆమెలో ప్రవేశించినట్లు కనపడింది. అలాంటి ఘడియలు ప్రతివారికీ యెప్పుడో ఒకప్పుడు వస్తాయి.

"భోజనం చేశావా సరళా" అన్నాను,

కళ్ళలోకి వకసారి చూసింది—"ఎందుకిలాంటి అసంగతమైన నిరర్థక ప్రశ్నలు వేస్తారు రామబాబూ" అంది. ఆ ప్రశ్న ఆ కళ్ళు అడిగాయి. పెదిమలు విరుచుకుని ... చేశాను అనే పదం బయటికి వచ్చింది.

"సాయంకాలం వెళ్ళిపోతున్నావా?" అన్నాను.

"మీరు యింకా వుండమని అనలేదుగా రామబాబూ?" అంది మెల్లగా,

"అది సమంజసంకాదు సరళా, యశోకి లఖియాకి అప్తులు యింకెవరూలేరు. నీకు ప్రేమించవలసిన భర్త లాలించవలసిన కొడుకూ వున్నారు" అన్నాను. ఆ ఆఖరివాక్యం నోరు జారి అన్నాను. అందులో వ్యంగ్యం లేదనుకుంటాను. అయినా అది సరళ కోపాన్ని ప్రేరేపించింది.

"అవును రామబాబూ! అదే నేను చేసిన పాపం. ఘోర పాపం. సమాజం స్త్రీకి యెంత అన్యాయం చేస్తుంది. ఒకసారి నేరక చేసిన తప్పుకి జీవితాంతంవరకూ బాధపడవలసిందేనా. ఒకసారి వుచ్చులో పడితే అందులోంచి కాళ్ళుచేతులూ కాకపోయినా కనీసం తల అయినా బయటపెట్టి తొంగిచూడగూడదా ? ఇక దీనికి గత్యంతరం లేదా."

"నువ్వు చేసింది తప్పుకాదు-సరళా! నాకు తెలిసిన వాళ్ళందరిలోనూ నువ్వే ఎక్కువగా సుఖపడుతున్నావు. నిన్ను చూస్తుంటే జీవితంలో సుఖం కూడా వుందనే విషయం జ్ఞప్తికి వస్తుంది. లేకపోతే అంతా చీకటిమయంగా కనబడుతుంది" అన్నాను, సరళ నిర్లక్ష్యంగా కృత్రిమంగా ఒకసారి నవ్వింది. పెదిమలు బిగించి 'సుఖం' అంది. "పెళ్ళి చేసుకొని

కొడుకుని కంటే సుఖపడుతూందని మీరంటారు, ఆ విషయం మనస్సులో మీరు నమ్మరు. బయటికి తియ్యటి మాటలని వదలించుకోవాలని ప్రయత్నిస్తారు. సత్యాన్ని ధైర్యంగా యెదుర్కోరు. మీదందరూ యింతే రామబాబూ, మీ రెప్పుడూ అంతే" అంది.

సరళ ముఖం వుజ్వలంగా వుద్రేకంతో ప్రకాశిస్తూంది. ముఖం ముఖ్యంగా పెదిమలు ఎర్రగా అయిపోయినాయి. క్రింద పెదిమ క్షణ కాలం వణికింది,

సంభాషణ మార్చాలనే ఆతురతతో మళ్ళీ తప్పుప్రశ్న వేశాను. "నీ కొడుకుకి బాదల్‌బాబూ అని పేరు పెట్టావు. నేను మాటవరసకి పరిహాసంగా సరే అన్నాను. పెద్దయినతరువాత నన్నుచూసి అది నా పేరని తెలుసుకుని యేమనుకుంటాడు చెప్పు?" అన్నాను.

సరళముఖం ఆవేశంతో ప్రజ్వరిల్లిపోతోంది. కళ్లు మిలమిలా నిప్పుకణాల్లా మెరుస్తూన్నాయి. "మనస్సులో మీరెప్పుడూ నా కన్యాయం చేస్తూనే వున్నారు, రామబాబూ! నేనంటే మీకేమాత్రమూ కనికరంలేదు. నన్ను ఏమాత్రం అర్థం చేసుకోవడానికి ప్రయత్నించరు. పురుషులు ఎంత కఠినహృదయులు" అంది.

ఇంకా ఏదో చెప్పబోతూంటే అడ్డువచ్చాను. "వద్దు సరళా. నాకు వకసారి నీవొక వాగ్దానం చేశావు. జ్ఞాపకముందా" అన్నాను. అప్పటికీ యిప్పటికీ చాలా మారిపోయారంది. "ఏవిధంగా సరళా! మానసికంగానా, శారీరకంగానా?" అన్నాను.

"రెండు విధాలకూడా. ఇప్పుడు మీరు కఠిన హృదయులయిపోయారు. మీరుకూడా అందరిలాగే అయిపోయారు. అందుకనే యీనాడు అణచివున్నదంతా విజృంభించింది. అయినా నేను చెప్పదలచుకొన్న దేమంటే నీమీద నాకున్న ఆలోచనలు ఆవేశాలూ ఏమీ మారలేదు. హృదయాన్ని చీల్చి వేసే అపరిమితమైన సానుభూతికూడా దానికి తోడయింది" అంది.

"దీనికి నేనెంతో కృతజ్ఞుడుని సరళా! ఈమాటలుచెప్పి నాకెంతో మనశ్శాంతి చేకూర్చావు. వేదనాపూరిత నేత్రాలతో నాకేసిచూస్తూ,

అనుమాన పడ్డారా?" అంది. ఒప్పుకోక తప్పలేదు. "యటో లక్షియాలంటే లేని అనుమానం నామీద ఎందుకు కలిగింది చెప్పండి." అంది.

"చెప్పానుకదా సరళా! నీవు నాకు సరిగా అర్ధంకావని అన్నాను. సరళముఖం హఠాత్తుగా మళ్ళీ ఎర్రబడిపోయింది. వుద్రిక్తచిత్తయై ఎందుకు అర్ధంకాదు రామబాబూ! నాలో అంత అర్ధంకాని దేముంది. అందరిలాగే నేను కూడా ఒక సాధారణ స్త్రీని అయితే మీకు అర్ధమయ్యేటట్లు విడమర్చిచెప్పమంటారా?" అంది.

"వద్దు సరళా వద్దు, ఇలాగే గడచిపోనీ, దాని వలన కలిగే లాభమేమీలేదు" అన్నాను.

సరళ ఏమీ మాట్లాడలేదు. బలవంతాన వుద్రేకాన్ని అణచుకుంటూన్నట్లు కనబడింది. కాస్సేపు మౌనంగావుండి "సాయంత్రంవెళ్ళే ముందు యింకా కనబడవేమో! డాక్టరుగారిని మరీ మరీ అడిగానని చెప్పు. బాబుని నా తరుపునకూడా ఒక ముద్దు పెట్టుకో. బాబుకి అన్నీ నీ పోలికలే వచ్చాయి కదూ సరళా." అన్నాను.

తల్లి ప్రేమంటే ఏమిటో ఆనాడు తెలిసివచ్చింది. అలాంటి సమయంలోకూడా కొడుకు తలుపుకువచ్చి నవ్వకుండా వుండలేకపోయింది. మాతృప్రేమ ఒకసారి పెల్లుబికింది. ముఖంలో క్షణకాలం పూర్వపు వెలుగు కనబడింది. చిరునవ్వులు చిందిస్తూ "పోలికలునావి. పేరు మీది బాగుందికదూ రామబాబూ! మీకు బాబు అంటే చాలా ఇష్టంకదూ" అంది.

"అవును సరళా చాలా ఇష్టం. నాకు పిల్లలంటేనే ఇష్టం. అందులో నీకొడుకు కనుక మరీయిష్టం. వాడినికూడా తీసుకు రావలసింది. నువ్వు పెద్దయిన తరువాత నిన్ను సుఖపెడతాడు. సరళా బాబుని నిర్లక్ష్యం చేస్తూవుంటావు నువ్వు. తల్లిప్రేమ కొరవడనియ్యకు సరళా" అన్నాను.

"లేదు రామబాబూ! అది యెప్పుడూ లోటు రానీయను. బయటికి నేను అలా కనబడతాను. కాని నా ఆశలన్నీ వాడిమీదే వున్నాయి."

"ఎవరిమీద ఆశలున్నాయి సరళా!" అంటూ యశో లోపలికి వచ్చింది.

"రామబాబుమీద."

"రామబాబూమీదా లేక బాదల్‌బాబుమీదా?"

"నీవు చెప్పిందే నిజం యశో. ఆ పేరులో వీ రిద్దరూ కూడా యిమిడిపోతారు. ఎంత చక్కటి పేరుపెట్టావు నువ్వు" అంది."

*       *       *       *

సరళ అశాంతితోనే వెళ్ళిపోయింది. కాని దుఃఖంతో కాదు. సరళ నాతో అనే మాటల్ని యెవరికి చెప్పడానికీ భయం వేస్తుంది, అందులో ముఖ్యంగా యశోతో ఆమెనుగురించి నేను సాధారణంగా మాట్లాడను. అపార్థం చేసుకుంటుందేమోనని నా భయం, లఖియాతో ఒకటి రెండుసార్లు ఆమెను గురించి మాట్లాడాను. ఆమె నవ్వి "సరళలో చాలా లోపాలున్నాయి రామబాబూ. కాని ఆమె హృదయం అగ్ని లాంటిది. అందులో యేదిపడినా భస్మమయిపోతుంది. ఆమెకు నే నెంతో ఋణపడి వున్నాను. మొదటినుంచీ ఆమె నా కెంతో సహాయం చేసింది." అంది.

అవును "అందుకనే ఆమెను నేను గౌరవిస్తాను. లోపాలు యెన్నివున్నా యీ పుణ్యమే అవన్నీ కడిగివేస్తుంది" అన్నాను.

ఇంకొక పదిరోజులు గడిచిపోయాయి. యశో లఖియా వీరిద్దరూ నా మంచాన్ని అంటిపెట్టుకుని వుండేవారు. లఖియా యెప్పుడూ యశోకే మొదటిస్థానం యిచ్చేది. ఆమె ముఖం చూస్తోంటే నాకు యెంతో మన శ్శాంతి కలిగేది. ఒక విధమైన మానసిక తృప్తికూడా లభ్యమయింది. కష్టాలు లఖియా ఒక్కర్తెకీ కలుగలేదు. నాకుకూడా లభ్యమయ్యాయి. ఆమె అన్నికష్టాలు చిరునవ్వుతో యెదుర్కుంటూంటే నేను యెందుకు

బాధపడాలి? లఖియా ప్రపంచంలో ఏకాకి. ఆమెకి ధనంలేదు. దారుఢ్యం లేదు. ఇవన్నీ లేకపోయినా ఫరవాలేదు, కాని ఆమెకి అందం వుంది. అయినా ఆమె ధైర్యంగా యెవరినో ఒక ఆకాశవాసిని నమ్ముకుని సంచరిస్తూంది. దానితో పోల్చితే నా దుఃఖము యేమాత్రము? నాకు విలువకట్టలేని ఒక స్త్రీ అందంగా వుంది. మాకు రెండు యిళ్ళున్నాయి. బ్యాంకులో డబ్బువుంది. నగలున్నాయి, స్నేహితు లున్నారు. ఇక యేం కావాలి? అయితే తేడా యేమిటంటే లఖియా దైవాన్ని నమ్మి నష్టపోయింది. నేను నమ్మకుండా కొంచెం నష్టపోయాను.

ఒకరోజున లఖియా — "ఇక నేను వెళ్ళిపోవటానికి అనుజ్ఞ యివ్వండి రామబాబూ. ఇక నేను వుండి మీకు చేయగలిగిం దేదీ లేదు. చాలా కాలమయింది నేను వచ్చి" అంది.

"ఎందుకు లేదు లఖియా. నువ్వు నా దగ్గరవుంటే నాకు ఎంతో మనశ్శాంతి కలుగుతుంది, లేకపోతే అసలు నేను కోలుకునేవాడిని కాను."

"వద్దు రామబాబూ! మీరు నాకు మాట యిచ్చారు. దాని ప్రకారమే నన్ను వెళ్ళిపోవనివ్వండి. పూర్వము నేను కష్టపడిపోతానేమో ననే ఆతురతతో నన్ను అడ్డగించారు. ఇప్పుడుమీకే అవి ఎదురయ్యాయి" అంది.

ఇక ఈమెను అడ్డగించి లాభంలేదు. ఎంతోకాలం విధినే నేను అడ్డగించాను. ఆ నియంతనే నేను ఎదిరించాను. కాని చివరిమాట నా శక్యంలో లేదు.

"సరే లఖియా, నీ దారికి నేను యిక అడ్డురాను. కాని ఆనాడు నేను చెప్పినమాట అప్పుడప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటూవుండు. అది నేను అప్రయత్నంగాఅనాలోచితంగా అనినమాట. అందుకని బహుశా అది నిజమే అయి వుంటుంది. ఆ మాట అని నిన్ను నేను అవమానించ లేదుకదా లఖియా. నాకు యిది చెప్పు, లేకపోతే నాకు మనశ్శాంతి వుండదు."

"లేదు రామబాబూ, నేనంటే మీకు, అపారమైన జాలి సానుభూతి వున్నాయి. అందులో యేమీ కల్మషంలేదు. ఆ మాట మీరు తప్ప యింకెవరవినా బాధపడి వుందును. కాని. మీరువేరు" అంది.

యశో కూడా యిదే మాటలంది. అది నిజమోకాదో నాకు ఇప్పటకీ తెలియదు. అయినా కాకపోయినా ఆమె సదభిప్రాయాన్ని ఎందుకు పోగోట్టుకోవాలి ?

"సరే లఖియా, నా ప్రార్ధన ఒకటి ఆనాడు తిరస్కరించావు. ఈనాడు అంగీకరించాలి. నీవు ఎక్కడున్నది అప్పుడప్పుడు వుత్తరం వ్రాస్తూ వుండాలి."

"వాగ్దానం చేయలేను రామబాబూ ! నన్ను క్షమించాలి. పరిస్థితులు బాగుంటే అలాగేచేస్తాను" అంది.

"అయితే నువ్వు ఎక్కడకు వెళ్తావు లఖియా ? కురుక్షేత్రమేనా ?

"అవును మొదట అక్కడికే వెళ్తాను. తరువాత ఏం చేస్తానో చెప్పలేను. అది నా చేతుల్లో లేదు.

"కురుక్షేత్రం గురించి కాస్త వివరంగాచెప్పు లఖియా. మొదటి కొద్దిరోజులైనా నిన్ను అక్కడ వూహించుకుంటూ వుంటాను. దాని గురించియేమీ తెలియకపోతే అలా చెయ్యటం కష్టం." అన్నాను.

లఖియా నవ్వుతూ "కురుక్షేత్రంమీద ఒక చిన్నపాఠం చెప్పమంటారు." అంతేనా అంది.

"అవును లఖియా నీ నోటినుంచి ఏదివచ్చినా ఎంతో శ్రావ్యంగా వుంటుంది. నువ్వు యిక్కడ వుండిపోతే నీ వద్ద శిష్యరికం కూడా చేస్తాను అన్నాను."

"వద్దులెండి పాఠం వినండి. కురుక్షేత్రం మనకు ఒక పుణ్యమైన క్షేత్రం. పురాతన గ్రంధాలలో దానిని ధర్మక్షేత్రమని వ్రాసివుంది. మహభారతంలో అది హిందూదేశంలోని అన్ని క్షేత్రాలలోకి పవిత్రమైనదని వ్రాసింది. శృతి శ్మృతుల ప్రకారం యిక్కడే దేవతలు, బ్ర

దేవుడూ నివసిస్తూ వుంటారు: ఇక్కడే కౌరవపాండవుల సంగ్రామంలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునునికి గీత వుపదేశించాడు. మానవుడు నిమిత్త మాత్రుడేనని యీ పవిత్ర స్థలంలోనే చెప్పాడు. ఇంకా ఏమిటి చెప్ప మంటారు" అంది.

"దాని చరిత్ర చెప్పావు కాని అక్కడ ఏముందో చెప్పలేదు. అదే ముఖ్యం ఇక్కడ 365 తీర్థయాత్ర స్థానాలున్నాయి. చాలా ప్రసిద్ధి చెందిన అనేక చెరువులున్నాయి ఉదాహరణకి కురుక్షేత్ర చెరువు, సన్యాహట్, స్థానేశ్వరి మొదలైనవి పేర్కొనవచ్చు. ఇక్కడ బిన్ గంగ అనే చిన్న చెరువు వుంది. ఆ స్థలములోనే అర్జునుడు భూమి లోంచి బాణపు దెబ్బతో నీరు బయటకి తెప్పించి భీష్ముని తృష్ణ తీర్చాడు. ఇక్కడే లక్ష్మీనారాయణ దేవాలయం గీతాభవనం వున్నాయి. మొత్తంమీద యిది చాలా పవిత్రస్థలం. ఇక్కడ మరణించిన వారికి పునర్జన్మ వుండదంటారు. కాని అది నాకు తెలియదు" అంది.

"ఇవన్నీ నీకు ఎలా తెలిశాయి లఖియా? అక్కడకు ఎప్పు డైనా వెళ్లావా" అన్నాను.

"లేదు మా అమ్మ వెళ్ళింది, చిన్నతనంలో యివన్నీ చెప్పేది. పెద్దయిన తరువాత వీలుంటే ఒకసారి వెళ్ళమని చెప్పింది."

"ఒకసారి అమ్మగారి మాటప్రకారం మామయ్య దగ్గరకు వెళ్లావు. ఈసారి కురుక్షేత్రం వెళ్తున్నావు. ఇప్పు డేమౌతుందో" అన్నాను.

"లఖియా నవ్వుతూ, మళ్లీ మీకు కోపంవచ్చింది. మీరేమి దిగులు పడకండి. నాకేమీకాదు" అంది.

"లఖియా వెళ్లిపోయే రోజు ఆసన్నమైంది. మనస్సు మళ్లీ కల్లోల పూరిత మయిపోయింది. వెళ్లిపోయేముందు ఆస్పత్రికి వచ్చింది. ఎప్పటి లాగే తెల్లటి చీర కట్టుకుని వుంది. ముఖంలో విచార చిహ్నాలేమి లేవు. చల్లటి వెన్నెల వెల్లవిరిసింది."

"రైలు స్టేషన్‌కువచ్చి యీసారి వీడ్కోలు చెప్పలేను. లఖియా ంంచోవడానికి మనిషికి రెండు కాళ్ళు కావాలి" అన్నాను.

కన్నీరు రాకుండానే కళ్లు తుడుచుకొని వద్దు "రామబాబూ! ఇక్కడనుంచి పంపించి వేయండి! మీరేమీ దిగులు పడకండి! మీ దగ్గర యశో వుంది. ఏలోటూ రానీయదు" అంది.

"వెళ్లిపోయేముందు అంతిమసందేశమేదైనా ఇచ్చిపో లఖియా?" అన్నాను.

"నేను మీకు సందేశమివ్వ తగినదానిని కానేమో! అయినా ఒకటి చెప్తాను. నక్షత్రకాంతి సూర్యరశ్మితోను చంద్రకాంతితోనూ పోలిస్తే సముద్రములో నీటిబొట్టులాంటిది. అయినా అది ఎప్పుడూ వెలుగుతూనే వుంటుంది. ఎప్పుడూ కర్తవ్య నిర్వహణ చేస్తూనే వుంటుంది. అలాగే మనమంతా ఎంత అల్పులమయినా మనకికూడా దైవ నిర్ణీతమైన కర్తవ్య మొకటుంది. ఎవరికివారు అది నిర్వహించాలి. దీపం వెలిగించేముందు చీకటిని చిందరవందర చేస్తుందా లేదా అని ఆలోచించ కూడదు" అంది.

"నువ్వు చెప్పింది నా కర్థమైంది లఖియా, నీ కర్తవ్యపాలన కోసం నువ్వు శూన్యంలోకి వెళ్ళిపోతున్నావు. నా కర్తవ్యమేమిటో కూడా కాస్త చెప్పిపో లఖియా" అన్నాను.

"అది మీకే తెలుస్తుంది రామబాబూ! ఇతరులు చెప్తే అది మీ కర్తవ్యమే కాదు" అంది.

లఖియా నిశ్చయాన్ని, నిశ్చలతనూ యెవరూ కదపలేరని నాకు తెలుసు. ఎంత కఠినమైన మాటఅయినా కటువుగా చెప్పదు. ఆ మాటల్లో యిమిడివున్న మెత్తటి మంచదింపు గ్రహించాను. యశో లోపలికి వచ్చి "ఇంక పద లఖియా బయలుదేరే వేళైంది. బైట టాక్సీ నిలబడివుంది" అంది.

"నువ్వు స్టేషన్‌కు వెళ్తున్నావుకదా యశో?" అన్నాను.

యశో కాస్త తటపటాయించింది. లఖియా "వద్దు రామబాబూ యశో మీ దగ్గర వుండాలి, నేనే వద్దన్నాను" అంది.

నా కళ్ళలో హఠాత్తుగా నీరు నిండుకున్నాయి. ఎందుకో కొంచెం కోపంకూడా వచ్చింది. "అలాగ కాదు యశో. నేను యెలాగూ వెళ్ళలేను. నువ్వైనా!" అనబోతుంటే....

యశో "అలాగే వెళ్తాను, మీరు యింకేమీ అనకండి" పదలక్షియా అంది.

లక్షియా దగ్గరకువచ్చి చిరునవ్వుతో "వెళ్ళివస్తాను రామబాబూ" అంది.

నే నేమీ మాట్లాడలేదు. నా మనస్సుని నే నింకా సమాధాన పరచలేదు. బయటికి వెళ్ళిపోతుంటే, "లక్షియా, వెళ్ళేముందు యీ కన్నీరు కాస్త తుడిచిపో" అన్నాను.

లక్షియా నవ్వుతూ దగ్గరకు వచ్చి చీర చెంగుతో కన్నీరు తుడిచి "ఇక మళ్ళీ యెప్పుడూ కంట తడిపెట్టకండి" అంది.

ఒకసారి గట్టిగా వెక్కివెక్కి ఆమె వడిలో తల పెట్టి చిన్నపిల్లవాడిలా ఏడవాలనే తీవ్రవాంఛ కలిగింది. బలవంతంగా అణుచుకున్నాను.

"సరే లక్షియా నా ప్రార్థన మరచిపోకు" అన్నాను

యశో—"ఒక గంటలో వచ్చేస్తాను. ఈలోగా మీకేమైనా కావాలంటే నర్సును అడగండి" అంది.

నే నేమీ జవాబు చెప్పలేదు. లక్షియా బయటికి వెళ్ళిపోయింది. అయిదు నిమిషాలు గడిచిన తరువాత బయట కారు బయలుదేరి చప్పుడయింది. ఆ కారు లక్షియాను స్టేషన్‌కు తీసుకపోతోందని గ్రహించాను. ఒక గంట పోయినతరువాత రైలుకూత వినబడింది. అదే రైలు లక్షియాని కురుక్షేత్రం తీసుకుపోతుందని వూహించుకున్నాను. లక్షియా ఆఖరిసారిగా కనుమరుగైంది.

# 25

ఆస్పత్రిలో యింకొక రెండు నెల లున్నాను. గాయాలన్నీ మాని పోయినాయి. డాక్టరు చెప్పినట్లు కుడికాలు క్రింద ఎడమభాగం నిరర్థకమై పోయింది. ఈ రెండునెలల్లోను డాక్టరుగారితో మా పరిచయం బాగా అభివృద్ధి చెందింది. మేమంటే ప్రత్యేకశ్రద్ధ చూపించేవారు. యశో మీద ఆప్యాయత ప్రదర్శించేవారు. యశోకూడా పూర్తిగా ఆది తిరిగి యిచ్చేది. ఆమె కోరిక ప్రకారం యశోని ఆయన పేరుపెట్టి పిలిచేవారు.

ఒకరోజున యశో "డాక్టరుగారూ మీ ప్రమీలని నాకు ఒకసారి చూపించరా" అంది.

ఎప్పుడూ నవ్వుతూవుండే ఆయన ముఖం నల్లబడింది.

"ఆమె వుంటే నాకు అంతకంటె సంతోషం కలిగించే దేమీలేదు. యశో! ప్రమీల నన్ను విడిచి వెళ్ళిపోయి మూడు సంవత్సరాలయింది. ఆమె ఆత్మహత్య చేసుకుంది."

మే మిద్దరమూ దిగ్భ్రాంతుల మయ్యాము, ఆయన మాటలనుబట్టి వారిద్దరిదీ అన్యోన్య దాంపత్య మనుకునేవాళ్ళం. కాసేపు సంశయించి కారణ మడిగాను. అభ్యంతరం లేకపోతే చెప్పమన్నాను.

"అభ్యంతర మేముంది రామబాబూ! చెప్తాను. ప్రమీలను నేను ప్రేమించి పెళ్ళి చేసుకోలేదు. పెళ్ళిచేసుకుని ప్రేమించాము. అలాంటివి సుఖంగా వుండవని కొంద రంటారు. ఇద్దరమూ ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళం. అప్పుడు మేము కలకత్తాలో వుండేవాళ్ళం. ప్రమీలది చాలా సున్నితమైన మనస్సు. ఎంతో చక్కగా వుండేది నాకు నిన్ను, యశోని చూస్తోంటే ప్రమీల జ్ఞాపకి వస్తుంది. ఏవో పోలికలు కనబడు తూంటాయి. పిల్లలంటే మాకు యెంతో అపేక్షగా వుండేది. ప్రమీలకి పసిపాపలంటే—ముఖ్యంగా మగపిల్లలంటే నిజంగా పిచ్చిగా వుండేది. పొరుగింటి పిల్లల్ని యింటికి తీసుకవచ్చి ఆటలు అలంకారాలు జరిపేది. పెళ్ళిఅయిన మూడు సంవత్సరాలకి ప్రమీలకి పిల్లలుపుట్టే సూచ

నలు కనబడ్డాయి. మా యిద్దరి సంతోషానికి అంతులేదు. ఎన్నో కలలు కన్నాము. ప్రమీల రాత్రింబగళ్ళు కూర్చుని పిల్లల దుస్తులు కుట్టుతూ వుండేది. అనేక ఆటబొమ్మలు కొంది ఇలా వుండగా ప్రమీలకు పెద్ద జబ్బు చేసింది. పుట్టకముందే సంతానం నశించిపోయింది. ఇక భవిష్యత్తులోకూడా పుట్టే అవకాశం లేదని తెలిసింది. ఆ విషయం ప్రమీలకు తెలియకుండా వుండాలని ప్రయత్నించాను. కాని చెప్పడమే మంచిదని ఒకనాడు చెప్పాను. అది విని ప్రమీల నేను భయపడినంతగా దుఃఖించినట్లు కనపడలేదు. నిజానికి నే నెంతో పొరబడ్డాను. ఆ మౌనం చూసి నేను జాగ్రత్త పడవలసింది. దుఃఖసమయాల్లో కన్నీరుకంటె ఘంచిది యింకొకటి లేదు. ఆ విషయం నేను అప్పుడు గ్రహించలేదు. డాక్టరు భార్య అవటంవల్ల ఆమెకు అన్నిమందులు గురించీ తెలుసు. ఒకనాటి రాత్రి విషం తీసుకుని ఆత్మహత్య చేసుకుంది. ఆ రాత్రి ఆమె ప్రవర్తన ఎంతో విచిత్రంగా వుంది. నేను మూర్ఖుడిని, మందబుద్ధిని అయి అప్పుడు నేను అది గ్రహించలేదు. రాత్రి చాలాసేపటివరకూ ఎంతో ఆప్యాయంగా కబుర్లు చెప్పింది. పడుకుందామంటే యింకొంచెం సేపు ఇంకొంచెంసేపు అని చాలా ఆలస్యం చేసింది. ఒకటి రెండుసార్లు కళ్ళలో నీళ్ళుచూశాను. భుజంమీద చేయివేస్తే గజగజా వణికింది. కారణ మడిగితే 'ఇవాళ మనసు బాగోలేదు ఎందుకో భయంగా వుంది' అంది. "పడుకుంటే అన్నీపోతాయి. పడుకో" అన్నాను. "అప్పుడు నాకా ఆలోచన కలుగలేదు చివరకి నేనే బలవంతంగా నిద్రపోయాను. ఎంత క్రూరంగా ప్రవర్తించాను. జీవితంలో ఎన్నో రాత్రులు వ్యర్థంగా నిద్రపోతూ గడిపివేస్తున్నాము ఆ అయిదు గంటలూ నిద్రపోకపోతే నా ప్రమీల దక్కునేమో. అ విషయం నాకు ఏమాత్రం తెలిసివున్నా ఆమె మనస్సు మార్చివుండేవాడిని నా మాట ఎప్పుడూ ఆమె కాదనలేదు నా ప్రవర్తనలోకూడా ఏదో లోటుపాటు వుండి వుంటుంది. లేకపోతే ప్రమీల ఎప్పుడూ అలా చెయ్యదు. ఒక వుత్తరం వ్రాసి పరలోకంలోకి పయనించింది. అందులో "జీవితమంతా సంతతి

లేకుండా నేనుండలేను. నలుగురినోట ఆ మాట నేను భరించలేను. నా తప్పువలన మీకు కూడా తండ్రి అయ్యే భాగ్యాన్ని కాకుండా చెయ్యను. మన మిద్దరమూ కలసి కన్నకలల్ని నేను మరచిపోలేను. ఇంటిలోని ఆట బొమ్మలు, దుస్తులు నన్ను వెక్కిరిస్తుంటే నేను భరించలేను. నేను వెళ్ళిపోతాను. నన్ను మరచిపోండి. నా మీద మీకేమైనా ఆదర ముంటే మళ్ళీ పెళ్లి చేసుకోండి. ఆ విధంగా మీరుచేస్తే నా ఆత్మకు శాంతి చేకూరుతుంది. చేతులు జోడించి మీ పాదలమీద పడి యిదే ప్రార్థిస్తూన్నాను. నా అంతిమ కోరిక తీర్చండి. ఇంకొక సంగతి మీకు చెప్పకుండా మీవద్ద శలవు తీసుకోలేను నేను మిమ్మల్ని ప్రేమించి నంతగా ఏ భార్య ఏ భర్తనీ ప్రేమించలేదు. శలవు" అని వ్రాసింది. ఆమె వెంటనే నేనుకూడా పోదామనుకున్నాను కాని వృద్ధ తలిదండ్రుల యెడ నా కర్తవ్యం అడ్డువచ్చింది. ప్రమీ పోయి మూడు సంవత్సరాలైంది" అన్నాడు.

డాక్టరుగారు ప్రమీ గాథ చెప్తున్నంతసేపూ సర్వమూ మరచి పోయి విన్నాను. అంతా అయి పోయిన తరువాత యశో ముఖంచూచి చకితుడనయ్యాను. అంతకు క్రితం ఎప్పుడూ ఆ విధంగా చూచినట్లు గుర్తులేదు. ఆమెలో దుఃఖంకంటె భయం ఎక్కువగా కనబడింది. మనస్సులో రహశ్యంగా సాగుతున్న దారుణమైన ఆలోచల్ని యితరులు బయటపెట్టి వెల్లడయ్యేభావాలు ఆమె ముఖంలో గోచరించాయి. ఆమె కూడా యీ విధంగా ఎప్పుడైనా భావించిందా? కొంచెసేపు మౌనంగా వున్న తరువాత యశో - అయితే మీరు ప్రమీల కోరిక నెరవేర్చరా డాక్టరుగారూ?" అంది.

"లేదు అన్నారు"

మరణించిన వారి కోరికలు మనకు సాధ్యమయినంతవరకూ"

"మన్నించాలి డాక్టరుగారూ! అయినా ఇందులో తప్పుకాని, నిందా కరమయినదికానీ ఏమీ లేదు. ప్రమీల చాలా దురదృష్టవంతురాలు. కాని ఆమె మీకోసం ఎంతో త్యాగం చేసింది"

"మీరన్నది నిజం. తన కోసమే అయినట్లయితే అలా ఎన్నడూ చెయ్యదు."

"అయితే నువ్వనేది ప్రమీల చేసింది మంచిదంటావా యశో. ఆత్మహత్య సమర్ధనీయమైనదేనా" అన్నారు.

"మంచిదా, చెడ్డదా అనే ప్రశ్నకి నేను సమాధానం చెప్పలేను డాక్టరుగారు. కాని ఆమె ఏలాంటి పరిస్థితుల్లో అలాచేసిందో నేను అర్ధం చేసుకోగలను. ఆత్మహత్య చేసుకుని మీకు ఎంతో దుఃఖము కలిగించి వుండవచ్చు. కొన్ని కొన్ని కార్యాలకి పరిణామాలతోనూ పరులతోనూ పరలోకంతోనూ నిమిత్తంలేదు" అంది.

ఈ సంభాషణ నన్ను చాలా కలవర పెట్టింది. అంత నిగూఢంగా మాట్లాడటం ఆమె స్వభావానికే విరుద్ధం. ఏవో మనస్సులో పెట్టుకుని మాట్లాడుతూందని స్పష్టమైంది. అది ఏమయి వుంటుంది. ఆ తరువాత కొంతకాలం వరకూ యశోలో ఒక విధమైన మార్పు గమనించాను. నేను నిద్రపోయి లేచేటప్పటికి కిటికివద్ద నిలబడి బయటికి తదేకంగా చూస్తూ వుండేది. పిలిస్తే వులిక్కిపడి 'మీరా' అనేది. ప్రమీగాధ ఆమె హృదయంలో తుఫానులేవదీసిందని గ్రహించాను. నాకు సంబంధించిన వరకూ ప్రమీలకూడా నాదుఃఖిత స్త్రీల పట్టికలో ప్రవేశ నార్హతపొందింది. లక్ష్మీకూ వుంటనా యీ కథ తెలిస్తే ఎంత బావుంటు. ఆమెకు కథ చెప్పి ఆమె అభిప్రాయం అడిగితేఏమనివుండునో నే నూహించుకోగలిగాను.

"ప్రమీ చాలా తప్పు చేసింది రామబాబూ భర్తకు చాలా అన్యాయం చేసింది. జన్మించటంలో మనకు ఎంత హక్కువుందో మర ణించటంలోకూడా అంతే వుంది. ఆత్మహత్య సమర్ధనీయమైనదైతే మానవకోటిలో సగభాగం ఈ క్షణమే మరణించాలి. ఏదో ఒకదుఃఖ కారణం ప్రతివారికీ వుంటుంది. 'జీవితంలో మనకు లభించిన దానిని మనము స్వీకరించాలి. ప్రమీలకు నా సానుభూతి లభిస్తుంది. ఒప్పుదల కాదు" అంటుంది. కానీ లక్ష్మీయా? ప్రమీ తనకోసం అలా చేయలేదు. భర్తకోసం అలాచేసింది. ఆమె పతివ్రతకాదా?

"ఆమె వుద్దేశ్యాలు మంచివే రామబాబూ ఆలోచనలు తప్పుదారి తొక్కాయి,...."

ఆ తరువాత ఏమని వుండునో నేను వూహించుకోలేకపోయాను. లఖియా శ్రావ్యకంఠస్వరం హఠాత్తుగా అంతమయిపోయింది. ఆమె కురుక్షేత్రంలోవుంది. నేను కాశీలో వున్నాను. ఈ రెండింటికీ మధ్య వున్న దూరాన్ని మైమరపించి మాట్లాడ గలిగితే ఎంత మధురంగా వుండును. రామబాబూ అనే మాట ఆ పెదవులలోంచి ఎంత మెత్తగా వస్తుంది. లఖియాకి కోపం రావటం నేనెప్పుడూ చూడలేదు. వస్తే ఆమె ముఖం ఎలా వుంటుంది ? అది నేను వూహించనుకూడా లేదు.

## 26

ఇంటికి తీసుకు వచ్చేసింది యశో. కాలుకి బదులు ఒక ధృడమైన కర్ర చేతికి లభించింది. అయినా దాని అవసరంకూడా అట్టే కలుగలేదు. యశో నా వెంట చాయలా వుండేది। నీడకూడా అప్పుడప్పుడూ మనకు కనబడదు. కాని యశో అలా కాదు. కొన్నాళ్ళు పోయింతరువాత కూర్చొని నడుపుకోవటానికి వీలున్న ఒక కుర్చీ కొంది. అందులో కూర్చుని యింట్లో తిరిగేవాడిని. సాయంసమయాలలో బయటకు తీసుకవెళ్తానంటె నేనే వద్దనేవాడిని. అభిమానంతో, సిగ్గుతో హృదయం దహించుకుపోయేది. కుంటివాడిని కుర్చీలో కూర్చోబెట్టుకుని తీసుకువెళ్తాంటే లోకు లేమనుకుంటారు. అప్పుడప్పుడు వెన్నెలరాత్రులలో చాలా ప్రొద్దుపోయిన తరువాత కాశీనగరం నిద్రావస్థలో వున్నపుకు గంగ వొడ్డుకు వెళ్ళి గడిపిన వెన్నెల రాత్రులు జ్ఞప్తికి వచ్చేవి. వాటికీ వీటికీ యెంత తేడావుంది. నయనాలతో నవ్వుతూ నన్ను లేవదీయండి। అన్న ఆ యశోకీ, కుర్చీతోసుకుపోతున్న యీమెకీ ఎంత భేధముంది. తామరతూడుల్లాంటి యీమె చేతులను చూసి తన్మయుడనయిన ఆ వ్యక్తికీ యీ నిర్దకుడికి యెంత వ్యత్యాసముంది ? యశో బయటికి వుత్సాహంగానే కనబడింది. నన్ను వంటరిగా ఎప్పుడూ

ఆలోచించ నిచ్చేదికాదు. అయినా అప్పుడప్పుడు హఠాత్తుగా ఆమె కళ్ళలో నీరు నిండుకోవటంచూశాను. నేను చూడకుండా వుండాలని ముఖం ప్రక్కకు తిప్పుకునేది, లేకపోతే వంటసాకు చెప్పి లోపలికి వెళ్ళిపోయేది.

డాక్టరుగారితో ఆస్పత్రి పరిచయం యశో వదలుకోలేదు. ఆయన చాలా తరచుగా మా యింటికి వచ్చేవాడు. ఆప్యాయతతో యింటికి వచ్చినవారిని రిక్తహస్తాలతో తిరిగి యెప్పుడు యశో పంపించదు. ఎంతో హుషారుగా వుండేవారు. యశోని యెంతో సులభంగా నవ్వించగలిగేవారు డాక్టరుగారు. ఆ విద్య నాకు సుతరామూ చేతకాదు. మనస్ఫూర్తిగా ఆమె నవ్వుతూంటే నేను యెంతో ఆనందించేవాడిని.

ఒకసారి "ప్రమీలనుకూడా ఇలాగే నవ్వించేవారా డాక్టరుగారూ" అంది యశో. "నేను నవ్వించటంకాదు యశో, ప్రమీలే నన్ను నవ్వించేది. మే మిద్దరమూ పుట్టబోయే కొడుకుకి ఏ పేరు పెట్టాలని చాలా మాట్లాడుకునేవాళ్ళం. ఎన్ని పేర్లు చెప్పినా ఆమెకు నచ్చలేదు. ఒక రాత్రి హఠాత్తుగా నిద్రలేపి అశోక్‌బాబూ! మీ అబ్బాయికి పెట్టవలసిన పేరు నాకు యిప్పుడు తట్టింది ?-బాదల్" అంది.

యశో ముఖం వివర్ణమైంది. "ప్రమీలకు నాకు పూర్వజన్మ సంబంధం యేదో వుండివుంటుంది డాక్టరుగారు. ఒక రాత్రి నాకుకూడా హఠాత్తుగా యీ పేరు తట్టింది. అది చాలాకాలం క్రితం. అప్పుడు నేను యెవరినైతే ప్రేమిస్తానో వారికి పెట్టాలనుకున్నాను. అది వీరికి పెట్టాను. నా స్నేహితురాలొకామె తన కొడుకుకి పెట్టింది. ఇదంతా విచిత్రంగా వుంది" అంది.

ఆయన నవ్వుతూ "పూర్వ జన్మమూ, పునర్జన్మమూ ఇదంతా ఒక పెద్ద భ్రాంతిమాత్రమే! ఇలాంటి పిచ్చినమ్మకాలకు తావివ్వకు. ఒకే పేరు యిదువురికి పెట్టటంలో ఆశ్చర్యమేమీలేదు" అన్నాడు.

యశో మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

డాక్టరుగారు అనేకసార్లు నా కాలిని పరీక్షించేవారు. ఆస్పత్రికి కూడా తీసుకువెళ్ళారు. చాలా పరీక్షలు చేశారు. ఒక రోజున ఆయన యశోతో_ "రామబాబుని కలకత్తాకు తీసుకువెళ్ళు యశో!" అన్నారు "ఎందుకు చెప్పండి. స్థలంమార్పు కావాలంటే జబ్బల్‌పూర్ తీసుకు వెళ్తాను. అక్కడ నాకు తెలిసినవారు చాలామంది వున్నారు. లేకపోతే ముస్సోరీ తీసుకు వెళ్తాను. అక్కడ మా సరళవుంది" అంది.

నాగుండెల్లో రాయిపడింది. ముస్సోరి వెళ్ళటం యిక అసంభవం. ఈ పరిస్థితుల్లో సరళ యింట్లో వుండటం అసంభవం.

"అదికాదు వైద్యంకోసం వెళ్ళమంటున్నాను. ఒక ఆపరేషన్ చేస్తే యిప్పటికంటె కొంచెము కాలు బాగుపడుతుంది. పూర్తిగా నయం కావడం అసంభవం. నాకు తెలిసివున్న పెద్ద డాక్టరున్నారక్కడ. ఆయనకి వుత్తరం వ్రాసి యిస్తాను. కావాలసిన సదుపాయాలు యిక్కడ లేవు" అన్నారు. యశో చేతులు జోడించి "మీకు పదివేల నమస్కారాలు డాక్టరుగారు యింత సువార్త నా జీవితంలో నేను వినలేదు. మీకు మేము జీవితాంతము కృతజ్ఞులంగా వుంటాము. ఇప్పుడే ఆ వుత్తరం వ్రాసి యివ్వండి. రేపే బయలుదేరి వెళ్ళుతాం, ఇన్నాళ్ళు యిది చెప్పలేదేమి మీరు?" అంది.

నిర్ధారణగా తెలిసేవరకూ చెప్పకూడదు. అయినా చాలాకాలం నుంచీ అనుమానంగావుంది. వుత్తరం రేపు ఆస్పత్రిలో వ్రాసి ఇస్తాను. కేస్ హిస్టరీ అంతా పూర్తిగా వ్రాసి యివ్వాలి" అన్నారు.

ఇక ఆ రోజల్లా యశో సంతోషం పట్టలేక పోయింది. ఎప్పుడూ నేను ఆమెను అంత సంతోషంగా చూడలేదు. ఒక చక్కటి పాట నేను అడక్కుండానే పాడి వినిపించింది. ఒక చిన్న నృత్యంకూడా చేసింది. అది అయిపోయిన తరువాత నా మెడచుట్టు చేతులుచుట్టి బాదల్ బాబూ! అంది "కాలు బాగుపడుతుందని డాక్టరుగారు చెప్పలేదు యశో! నువ్వు పొరపడుచున్నావు" అన్నాను. "పూర్తిగా కాకపోయినా కొంచెమయినా బాగుపడుతుంది. అది చాలదా? కొంచెమైనా నడవగలుగు

కారు. అయినా వంటరిగా నేను మిమ్మల్ని ఎప్పుడూ నడవనివ్వను. నేను ఎప్పుడూ మీ ప్రక్కనే వుంటాను"

ఆ రాత్రి చాలాసేపు వరకు నాకు నిద్రపట్టలేదు. అలసి వుండటం చేత యశో వెంటనే నిద్రపోయింది. అనేక ఆలోచనలు గుమిగూడి నా మెదడులో ప్రవేశించాయి. డాక్టరుగారు చెప్పిన మాటలవలన నాకే మంత సంతోషం కలుగలేదు. కొంచెంగానైనా ఒకటే అసలు లేక పోయినా, ఒకటే నేను ఎలాగయినా కుంటివాడినే.

యశో కనపరచిన సంతోషం నన్ను కదలించివేసింది. మరుగు పడిపోయిన ఆలోచనలు తిరిగీ మస్తిష్కంలో ప్రవేశించాయి. అడవి కాచిన వెన్నెలలాగ ఆమె జీవితం గడిచిపోతుంది. ముప్పదిసంవత్సరాలు దగ్గరపడుతున్నాయి. పది సంవత్సరా లయింది ఆమెను మొదటిసారి చూసి. ఇన్నాళ్ళ యీమె అందమూ యవ్వనమూ నాకోసం వృధా చేసింది. ఒక్కసారి ఆమె నా కా విషయం జ్ఞాపకం చెయ్యలేదు. నన్ను పల్లెత్తు మాటకూడా అనలేదు. యశోని చూస్తూంటే యింత వయస్సు దని యెవరూ అనుకోరు. ఆమె అందం చెక్కుచెదరకుండా వుంది. అదే రూపం, అదే విగ్రహం, అదే తీరు, అంతా అలాగే వుంది. ఆమె సౌందర్యం చూపరులను దిగ్భ్రమ చేస్తుంది. అది దేశకాలాలకు అతీతం కామోసు. ప్రకృతి విరుద్ధంగా యిది అంతా జీవితాంతంవరకూ వృధా అయి చివరకు స్మశానవాటికలో మట్టి అయిపోవలసిందేనా? ఒక కుంటివాడి సంరక్షణలో హరించి పోవలసిందేనా? ఇలా ఆలోచిస్తూంటే హఠాత్తుగా ఒక కొత్త ఆలోచన నాకు స్ఫురించింది. తప్పు చెయ్యకుండా దైవం శిక్షించదని ఒకసారి లఖియా చెప్పింది. నా విషయంలో కూడా అది నిజమేనేమో! వివాహం కాకుండా నేను, యశో కలసి యింతకాలం వుండటమే నేను కుంటివాడి నవటానికి కారణమేమో? మామీద ఆగ్రహించి ఆయన అలా చేశాడేమో? ఇప్పుడైనా తప్పు సరి దిద్దుకుంటే భవిష్యత్తులోనైనా సుఖపడగలమేమో? ఆ ఆలోచన కలిగిన వెంటనే మనస్సులో అంతర్యుద్ధం ప్రారంభించింది. అవును యశోని నే నెందుకు వివాహం చేసుకోకూడదు. అందువలన కలిగే.ఏ.

నష్టమేమిటి ? జీవితాంతం యీమె యెలాగైనా నావద్ద వుండవలసిందేగా? అయితే సుశీ సంగతి యేమిటి ? నా నిశ్చయం మాటేమిటి ? నా జీవితాన్ని నా యిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు. కాని యింకొక స్త్రీ జీవితాన్ని నాశనం చేసే అధికారం నాకులేదు. వివాహం చేసుకోకూడదనే నిశ్చయం నాలో వుంటే యశోకి నామీద మమత యేర్పడకమునుపే చెప్పివుండవలసింది. అది వీలుపడకపోయినా మొదటిసారి ఆమెను విడిచిన తరువాత తిరిగి ఆమెను వెతుక్కుంటూ ఆశ్రమం వెళ్ళటం నాదే తప్పు. ఆమెకు మొదట వుత్తరం వ్రాసినది నేనే. మాటవరసకని నన్ను అక్కడకు రమ్మనివ్రాస్తే అది పురస్కరించుకుని పరుగుపెట్టాను. మాసిపోయిన మమకారాన్ని చిగురింపచేశాను, నావలనే ఆమె జీవితం నాశనమయింది. ఇంత జరిగిం తర్వాత సుశీ సాకుచెప్పి యీమెకు అన్యాయం చేయటం చాలాతప్పు. సరళ ఒకసారి "అధికారం వుంది కదా అని తప్పులేకుండా యెవరినీ శిక్షించకండి" అని చెప్పింది. అది నిజమే. అందరినీ నేను యిలాగే కష్టపెడుతూ వచ్చాను. యశో ఒక అపూర్వ స్త్రీ అని లభియా చెప్పింది, 'అవును' అది అక్షరాల నిజం. ఇంకెవరైనా నన్ను యేనాడో కాలదన్ని వుండేవారు. లభియాకి వివాహ ప్రబంధనలో అమితమైన విశ్వాసం వుంది. నేను యశోని వివాహం చేసుకోవాలనే ఆమె అభిప్రాయమని చాలాకాలం క్రితమే గ్రహించాను. స్వర్గంలోవున్న సుశీ నన్ను అర్థం చేసుకుంటుంది. అవును యెందుకు అర్థం చేసుకోదు ? నేను కష్టపడటం యితరులను ఆమెగురించి కష్టపెట్టడం ఆమె సహించదు. నా ప్రస్తుత పరిస్థితి తెలిస్తే ఆమె యెంత బాధపడుతుంది. యశోవంటి స్త్రీ నాకు లభించినందుకు ఆమె చాలా సంతోషిస్తుంది. సుశీ చనిపోయి పండ్రెండు సంవత్సరాలైంది. అయినా యెంతో స్పష్టంగా ఆమె ముఖాన్ని వూహించుకోగలిగాను. భయపడుతూ ఆమె కళ్ళలోకి చూశాను. వాటిలో క్రోధమే లేదు. మందలింపు లేదు, మకారంతో మిళితమైన మందహాసం వుంది.

ప్రమీల గురించికూడా ఆలోచించాను. ఆమె కథపవి యశో చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. యశోకి పిల్లలంటే ఎంతో అపేక్ష.

ప్రమీలకు కూడా అంతేనని ఆమె తెలుసుకుంది. ప్రమీల తనకు పిల్లలు పుట్టరని భయంకరమైనద్వారంగుండా పరలోకంలోకి పోయింది. ఆ వెలితి గురించి యశో చాలాకాలంనుంచీ ఆలోచిస్తున్నట్లు కనబడింది. ప్రమీల దానిని తిరగతోడింది. యశో తన జీవితాన్ని పునరావలోకించుకొని యిదే నాకు శరణ్యమా? అని అనుకుంచేమో! అదీకాక ప్రమీల తన పుట్టబోయే కొడుకుకి బాదల్ అని నామకరణం చేద్దామనుకుందని యశో తెలుసుకొని ఏమనుకుంది? వారిద్దరూ గత జీవితంలో సవతులను కుందా? అక్క చెళ్ళెలనుకుందా? ఎందుకో నాకు భయంవేసింది. యశో స్వభావం నాకు తెలుసు. ఆమె ఆవేశాలకీ వుత్తేజితాలకీ సుల భంగా లోనయిపోయింది. నన్ను నిస్సహాయుడిగా వదలి ఎక్కడికీ వెళ్ళదనే నమ్మకం నాకు వుంది. అయినా ఆమె నాకోసం యింత త్యాగం చేసినపుడు ఆమె వాంఛని తీర్చనంత కృతఘ్నుడినా? కుంటి వాడిని భుజస్కంధాలమీద మోస్తూన్న యీ దుస్సమయంలో అతగాడు ఆమెకు ఏమీకాడని యితరులు అంటూంటే ఆ అబల ఎలా సహించ గలదు? ఇక తటపటాయించి లాభంలేదు. నేను నిజంగా 'బాదల్ బాబు'నయితే నేను యశోకి చెందవలసిందే 'దీనికి తిరుగులేదు యశో కేసిచూసి చూచాను. సన్నటి ఆ ఎర్రలైటు కాంతిలో ఆమె ముఖం ఎంతో ప్రశాంతంగా కనబడింది. ఎంత అందంగావుంది మొదటిసారిగా యశోని పొందాలనే వాంఛ నాకు కలిగింది. మెల్లగా యశో అని పిలి చాను. నాకు ఏమైనా కావలసివస్తుందేమోనని నా మంచానికి దగ్గరగా ఇంకొక మంచం వేసుకుని పడుకునేది. పిలుపు చెవిని బడిన వెంటనే వులిక్కిపడి లేచి కూర్చుంది.

"ఏమిటి? ఏం కావాలి చెప్పండి" అంది.

"ఇక్కడికివచ్చి నా మంచంమీద కూర్చో యశో!" అన్నా

కాస్త ఆశ్చర్యపడుతూ అలాగే చేసింది. "చెప్పండి?" పన్నెండు గంటలయింది. మీరింకా నిద్రపోనేలేదా" అంది.

"లేదు అమ్మీ! యిందాకటినుంచీ నే నొకసంగతి ఆలోచిస్తూనా

అది నీకు చెప్పాలని నిద్రలేపాను. పొద్దునవరకూ వేచియుండలేక పోయాను. నన్ను క్షమించు" అన్నాను.

"దీనికి మీరేమీ క్షమ పణ చెప్పకోనక్కరలేదు. అలా అయితే రోజల్లా మీరలా అంటూ కూర్చోవాలి. ఇంతకీ ఆ సంగ తేమిటి చెప్పండి" అంది.

ఎలా చెప్పాలో తెలియలేదు. ఆమె చేతుల్ని నా చేతులలోకి తీసుకుని "నీ చేతు లిలా వున్నాయేమిటి? కుడిచెయ్యి యిలా వుందేమిటి?" అన్నాను. అవి పూర్వమంత సుకుమారంగా సున్నితంగా లేవు.

యశో నవ్వి "ఎప్పుడూ ఒకలాగే వుంటాయా. ఇంటిపనులు చేస్తూంటే అవి అలాగే కూర్చుంటాయా చెప్పండి. అదీగాక వయసు కూడా మరలిపోతూంది. నేనేమీ యింకా చిన్న పిల్లను కాదు."

ఆ మాటలు వెళ్ళి తిన్నగా నా హృదయంలో గుచ్చుకున్నాయి. నిజమే యశో పగలల్లా యేవో చేస్తూనే వుంటుంది. ఆమె చిన్నపిల్ల కాదు. అదీనిజమే. "అయితే ఇప్పుడు నీ వయస్సెంత చెప్పు అమ్మీ" అన్నాను.

నవ్వుతూ "స్త్రీల వయస్సెంతని వారిని అడగకూడదని మీకు తెలియదా. ఇందుకోసమే మీరు నన్ను నిద్రలేపారా. ఇంక పడుకోండి" అని లేవబోయింది.

చెయ్యి పట్టుకుని "కాదు యశో! అసలుసంగతి చెప్పలేదు. ఎలా చెప్పాలో తెలియదు. మన మిద్దరం యింతకాలం వివాహం చేసుకోకుండా వుండటంవల్లే యిలా జరిగిందని అనిపిస్తూంది" అన్నాను. యశో శరీరం వక్కసారి వణకినట్లనిపించింది. ఆ మసక కాంతిలోకూడా ఆమె ముఖం వెలవెలపోవటం నాకు కనపడింది.

"వద్దు, అలాంటి వాటినిగురించి ఆలోచించవద్దని చెప్పాను కదూ" అంది.

"అదికాదు పూర్తిగా విను. నన్ను పెళ్ళి చేసుకోగలవా అమ్మీ"

యశో ముఖంలోని తెలుపు పోయి సింధూరం ప్రవేశించింది. కొంతసేపటివరకూ మాట్లాడలేదు.

"చెప్పు అమ్మీ. నీ మనసులోని మాట చెప్పు ?"

"నేను మీకు చెప్పానుగదా ! మీది కానిది నావద్ద ఏమీ లేదని. మీరు యేమి చేయమన్నా చేస్తాను. కాని నాకోసం యేమీ చేయవద్దు. నేను యిలాగ జీవితాంతంవరకూ వుండిపోగలను. నాకు యింకేమీ అక్కరలేదు. నేను కష్టపడుతున్నాననే వుద్దేశ్యంతో మీ రేమీ చేయకండి" అంది.

"అయితే వివాహం చేసుకోకుండా నీ దేహాన్ని నా కివ్వగలవా ? అమ్మీ. "యశో ముఖానికి ఆమె నుదుటమీద వున్న కుంకుమకీ యేమీ తేడా కనబడలేదు. శరీరంలోని రక్తమంతా ముఖంలోకి వచ్చినట్లు యెర్రబడిపోయింది. ముఖం పూర్తిగా కిందికి దించివేసుకుంది. సిగ్గుతో ఆమె శరీరం దహించుకుపోతున్నట్లు కనబడింది.

"అస్పష్టంగా....మీరు కావాలంటే....కాని అది ధర్మ విరుద్ధం కాదేమో ?" అంది. ఆమె పరిస్థితి చూసి నేను సిగ్గుతో కృంగిపోయాను. ఆ ప్రశ్న అడిగి నేను యశోని అవమానించాను. ఆమెవంటి స్త్రీని అడుగవలసిన ప్రశ్నా యిది ? నేను యెప్పుడూ యింతే ప్రతిసారి యీలాంటి తప్పుడు మాటలనే మాట్లాడుతుంటాను. "సరే అమ్మీ అలాంటి ప్రశ్న వేసినందుకు నన్ను క్షమించు. కుంటివాడిని భర్తగా స్వీకరించ గలవా ?" అన్నాను. ఆమె వద్దనుంచి ప్రేమ వాక్యాలు వాంఛించి అన్నమాట లివి. నేను అనుకున్నట్లే ఆమె ఆచరించింది. చివాలున తల యెత్తి నా నోటిమీద చెయ్యి పెట్టి "అలా అనకండి. నాకు చాలా బాధ కలుగుతుందని తెలుసుకదా ?" అంది. ఆ చెయ్యిని తీసివేసి నా హృదయంమీద పెట్టుకుని "అయితే చెప్పు నీ కిష్టమేనా?" అన్నాను. "సుశీ సంగతి యేమి చేశారు ?" అంది. "ఈనాటికి నేను తెలుసుకోగలిగాను అమ్మీ. సుశీకి యశోకి మధ్య యేమీ వైరుధ్యం

లేదు. దీనివలన ఆమె కేమీ అన్యాయం జరగదు. ఆమెకోసం నేను కష్టపడటం యితరులను దుఃఖపెట్టడం ఆమె సహించలేదు. ఆమె స్మృతి మన కెప్పుడూ పవిత్రమైనదే. పరలోకంనుంచీ మనిద్దరినీ ఆశీర్వదిస్తుంది. సుశీ, లక్ష్మియా వీరిద్దరూ మన కుల దేవతలు. యశో ముఖం పద్మంలా వికసించింది. ఆమె ముఖం నా దగ్గరగా పెట్టి చెవిలో— "అయితే నా కోరిక తీరుస్తారా" అంది.

"ఏమిటి...." మెల్లగా చెవిలో రహస్యంగా చెప్పింది.

"ఆ నెరవేరుస్తాను. ఇంకొకటికూడా తీరుస్తాను తెలుసా" అన్నాను. ఏమిటది ? నేనూ మెల్లిగా ఆమె చెవిలో చెప్పాను.

"ఛా ! వూరుకోండి" అంది, ముఖాన్ని తలగడలో దాచుకుంటూ. కాని మనసులో ఒక అనుమానం పీకుతూంది. "అమ్మీ ! నేను ఒక దమ్మిడీకూడా సంపాదించలేనని నీకు తెలుసు. ఇలాంటిస్థితిలో మనము వివాహపు వుచ్చులో చిక్కుకోవడం వివేకవంతమైందేనా ? దారిద్ర్యం కూడా సంభవిస్తుందేమో" అన్నాను. ముఖం పైకెత్తి వేదనాపూరిత వ్యాకుల కంఠంతో—"యిలాంటి మాట లనవద్దని యెన్నిసార్లు చెప్పినా యెందు కంటారు చెప్పండి. నన్ను కావాలని కష్టపెట్టాలని అంటుంటారా" అంది.

"కాదు అమ్మీ ! నీకు తెలియదు. మనస్సులో యిలాంటి ఆలోచనలు ఎప్పుడూ పీకుతుంటాయి. అయినా యిది నిజంకాదా !"

మీకు నేను చాలాసార్లుచెప్పాను మనమేమీ బీదవాళ్ళంకాము. కావాలంటే మనమిక్కడ ఒక మేడకొనుక్కొని వుండవచ్చు. దాని అవసరం లేకే మన మిలా వుంటున్నాము. దాని గురించి మీ రేమీ చింతించకండి అయినా యిది చాలా కాలం తర్వాతమాటకదా ? ఇప్పటినుంచీ మీకంత వూహిస్తూన్నారా ? మనవాళ్ళంటూంటారు. ఆలులేదు చూలులేదు...."

"అదికాదు అమ్మీ ! మనమంతా ఆలోచించి చెయ్యాలి ? తరువాత విచారించి లాభంలేదు."

ఆ అవసరం మీకు కలుగదు. మీ భారాన్ని నేను మొదటిసారి వహించినప్పుడు మీరే త్రుంచివేసి వెళ్ళిపోయారు.

తరువాత పిలుపువిని మీరు మళ్ళీ నావద్దకు వచ్చారు. ఆతరువాత తప్పుడు మాటలువిని మిమ్మల్ని వదలుకోవటానికి సిద్ధపడ్డాను. సమయానికి లఖియా నా కళ్ళు తెరిచింది. మిమ్మల్ని నా చేతికప్పగించి యిదే విలువకట్టలేని ధనం అని చెప్పింది. ఆ రాత్రి బండిలో నేనూ అనుకున్నాను. యిక యీయనను ఎన్నడూ వదలిపెట్టను. ఈ ఘోర తప్పిదం మళ్లీ నేను చేయటానికి సిద్ధపడను. సర్వకాలాల్లోనూ నా సర్వస్వం బాదల్‌బాబే. అలాగే యీనాడు మీకు నేను వాగ్దానం చేస్తున్నాను. భవిష్యత్తు ఎక్కువభారంకూడా నేనే వహిస్తాను" అంది.

"చిన్నతనంలో నాకు భగవంతునిమీద అమితమైన ప్రేమ వుండేది అమ్మీ. సుశీమరణం దాని కొంక గొడ్డలిపెట్టులాంటిది. ఆ తరువాత లఖియా కష్టాలుచూచి అది పూర్తిగా నశించింది. ప్రస్తుతం అది పూర్తిగా క్షీణించిపోతోంది. కాని భగవంతుదేవుంటే నిన్ను రక్షిసాడు అమ్మీ. నిన్ను ఎప్పుడూ కాపాడుతాడు. అలాకాకపోతే యిక దేనినీ నమ్మను నేను" అన్నాను.

# 27

లఖియా వెళ్ళిపోయిన తరువాత యిప్పటివరకూ ఆమె కబురేమీ తెలియలేదు. ఆమెని నే నెప్పుడూ మరచిపోలేను. నేత్రాన్వేషణ ఎన్నడూ అస్తమించలేదు. అది యుగసంధిలోనే అంతమౌతుంది. ఆమె గురించి నేను అట్టే చింతించటంలేదు. అది ఆమె యిష్టానికి విరుద్ధమైనది. అదీకాక అలాంటివారు లోకంలో ఏ వొక్కరిసొత్తూకాదు. వారు ప్రపంచానికి చెందరు. పరలోకానికి చెందరు. ఈ రెంటికి మధ్య ఏముందో నాకు తెలియదు. కాని ఏదైనావుంటే దానికి ఆమె రాణి. మానవులలో సాధారణంగా రెండేరకాల వ్యక్తులుంటారు? ప్రేమించినవారు, ప్రేమింపబడినవారు. మామూలుగా ప్రతి వ్యక్తి ఎప్పుడో ఒకప్పుడు ఎవరినో ఒకరిని ప్రేమిస్తారు, కాంక్షిస్తారు. మరికొంత మంది యితరులచేత ప్రేమించబడుతారు. ప్రేమికులు సమపాళ్ళలో

ఒకరి నొకరు ప్రేమించుకోరు. వారిలో ఒకరు ప్రేమిస్తారు. ఇంకొకరు ప్రేమించబడుతారు. కాని ప్రేమకు బదులుగా నిర్లక్ష్యం లభిస్తే భరించటం దుర్లభమయినది. నరకయాతన అనేపదం దానికి అనుగుణంగా వుంటుంది; ఈ రెంటింటికీ చెందని వ్యక్తులుకూడా తారసిల్లుతూంటారు చాలా అరుదుగా. దానికి తిరుగులేని వుదాహరణ లభియా. ఆమె జీవితంలో ఎవరినైనా ప్రేమించిందా? దానికి సమాధానం మానవమాత్రులెవరూ చెప్పలేరు. కాని నేను యిది చెప్పగలను. ఎవరినైనా ప్రేమించియుంటే ఆ వ్యక్తి ఆమె భర్తమాత్రమే. భర్తమరణానికి ముందు రెండు రోజులు ఆమె అతనిని ప్రేమించినంతగా ప్రపంచంలో ఎవరినీ ప్రేమించి వుండరు. భగవంతుని ప్రార్థించినంతగా యింకెవరూ ప్రార్థించియుండరు. ఆమె అతనికి సేవచేసినంతగా ఎవరూ చేసియుండరు. అంతవరకూ సౌందర్యము మాత్రమే సమర్పించగలిగింది. ఆ రెండు రోజులూ దాని అవసరం లేకపోయింది. అర్ధాంగి ప్రేమంటే ఏమిటో ఆ అభాగ్యుడికి ఆమె చూపించింది. ఎన్నిపాపాలు చేసినా అతడు అదృష్టవంతుడు. అందుకనే అది అతనికి లభించింది, లభియా పూర్తి ప్రేమ జీవితమంతా లభిస్తే అతను మానవమాత్రుడే కాదు. అందుకనే బహుశా దైవం అతనిని అలాచేశాడు. "తడివున్న కంటిని తుడవటానికి ప్రయత్నించు లభియా!" అని అంతిమ సందేశమిచ్చాడు. లభియా ప్రయత్నించింది. సాధ్యపడలేదు. కన్నీరు తుడువటానికి బదులు కన్నీరు కార్చింది.

భగవంతుడు సృష్టించిన ప్రతిదానికి ఏదో ఒక తాత్పర్యం వుంటుంది. అలాగే మానవ శరీరంలోని ప్రతి అవయవానికీ ప్రతివస్తువుకీ ఏదో ఒక కర్తవ్యముంటుంది. అయితే అశ్రువులమాటేమిటి? కన్నీరుకి కొలతలేదు. నేత్రాల్లోంచి అది అక్షయంలా వూరుతుంది. అసహాయుడికి అదే గత్యంతరం. ఆత్మకి అదే అంతరార్థం. పుట్టుకతోనే మనమంతా ఏడుస్తూ పుడతాము. శైశవములో శారీరక కష్టాల్ని వాంఛల్ని ఏడుపురూపంలో వ్యక్తపరుస్తాము. జ్ఞానం వచ్చినప్పటినుంచి మానసిక బాధల్ని ఏకాంతంలోనూ ఆప్తుల ఆలింగనంలోనూ కన్నీరు రూపంలో

జారవిడుస్తాము. బంధుమిత్రులు మనల్ని వదలిపోయినప్పుడు నిరాక్షేప ణీయంగా అశ్రువులను విడుదల చెయ్యవచ్చు. కన్నీరు బలహీనతకు చిహ్నామని దానికి పురుషత్వానికి బద్ధవిరుద్ధమని చాలామంది అను కుంటారు. ఎందుచేత ? కన్నీటితో పురుషునికి అగత్యం లేకపోతే అది ఎందు కిచ్చాడు, ఆ అంతర్యామి. ఒక అజ్ఞాతవ్యక్తి అన్యాయానికి బలి అవుతుందని విని అశ్రువులను చెంపలమీద కార్చేవారి గొంతుకలు అరణ్య రోదనలోనే అగిణపోతాయి. దానివలన లాభముందని నేను అనను. మానవ నేత్రాల్లోని కన్నీరంతా నదిలా ప్రవహించినా లఖియాకి కలిగే లాభ మేమిటి ? అన్నింటిలాగే అదికూడా చివరకు సప్త సము ద్రాలలో కలసిపోతుంది. అయితే జీవితంలోని ప్రతిదానినీ లాభనష్టాల దృష్టితో చూడాలంటే నేను వొప్పుకోను. జీవితంలో యిక వేరే అర్థమే లేదు. స్వలాభమే జీవితంలో పరమావధియా? నా ఆవేశానికి మీరు నన్ను క్షమించాలి. ఇంతకీ నేను మీవద్దనుంచి యాచించేదేమంటే రెండు కళ్ళనుంచీ రెండు కన్నీటి బిందువులు—అవి కురుక్షేత్రం పోయిన ఆ అసహాయ స్త్రీకి నిశ్శబ్ద శ్రద్ధాంజలి. "అక్కడ నాబోటివారికి స్థానం వుందని విన్నాను." అంది లఖియా. స్థానం లభించిందో లేదో నాకు తెలియదు. అసలు అక్కడికి చేరుకోగలిగిందో లేదో కూడా నాకు తెలి యదు. చాలాకాలం ఆమె తిరిగివస్తుందనే కాశీలో నిరీక్షించాము. చివరకు పరిస్థితులు బాగుండి ఆమె బాబు వ్రాస్తుందని ఆశించాము. పరిస్థితులు బాగుంటే ఆమె లఖియా ఎందుకవుతుంది. ఆమె యే దుర్ముహూర్తాన జన్మించిందో అప్పటినుంచే అవి బావులేవు. ఈ ఏకాకి పరిస్థితుల్ని ప్రపంచాన్ని ఎంతవరకూ ధిక్కరించి ఎంతకాలంవరకూ జీవించగలదు. లేక చలిలో ఏ చెట్టుక్రిందైనా మరణించిందా ? గడ్డి మోపు ప్రక్కన నిద్రిస్తూ అగ్నిలో ఆహుతి అయిపోయిందా ? అయినా నాకు ఒక విషయం బాగా తెలుసు. ఎలాంటి కష్టాలు ఎదురైనా ఆమె ఆత్మహత్య చేసుకొని యుండదు. నాతో అనేకసార్లు ఆమె అదే చెప్పింది. కాని ఆమె చెప్పిన ఒకమాట జ్ఞాపకివచ్చి కలవర పడు తుంటాను. "ఆ రాత్రి రణధీర్ నా రక్షణకు రాకపోతే నేను ఆత్మహత్య చేసుకొని వుందును" అంది. అలాంటి పరిస్థితి మళ్ళీ ఎదురయితే ఆమె

ఎంచేస్తుంది. వైధవ్యరక్షణకోసం ఆమె విధాతనుకూడా ధిక్కరించ గలదు. లేకపోతే లభియా యింకా జీవించేవుందా? హే భగవాన్ మళ్ళీ వకసారి కన్నీరు తుడిచేటట్లు అనుగ్రహించు. నాలుగు తెల్ల చీరల్లోనూ చివరకి వక చీరయినా ఆమెకు మిగిలేటట్లు చెయ్యి. కష్టం తీరకపోతే కబళించివెయ్యి.

కొంతమంది వ్యక్తులకి ప్రాపంచక సుఖాలన్నీ అందుబాటులో వుంటాయి. కాని వారు దేనికోసమో అస్పష్టంగా అన్వేషిస్తారు. అశాంతితో దేనినో కాంక్షిస్తారు. అది వారి చేతి కెపుడూ అమడదూరంలో వుంటూ అరచేతిలో యెప్పుడూ లభ్యంగాదు. తోటి మానవులనుంచి వారికి లభించేది పెదవి విరుపులతో కలసిన ఒకేఒక మాట. చంచల స్వభావం—నిలకడలేదు. నా కర్థం కాని దేమంటే, నిలకడ యెందు కుండాలి? యంత్రంలా నడిచే మానవ జీవితంలో దీని అవసరం యేమిటి? అడుగడుగునా ప్రశ్నలే యెదురయ్యే యీ పయనంలో ప్రశాంతతకు, ప్రవేశనార్హత యెక్కడిది? ఇలాంటి వ్యక్తి సరళ. తన తృష్ణ తీర్చగల వ్యక్తికోసం అర్రులు చాచింది. ఆ తృష్ణ యేమిటో నాకు యెప్పుడూ తెలియలేదు. ఒకసారి చెప్తానంటే భయంతో "వద్దు. వద్దు సరళా" అన్నాను. అది చివరకు యెండమావిలాగే నిలచి పోయింది. "మనసులో నాకు అన్యాయం చెయ్యకండి రామబాబూ" అని రైలు కదలబోయే సమయంలో సరళ నన్ను అర్థించింది. నిజంగానే యీమెకు నేను అన్యాయం చేశాను....

చెప్పవలసిన వృత్తాంతమంతా చెప్పివేశాను. ఆ తరువాత యేం జరిగింది? చాలా జరిగింది. ఇది కథా, కల్పనా కాదు గనుక దీనికి అంతం లేదు. ముచ్చటగా ముగింపైనా లేదు. అందరూ చివరకి మట్టిలో కలసిన విషాద నాటకం కాదు. ఇన్నాళ్ళు గడచిపోయినతరువాత జీవితంలో నువ్వు తెలుసుకున్న దేమని ప్రశ్నిస్తే కాస్సేపు తడుము కుంటాను. ఎందుకంటె స్వతహాగా నాకు యేమీ చేతకాదని సుశీ అనేది, యశో అంటుంది, నా భారమంతా వీరు—ముఖ్యంగా యశో మోశారు కనుక వీరి మాటలకు విలువ యివ్వాలి. అయినా చివరకు

యిది చెప్తాను. జీవితంలో యెవరి యుద్ధాల్ని వారే నడుపుకోవాలి. మనము యితరుల వద్దనుంచి సానుభూతి ఆశించవచ్చు. అప్పుడప్పుడు సహాయం యాచించవచ్చు. ప్రేమ లభిస్తే స్వీకరించవచ్చు. అయినా చివరకి సారధ్యం వహించవలసింది ఆ వ్యక్తే. కొన్ని కొన్నింటిలో విజయం సాధిస్తాము. మరికొన్నింటిలో ఓటమి అంగీకరించాలి. ముఖ్య మైన సంగతేమిటంటే యీ గెలుపు ఓటమిలను బంగారపు తక్కెడతో తూచే సమయంలో అంతర్గతంతో ప్రమేయమున్నది. ఫలితం కాదు. ప్రవర్తన మాత్రమే.

[మరణ సమయంలో ప్రతి వ్యక్తి ఒంటరిగానే వుంటాడు. మనతో మనము యెవరినీ తీసుకుపోలేము. జీవితంలో తటస్థప. వారందరికీ యెప్పుడో వొకప్పుడు వీడ్కోలు చెప్పాలి. పాఠకునికి వీడ్కోలు చెప్పవలసిన సమయం యిప్పుడు ఆసన్నమైంది. చెయ్యి పట్టుకుని గత జీవితాన్ని పర్యావలోకించాను. జీవిత పుటలోని ఆఖరి ప్రకరణం యింకా ముగియలేదు. అయినా మీకు శలవు చెప్పాలి.]

—o—



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA124B173 |
| పుస్తకం పేరు | క్షంతవ్యులు |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 231 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rukhsana |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |